భాషోద్ధారక

# శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి

## షష్టిపూర్త్యుత్సవసన్మానసంపుటము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారి

వావిళ్ల ప్రెస్సున

ముద్రితము.

1952

# విషయసూచిక

విషయము. ... పుట.

## I. షష్టిపూర్తి సభాసమావేశ వృత్తాంతములు.



## మిత్రుల ఉపన్యాసములు.



## సందేశములు.

## II. వ్యాసములు.

# శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి

# షష్టిపూర్తిసభ

1948-వ సంవత్సరము ఏప్రెలునెల తే 3 దిని ఆంధ్రయూనివర్సిటీ వైస్‌ఛాన్సలరు

## డాక్టరు: సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారి

అధ్యక్షతన నెం. 490 రు తిరువత్తూరు హైరోడ్, మదరాసున జరిగిన

## షష్టిపూర్తిసభాసమావేశవృత్తాంతములు, సందేశములు



షష్టిపూర్తిసభాసందర్భమున తీయబడిన ఛాయాపటము

చిరకాలముగ ' మిత్రులెప్పుడెప్పుడనితొందరపడుచుండిన భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తి సభ ఎట్టకేలకు తే 3.4-48 దిని వీరిస్వగృహమున జయప్రదముగ జరగెను. ఈయావరణమున శుభ్రధవళవస్త్రములతో రంగురంగుల పుష్పమాలలతోను సుందరముగ నలంకరింపబడిన పందిరియందు నాటిప్రాతఃకాలమున 8-30 గంటలకెల్ల పలుప్రాంతములనుండి కవులు, గాయకులు, పండితులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పత్రికారచయితలు మున్నగువారు అనేకులు శ్రీశాస్త్రిగారి మిత్రులు, బంధువులు, అభిమానులు సమావేశులై సుఖాసీనులైరి. ముస్ముందుగ సభాసదస్యులు

అల్పాహారపానీయ చందనపుష్పతాంబూలాదులచే సత్కృతులైరి. అందఱు పుష్పమాలాలంకృతులైరి. సభకేతెంచిన ప్రముఖులలో కొందఱ:— బాబాసాహెబ్ డాక్టరు పరంజపే, (జేగారు), డాక్టరు సర్. శ్రీసర్వేపల్లి రాధాకృష్ణయ్య, శ్రీ వి. వి. శ్రీనివాసఅయ్యంగారు, డా॥ కే. యన్. కేసరి, శ్రీసప్పు సోమసుందరంగారు, శ్రీవేమూరి విశ్వనాథశర్మగారు, శ్రీ శ్రీమునగాల రాజాగారు, గానవిశారద శ్రీకుతి సరస్వతీబాయి, శ్రీ టి. పి. మీనాక్షీసుందరం పిళ్లగారు, శ్రీఖాసా సుబ్బరావుగారు, శ్రీ యం. శేషాచలపతిగారు, శ్రీ కే. యస్. రామస్వామిశాస్త్రిగారు, కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు, శ్రీశ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, శ్రీమొక్కపాటి నరసింహశాస్త్రిగారు, శ్రీముల్లవరపు విశ్వేశ్వరరావుగారు, శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు, శ్రీపిలకా గణపతిశాస్త్రిగారు, శ్రీరామచంద్రుని వేంకటప్ప గారు, శ్రీవేలూరి సదానందంగారు, శ్రీదుగ్గిరాల రాఘవచంద్రయ్యశాస్త్రిగారు, శ్రీప్రతివాది భయంకరాచార్యులు, శ్రీకంచి కామకోటిపీఠమువారి శ్రీముఖముగొనివచ్చిన కార్యకర్తలు, జార్జి కెన్నెత్ గారు, శ్రీగాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీకొండగుంట ఉమామహేశ్వరము, బి. ఏ., బి. ఎల్., శ్రీ ఆర్. నటేశయ్యర్ గారు, శ్రీ కే. వేంకటస్వామి నాయుడుగారు, శ్రీ పి. యం. ఆదికేశవులు నాయకర్ గారు, మాజీడిప్టీమేయరు, కార్పొరేషన్ కౌన్సిలరు టి. కన్నప్పర్, శ్రీ టి. పట్టాభిరామఅయ్యర్, బి. ఏ. బి. ఎల్. గారు, రావుసాహెబు శ్రీటీ. దేవరాజమొదలారి, శ్రీభట్టాచారిగారు, దివాన్ బహదర్ శ్రీఆర్. వీ. కృష్ణయ్యరు, దివాన్‌బహదర్ శ్రీవీ. భాష్యముఅయ్యంగారు, శ్రీషాఫీమహమ్మద్, శ్రీశిరోభూషణము సుబ్బరాయులు, శ్రీసత్యవోలు రాధామాధవరావు, శ్రీవాసుదేవశాస్త్రిగారు, శ్రీగరిమెళ్ళ సత్యనారాయణ, శ్రీనిడదవోలు వేంకటరావుగారు, శ్రీవేదము లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీవేదము వేంకటకృష్ణశర్మ, శ్రీనారు నాగనార్య, శ్రీవి. నారాయణయ్యరు ఎం.ఏ., యం. ఎల్. గారు, శ్రీపీ. మార్తాండ పిళ్లగారు, శ్రీయం. శేషాచలపతిగారు, శ్రీయస్. తులసీదాస్‌నాయుడుగారు, శ్రీగద్దె రంగయ్యనాయుడుగారు, చూణాంపేటజమీందారు దివాన్‌బహదర్ సీ. అరుణాచలమొదలారి ప్రభృతులు.

ఆంధ్రవిశ్వవిద్యాలయమును అవిచ్ఛిన్నముగ 18 సం॥ లుగ నేలుచున్న డాక్టరు సర్: శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు సభకధ్యక్షత వహించిరి. శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు అనారోగ్యపీడితులయ్యును సంతోషము సగముసత్తువయన్నట్లు ఓపికతో సభాధ్యక్షుని కెడమపార్శ్వమున కుర్చీయందు సుఖోపవిష్టులైరి. తగుమాత్రము ధవళవస్త్రధారియై విభూతికుంకుమాంకములు ఫాలతలము నలంకరింప గంభీరముద్రవహించిన శ్రీశాస్త్రిగారి మూర్తి 6 సం॥ లనుండి రుగ్మతతో నలిగినది వీరేనా అనిపించినది. ఈశ్వరునికృపవల్ల ఇతఃపరము వారు సంపూర్ణారోగ్యవంతులై యథారీతి వ్యవహారోన్ముఖులై సంచరింతురు గాక అని యెల్లరిమనంబుల నేకముఖంబున ఆశీర్వదింపబడిరి. అధ్యక్షుని యుత్తమాంగోపరిభాగమున వైదికతేజముట్టిపడుచున్న కీ॥ శే॥ శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రిగారి చిత్రపటమొకటి వ్రేలుచుండెను. దానిని పుష్పములతో నలంకరించిరి. దానిప్రక్క

నున్న జగద్గురు శ్రీశ్రీ ఆదిశంకరాచార్యులవారి పటమునకు తొలుత మంగళహారతి యొసగిరి. తర్వాత వేదోక్త మంగళాశీస్సులాశాసింపబడెను. పిదప వైదికోత్తములు షష్టిపూర్తిసభసంబంధ మగు వైదికతంతుకొంత నడుపగా సభాసదులగు పిన్నలు పెద్ద లందరును శుభాక్షతలుగైకొని శ్రీశాస్త్రిగారిపైఁ జల్లిరి.

ఆపిదప బాబాసాహెబ్ డాక్టరు శ్రీయుత. జి. పరంజపేగారు (బీరారు) డాక్టరు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారిని సభాధ్యక్షులుగ నుపపాదింపగా కరతాళధ్వనులతో శ్రీ రెడ్డిగారు అధ్యక్షపీఠమునలంకరించిరి.

అంత సభకు రాజాలమికి చింతిల్లుచు సభ జయప్రదముగ జరుగవలయునని కోరుచు శ్రీశాస్త్రిగారి కాయురారోగ్యము లర్థించుచు, వారి గుణగణవిశేషములనుగ్గడించుచు పలువురుపెద్దలు పంపిన సందేశములను సంఘకార్యనిర్వాహకులుజదివిరి.

శ్రీ రామలింగారెడ్డిగారి గూర్చిన ప్రశంస

అనివార్యమ్మగు కార్యభార మిసుమంతైనట్లు భావించి మీ
రనుమోదంబున దూరభారమును నాయాసంబు పాటింప కీ
దిన మధ్యక్షులరౌట మాకిటను నెంతేమోదముంగూర్చె ని
ట్లని మిమ్ముంబొగడంగ నూతరమటయ్యా రామలింగాగ్రణీ! 1

వేయువిధంబు లాంధ్రజన విశ్వకళాపరిషత్తు జ్ఞానము
ద్రాయితమై నిరంతరము నాంధ్రులిలపాలిటి కల్పవృక్షమై
శ్రీయలరారఁజేసిన విశిష్ట మహామహిముండు రెడ్డికిన్
వేయననేల నీడెవరు విశ్వజనీనత తెల్గునాటిలోన్. 2

షష్టిపూర్తి మహాసభాసమయమందు, ప్రథిత వావిళ్ల వేంకటేశ్వరుడుమిమ్ము
నందజేసె కళాప్రపూర్ణాంకబిరుదు, అందికొనుమయ్య నేడు స్నేహప్రశస్తి. 3

భారతదేశమందు ప్రతిభారతినించిన యాంధ్రపుత్రులన్
వేరువహించి యాంధ్రజన బృందసమాదరణీయమూర్తివై
తోరపుకీర్తినించి బుధితులుల్యఁడవై యలరారుమయ్య వి
స్ఫారయశోఽస్తి రెడ్డికులజాతమణీ! ప్రతిభా ప్రభాఖనీ. 4

(ఆయాయవి వేఱుగా ప్రకటింపబడినవి.) ఆపిదప ఆంధ్రగీర్వాణభాషలందు పద్య రత్నములు శ్లోకములు చదువబడినవి. తర్వాత కమిటీ తరపున అడ్వకేటు శ్రీఆర్. నటే శయ్యరుగారు శ్రీశాస్త్రిగారి కాంగ్లమున అభినందనపత్రము చదివి సమర్పించిరి. ఆటుపిదప సభకార్య నిర్వాహక సంఘకార్యదర్శి శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు వీతత్సంఘ కార్యనివేదికను ఇట్లు చదివివినిపించిరి.

కార్యనివేదిక

తెనుగుదేశమున సుప్రసిద్ధమగు శ్రీవావిళ్లవారి సంస్థకధ్యక్షు లయిన శ్రీవేంకటే శ్వరశాస్త్రిగారిషష్ట్యబ్దపూర్తిని పురస్కరించుకొని షష్టిపూర్తినాటికి వారినభినందించుట

తమకర్తవ్యమని భావించి శ్రీశాస్త్రులవారి మిత్రులును ఆదరాభిమానపూరితులును కొందరు కలిసి ఒకవిజ్ఞప్తిని ప్రకటించిరి. దాని ఆమోదించుచు దేశమంతటినుండియు పండితులును కవులును పత్రికాధిపతులును ఇతరప్రముఖులును శతాధికముగ అంగీకారమును సూచించిరి. తర్వాత చెన్నపురిలో నొకకార్యనిర్వాహకవర్గ మేర్పడినది.

అధ్యక్షులు:—దివాన్‌బహాదరు ప్రొఫెసరు శ్రీ సి. యస్. శ్రీనివాసాచారిగారు.

కార్యదర్శులు:— 1. శ్రీగరిమెళ్ల సత్యనారాయణగారు, 2. శ్రీనిడుదవోలు వేంకటరావుగారు, 3. శ్రీవేదము లక్ష్మీనారాయణ శాస్త్రిగారు.

కోశాధికారి:—శ్రీకాళహస్తి చంద్రమౌళీశ్వర శాస్త్రిగారు.

ఇతరసభ్యులు:—1. శ్రీఅల్లాడి రామస్వామిగారు, (వీరు రెండునెలల క్రితము దివంగతులైరి.) 2. శ్రీ ఆర్. నటేశయ్యరు గారు.

కార్యవర్గోద్దేశములను ప్రజలకు పరిచయపరచుటకై శ్రీగరిమెళ్ల సత్యనారాయణగారు గంజాము విశాఖపట్టణము మండలములలోను, శ్రీనిడుదవోలు వేంకటరావుగారు గోదావరి కడప మండలములలోను సంచారముగావించిరి. ఆయా ప్రాంతములలోని యభిమానసంపన్నులు సమావేశములేర్పఱచి తీర్మానములు చేయగా నాకార్యప్రణాళిక నప్పుడప్పుడు త్రిలిఙ్గ పత్రికలో సకాలమున ప్రకటించుచుంటిమి.

ఈ కమిటీవారితీర్మానము ననుసరించి శ్రీశాస్త్రులుగా రేయే సంస్థలతో సంబంధపడి యుండిరో వానిలోనెల్ల వారిఛాయాపటము నెలకొల్పఁదలచి యీ క్రింది సంస్థలయధికారవర్గముతో సంప్రతించి వారియనుమతి బడసితిమి. క్రింది సంస్థలలో త్వరలోనే శ్రీశాస్త్రులవారి పటములు పౌరప్రముఖులచే ఆవిష్కరింపబడును:—

1. మదరాసు కార్పొరేషను శ్రీ ప్రకాశంపంతులు గారు బహిరంగపరచిరి. 2. మదరాసు పచ్చయప్పకాలేజి. 3. మదరాసు శిశురక్షణసంఘము. (Society for the Protection of Children) 4. మదరాసు సెంట్రల్ కో-ఆపరేటివుబ్యాంకు, 5. మైలాపూరు రానడేమందిరము. 6. చూళై హిందూ యూనియన్ హైస్కూలు, 7. గోక్లేహాలు, 8. మదరాసు మహాజనసభ, 9. దక్షిణ ఇండియా పత్రికారచయితలసంఘము, 10. మదరాసు పోర్టుహాండురైటర్లసంఘము, 11. తండయార్పేట హిందూబాలికాపాఠశాల, 12. కర్నూలు మునిసిపలుహైస్కూలు, 13. ఈశ్వరపుస్తకభాండాగారము, కాకినాడ. 14. ప్రొగ్రెసివ్‌యూనియన్, నెల్లూరు. 15. హిందూథియలాజికల్ హైస్కూలు, 16. చెన్నపురాంధ్రసభ, 17. పురపాలకసంఘము బెజవాడ. 18. పురపాలకసంఘము రాజమండ్రి.

ఈసంస్థలలో పటములు పౌరప్రముఖులచే ఆవిష్కరణము చేయబడును. వానిని తమతమసంస్థలలో నెలకొల్ప నంగీకరించిన పైవారికి మేమెంతయు కృతజ్ఞతతో వందనము లర్పించెదము.

షష్ట్యబ్దోత్సవమునాటికి శ్రీశాస్త్రులవారి శోక వ్యాససంపుటము సంస్మృతి చిహ్నముగా సమర్పింపదలచి కవులకును పండితులకును విద్వాంసులకును విజ్ఞప్తినంపగా పెద్దలు పెక్కుమంది కేవలము అపూర్వవిషయములనుగూర్చి చక్కని వ్యాసములు వ్రాసిపంపిరి. వాని నొకసంపుటముగ ముద్రించి నేడు (3-4-48) శ్రీశాస్త్రులవారి కర్పింపదలచి యథాశక్తి పాటుపడితిమి కాని మినిస్టరుగారి ప్రోద్బలముండినను పేపరుకంట్రోలువారుచేసిన యాలస్యముమూలమున నాకార్యము సకాలమునకు పూర్తిగాక నిలిచినది. అచిరకాలముననే సంపుటమును ముద్రించి శ్రీశాస్త్రులవారికి సమర్పించుకొనుటయేకాక తమకందరికి సంపుటముల నందింప దలచియున్నాము. ఆలస్యమునకై మిత్రులందరు క్షమింతురని మావేడికోలు. ఈసంపుటములోనే కమిటీవారిసందర్భమున సాగించిన జరూఖర్చులను తదితర కార్యక్రమమును ప్రచురింతుమని విన్నవించుకొనుచున్నాము.

బహుమహాకార్యనిమగ్నులై అనివార్యములగు నవసరకార్యము లెన్నోయున్నను త్రుటికాలమేనియు విరామము లేనివారైనను ఆసందర్భములనెల్ల వెనుకబెట్టి శ్రీశాస్త్రులవారికిని తమకునుగల యన్యోన్య సుహృద్భావమును పురస్కరించుకొని నేడిచ్చటికి విచ్చేసిన ఆంధ్రవిశ్వకళాపరిషదధ్యక్షులు డాక్టరు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారికి కార్యసంఘమువారు మనఃపూర్వకము తమకృతజ్ఞతను దెలుపుకొనుచున్నారు. మాఆహ్వానమును గౌరవించి యీసభకు విచ్చేసిన శిష్టజనులకందఱికిని మావందనములు.

పూర్వోక్తనివేదికను చదివిన అనంతరము వరుసగ నాయామిత్రు లిట్లుపన్యసించిరి.

శ్రీభాసా సుబ్బారావుగారు, బి. యే., బి. యల్., యల్. టి.,

స్వతంత్రపత్రికాసంపాదకులు.

శ్రీవావిళ్లవారు ప్రతిఫలనిరపేక్షముగ అమూల్యములగు తెనుగు సంస్కృతకావ్యములను ప్రజాసామాన్యమున కందుబాటగునట్లు ప్రచురించిరి. నిరాటోపముగ తోడివారికి ఉపకారము చేయువారిలో శ్రీశాస్త్రిగారగ్రగణ్యులు. ముద్రణయంత్ర ప్రాముఖ్యమును ప్రజాజీవితమున దానియవసరమును మొట్టమొదట గుర్తించినవారిలో వీరు ముఖ్యులు.

శ్రీశాస్త్రిగారితోడి పరిచయము బాగుగానైననేగాని యితరులకు వారివిశేషగుణములు తెలియరావు. నిష్పక్షపాతముగు విమర్శనలు దుర్గ్రాహ్యమైన యీకాలములో వారు మానవవ్యవహారములను పిన్నపెద్దలను భేదమును పాటింపక నిర్మొగమోటముగ, నిష్కపటముగ, నిష్కర్షగ, ఖండితముగ, కచ్చితముగ, కటువుగకూడ విమర్శింతురు. దానివల్ల శ్రోతలమనస్సు జడత్వమువీడి వివేచనాయత్తమగును. అయితే ఆయాయభిప్రాయముల జోక్యము లేకయే యెవ్వరైన కష్టదశలో నున్నారనగా, క్లిష్టసమస్యలలో చిక్కుపడి యున్నారనగా వారికి వలయుసాయము నంతయు అయాచితముగా సునాయాసముగాచేసి యుద్ధరింతురు. ఆప్తమిత్రులచే విడువబడినవారుగూడ శ్రీశాస్త్రిగారి ఆశ్రయసాహాయ్యము నపేక్షించి పొందగలరు. ఈపరస్పర వైరుధ్యభావములే ఒండొంటికి విమోచనసాధనములై

యలరారుచున్నవి. ఎవ్వరిబాకా వారు ఊదుకొనుచు, ఇతరులను మోచేతిపోట్లతో వెనుకకు త్రోసివేసి తాము ముందుకు సాగిపోవుచు అందకున్నను నాయకత్వమునకు అఱ్ఱెత్తి చేతులు చాచుచునుండు రాజకీయవేత్తలతో జగమంతయు నిండియుండగా నిట్టివారరుదైరి అవసరమైయున్నారు. వారు గుప్తదానపరులని పలువురెఱిగినవిషయమే. వారివద్దనున్న లోటును విశేషమును తమ్ముతాము ప్రకటించుకొనమియే.

మదరాసు షెరిఫ్ అయిన శ్రీజనాబ్ షాఫీ మహమ్మద్ సాహెబుగారు.

శ్రీశాస్త్రులవారు చెన్నపురియందు పలురంగముల చిరకాలముగ కృషిచేయుచున్న ప్రజాసేవకులు. ఆంధ్రవాణిజ్యపరులకు ప్రత్యేకవ్యక్తిత్వ మవసరమని తోచగనే ఆంధ్ర వాణిజ్యసంఘము నేర్పరిచి వృద్ధికితెచ్చిరి. చేపట్టినపనిని చాల ధైర్యముతోను పట్టుదలతోను సాగించునట్టి దిట్టలు. మాతో చిరకాలము కాంగ్రెస్సున, కార్పరేషను పనిచేసిరి. వారిని మేమెంతో యభినందించుచున్నాము.

దివాన్‌బహదూరు శ్రీ కే. యస్. రామస్వామి శాస్త్రిగారు.

శ్రీ శాస్త్రులుగారు మాతండ్రిగారికి (ప్రొఫసర్: కే. సుందరరామన్, ఎం. ఏ.,) చిర పరిచితులు, స్నేహితులు. వీరు సంస్కృతభాషకు చేసిన సేవ యపారము. అరవదేశ మందెల్లో భారతమునెడ నంత యభిమానముచూపదు. అట్టి యరవలకు సైతము నాగర లిపియందు చదువుకొని యానందించుటకు వీలుగా అనేక వ్రాతప్రతుల నరసి పాఠభేదములతోను, చక్కని పాఠవివరణములతోను సంస్కృతలిపి భారతమును వెలువరించిరి. దానిని శ్రీ శాస్త్రిగారికొఱకు పరిష్కరించిన ప్రముఖులు మాతండ్రిగారి యందలి గురుభావమున దానిని తెచ్చి వారిపాదపీఠమునపెట్టగా వారును దానినిగాంచి చాల సంతసించి శ్రీశాస్త్రిగారి కృషిని మిక్కిలి ప్రశంసించిరి. వీరు మాతండ్రిగారి మిత్రులగుటవల్లనే నేడు నేనిసభకు విచ్చేసి వీరియందు నాకుగల గౌరవభావమును వెల్లడించితిని.

శ్రీవిద్వాన్ టి. పి. మీనాక్షిసుందరంపిళ్లగారు, ఎం. ఏ., బి. ఎల్.,
ఎం. ఓ. ఎల్., అణ్ణామలై యూనివర్సిటి ప్రొఫెసరు.

శ్రీశాస్త్రిగారి పూర్వికులు అరవలు గావున తాము అరవభాషలో మాటలాడు చున్నా మనిరి. (నిజమునకు శ్రీపిళ్లగారు ఆంగ్లాంధ్ర సంస్కృతభాషలలో ముచ్చటింప సమర్థులు.) శ్రీశాస్త్రిగారు సంస్కృతాంధ్రగ్రంథములనేగాక అరవభాషా గ్రంథములను ప్రచురించి అరవ గ్రంథకర్తలనుకూడ పోషించినవారు. కీ. శే॥ వీ, ఓ. చిదంబరముపిళ్ల గారు తొల్కాప్పియమునకు వ్యాఖ్యానము రచింపగా అరవవాండ్రెవ్వరును దానిని ప్రచురింప నిష్టపడరైరి. అట్టిసమయమున ఆ కార్యభారమును తలపై వేసికొన్న ప్రముఖులు శ్రీశాస్త్రులుగారు. వారు పుట్టుకకు ద్రావిడులయ్యు తెనుగుదేశమున నివాసమేర్పఱచు కొన్న కారణమున తెనుగుదేశాభిమానులు, తెనుగు భాషాభిమానులుగూడ నయిరి. రాయలసీమయు నుత్తరసర్కారులును కలియు కోణభాగమున నున్నది గాన మద్రాసు ఆంధ్రరాష్ట్రమునకు రాజధాని గావలె నన్నవాదమును అందముగాలేవదీసినవారు వీరే. అయినను అరవలలో వారికి మిత్రులు పలువురు కలరు.

వాగ్గేయకారక శ్రీమతి సరస్వతీభాయిగారు.

శ్రీశాస్త్రిగారు తెనుగు, అరవము, సంస్కృతము, ఆంగ్లభాష లన్నిటిలో గ్రంథ ప్రచురణములు సాగించి పోషించినవారు. అన్ని భాషలవారితోను మైత్రి గలిగి అందరికి ప్రోత్సాహములు చేకూర్చువారు. అంతేకాదు. అత్తాకోడండ్రయిన లక్ష్మీ సరస్వతులు పొత్తుగా నుండుట దుర్ఘటము. వారికిని తగుయింట పొత్తుకుదిర్చినవారు శ్రీశాస్త్రులవారు.

[ఈ పలుకులకు తర్వాత నామె కొన్ని సంస్కృత శ్లోకములను చదివి "ఎన్నగాను రామభజన" అని కీర్తన పాడెను. పేరుపొందిన హరికథాకాలక్షేపచతురయగు నీమె యుపన్యాసమును సంగీతమును సభాసదులను ముగ్ధులుగా నొనర్చినవి.]

తర్వాత శ్రీశాస్త్రిగారి వావిళ్లప్రెస్సు పండితులు శ్రీపరవస్తు రామానుజాచార్యులు గారు సంస్కృతశ్లోకములను జదివిరి. ఆపిదప వరుసగా శ్రీనారు నాగనార్యకవిగారు, కళా ప్రపూర్ణ శ్రీజనమంచి శేషాద్రిశర్మగారు, శ్రీనిడుదవోలు వేంకటరావుపంతులుగారు, శ్రీ తులసీదాసునాయుడుగారు, (రిటైర్డు జడ్జి), శ్రీప్రతివాది భయంకరాచారిగారు, శ్రీసత్య వోలు రాధామాధవరావుగారు, విద్వాన్ వేంకటశాస్త్రిగార్లు గద్యముల పద్యముల నుపన్య సించిరి. శ్రీరావాడ వేంకటశాస్త్రిగారు బళ్లారిలో శ్రీశేషప్పశ్రేష్ఠి అనేమిత్రులు తమ ద్వారా రు.25-0-0 లు శాస్త్రిగారికి పంపిరని దాఖలుచేసిరి. కడపట శ్రీగద్దె రంగయ్యనాయుడుగారు శ్రీశాస్త్రిగారి వివిధోద్యమములును పదునెనిమిది సంపుటముల సంస్కృతభారత నాగరలిపి ముద్రణమును ప్రశంసాపూర్వకముగ నుగ్గడించుచు సుమారు అర్ధగంటసేపు గంభీరోప న్యాసము గావించిరి. కడపట శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు తమ అధ్యక్షోపన్యాస మున నిట్లు నుడివిరి:—

శ్రీరెడ్డిగారి ఉపన్యాసము

ఇంతసేపు పండితులు వక్తలు శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారినిగురించి చేసినప్రశంసలో అత్యుక్తి యేమాత్రములేదు. ఆయనను ఆయన తండ్రి శ్రీరామస్వామిశాస్త్రిగారిని తెలి యనివా రెవరు? శ్రీరామస్వామిశాస్త్రిగారు గొప్ప విద్వాంసులు. తండ్రివలెనే శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారుకూడ పాండిత్యము సంపాదించి పండితులనుపోషించి విద్వజ్జనము నకు ఆప్తులయిరి.

మాతండ్రి శ్రీసుబ్రహ్మణ్యరెడ్డిగారును శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారును కడు మిత్రులు. అట్లే వారి తనయులము మేమును మిత్రులము. ఆవంశపారంపర్యమైత్రిచే నేను విధిగా దలచి యీసభకు వచ్చితిని. కాన ఇందు విశేషమేమియు లేదు. ఖిలమైపోవు చున్న అనేక పూర్వకవికృతగ్రంథముల నచ్చొత్తించి యుద్ధరించిన కీర్తి శ్రీవావిళ్లవారిది. వారు తెనుగులిపిలో సంస్కృతగ్రంథము లనేకములు ప్రకటించిరి. ఒక శతాబ్దానికి పూర్వముకూడ సంస్కృతగ్రంథములు కొన్ని తెనుగులిపిలోనే ప్రచురింపబడేవి.

పూర్వము భాషాపోషకులు రాజులు. కాని, నేటి కది ప్రజాపోషణపాల బడినది. అట్టి ప్రజాపోషణ కవకాశమిచ్చునట్లు గ్రంథప్రచురణము గావించినవారు వీరు. ఎడతెగక

ఆపని సాగించినది వీరే. మఱి వీరికి సాటి యెవ్వరును లేరు. చిరుత ప్రాయములోనే పత్రికల ద్వారా తమ యభిప్రాయములను నిర్భయముగ ప్రకటించువారు వీరు. ఆనందముద్రాక్షర శాల యొకానొకప్పుడు వీరికి పోటీయగునేమో యను సంశయముండెను గాని యట్లు గాలేదు. ఆసంస్థలోనికి శ్రీతంజనగరము తేవప్పెరుమాళ్లయ్యను ప్రవేశపెట్టినవాడను నేనే. నాభాషాసక్తికి దోహదమిచ్చినవారీశాస్త్రిగారే. నేను ఇంగ్లాండునకు పోవుటకు పూర్వము కళాపూర్ణోదయమున కొక విమర్శ వ్రాసితిని. దానిని శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి కృషివల్లనే పెద్దలకు వినిపించితిని. నా ప్రయత్నమును శ్రీచదలువాడ సుందరరామశాస్త్రిగారు శిష్యవాత్సల్యమున ప్రోత్సహించిరి. ఆపిదప నొకటి రెండు తావులచదివి ఇంగ్లాండు వెళ్లి వచ్చితిని. మఱి 10 సం॥లకు పిదప నా విమర్శను తమ కళాపూర్ణోదయమునకు పీఠికగ నిమ్మని శ్రీశాస్త్రిగారు కోరిరి. విచారింపగా దానితో చేర్చియుంచిన మాతాతగారి గ్రంథములు జాగ్రతగ నుండుటయు నాయీ రచనయంతర్హితమగుటయు దెలిసెను. శ్రీశాస్త్రిగారి బలవంతమున నా భావములనే మరియొకసారి భాషాబంధన మొనర్చిరి. శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి నీ పనికినిలుపగా వారిపని నాకసంతృప్తిగనుండుటచే ఆపని నేనే నిర్వహించితిని. అది యొక పెద్ద గ్రంథముగ పెరిగినది. దాని నింకను వివరించి గ్రంథముగ ప్రచురించి దాని సంక్షిప్తరూపమును కళాపూర్ణోదయ పీఠికగ ప్రచురించితిని. ఇప్పుడు వారి ముద్రణమున నుండినది నా పీఠికయే. అప్పటికి కళాపూర్ణోదయమున కింత ప్రఖ్యాతిలేదు; నా విమర్శనమే దానికాకీర్తి తెచ్చెననుకొందును. నాకును దాని రచనవల్లనే విమర్శకుడను కీర్తిగల్గెను. దీనికంతటికిని మూలము ఈశాస్త్రులవారు. ఆపిదప వేమన పీఠికకూడ నాచే వ్రాయించిరి. శ్రీశాస్త్రులుగారి వేమనశతకమువంటి ప్రతి మరి యెవ్వరును ప్రచురింపలేదు. దీని కంతకును మూలము శ్రీశాస్త్రిగారి ప్రతిభయే. చిన్నతనముననే వారీపని చేపట్టి స్వయంకృషి చేతను పట్టుదలచేతను ఇతర సాహాయ్య నిరపేక్షముగ దీనిని పెంపొందించిరి. శ్రీవావిళ్ల వారి కృషి లేనిపక్షమున వైదికపురాణాది గ్రంథములు విస్మృతిలో నశించియుండును. కాలవాహినిలో అందరును కలసిపోయి విస్మరింపబడినప్పటికిని శ్రీవావిళ్లవారి కృషి అమరప్రాయముపొంది నిలువగలదు.

శ్రీశాస్త్రులవారొక్క భాషాసేవయేగాక నితరములగు నుద్యమములనుకూడ చేపట్టి నడపినారు. పత్రికాప్రచురణమున “త్రిలిఙ్గ” (తెనుగున) “ఫెడరేటెడిండియా” (ఆంగ్లమున) నడపుచున్నారు. వానిలోని విమర్శనములనుగూర్చి శ్రీభాసా సుబ్బరావుగారు అవి నిష్పక్షపాతములని శ్లాఘించియున్నారు. బహుశః వారు శ్రీశాస్త్రిగారి విమర్శనాబింబమును రూపించుచు తమవిమర్శనాప్రతిబింబమునుకూడ వర్ణించిరేమో ? శ్రీశాస్త్రులవారి ఆంగ్లపత్రిక ఇంగ్లాండునగూడ గౌరవభావమందినది. వారు సెంట్రలుబ్యాంకింగు ఎంక్వయిరీ కమిటీలో సాక్ష్యమిచ్చుటయు, అఖిలభారత వాణిజ్యసంఘమున బహుకాలము మద్రాసు ప్రతినిధులుగ నియమింపబడియుండుటయు ఆంధ్రచేంబర్ ఆఫ్ కామర్సును నిర్మించుటయుకూడ వారివ్యవహారదక్షత తెలియవచ్చును.

శ్రీశాస్త్రిగారు సంబంధపడనిసంస్థ యీరాష్ట్రమున కనపడదు. మదరాసు యూనివర్సిటీలో కొంతకాలము సెనేటుమెంబరుగను తెనుగుబోర్డు ఆఫ్ స్టడీసుమెంబరుగను నుండిరి. మదరాసు అణ్ణామలై యూనివర్సిటీలో తెనుగునకు పరీక్షాధికారిగ నుండిరి. పచ్చయప్ప కాలేజి, పోర్టుట్రస్టు, సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకి, హిందూ థియలాజికల్ హైస్కూలు, చూలైకమిటీ సెకండరీస్కూలు మున్నగువానిలో ట్రస్టీగ నెంతోకాలము పాటుపడిరి. మదరాసు శిశురక్షణసంఘమునకు కార్యదర్శిగనుండిరి. ఫిలింబోర్డుసెన్సరుగను ఇండస్ట్రియలు బోర్డు, యం. అండ్. యస్. యం. రైల్వేబోర్డుమెంబరుగనుయుండిరి. ఆంధ్రచేంబర్ ఆఫ్ కామర్సును వీరే నిర్మించిరి. నిర్మించుటయేగాక చాలకాలము సెక్రటరీగ పాటుపడుచు అనేక సంస్థలలో చేంబరునకు ప్రాతినిధ్యము సంపాదింపగలిగిరి. వీరు జబ్బుపడ్డనాఁడట నీచేంబరు ఏసంస్థలోను ప్రాతినిధ్యము సంపాదించినట్లు కనబడదు. శ్రీశాస్త్రిగారనేకసంస్థలతో సంబంధపడి తమయనుభవముచే నాయాపట్ల కార్యదీక్ష పురిగొల్పును యథామతి సలహాలనొసగుచు తమకై వారుత్సాహముతో నిరీక్షించుచుండునట్లుగా తలలో నాలుకగ నడచుకొనుచుండిరి.

శ్రీశాస్త్రిగారింకను విశేషముగ భాషాసేవయు దేశసేవయు గావించుటకును నేను తలపెట్టిన మహాభారత విమర్శనను ముద్రించుటకును ఈశ్వరుడు వారి కాయురారోగ్యము లిచ్చుగాక! శ్రీశాస్త్రిగారి షష్టిపూర్తి సభాకారణముగ నొక శాశ్వతస్మరణచిహ్న మేర్పరుపదలచి సర్: యస్. రాధాకృష్ణన్ గారును నేనును సభాప్రారంభమునకు పూర్వమే సంప్రతించుకొంటిమి. ఒకనిధి నేర్పఱచి ఆంధ్రవిశ్వవిద్యాలయమున వారిపేర నేదైన శాశ్వతవినియోగము కల్పింప నూహించితిమి. అందులకై ముందుగా నేను 116 లు ఇచ్చుచున్నాను. శ్రీరాధాకృష్ణనుగారును ఇత్తురు.

### శ్రీ వేంకటేశ్వర శాస్త్రి గారి ఉపన్యాసము

అంత శ్రీశాస్త్రిగారు వచ్చినవారందఱకీ, అధ్యక్షులకు వందనము లర్పించుచు తమ కృషి ఫలించుటకు మూలకారకు డితడు అని వావిళ్లసంస్థకు మేనేజరు పదవిలోనుండు శ్రీ కాళహస్తి చంద్రమౌళీశ్వరశాస్త్రిగారిని సభాసదులకు పరిచయముగావించి తమకు శరీరరుగ్మతతోపాటు తమమేనల్లుడు అల్లాడి రామస్వామి యం. ఏ., బి. యల్. గారు కీర్తిశేషులగుటచే చింతిల్లుతమకేమియు సంతోషోత్సాహములు లేవని తెలుపుచు నిట్లుపన్యసించిరి.

"ఏతత్క్షణపర్యంతము మీరెల్లరు పెద్దమనస్సుచేసి నన్నుగూర్చి ప్రకటించిన ప్రశంసా వాక్యములకు నేనర్హుడనుగాను. మాతండ్రిగారు ప్రారంభించినకార్యమును నేను కొనసాగించితిని. నాభాగ్యవశమున నాకు శ్రీస్వామి వివేకానంద, శ్రీస్వామి రామకృష్ణానంద, శ్రీశాయిబాబా, శ్రీరమణమహర్షి, శ్రీయుతులు అరవిందఘోషు మున్నగు మహనీయులతో పరిచయము గలిగినది. మన ప్రముఖులలోనేగాక జస్టిసుకార్నిష్,, జస్టిసు సర్: ట్రాటరు, బారిస్టరుగ్రాంటు, సర్: ఫ్రాన్సిస్ రాస్. సర్: ఎడ్గర్ వుడ్, సర్: హెన్రీటవుర్క్, మున్నగు ఐరోపియన్లలోను నాకు ఆప్తులుగలరు. రాజకీయరంగమున లోకమాన్య శ్రీతిలకు గారివద్దను, శ్రీలాలాలజపతిరాయి, శ్రీదేశబంధు సీ. ఆర్. దాసు, శ్రీమాన్ యస్. శ్రీని

వాసయ్యంగార్లతో కలసియు పనిచేయు అపూర్వభాగ్యము నాకబ్బినది. వీరేగాక యితర దేశ నాయకు లెందఱితోడనో సాంగత్యము నాకు లభించినది.

శ్రీగాంధీగారితోడి నాతొలిపరిచయమునకు ఈయధ్యక్షులే కారకులు. ఆ విషయమునుగూర్చి యించుక ప్రస్తావింపవలసినదిగా నేను వారిని కోరుచున్నాను.

తర్వాత మాసంస్థలోని పండితులు, చిత్తులుదిద్దువారు, నౌకరులు, గుమస్తాలు మున్నగువారికిని నావందనములు. నాయుద్యమముఫలించుటకై వారెంతో శ్రమించి యున్నారు. వీరేగాక నాగ్రంథములను పరిష్కరించి, టీకలు వ్రాసి ముద్రణము సాగించిన విబుధులకును, విద్వాంసులకును నామనసార వందనములు.

అధ్యక్షులయిన డాక్టరు శ్రీరెడ్డిగారినిగూర్చి ఏమిపలుకుటకు నోరాడకున్నది. వారు విద్యాలుబ్ధులగుటచే వారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తున కుపాధ్యక్షులుగ నున్నారుకాని వారు విద్యావైదుష్యములచే రాజకీయరంగమున స్వతంత్రభారతమున ప్రధానమంత్రి పదవి కర్హులనుట అతిశయోక్తియే కానేరదు. వారితండ్రియు మాతండ్రియును ఆబాల్యమిత్రులు. దానిని మరువక మేమును మైత్రి పాటించుచున్నాము. ఇదియొక సుకృతము. ఆంధ్రవిశ్వవిద్యాలయము వీరిసంతానమే యనుటయు, తదభివృద్ధికి మూలపురుషులు వీరే యనుటయు నేను విడిగ పేర్కొన నక్కరలేదు. అయ్యది లోకవిదితమే. తెనుగుగద్య రచనకు నాకత్యంతాభ్యాసము గావించిన గురువులు వీరే. దేశభాషలను ఆంగ్లవిద్యాసంపన్నులు నిరసనభావముతో జూచుకాలమున 1910-వ సం॥ నాటికే వీరు నాకు గురువులైరి. నేను సరియైనగురువు నెన్నుకొంటినో లేదో విమర్శింప సమర్థులు మీరే.

నేను పత్రికారంగమును ప్రవేశించునపుడు తొలుత విలేఖరిగ ప్రారంభించితిని. ఆసందర్భమున పత్రికాప్రపంచమున హేమాహేమీలని గణింపబడుచుండిన లోకమాన్య శ్రీతిలకు, శ్రీజి. సుబ్రహ్మణ్యయ్యరు, యస్. కస్తూరిరంగఅయ్యంగారు, ఏ. రంగస్వామి అయ్యంగారు, యస్. రంగస్వామి, యన్. సి. కేల్కరు, డాక్టరు సర్ సి. వై. చింతామణి, శ్రీకే. వ్యాసరావు మున్నగువారితో నాకు పరిచయముగలిగినది. ఒకప్పుడు కాకున్న మఱొకప్పుడువీరు నాకు ఉద్బోధము గావించినవారే; వారికెల్లరకు నాకృతజ్ఞత చెల్లించెదను. నేటి పత్రికాలోకమున సింహతుల్యులగు శ్రీ కే. పి. విశ్వనాథయ్యరు, శ్రీరఘునాథఅయ్యరు, శ్రీఖాసా సుబ్బరావు మున్నగు అనేకులతో నాకు చెలిమి కలదు. వారు నాయందతివిశ్వాసము కలవారనియే నానమ్మకము.

నాయాహ్వానము నాదరించి స్నేహవాత్సల్యముల పాటించి యేతదుత్సవమునకు జయమొనగూర్చిన జగద్గురువులు, రాష్ట్రగవర్నరులు, ఇండియాగవర్నమెంటు మెంబర్లు ప్రభృతులకు నామనఃపూర్వకవందనములు. ఖండాంతరవ్యాప్తిగలిగి సంచారకార్యధురంధరులై అన్యప్పుడెల్ల దుర్లభులైన మద్బాల్యసఖులు శ్రీ డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు యాదృచ్ఛికముగ నీచెన్నపట్టనగరమునకు వచ్చియుండి నాయందలి వాత్సల్యాతిశయముచే నీయుత్సవమునకు రాగల్గినందున నాయానందమునకు మేరలేదు. దూరభారమని

యెంచక 80 సం॥ రముల వయస్సునకు మించిన వృద్ధులైనను, నా రాజకీయగురువర్యులగు శ్రీతిలకు మహారాజ్ మొదలుగ నభిమానముగల మహారాష్ట్రమిత్రవర్గమునకు ప్రతినిధిగ ఢిల్లీనుండి విచ్చేసి నన్నాశీర్వదించిన శ్రీబాబాసాహెబ్ డాక్టరు: తః స్వీపరంజపేగారికి వందన శతములు. మఱియు సభకు విచ్చేసి నన్నాదరించినవారందరికి నాహృదయపూర్వక నమస్కారములు.

గద్యపద్యాత్మకమగు తమ అభినందనములతో నన్ను ప్రశంసింపవచ్చిన శ్రీజనమంచి శేషాద్రిశర్మప్రభృతులైన పండితులు, కవులు, పత్రికాసంపాదకులు మున్నగువారందఱికి నేను తీర్పజాలని ఋణము నపడియున్నాడను. వ్యవహారరంగమున ననేకవిషయముల భిన్నాభిప్రాయుడనయ్యును తమశుభసందేశ మంపి గౌరవించిన గవర్నరు శ్రీచక్రవర్తి రాజగోపాలాచార్యులుగారికిని, శ్రీసర్: అల్లాడి కృష్ణస్వామయ్యరుగారికిని నావందనము లర్పించుచున్నాను.

శ్రీకట్టమంచి రామలింగారెడ్డి, శ్రీసర్: రాధాకృష్ణయ్య, శ్రీమునగాల రాజా మున్నగు పెద్దలు నాయందలి వాత్సల్యాతిశయమున నీసభ సంస్మృతిగా నొక నిధి నేర్పఱచి ఆంధ్రవిశ్వవిద్యాలయమున దాని కొక వినియోగము కల్పింప నుద్యమించినందులకు వారికి నాయభినందనము లర్పించుచు పరమేశ్వరుని కృపచే నది యచిరకాలముననే సిద్ధినందుగాక యని భగవంతుని ప్రార్థించుచుందును.

ఈసభా నిర్వాహక కార్యభారమూని శ్రమయనియెంచక దూరదేశములకుగూడ సంచారార్థము వెళ్లివచ్చి దీని నింత జయప్రదముగ నెరవేర్చినందులకు మామిత్రులు శ్రీయుతులు గరిమెళ్ల సత్యనారాయణ, శ్రీకుదవోలు వేంకటరావుపంతులు, శ్రీవేదము లక్ష్మీనారాయణశాస్త్రి మున్నగు మిత్రులందఱికిని శాశ్వతముగా కృతజ్ఞుడను.

1931 వ సం॥ కాంగ్రెస్సుకక్షివారిలో అనేకులు పురుషులు, స్త్రీలు, వాలంటీర్లుమున్నగు వారిని అధికారులు పోలీసులచే చావగొట్టించుదృశ్యమును సహింపలేక శ్రీరెడ్డిగారు ఆంధ్ర యూనివర్సిటీపదవికి రాజీనామాయిచ్చిరి. తదనంతరము దేశాభిమానముతో కాంగ్రెస్సున పాటుపడదలచిరికాని శ్రీగాంధీ అనుచరులు ఇందుకు అవకాశము ఇవ్వరైరి. (రెడ్డిగారు.— నేనుగా కాంగ్రెస్సుతో సంబంధము వదలుకొంటిని)-

శాస్త్రి.— కాదు, కాదు శ్రీగాంధీగారు మీకు అనుకూలురుగ నుండినను ప్రముఖులగు అనుచరులు ప్రతికూలముగ వర్తించుటవల్లనే తాము కాంగ్రెస్సును వదలవలసి వచ్చెను. ఆయనుచరులు ఇదేతీరున నెందరో దేశాభిమానులగు ప్రముఖులను వెళ్లగొట్టి దిగద్రొక్కిరి.

శ్రీగాంధీ అనుచరుల దృక్పథము మారినగాని భారతదేశము బాగుపడదు. తాము స్వరాజ్య మిప్పించినాముని రేయింబవళ్లు ప్రచారము సాగించుచున్నారుకాని యే తురకల ప్రభుత్వములోను ఎన్నడును హిందువులకు ఇప్పటి కష్టములు తటస్థించలేదు.

హిందూస్త్రీలు పిల్లలు లక్షలకొలది అధోగతిపాలైరి. భారతదేశమున "నేను హిందువును" అని చెప్పుకొనుటకుకూడ అవకాశము లేక చేసిరి.

శ్రీరెడ్డిగారు యూనివర్సిటీ ప్రారంభము మొదలు దీని కార్యభారమువహించి నిర్వహించిరి. 17 సంవత్సరములుగ తాము వైస్‌ఛాన్సలరు పదవి నలంకరించుటయు ఈమధ్య పోటీలేకయే యీపదవి కొప్పుకొనబడుటయు తమప్రతిభయే నిందుకు కారణమని తలంచుచున్నాను. ఏలూరున తమపేర ఒక ఫస్టుగ్రేడుకాలేజి నిర్మింపబడుటచే తెనుగువారి కీర్తికి వీరు పాత్రులైనారని వెల్లడియగుచున్నది. జాతి మత కుల సాంఘిక వైషమ్యముల పాటింపక వీరు వర్తించుటయే వీరికీర్తికి మూలకారణము.

ఆ పిదప రాజకీయముల ప్రస్తావనమురాగా శ్రీశాస్త్రులవారు ఉద్రిక్తులగుచుండుట గని అధ్యక్షులవారది వారి యారోగ్యమునకు భంగకరమని సాంత్వన వచనములచే సభ ముగించిరి.

శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు పూనుకొనిన పనికి స్థిరమైన యేర్పాటుచేయుటకై శ్రీరెడ్డిగారు తమ రూ. 116 లతో ప్రారంభించిన నిధికై సర: రాధాకృష్ణగారు రు. 116 లు ఇత్తురని అధ్యక్షులే ప్రకటించిరి. అంతట షెరీఫ్‌గారయిన జనాబ్ షఫీ మహమ్మదు, శ్రీపాన్నేరి శ్రీరాములుశెట్టి, శ్రీమునగాలరాజాగార్లును రూ. 116 లు సభలో వాగ్దానము గావించిరి.

శ్రీనిడుదవోలు వేంకటరావుగారు, ఎమ్. ఏ., మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషోపన్యాసకులు, శ్రీశాస్త్రిగారి షష్టిపూర్తికమిటీ కార్యదర్శులు చదివినపద్యములు:—

క. శ్రీవేంకటేశుఁడాయుః, శ్రీవిద్యాశక్తినొసగి చిరతరకరుణన్
  శ్రీవావిళ్లాన్వయ మిం,తె వెలయఁగ బ్రోచు వేంకటేశ్వరశాస్త్రిన్. 1

ఆ. బాలశిక్ష మొదలు భారతంబువఱకు, గ్రంథమేదియైన కావలసిన
  వ్రాయుడింక నేల 'వావిళ్ల'కనియెదు, పలుకె తెలుగునాట నిలిచె నేడు. 2

ఆ. ఆంధ్రవాఙ్మయచరితంబునందు తెలుఁగు, ముద్రణచరిత్రమును చెప్ప మొట్టమొదట
  వెలయు మూడక్షరము 'వావిళ్ల' పేరు, వాఙ్మయ ముఖాన నోంకృతి వరలునట్లు. 3

ఆ. స్థాపనంబొనర్చె తండ్రి రామస్వామి, తెలుగుముద్రణంబు; దిద్దితీర్చి
  వేంకటేశ్వరుండు వృద్ధినొందించుచు, తండ్రిమించినట్టి తనయుఁడయ్యె. 4

గీ. రాజకీయార్థికాదిసారస్వతాది, సకలసంస్థల వేంకటేశ్వరుడు మించె
  వానఁదడియని వాగలు, దాన మతని, చేతగొననట్టివారలు చెప్పనరిది. 5

నాటిసాయంకాలము గం. 3-30 లకు మరల పండితులును పత్రికా రచయితలును సమావేశమైరి. శ్రీకళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు అధ్యక్షపీఠమలంకరించిరి. దేశమున పలుభాగములనుండియు సంస్కృతమున తెనుగున కవులు విద్వాంసులు వందలకొలదిగా పంపిన సందేశములలోను, పద్యములలోను కొన్నింటిని చదివి సభవారికి వినిపించిరి.

తరువాత పత్రికారచయితలు పండితులు మున్నగువారిలో ఫ్రీప్రెస్సు సంపాదకులు శ్రీఐరావతముగారిట్లుపన్యసించిరి.

“షష్టిపూర్తి సందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని మనసార అభినందించుచున్నాము. ఆయన తెనుగు సంస్కృతగ్రంథ ప్రకటనముచే చిరస్థాయి యగు కీర్తిని గడించిరి. తెనుగు మండలములో వారి గ్రంథము చూడబడని మూలమూలలయొక్కటైనను కనబడదు. వారి విద్యావైదుష్యముల గ్రహించియే శ్రీలోకమాన్య బాలగంగాధరతిలకుగారు తమ గీతారహస్యమునను తెనుగుపరివర్తన ముద్రణాధికారముల వారి కప్పగించిరి. దీర్ఘకాలము పత్రికాసంపాదకులై నిర్భయముగ మనోభావములను ప్రకటించుటకు వెనుకటివారికి మార్గదర్శకులైరి. ఇంగ్లాండున రౌండుటేబిలు సమావేశము జరిగినపుడు నిష్పక్షపాతముగ అభ్యుదయ భారతీయాభిప్రాయముల వెల్లడించుటలో వీరి ఫెడరేటెడిండియాపత్రిక నిరుపమానమైనదని సర్: సామ్యుయల్ హోరుగారును, సర్: థియోడోర్ మారిసన్ గారును, సర్ వాలెన్టైన్ షిరాల్ గారును తమ యభిప్రాయములు వెల్లడించియున్నారు. వీరి త్రిలిఙ్గపత్రిక సునిశిత విమర్శలకును నిష్పాక్షికబుద్ధికిని ప్రశస్తతరమైనది. వీరివంటి ప్రముఖులు అరుదు. ఖండనమండనాదులచే ప్రతిపక్షులకు భయము గొల్పువారైనను వీరివంటి యుదారులు సత్కృత్తు; మహోపకారులు. ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామర్సుసంస్థ వీరిబిడ్డయే.

పిమ్మట శ్రీపిలకా గణపతిశాస్త్రి, శ్రీబులుసు వేంకటరమణయ్య, శ్రీమొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీశ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీసత్యవోలు రాధామాధవకవిగార్లు, శ్రీశుభ్రవేటి తిప్పాజోస్యులుగారు, శ్రీగాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారును శ్రీశాస్త్రులవారి యౌదార్యమును, వదాన్యతను, సర్వాంకషత్వమును ప్రశంసించుచు పెక్కువిధముల నుడివిరి. అధ్యక్షులవారు ఉపసంహారోపన్యాసవాక్యములు కొద్దిగ పలికి సభను ముగించిరి.

# సందేశములు

**1 ఆంధ్రకేసరి శ్రీటంగుటూరు ప్రకాశంపంతులుగారు.**

మదరాసురాష్ట్ర మాజీప్రధానమంత్రి, గవర్నమెంటుహౌసు, చేపాకు, మదరాసు.

మాచిరకాలమిత్రులయిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని వారిషష్టిపూర్తి సమయమున నెంతో కుతూహలముతో అభినందించుచున్నాను. నాటికి హైదరాబాదుగోలను తనిఖీచేసి వచ్చుటకై వెళ్లవలసిన నిర్బంధముచేత నీసభకు రాజాలనైతిని. మహనీయులైన వారితండ్రి కీ. శే॥ శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు సంస్కృతాంధ్రములలోను, అరవభాషలోను ప్రాచీనగ్రంథముల ముద్రణరూపమున నెంతో సేవయొనర్చియున్నారు. కుమారుడును తండ్రియడుగుజాడలనే యనుకరించి తమముద్రణ ప్రచురణ కార్యములను విస్తరింపజేసినందువల్ల నేటి తెనుగుదేశమున వావిళ్లవారిగ్రంథములలో నొకటైనను కానరాని మూలమూల కనబడదు.

వారికిని వారిసంస్థకును శ్రేయోభివృద్ధులు కలుగునుగాక! శ్రీశాస్త్రిగారి వ్రాతలు గంభీరములు విషయపూరితములును ఉద్బోధకములు నగుటయేగాక వచనరచనమునకును మార్గదర్శకములుగనుండును. తొలుదొల్తపై 1914- వ సం॥ శ్రీలోకమాన్యతిలకునిధికి విరాళ మడుగ శ్రీబాబాసాహెబు పరాంజపేగారితో కలసి నావద్దకువచ్చిరి. నాటినుండి నేటివఱకు మాసఖ్యము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది. వారిప్రోద్బలమువల్లనే నేను రాజకీయాంగణమును ప్రవేశించినట్లు నాజ్ఞాపకము. ఈ 35 ఏండ్లుగా మేమిరువురమును గలసికొని రాజకీయవ్యవహారములనుగూర్చి చర్చింపని రోజొక్కటియు నుండదు. దురదృష్టవశమున మనము మరచిపోవుచున్న సదాచారము లనేకములు వీరు నిష్ఠతో పరిపాలించుచున్నారు. స్నేహముయొక్క విలువను సంపూర్ణముగ నవగతము చేసికొన్న విచక్షణులు వీరు. పత్రికాకళకును దేశమునకును వారిసేవ పరిశుద్ధమై స్వార్థరహితమై వెలయుచుండును.

"త్రిలిఙ్గ", "ఫెడరేటెడిండియా" అను రెండుపత్రికలు వారు చేతులార సాగించుచున్నారు. వానినిగూర్చి ప్రశంసించుట నాతరముగాదు. వారిత్రిలిఙ్గ తెనుగుదేశములోనేగాక విదేశములలోని తెనుగువారి వలసప్రాంతములకును ప్రాకియున్నది. ఆత్రిలిఙ్గ వారపత్రికను దినపత్రికగ మార్పవలెనని కోరువారిలో నేనొకడను. ఆసేతుహిమాచలముననేగాక విదేశములందుగూడ శిష్టులచే వారు విశ్వాసపాత్రులు గౌరవార్హులుగ పరిగణింపబడుచున్నారు.

వారివినీతవర్తనమును జూచినవారికి మొట్టమొదట భగ్నాశ కలుగవచ్చును. వారిబుద్ధి తీక్ష్ణగ్రాహియైనది. పరేంగితము నూహించుటలోను, నీతివిషయకమైన యభిమానమునందును, విచక్షణతయందును, అన్నిటికన్న మించిన దేశభక్తియందును, సంస్కృతాంధ్ర వాఙ్మయములమీది అనురాగమునందును ఆయన ఇతఃపూర్వమునుండియే యనుభవముననున్న భారతీయాదర్శములు వారియాచరణమునకు మార్గదర్శకములు. ఆయన రాజకీయ వ్యవహారులు, పత్రికారచయితలు, పండితులు, విద్వాంసులు, విద్యార్థులు-వారు వీరన్న భేదము పాటింపక అందఱకు నుపకారముచేయువారు; అట్టి మహనీయుని వారెల్ల రాదరింపవలసినదినమిది. ఆయన అఖిలభారతీయ దేశీయ సభాకార్యవర్గమందు నాకన్న నెంతో కాలము ముందటినుండియు సభ్యులైయుండిరి. ప్రముఖులగు దేశనాయకులలో వారికి పరిచితులుగానివారులేరు. మహాత్మాజీతోగూడ వీరికి పరిచయము గలదు. పత్రికావిలేఖరిగ జీవనము ప్రారంభించి విఖ్యాతపురుషులగు సర్ వాలెంటైన్ షిరాల్, లాసన్, కార్నిష్, ఏ. ఏ. హేల్సు, సర్ థియోడోర్ మారిసన్, శ్రీజి. సుబ్రహ్మణ్యయ్యరు, శ్రీమాన్ కస్తూరిరంగఅయ్యంగారు, శ్రీమాన్ ఏ. రంగస్వామయ్యంగారు, శ్రీమాన్, సి. రాజగోపాలాచారి, రావుసాహెబు శ్రీసి. మునుస్వామయ్యరు, డాక్టరు సి. వై. చింతామణి, శ్రీమోతీలాలుఘోషు, లోకమాన్య శ్రీతిలకు, శ్రీయన్. సి. కేల్కరు మున్నగు మహనీయులకు వీరాప్తులుగాకూడ మెలగియున్నారు.

ఇట్టి మహాశయుడు దీర్ఘకాలముగ రుగ్ణతచే మంచముపట్టియుండుట చాల విచార కరము. ఆయనకు, ఆయనసంస్థకు పత్రికకు శ్రేయోభివృద్ధులు కలుగునట్లు దేవుని ప్రార్థించుచున్నాను.

2 పడమటి బెంగాల్ గవర్నరు గౌ. శ్రీ సీ రాజగోపాలాచారిగారు.

అనేకసంవత్సరముల క్రిందట 1919 సంIIలో నేను చెన్నపురమున స్వవృత్తి నారంభించిన క్రొత్తలో 'స్వదేశమిత్రన్' పత్రికాధిపతులు కీ॥ శే॥ ఏ. రంగస్వామిఅయ్యంగారి మూలమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారితో నాకు ప్రథమముగ పరిచయ మేర్పడినది. అప్పుడు ఉత్సాహక్రియాశక్తులు కలిగిన ప్రాచీనసారస్వతాభిలాషియు, పౌరజీవనమున శౌచపరుడునని నామనస్సునకు దోచెను. స్వభావసిద్ధమయిన లజ్జయు, ఆరోగ్యమున మృదుత్వమును లేకున్నచో వారికి రాజకీయరంగమున విపులకీర్తి గలిగి యుండెడిది. ఆ కాలమున దక్షిణదేశములో సంస్కృతగ్రంథములు విరివిగా తెలుగులిపి లోను, గ్రంథాక్షరములలోను, మలయాళలిపిలోను స్వల్పముగాను ముద్రింపబడుచుండెను. ఆశాఖయందు వావిళ్లసంస్థ తొలుత కీ. శే॥ శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిచేతను, తర్వాత శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారిచేతను చెప్పనలవికానిసేవ చేయించి దక్షిణదేశమంతటను తనముద్రణములతో నింపినది. 1919 వ సంII ఆ ప్రాంతమున వేంకటేశ్వరశాస్త్రిలవారిని మాపినతండ్రిగారొకరు గొప్పవిద్వాంసులు మైసూరిలో సంస్కృతగ్రంథముద్రణము సాగించుచుండుట నెఱుగుదురాయని ప్రశ్నింపగా తక్షణమే మావారు ప్రచురించిన ప్రాచీనగ్రంథప్రతి నొకదానిని నాకుచూపిరి. ఈవిషయము మాయిరువురిస్నేహమును బలపఱుచుటచే నేనింకను దానిని మఱువలేకున్నాను.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రిలవారు ప్రొఫెసరు శ్రీ శేషగిరిశాస్త్రిలవారు, శ్రీ అల్లాడి మహా దేవశాస్త్రిలు, శ్రీ సర్: అల్లాడి కృష్ణస్వామయ్యరు, శ్రీ పేరి నారాయణమూర్తి, శ్రీ పప్పు సోమసుందరంగార్లు మున్నగు మహనీయులవలె తెలుగుమండలమున స్థిరనివాస మేర్పఱచు కొన్న ద్రావిడకుటుంబమునకు చెందినవారు. ఆ శేషువంశల యేండ్లకుపూర్వము కొన్ని ద్రావిడ కుటుంబములు తెనుగుమండలమున చేరి తెనుగుభాషలో పండితులు, విద్వాంసులు, కవులునై విఖ్యాతయశులైనవారికి జన్మకారణమైయున్నది. అటులే, కొన్ని తెనుగుకుటుంబ ములు అరవమండలమున స్థిరనివాసములు గల్పించుకొని యా అరవవారి విశిష్టతగ కళలు, వృత్తులు, సారస్వతము తమవిగ స్వీకరించి కీర్తిగడించి యున్నవి. అట్లుండగా, అరవ తెలుగు మండలములను హద్దులేర్పఱచి చీలగొట్టవలెనను నేటియుద్యమము ఎంతన్యా య్యము, ధర్మము, యుక్తమునైనదైనను, వందలకొలది యేండ్లుగా దేశములోని పలుప్రాం తముల సంధానమునకై పడినపాట్లన్నియు గంగలో కలిసి మోహమునకును, తృష్ణకును, వైమనస్యమునకును తావిచ్చుచున్నదిగదా యను వేదనమాత్రము పెరుగుచున్నది. తెనుగు, అరవ వివాదమున కక్షలు పెరుగుచుండుటఁజూచి శ్రీ శాస్త్రులవారిహృదయము త్రుళ్లిపడు

చున్నది. వారిహృదయము శాంతి, సంయోగము, సమాధానమునే వాంఛించును. వారు సజాతీయులు శాస్త్రసారస్వతమున ఆధ్యాత్మికవిద్యలో నెట్లు ఆనందోత్సాహము లనుభవించుచున్నారో అట్లే రాజకీయ ప్రశాంతి శాస్త్రులవారభిలషించుచున్నారు. ప్రాచీన గ్రంథరత్నములను అచ్చుకూర్చుపనివారుకూడ ప్రఖ్యాతయశులైన దేశభక్తులు దేశము నకు చేయునంతటి సేవయొనర్తురని నాభావము. దానింబట్టిచూచిన మద్రాసునగరిలో శ్రీవేంకటేశ్వరులవంటి గొప్పముద్రాపకు డింకొకడు లేడు.

3 శ్రీ సర్: ఆర్. కే. షణ్ముఖము శెట్టిగారు,

ఇండియాగవర్నమెంటు ఆర్థికశాఖా ప్రధాని, న్యూఢిల్లీ.

ప్రియమైన శాస్త్రులుగారూ! షష్టిపూర్తిసభకు రాజాలనందుకు చింతిల్లుచున్నాను. ప్రముఖులు అనేకులు తమనిర్దుష్టమైన 35 సంవత్సరముల ప్రజాసేవను హర్షించుచు అభినందనముల పంపిరిగావున నేను నాఅభినందనములు పంపుచున్నాను. తామింకనూ అనారోగ్యముగనున్నందుకు విచారపడుచున్నాను. ఈమారు ఆప్రాంతములకు వచ్చి నపుడు తప్పక మిమ్ముల సందర్శించెదను.

4 శ్రీ సర్: మీర్జా యం. ఇస్మాయిలుగారు, కే. టి. సీ. ఐ. ఈ., బెంగళూరు.

తమజాబు ఆలస్యముగ అందినదిగావున తమషష్టిపూర్తిసభనాడు నాఅభినందనముల అందింప వీలుగాకపోయెను. సభ శ్రీ రెడ్డిగారియాజమాన్యమున జయప్రదముగసాగెనని హిందూపత్రికలో చదివితిని. తమకు త్వరలో ఆరోగ్యమును భగవంతుడు ప్రసాదించునని నా ప్రార్థన.

5 శ్రీమతి అంబుజవల్లిఅమ్మగారు, భారతీయమహిళాసంఘము, మైలాపూరు.

తమషష్ట్యబ్దపూర్త్యుత్సవములకు వచ్చి యానందించు భాగ్యము లేకపోయి నందులకు చింతిల్లుచున్నాను. తే 4 ది నాటి పత్రికలలో నీవిషయమును చదువగా నీ యుత్సవప్రసక్తి తెలిసినది. నాతమ్ముడు శ్రీ యస్. పార్థసారథి చెన్నపురమునలేడు. కోడైకెనాలుకు వెళ్లియున్నాడు. అతనికిని మీయాహ్వానము అందియుండదు.

నేను మీకేమి సందేశమంపగలను? మీరు మాతండ్రి కీ. శే॥ యస్. శ్రీనివాస అయ్యంగారుగారికి పరమాప్తులుగనుంటిరి. స్వయముగా సంస్కృతమున పాండితి వెలయు టచే ఆయన మీభాషాసేవ గుర్తింపగలిగి సుమారు ముప్పదేండ్లు తమయందు వారు విశ్వా సమువహించియుండిరి. తమరింకను అమూల్యమగు భాషాసేవ యొనర్పగల్గుటకు శ్రీమన్నా రాయణుడు మీకు దీర్ఘాయు వొసంగుగాక! మీ విశాలహృదయమును, వదాన్యతయు నితోధికముగ వర్ధిల్లుగాక!

6 గౌరవనీయులైన యమ్. భక్తవత్సలముగారు, మదరాసు ప్రభుత్వమంత్రి.

నా ప్రియమైన శాస్త్రులుగారికి.— నాకు తమషష్టిపూర్తిసభాహ్వానమే కారణముననో సకాలమునకు చేరలేదు. చేరినను నేనాసభలో పాల్గొనుటకు స్వయముగా మహాసభలో మిమ్మునభినందించుటకు నవకాశము లేకపోయినందులకు విచారించుచున్నాడను. నేను

మంత్రులతోఁగూడ మైసూరున పర్యటనము చేయుచుండుటయే దీనికి కారణము. నేను తమ షష్టిపూర్తి మహోత్సవమున కెంతయు సానందించి తమ దీర్ఘాయురారోగ్య భాగ్యములకై భగవంతుని ప్రార్థించుచున్నాను.

సంస్కృతాంధ్ర ద్రవిడ వాఙ్మయములను, తాముద్ధరించి అందుగల మహోత్కృష్ట గ్రంథరాజముల ముద్రించి చేసినసేవకు, ఒక్క మదరాసురాష్ట్రమేగాక భారతదేశ మంతయు కృతజ్ఞతాబద్ధమై యున్నది.

7. స్వామి శ్రీశివశంకరశాస్త్రిగారు, తీర్థాశ్రమము, వేటపాళెము.

శరీరముదూరముననున్నను మనస్సురమీపమగుటచే ఇచ్చటనుండియే శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారికి మా ఆశీస్సులు! షష్టిపూర్తిసభ జేగీయమానముగ నడచును గాక! శివానుగ్రహమువలన శ్రీశాస్త్రులవారికి త్వరలో ఆరోగ్యలాభ మగును గాక! 'త్రిలిఙ్గ' దైనికపత్రిక అగును గాక!

'తీర్థాశ్రమ'పక్షమున, 'సాహితీసమితి'పక్షమున, 'కళాపీఠ'పక్షమున శ్రీశాస్త్రులవారికి అభినందనములు.

8. శ్రీనంగోలు వేంకటరంగయ్యగారు, బి. ఏ., బి. యల్. వకీలు, నెల్లూరు.

శ్రీశాస్త్రులవారి ననేకవిధముల నభినందించుచు వారికి చిరాయురారోగ్యైశ్వర్య సంపదలు పూర్ణముగ జేకూరునట్లు త్రికరణశుద్ధిగ ప్రార్థించువాడ. శ్రీశాస్త్రులవారిముద్రణ ప్రకటన ప్రకరణములు ఇతోధికవ్యాప్తియు ఉపద్ధృతియుగలిగి విలసిల్లుగాతమని ప్రార్థించు చుండెదను.

9. శ్రీజి. వి. సుబ్బరామయ్య, యం. ఏ., వి. ఆర్. కాలేజి, నెల్లూరు.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆంధ్రసంస్కృతసారస్వతములకుఁ గావించిన అమూల్యవరివస్యకు జోహార్లు. శ్రీశాస్త్రులవారి దీర్ఘాయురారోగ్యములకై పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

10. శ్రీతేకుమళ్ల రామచంద్రరావు, ఎం. ఏ., బి. ఎల్., వకీలు, బందరు.

బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి షష్టిపూర్తిసభ శ్రీరామలింగారెడ్డిగారి అధ్యక్షతను జరగుట ముదావహము. శ్రీశాస్త్రులవారు ఆంధ్రసంస్కృతభాషలకు చేసిన సేవ నిరుపమానమని ఎల్లరు ఎరింగినదే! ఈసభప్రభావమున శ్రీశాస్త్రులవారికి ఆరోగ్యము చక్కగచేకూరి చిరకాలము ఇతోధికముగు భాషాసేవచేయుటకు భగవంతుడు తోడ్పడుగాక యని ప్రార్థించుచున్నాను.

11. సాహిత్యభూషణ శ్రీనందిరాజు చలపతిరావుగారు, ఎమ్. ఆర్. ఏ. ఎస్.

మంజువాణి పత్రికాధిపతులు, ఏలూరు.

మీషష్ట్యబ్దమహోత్సవ సన్మానసంచికకు ప్రత్యేకవ్యాసమొకటి "గోసేవాఫలము ప్రజలకర్తవ్యము" అను శీర్షికతో బంపుకొనుచున్నాను.

డెబ్బదేడులవయసున మీయట్టి భాషోద్ధారకుల షష్ట్యబ్దమహోత్సవము చక్కగా జరిగినదనివిని గుతూహలుడనై యున్నాడనని మనవి. తచ్చిహ్నముగ ప్రకటితమగు సన్మాన సంచికకు నోపిక లేకున్నను దెచ్చికొని ఈ వ్యాసమును బంపికొంటిని. కావున దప్పక ప్రకటింతురుగాక!

12. శ్రీ విద్యాశేఖర ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిగారు, ఒంగోలు.

గీర్వాణాంధ్రభాషలందు వేదవేదాంతపురాణేతిహాస ధర్మశాస్త్ర కావ్యనాటకాలంకారాది పెక్కుగ్రంథములను సంస్కరించి ముద్రించి ఆంధ్రమండలమునకనేల భారతదేశమునకంతయు మహోపకారముం గావించిన మీయెడ కృతజ్ఞత నెవరు జూపజాలరు, ఎల్లరకు సంస్తవనీయులు. ఇదివఱలోనే దత్తమండల మహాజనసభయందు "భాషోద్ధారకయని" బిరుదము పడసితిరి. త్రిలిఙ్గపత్రికద్వారా మత నీతి ధర్మ రాజకీయ విషయములం బ్రచురించుచు బహుగ్రంథముల ముద్రించి వాఙ్మయసేవను గావించుచున్న మీ కీర్తిదిగంత వ్యాప్తమయినది. ఇతోఽప్యధిక భాషాసేవను గావించి బహుగ్రంథముల ముద్రింపించి విద్వత్కవి బుధజన పాఠకమహాశయులకు మహోపకారముం గావించుటకై శ్రీపరమేశ్వరుండు మీకు సంపూర్ణారోగ్యమును దీర్ఘాయురైశ్వర్య వైభవకీర్తుల నొసంగి ప్రోచుంగాతయని ప్రార్థించుచున్నాఁడను.

శ్లో. వావిల్లాన్వయ దుగ్ధవారిధిశశీ శ్రీవేంకటేశస్సుధీః
గీర్వాణాంధ్ర బహుప్రబంధ ప్రకటీకుర్వన్ త్రిలింగేశ్వరో
భాషోద్ధారక కీర్తియుక్త సుకృతీ షష్ట్యబ్ద పూర్త్యుత్సవే
ఆశీర్భిర్మహతాం మహేశ్చ కృపయా జీయాచ్చిరం భూతలే.

13. శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు, బి. ఏ.,

ఆంధ్రాధ్యాపకుఁడు, శ్రీ పీఠికాపురాధీశకళాశాల, రామారావుపేట, కాకినాడ.

శ్రీవావిళ్లవారు రాజరాజ కృష్ణరాయాదులకంటె కోటిమడుంగు లధికముగ భారతీసేవ జేసిన ధన్యులైనారు. మహాతపోధికులైన ప్రాచీనఋషివతంసుల కావ్యతత్త్వలహరిని స్వర్ణపాత్రముల బడిలపఱచిన వీరి ధన్యతవలన భారతదేశమున నిక కవులే లేకపోయినను దేశమున కేలోపమును లేదు. ప్రాచీనమహాకవులు లేని మార్గమే లేదుకనుక వారు మనకు జూపని రసమే లేదుకనుక, 'కళాప్రపూర్ణ' బిరుదము వీరికిక నెప్పుడో యొసంగి గౌరవించ మనుకొనుచున్న విశ్వవిద్యాలయ మట్టి బిరుదసహస్రములకు బాత్రులైన వీరివిశిష్టత నేలవలేశసమ్మానముచేనైన నేనాఁడో గ్రహింపజాలమికి మిగుల దలవాల్చుకొనవలసినదే!

ఒకరి బిరుదములకుగాక యొకరి మన్ననలకుగాక యొక లాభమునకుగాక తమ విధ్యుక్తధర్మమని నిష్కామముగ బరమార్థబుద్ధితో భారతీసేవాధురంధరులైన శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి షష్ట్యబ్దపూర్తిదివసము నిజముగా జాతీయపర్వదివసమనుట స్వభావోక్తి.

షష్టిపూర్తిసభ సమయ శాస్త్రులయులు, సంబంధములు

వీరికి భగవంతు డిక నొకటిరెండు షష్టిపూర్తులగువఱకు నాయురారోగ్యభాగ్యాదుల ననుగ్రహించి కాపాడుగాక! అజరామరమైన వీరికీర్తి ఇతోధికసేవానునీతచే నెగడొందు గాక! భారతపుత్రరత్నములలో వీరగ్రేసరులై వెలుగొందుదురుగాక!

## 14. శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు,

శ్రీపిఠాపురమురాజాకాలేజి, గాంధీనగరు, కాకినాడ.

మహోదయులారా, వందనపూర్వక విజ్ఞప్తి. మహాసభాసందర్భమున ఈ 'మంగళాశాసనము'ను సమర్పించుచున్నాను.

విద్వద్బాంధవనీరాజనము.

ఆంధ్రసంస్కృతికి ఆంధ్రగీర్వాణసారస్వతములకు విశిష్టామేయదోహద మొనరించి వన్నెకెక్కిన ఆంధ్రమహాసంస్థలు రెండు. వావిళ్లసంస్థ, కాశీనాథునిసంస్థ.

తెనుగునాట అక్షరాస్యులలో వావిళ్లవారినిగూర్చి విననివారు బహువిరళముగా నుందురు. ఆంధ్రగీర్వాణ వాఙ్మయప్రచారమునకు వీరి అపారసేవ యవిస్మరణీయము. శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి కవి పండితాదరణ మనూచానము. పిత్రుపైతామహసంక్రాంత మగు విజ్ఞానదీపికను నిలుపుటయేకాక ఏకోత్తరముగ మహోజ్జ్వలకాంతులతో ప్రకాశించునట్లు పాటుపడుచున్న మహామహులు శ్రీశాస్త్రివర్యులు లక్షలాదిగ ధనమును వెచ్చించి పరిష్కృతములుగ వివిధగ్రంథరాజములను లక్షలకొలది ప్రతులను ముద్రించి యనూర్వ్యంకశ్యములగు వానికి సూర్యాలోకనభాగ్యము నొసగిన విజ్ఞానపోషకులు కవి పండిత బాంధవులు శ్రీశాస్త్రిచరణులు. వీరితో ఉధికముగ విజ్ఞానసేవ యొనరించుటకై వీరికి బూర్ణపురుషాయుషమును, అఖండారోగ్యమును, సడలని కార్యనిర్వహణదక్షతయు దీక్షయును పరాత్పరుడగు నాయేడుకొండలయేలిక యనుగ్రహించుగావుత అని మా మంగళాశాసనము.

## 15. శ్రీ మోటుపల్లి రామానుజరావునాయుడుగారు, ఎం. ఏ., జె. పి.

ప్రొఫెసరు, పచ్చయప్పకాలేజి.

శ్రీ శాస్త్రిగారు మనసమకాలికులగు ఆంధ్రమహాపురుషులలో నొకరు. అక్షరాస్యులగు నాంధ్రులలో వారి పేరు వినని వారుండరు. ఉద్దండపండితుడు, సాహితీపోషకుడు నగు తండ్రిగారి అడుగుజాడల నడచుచు, వీరుమనభాషకు, సారస్వతమునకు గావించిన సేవ నిరుపమానము. నేటి ఆంధ్రాభ్యుదయమునకు వీరి నిరాడంబరమగు కృషి పునాది. వీరి సౌజన్యము, ఔదార్యము, విద్యారసికత, కార్యదీక్ష ఇవి ఆంధ్రుల హృదయ క్షేత్రముల నేనాడో చూరగొన్నవి. అట్టివీరి షష్టిపూర్తి యేఆంధ్రుని ఉత్సాహిత లూగింపదు! పరమేశ్వరుడు వీరికి సంపూర్ణాయురారోగ్యములను ప్రసాదించి మనుచుగాతమని ప్రార్థించుచున్నాను.

16. శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు, ఎం. ఏ., బి. యల్., రాజమండ్రి.

భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి షష్టిపూర్త్యుత్సవము వారిజీవితమునందేగాక తెనుగుభాషాచరిత్రములోను వాఙ్మయచరిత్రములోనుగూడ నొక గొప్పఘట్ట మనవచ్చును. నేటికి వందయేండ్లకుమించి వావిళ్లసంస్థ సంస్కృతాంధ్ర గ్రంథ ప్రచురణమున అగ్రస్థానము పొందియున్నది. ఒకానొకప్పుడు మైసూరువారికిని మదరాసు వారికిని ప్రజానీకమునకు గ్రంథములను చౌకగ నందజేయువిషయమున ఉత్సాహవంత మైన పోటీ ప్రబలినది. కాని, లోటుపాటులును మెండుకొన్నందున నాసంస్థలు ప్రస్తుతశ తాబ్దారంభ కాలమునకు క్రమేణ అంతర్ధానము చెందినవి. అట్టితరుణమున వావిళ్లసంస్థ తలయెత్తినది. మనభాషోద్ధారకుల తండ్రిగారు శ్రీ రామస్వామిశాస్త్రులవారు దానికి మూలపురుషులు. ఆదివరలో అపూర్వగ్రంథజాలము ఎండకన్నెఱుగక తాళపత్రములలో ముతకకాగితములలో పెళుసుకాగితములలో బడి చిసికి నలగుచుండెను. అట్టివానిని తెనుగుజాతికి అందుబాటులేని వానిని పరిష్కరించియు పరిష్కరింపించియు విపులపీఠిక లతో టీకలతో అవసరమైనపట్టుల వ్యాఖ్యానములతో ముద్రించు భారమును శ్రీ రామ స్వామిశాస్త్రులవారు వహించిరి. అది సామాన్యకార్యముకాదు. ధైర్యసాహసములు, త్యాగము, పాండిత్యవిజ్ఞానములు అత్యావశ్యకములైన కార్యమది. దానికి వారు వెరుదీయ కుండిరి. అట్టి మహనీయునిపుత్రులై తండ్రి ప్రారంభించిన కార్యమును నత్యుత్సాహము లతో నితోధికభక్తిశ్రద్ధలతో తమకు సాటి లేకుండునట్లుగా శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు నిర్వహించుచున్నారు. వారినిర్వహణశక్తి వర్ణింపనాతరముగాదు. నేడు తెనుగుసారస్వత మున ప్రాచీనగ్రంథకులించుమించుగ నన్నియు ముచ్చటగొల్పుముద్రణరూపములో కనబడుచున్నచో శ్రీ శాస్త్రులవారి తత్పరతయు, విచక్షణతో గూడియుండు దేశభక్తియు అణపరానిభాషాభిమానమును దానికి మూలములగును. వారినిరంతరసేవ భాషోద్ధారక బిరుదమును సార్థకముగావించును. శ్రీ శాస్త్రులవారిప్రతిభ రాజకీయవ్యవహారములందు గూడ అమోఘమైనది. వారు ఉదారపురుషులు, వదాన్యులు, ఋజుభావమును వినయ మును వారికి పెట్టనిసొమ్ములు. మనదేశమునకు భాషకు సారస్వతమునకు ఇతోధికసేవ చేయుటకై వారికి భగవంతుడు పూర్ణాయురారోగ్య సంపదలను ప్రసాదించునుగాక!

17. శ్రీ సి. బాలాజిరావుగారు, విశ్వేశ్వరపురము, బెంగళూరు.

మీషష్టిపూర్తి సమయమున మీకు నాయభినందనములు ఆశీస్సులు, మీపరి చయము నాకు 1902 వసం॥ నుండియు కలదుగదాయని మురిసిపోవుచున్నాను. ఉత్సవ సమయమున శ్రీయుతులు సి. ఆర్. రెడ్డిగారును, సర్ రాధాకృష్ణన్ గారును వచ్చియుండి రని వినుటకెంతో సంతోషించుచున్నాను. మీకన్న నేనొకయేడు పెద్దవాడనని తెలియు చున్నది. నేనును యథాశక్తిగా, నాఅంతస్సునకుతగినట్లు ట్రస్టీగయున్న యొకదేవళములో షష్టిపూర్తిచందుగ నేరవేర్చుకొంటిని. 'ఫెడరేటెడ్ స్టేట్సు' పత్రికాధిపతులు శ్రీయుతులు

శ్రీకంఠయ్యగారు తమకారోగ్యము కొంచెము తప్పియున్న దని చెప్పినారు. ఈయుత్స
వము జరుపుకొనుటచే మీరారోగ్యవంతులు కావలెనని కోరుచున్నాను.

18. శ్రీ జగదీశచంద్రరాయలవారు, కోట, హిందూపురము.

ఆధునిక ఆధ్యాత్మిక ఆంధ్రవసుంధరలో అగ్రస్థానము నలంకరించిన తమకు షష్టి
పూర్తిమహోత్సవములు విషయవైభవముగా జరిగినవార్తలు పత్రికాప్రపంచమున గాంచి
పరమానంద భరితుడనైతిని. అట్టి యద్భుతదృశ్యములగాంచ సదవకాశభాగ్యము నాకు
లభించనందున మిక్కిలి చింతాక్రాంతస్వాంతుడనై నాభక్తిపుష్పమును తమచరణకమల
ముల పోయుటకై నీకమ్మవ్రాయుచున్నాను. ఒక్కరికటాక్షమును కాంక్షింపక తమ
ప్రతిభను దివ్యప్రదీపమై ప్రకాశించునట్లుచేసి తమ మనశ్శక్తి, ఆత్మశక్తి, సంకల్పశక్తి
మహోజ్వలములై ఉత్కృష్టసాహిత్యమును సృష్టించి ఆంధ్రావనియందు విద్యాగంధమును
పరిమళింపజేసినవి. అమరులకు, అగ్రజీవులకు ఆరాధ్యులై అమరవధూమణులు సహితము
తమపై పూలవానకురిపించిరనివిని దిగ్భ్రమజెందితిని. దశ వర్షముల క్రితము తమను సంద
ర్శించినపుడు అమూల్యమైన శ్రీభగవద్గీత యను గ్రంథమును తమజ్ఞాపకార్థము బహూక
రించి యుంటిరి. యుద్ధజ్వాలల బీభత్సకముచేతను, వీరతామరాతుసుని బాధలచేతను
చెన్నపట్టణమునకువచ్చి విద్యావంతుల సందర్శింప నవకాశము కలుగలేదు. గాన తమ
షష్ట్యబ్ది మహోత్సవజ్ఞాపకార్థము వెండియు స్మారకనిమిత్తము భవదీయగ్రంథాలయమునకు
"సంపూర్ణాంధ్ర జైమినిభారతము" మరియు కొన్ని యనగా మూడు నాల్గు సత్కథా
గ్రంథములు నీతిదాయకములైనవియు, పామరరంజకమైనవియు భృత్యునిపై తమకటాక్ష
దృష్టిని కురిపించుచు సుచితముగా పంపెదరని ప్రార్థించుచున్నాను. నావీక్షణకార్డును
(Visiting card) ఇందులో నుంచినాను. తమ త్రిలిజ్గ ఉగాది సంచికను ఈపత్రికప్రతిని
పంపినయెడల దానికి తగువ్యాసముల నపుడపుడు పంపుచుందును. సర్వధారి ఉగాది
సుదినమున సర్వులకు శుభమగుగాక?

19. శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు, ఆంధ్రవాణిఅధిపతులు, బెజవాడ.

శ్రీశ్రీ వావిళ్లవేంకటేశ్వర శాస్త్రులవారు ఆర్యవిజ్ఞాన పునరుద్ధారకులు, ఆంధ్ర
భాషామతల్లికి అనుపమసేవకులు ననుటకు వారిచే ప్రకటింపబడిన గ్రంథములు, త్రిలిజ్గ
పత్రికలే ప్రబలతార్కాణములు. నలుమూలల అజ్ఞానతిమిరము ఆవరించియున్న సందర్భ
మున పెక్కువ్యయ ప్రయాసలకోర్చి, ఆర్యవిజ్ఞాన పునరుద్ధరణకై శ్రీవారు గావించిన
కృషి అనుపమము. అంతేగాదు పెక్కు ప్రజోద్యమములద్వారా వారుకావించిన ప్రజా
సేవ మరువరానిది. తమ ఆంధ్రాంగ్లపత్రికా సంపాదకీయములద్వారా వారుగావించెడి
నిష్పాక్షికవిమర్శలు సంపాదకులకు అనుసరణీయములు.

ఇట్టి ఉత్తమ ఆర్యవిజ్ఞానోద్ధారకులు, ఆంధ్రసారస్వతోపాసకులు, పత్రికానిర్వాహ
కులు, ప్రజాసేవకుల షష్టిపూర్తిసభగావించి గౌరవించి సమ్మానించుట ఆంధ్రజాతికేగాదు,
ఆర్యసంతతికంతకు గౌరవప్రదము, ఆనందకరము, శుభకరము.

శ్రీవారికి భగవానుడు ఇతోధికముగ ఆర్షవిజ్ఞానోద్ధరణము, భాషాసేవ, ప్రజాసేవ చేయుటకున్ను, త్రిలిఙ్గను దినపత్రికగ నొనర్చి ఆంధ్రావనియందైక్యతను నెరపి ప్రాచీనాంధ్ర ప్రతిభను పునః ప్రతిష్ఠయొనర్చుటకున్ను దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక! యని కోరుచున్నాను.

## 20. గ్రామాభ్యుదయసంఘము, కుద్దిగాం.

ఆంధ్రభాషోద్ధారకా! మీయవిరళ దీక్షాదక్షతచే ఆంధ్రగ్రంథములు సర్వాంగ సుందరములై, నిర్దుష్టములై, తెలుగుసీమలో విహరించుచు, అపారసాహిత్యసంపదలనిచ్చి యనన్యసేవ గావించినందులకు మాహృదయపూర్వకాభివందనములు.

పండితపోషకా! దక్షిణభారతదేశములో సంస్కృతవిజ్ఞానముతోపాటు మాతృభాషలును హీనదశకు వచ్చుతరి మాతృభాషాపండితులను, గణితజ్యోతిషవిద్వాంసులను, సంస్కృతవిద్యావేత్తలను సమ్మానించి, గ్రంథరాజముల నత్యంతశ్రద్ధతో సంపాదించి, యమూల్యములగు టీకలతో అత్యంతహృదయంగమవ్యాఖ్యలతో ముద్రించి, కేవలాంధ్రదేశమునకేకాక యావద్భారతమునకే సేవనొనర్చిన మీకు మానమస్సులు.

దేశభక్తాగ్రణీ! నిరక్షరకుక్షులై యజ్ఞానాంధకారములో అల్లాడు నాంధ్రప్రజానీకమునకు దేశభక్తి తెరుపరింగించుటకై స్వయముగా భారతీయనాయకులతో కలసి పనిచేసి దేశభక్తజీవితముల నామూలాగ్రముగా ప్రకటించి స్త్రీలను సైతము స్వాతంత్ర్యదీక్షాబద్ధకంకణలగా నొనర్చిన మీ దేశభక్తికి మా జోహారులు.

వేదాంతశిరోమణీ! భగవద్గీత, బ్రహ్మసూత్రములు, నుపనిషత్తులను ప్రస్థానత్రయమును, వేదాంతపంచదశి, వివేకచూడామణి మున్నగు వేదాంతగ్రంథములను తరచితరచి తత్త్వమునెరింగి, యాంధ్రప్రజలకు నవనీతము నరచేతనిడినట్లు తద్గ్రంథముల నిడి ముముక్షువుల కాలవాలమగు మీకు మాభక్త్యంజలులు.

త్రిలిఙ్గజనకా! ధార్మిక, సాంఘిక, రాజకీయ, నైతిక, విషయములను శాస్త్రానుసరించుచు, ఆంధ్రదేశము నల్లకల్లోలమొనర్చు దుష్టపత్రికలధాటి నిలువరించుచు యథార్థవిషయముల నాంధ్రపుత్రులకుదెల్పి విజయమందు త్రిలిఙ్గపత్రికారాజము నతిసమర్థతతో నిర్వహించు మీశక్తికి మా అభివందనములు.

ధార్మికశిరోభూషణా! ధర్మము మచ్చునకైన నిల్పింపదేమోయని భీతిలు నీకాలమున ధార్మికులకు, సనాతనులకు చేయూతనిచ్చుచు, ధర్మవ్యతిరేకుల నడంచుచు "యతో ధర్మ స్తతో జయః" అని నిర్భయముగా చరించు మీధర్మపక్షపాతిత్వమునకు మా ప్రశంసలు.

ఆంధ్రమాణిక్యమా! ధర్మన్యాయపక్షపాతివై, ఆంధ్రాభ్యుదయకారివై యనవరతము శ్రమించు మీకు చిరాయురారోగ్యైశ్వర్యసంపదలనిచ్చి భగవంతు డాంధ్రసేవ మీచే చేయించుగాక!

ఇ॥

**21. విద్యాసుందరి శ్రీమతి బి. నాగరత్నముగారు,**
శ్రీత్యాగబ్రహ్మనిలయము, తిరువయ్యార్.

షష్టిపూర్తిసభ ఆహ్వానపత్రమును చూచితిని, శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు ఏ
కో మూలదాగి తాటాకులలో చిక్కుపడియుండిన శ్రీభాషా దేవిని ఉద్ధరించినారు. విడిచి
తండ్రితాతల మహాత్యాగములను సర్వలోకములచే కొనియాడబడునట్లు ధీరులై
లై నిర్వహించి ఇప్పుడుకూడా నిర్వహిస్తూ యుండు శ్రీసరస్వతీ లక్ష్మీకటాక్ష పూర్ణాను
మును బొందిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు సంపూర్ణాయు రారోగ్యములు
జగత్తుకే ఆదర్శప్రాయులై చాలాకాలము జీవించి మిగిలిన వారిసంకల్పములు పూర్తి
లెనని శ్రీత్యాగరాజస్వాములవారిని ధ్యానించి విభూతి కుంకుమ ప్రసాదము పంపు
చున్నాను. అంగీకరించి నన్ను ధన్యురాలను గావింపవలెను.

**22. దేశభక్త శ్రీకొండా వేంకటప్పయ్యపంతులుగారు, గుంటూరు.**

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తిమహోత్సవము ఈనెల తే 3 ది
) జయప్రదముగ సాగినదనివిని మిక్కిలి సంతసించినాను. కీ॥ శే॥ శ్రీవావిళ్ల రామ
శాస్త్రిగారికుమారులైన శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు వావిళ్లవారి ముద్రణాలను
చిరి. ఆంధ్రమునందును, గీర్వాణమునందును ప్రాశస్త్యములైన గ్రంథరాజము లనేక
పండితులచేత పరిష్కరించి ముద్రింపించి ఆంధ్రలోకమునకు మహోపకారము గావించి
చెన్నపట్టణములోని ముద్రణాలయములలో వావిళ్లవారి ముద్రణాలయము విశేష
ప్రఖ్యాతిగాంచినది. శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు గ్రంథప్రచురణవ్యాపారమును
ు అభివృద్ధి గావించుటయేగాక త్రిలిఙ్గము పత్రికను ప్రకటించి ప్రజలను రాజకీయ
గములు మొదలగు వానియందు కృతపరిచయులగావించి చెన్నపట్టణపౌరులలో
స్థానమును పొందియున్నారు. "Federated India" కు సంపాదకులుగా వ్యవహ
ను తమజీవితము పరోపకారకార్యములందు వినియోగించుచుండుట మిక్కిలిశ్లాఘ
ముగనున్నది. ఆంధ్రలోకము వీరికి కృతజ్ఞత తెలుపుచు వీరు మరియు ననేకసంవత్సర
ఇట్టిఘనకార్యనిర్వాహణము గావింపకోరుచున్నది. కొంతకాలమునుండి వీరు
రోగ్యస్థితిలో నున్నారు. వీరు త్వరలో ఆరోగ్యవంతులై పూర్ణాయుర్దాయముతో
మన పరమేశ్వరానుగ్రహమునుపొంది మనుచుందురుగాక యని గోరుచున్నాను.

**23. శ్రీయుత. సి. నరసింహాచార్య, బి. ఏ., ఎల్. ఎల్. బి., అడ్వొకేట్,**
మాతుంగ, బొంబాయి.

తమషష్ట్యబ్దిపూర్తి మహోత్సవసమయమున బొంబాయి ఆంధ్రులు తమను అభి
చుచున్నారు. తెలుగుప్రపంచమంతయు తమభాషాపోషణను కృతజ్ఞతతో నెల్లప్పు
స్మరించుచున్నది. మీరు సత్వరముగా ఆరోగ్యముపొంది, దేశీయులనెల్లరను కృతా
యుందురని ఆశించుచున్నాము. తమత్రిలింగపత్రిక దేశభాషలోనే వెలువడి ఆంధ్ర

భాషకు, ఆంధ్రదేశమునకు వివిధరాష్ట్రముల నివసించుచున్న ఆంధ్రప్రజకు అనేకవిధము సహాయపడుచున్నది. తమరు భాషాగౌరవమును, ఉత్కృష్టతను ఇంతవరకు కాపాడి ఆధునికరాజకీయప్రపంచమున అన్నివిధముల వెనుకకు నెట్టివేయబడిన ఆంధ్రుల కండగ నిలచి వారిజాతిగౌరవము నిలబెట్టితిరి. ఒక్కరివల్ల జాతికంతకు ఇంతసహాయము లభించుట అదృష్టమనియే నాయభిప్రాయము. పరమేశ్వరుడు మీకు సత్వరముగా ఆరోగ్యము కలుగజేసి తమ ఉద్యమము నిరాఘాటముగా వర్ధిల్లజేయుటకై అనేకసంవత్సరములు తమకును ఆంధ్రప్రపంచమునకు అవకాశము కలుగచేయునను దృఢవిశ్వాసము కలిగియున్నాను బొంబాయిరాష్ట్రమునగల ఆంధ్రులు మీరుచేసిన భాషాసేవకును, వారి ఆంధ్రోద్యమమునకు మీవల్లకల్గిన సహాయమునకును కృతజ్ఞులై యున్నారు. దేవభాషయగు సంస్కృతమును పోషించి దేశమంతకును ఉపకారులైనట్లు మహారాష్ట్రదేశమునను, కన్నడదేశముననుగల పండితోత్తములే చాటుచున్నారు.

24. శ్రీ ద్వివేది నారాయణ శాస్త్రిగారు, శివనాడీప్రవీణ, పవరుపేట, ఏలూరు.

వావిళ్ల వంశపయఃపారావారసుధాకరాయమాణాః ముద్రాపితనిరంతనాధునాతన సద్గ్రంథనికురుంబమంజూషాయమాణాః విప్రవతంసాః షష్టిపూర్తి మహోత్సవాలంకరిష్ణవః పరదేవతాకటాక్షేణ పునః షష్టిపూర్తివయఃపరిపాకలాంఛనప్రపిత్సవః శ్రీమంతః అత్రభవంతః వేంకటేశ్వరశాస్త్రిణః జేజీయంతాంఇతి భవతాం సర్వేషాం మదాశీఃపరంపరావచనమ్ ఇతః పూర్వం మయా పద్యాని ప్రేషితాని గాంధీనిర్యాణ పద్యాని కాత్యాయనీశతకపద్యాని చ భవద్భిః ముద్రాపితాని త్రిలిఙ్గపత్రికాసు భవతు నామ త్రిలింగపత్రికా మమ న ప్రేషితా భవాదృశాం ప్రేష్యస్థానే అయం హ్యేక ఏవ ఇతి మన్యే పునఃపద్యాని ప్రేషితాని పత్రికాయాం ముద్రాపయిత్వా మమ పత్రికాం ప్రేష్యతామితి అభ్యర్థయే.

శ్రీమంతః మద్వచనమురరీకుర్వంతు త్రిలింగపత్రికాం ఏతద్విలాసస్య ప్రాపయంతు పరదేవతాకటాక్షేణ భవతాం శ్రేయో భవేత్.

25. ఆయుర్వేదాచార్య డాక్టరు: ఎన్. మాధవమీనన్‌గారు, ఏ యం. ఏ. సి, మదరాసు.

తాము పైసభకు ఆహ్వానించిపంపిన పత్రము చేరినది, అందులకు తమకెంతయు కృతజ్ఞతను చూపుచున్నాను. కాని, నాదేహపరిస్థితి ననుసరించి అచ్చటికి రాజాలనందులకు మన్నింతురుకదా. పైకార్యక్రమము మిక్కిలి జయప్రదముగ జరుగగలందులకును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆయురారోగ్య ఐశ్వర్యవంతులుగ నుందురుగాక అనియు కరుణామూర్తియగు శ్రీభగవంతుని ప్రార్థించుచున్నాను.

26. బాలకవిశేఖర శ్రీవాకాటి పెంచలరెడ్డిగారు, ఇసుకపాళెము, నెల్లూరు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవమును గాంచుభాగ్యము నాకు లేకున్నను, మనస్సుమందానందకందళిత భరితమయ్యెను. భారతావనికి శాస్త్రిగారు గావించిన సేవ వర్ణనాతీతము. నిక్కముగ శ్రీ శాస్త్రిగారు నిజమైన దేశోద్ధారకులు, కళారాధకులు, కళాపోషకులు, కళాప్రపూర్ణులు. యావద్భారతము శ్రీశాస్త్రిగారికి ఋణపడియున్నది.

త్రిలిఙ్గపత్రికాసంపాదకులై శ్రీశాస్త్రిగారు మత, రాజకీయ వైజ్ఞానిక విషయములను తమ పత్రికాముఖమున నిర్దుష్టభాషలో ప్రకటించుచు జ్ఞానప్రదాతలై విరాజిల్లుచున్నారు. వారి అవ్యాజానురాగము చిరస్మరణీయము. వారికి సర్వదాకృతజ్ఞుఁడను. శ్రీశాస్త్రిగారికి ఆయురారోగ్యసంపదలు ప్రసాదించుగాకయని రమాపతిని వేఁడుచున్నాను.

27. కవిరత్న శ్రీరామ్ వీరబ్రహ్మకవిగారు, విశ్వజ్ఞ గ్రంథనిలయము, మచిలీపట్టణము.

నేఁడు జరుగుచున్న తమ షష్టిపూర్తి సభయందు నేనునువచ్చి స్వయముగా పాల్గొని, యానందించవలెనని యెంతయో నిరీక్షించుచుంటిని. గాని, ఇటీవల తటస్థమైన తఱచు ప్రయాణములవలన నా ఆరోగ్యము సరిగ లేనందున రాజాలక పోవుచున్నందులకు చింతిలుచు, ఈ సభ జయప్రదముగ జరుగుగాకయని కోరుచు, తమకు భగవంతుడితోధిక దీర్ఘాయురారోగ్య భాగ్యములను బ్రసాదించునటులు నిరంతరమును బ్రార్థించుచున్నాను. మఱియు నా చిఱుకానుకగ నింతదనుకను, నేడును బంపుచున్న యీ పద్యరత్నపారితోషకమును మన్నించి స్వీకరింప బ్రార్థింతును.

28. శ్రీరాళ్లభండి వేంకటసీతారామశాస్త్రిగారు, అడ్వకేటు, మచిలీపట్టణము.

ప్రపంచవిజ్ఞానములలోనెల్ల వేదవిజ్ఞానము ప్రాచీనతమమై సర్వోత్కృష్టమై మూర్ధన్యస్థాన మలంకరించుచున్నది. అట్టి విజ్ఞానము సంస్కృతభాషలో నుండుటచేత జనసామాన్యమున కందరికి అందుబాటులోలేనిదుస్థితి యేర్పడినది. ప్రభుత్వమువారును, విశ్వవిద్యాలయమువారును కూడ అట్టి విజ్ఞానరక్షణార్థమై సంస్కృతమును తప్పక శిక్షించవలసినభాషగా చేయక దానియందు సవతితల్లిప్రేమ కనపరచియుండుటచే అట్టి విజ్ఞానతేజోరాశికి మేఘ మావరించి అందరిని అజ్ఞానాంధకారనిమగ్నుల గావించినది. ఆంధ్రులందరు అట్టి దుస్థితిలో నుండగా మీ పితృపాదులును, వారితరువాత మీరును అట్టివిజ్ఞానమునకు సర్వతోముఖవ్యాప్తి కలుగునట్లు ఆ వైదికవాఙ్మయమును అచ్చొత్తించియు, ఆంధ్రీకరించియు అందరికిని అందుబాటులోనికిదెచ్చి విజ్ఞానోద్ధరణగావించిన మహాపుణ్యపురుషులుగా మీరు విరాజిల్లుచున్నారనిన అతిశయోక్తికానేరదు. మీజన్మ సర్వవిధముల ధన్యము. ఇప్పటికిని ఇంకను ఆంధ్రీకరింపవలసిన గ్రంథరాజములు అనేకము లుండియున్నవి. కనుక మీ ఈషష్ట్యబ్దసభాసందర్భమున పరమేశ్వరుడు మీకు సంపూర్ణఆయురారోగ్యముల ప్రసాదించి మిమ్ములను రక్షించుగాత!

29. శ్రీజొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఏల్., బెజవాడ.

శ్రీశాస్త్రులవారు భారతదేశమున నుద్భవించిన మహాపురుషులలో నొకరు. స్వయంకృషివలన క్రమనిష్ఠవలన మహోన్నతస్థితినంది తండ్రిగారి యడుగుజాడల ననుసరించిరి. భాషోద్ధారకులైన శ్రీశాస్త్రులవారు కేవలము వాణిజ్యదృష్టి గలవారుకారు. రూకలు ప్రోగొనరించుకొనుటేవీరి పరమాశయమగుచో బండ్లకొలది చిత్తుపొత్తములను వీరుబజారులందును రైళ్లలోను ప్రదర్శించి యుందురు. దేశమున మూలమూలాలలందు అటకలందు బడినతాళ

పత్రగ్రంథనిలయమును పెక్కు కష్టములపాలబడి వెలుపలికితీసి ముక్తములుపోలు అక్షరములందు ముద్దులు మూటగట్టు అచ్చు పుస్తకములందు ప్రకటించి శ్రీ శాస్త్రులవారు వాగ్దేవికి కాన్కలుగా సమర్పించిరి. వేదములను, ఉపనిషత్తులను, ఆగమములను, బ్రాహ్మణములను, ఇతిహాసములను, బహుళపురాణములను, సంస్కృతాంధ్ర ద్రావిడ భాషలందు ప్రకటించి పండితులందు మాత్రమేగాక పామరులందు సయితము విజ్ఞానవిస్తృత మొనరించిన పరార్థ జీవులు శ్రీ శాస్త్రులవారు. సర్వతోముఖ ప్రజాపురోభివృద్ధికి సంబంధించిన మహోత్సవములు వీరిమహత్తర కృషియందు సహితములై యున్నవని కన్నుగలిగియున్నవారు గుర్తింపగలరు, మహిమోపేతమైన భాషాసేవనవలన ఈదృశవిజ్ఞానభిక్షను ప్రజాళికి ప్రసాదించినవారిలో మనదేశమందు మాత్రమేకాక సర్వసీమలందు మనకాలమున శ్రీ శాస్త్రులవారు అగ్రగణ్యులు.

శ్రీ శాస్త్రులవారి మేధాశక్తి అద్భుతమైనది. వీరి మనస్సు ఎన్సైక్లోపీడియాబోలునదని వీరిసన్నిహితమిత్రు లెఱుగుదురు. గడచినయేబదియేండ్ల సాంఘిక రాజకీయ సారస్వత ఆర్థిక మహోత్తమ చరిత్రలు వీరిమనమున నిండియున్నవి. సత్యము నారాధించుచు, సత్యము నన్వేషించుచు, సత్యమును నిర్వచించుచు తమ ఆశయముగా గలవారు.

కేవలము గ్రంథరచనయందేకాక పత్రికారచనయందును వీరు సిద్ధహస్తులు. వీరి "త్రిలిఙ్గ" పత్రికలు చాలకాలమునుండి దేశసేవ చేయుచున్నవి. ఉన్నతాశయ ప్రదీప్తములై విలసిల్లుచున్నవి. వైదికవాఙ్మయమును మాత్రమేకాక కావ్యవాఙ్మయము, జ్యోతిర్మయమైన వాఙ్మయము ఉత్సాహగర్భితమైన వీరి ప్రోత్సాహముకతన దశదిశలందు వెలసినవి.

'సత్యమ్' 'సుందరమ్' 'శివమ్' 'శాంతమ్' 'అద్వైతమ్' 'అద్భుతమ్' 'అనంతమ్' అను పరమాశయములనారాధించు మహాత్ములు శ్రీ శాస్త్రులవారు. వీరినోటినుండి ఎన్నడు ఒక్క పరుషవాక్కు వెలువడలేదు. వీరెన్నడైన బిగ్గరగా మాట్లాడలేదు. ప్రఫుల్ల పుండరీక విలసితమానససరోవరమునుండి రాజహంసలు అల్లనమెల్లన మీది కెగయునట్లు ప్రశాంతమైనవీరిమానసమునుండి సుందరభావములు అల్లన వాఙ్మయవీథియందు ఆత్మవ్యక్తీకరణము నందుచుండును.

భాషోద్ధారకులు దానరాధేయులనుట నిస్సంశయము. గుప్తదానము లొనరించుట యందు వీరారితేరిరి. ఈమహాత్మునిసాహాయ్యము నందువారనేకులున్నారు. వీరిబాల్యమిత్రులు, విపులధిషణాధురంధరులు యశస్తిలకులు డాక్టరు కట్టమంచి శ్రీ రామలింగారెడ్డిగారధ్యక్షపీఠము నలంకరించిన మంగళముహూర్తమున ఈషష్ట్యబ్దమహోత్సవము జరుగుచుండుట ముదావహము. వీరి పైబడుకుసుమములు శ్రీ శారదాదేవిపై బడునవనుట నిస్సంశయము. శ్రీ శాస్త్రులవారి "త్రిలిఙ్గ" దినపత్రికయగుటకును, వారిశిలావిగ్రహములు వివిధ స్థలములందు నెలకొనుటకును, తండయార్పేట వావిళ్లవారిపేట అనబరగుటకును. శ్రీ భాషోద్ధారకుల మహదాశయములు చరితార్థత నందుటకును సుహృద్వరులు శతథాయత్నింతురని ఆశపడుచున్నాను.

## 30. వ్యాకరణకేసరి శ్రీపుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు,

ముంగండ అగ్రహారము, అంబాజీ పోస్టు, తూర్పుగోదావరిజిల్లా.

శ్లో. శ్రీవావిళ్లకులాబ్ధికౌస్తుభమణి ర్విజ్ఞానచిన్తామణి
ర్భాషోద్ధారకవేంకటేశ్వరమణిర్భాషావిభూషామణిః,
జీయాదన్ధ్రధరాశుభ ప్రదవిధివ్రాతప్రకాశోన్నత
వ్యాసగ్రన్థఘృణిశ్యమన్తకమణిర్విజ్ఞాన్ధ్రచూడామణిః. ౧

త్రైలింగీయస్య పత్రీబుధసవిధగతా సాహితీ సాధుగోష్ఠ్యా
స్సద్ధర్మవ్రాతగోష్ఠ్యాస్సునయహితపథోద్బోధివృద్ధోక్తిగోష్ఠ్యాః,
కాలేయాధర్మమర్మావిదలితశితవచస్సూచికావేధగోష్ఠ్యా
చిత్తాన్యానన్దయన్తీ చరతి సుఖసృతౌ వర్తయన్తీ నితాన్తమ్. ౨

కామం కాలేయదుస్సంస్కరణవిధితతేశోచ్ఛిదయిత్ర్యాఽత్రపత్ర్యా
భూయస్యస్సన్తు దేశే వికృతతరవకృతోఽహర్నిశం సంచరన్త్యః,
వ్యామోహాస్తత్త్వబోధోదయతఇవ నృణాం ప్రాకృతోఽర్కోదయాద్వా
ధ్వాన్తం యత్పత్రబోధాత్కవిమలినగతిర్నశ్యతి క్షిప్రమాన్ధ్రే. ౩

యానానాదర్శనానామపి సకలకలాసారసాహిత్యవర్యా
స్సత్కావ్యానాం సమీక్షావిధివిషయనిబన్ధావళిస్సద్బుధానామ్.
ఆర్షశ్రీధర్మదేవాస్సకలసుఖకరార్వ్యార్షరాజ్యాంగనీతే
స్త్రైలింగీసచ్చరణ్యాప్రతిదినమపి సా సంచరన్తీహ జీయాత్. ౪

ఆస్త్రీబాలార్యవృద్ధం విమలవిలసిసద్గ్రన్థరత్నాని హస్తే
ష్వధ్యేత్రధ్యాపకానాం ప్రతిసదనమహో భాన్తి యద్భాసితాని,
పుష్యన్తే యేన నిత్యం బహువిబుధవరాః కామితార్థప్రదానై
ర్యం శ్రీర్వాణీసుకీర్తిర్ధరణిరవృణతస్స్వాగుణౌఘేన లుబ్ధాః. ౫

సోఽయం వావిళ్లవంశోదధిజనితకళాపూర్ణపీయూషభానుః
షష్ట్యబ్దానాం చ పూర్ణస్సుగుణమణినిధిర్వేంకటేశద్విజేశః,
మార్కండేయాదితుల్యో భవతు బహులషష్ట్యబ్దపూర్ణో ధరిత్ర్యాం
ఆరోగ్యైశ్వర్యపూర్ణో వివిధనిజవధూభోగ్యమేశప్రసాదాత్. ౬

అభినవపణ్డితరాజో విద్యావాచస్పతిశ్చ విబుధకవిరత్నమ్,
స ఉమామహేశ్వరసుధీః పుల్యశ్శ్రీవేంకటేశమేవమాశాస్తే. ౭

ధార్మికమహోదయా కొన్నిఅనివార్యకారణములచే తే 15-1-48 ది వాయిదా నాటికంపలేకపోయినాను. వేరుకాపీవ్రాయుటకుగూడ నవకాశములేక దీని యంపినాను. నన్నుమన్నించి శ్రమకోర్చి ఈవ్యాసమును ఈశ్లోకములను సమ్మానసంపుటమున బ్రకటింప జేసి గౌరవించగోరుచుంటిని.

## 31. శ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు, యం. ఏ.,

తెనుగు సంస్కృత ప్రొఫెసరు, నిజాంకాలేజి, సికందరాబాదు.

ఉ. శ్రీయును విద్యయున్ సరస చిన్మయవృత్త ముదారభావమున్
వేయివిధాల మీచరిత వీనులవిందుగ నాంధ్రలోకమే

చాయలఁ గన్నుఁ గాంచ నగు సాంద్ర యశస్థిరజీవనమ్ము వా
పాయము పూర్ణమందుమయ వావిళ వంశపయోధిచంద్రమా.

ఉ. మీగురుదేవసత్కృతు లమేయవిధమ్మునఁ దీర్చి దిద్దుచున్
సాగిన యర్వదేండ్ల వ్యవసాయము గాగ మహాస్రవంతికా
వేగ విశాలనిర్మలమవేలము సాగుత నూఱులేండ్లు మా
వాగనుశాసనప్రచురభాగ్యమహోదయ వేంకటేశ్వరా.

ఉ. తీయని యాంధ్రభారతికిఁ జేటలు జెమ్మెడు హాన్నుసౌమ్ములన్
వాయనిభక్తిఁ గూర్చితి వుపాయముతోడ త్రిలిఙ్గపత్రికన్
జేయనఁగా సనాతనవశీకృతచిత్తము లెంచి దిద్దిప్రా
లేయవిలాససన్నిభమ లేఖ్య విధమ్మున మించఁ గూర్చితో.

ఉ. తిర్పతివేంకటేశ్వరులె తీయని మీచరితమ్ము దిద్దాడిన్
గర్పురహారతుల్ మలయఁగా నవమల్లిక లెత్తె నేర్చు నీ
కర్పణసేయు ముత్తియఁపుఁ టందఁపుసేసలు తారహారముల్
దర్పణ మీసుహృత్సరసిధన్యత మోత్తమ వేంకటేశ్వరా.

ఉ. విత్తము విద్యయున్ సతము విన్నను నొప్పఁగ శారదాంబకే
చిత్తము దత్తమయ్యె బుధశేఖర సమ్మతి శారదాంబకే
యెత్తిడు లోర్చుకో నడరు నుత్తమజీవిక శారదాంబకే
హత్తుచిరమ్మిటు ల్బునుము లార్ద్రకృతమ్ములు శారదాంబకే.

### 32. శ్రీ తి. వ. నారాయణస్వామిగారు, సింహాచలము

క. శ్రీవిలసితుఁ డాశ్రితరక్షా విశ్రుతమూర్తి లోకసంరక్షకుఁడో
శ్రీవిష్ణుడుదయ నేలుత, వే వావిళ్లాన్వవాయు వేంకటశాస్త్రిన్.

మ. తనయం దవ్యభిచారియౌ నెనరు మోదం బాత్మమిత్రాళియం
దునయం బాశ్రితులందు భక్తిబుధులందు న్సత్క్రియాదీక్ష యో
చనయందు న్ఘటియించి శ్రీశుఁడు కృపాంచద్దృష్టి నీక్షించి తా
ననయం బీఘను వేంకటేశ్వరుని గణ్యశ్రీయుతుం జేయుతన్.

చంపకమాలిక:—

చ. వనరుహసూతిసృష్టి సలుపన్దలపోయుచు మున్ను సత్తపో
ధనుల ననూన సత్క్రితు వితాన సుతర్పిత నిర్జరేశులన్
అనితర లభ్యశాంతవినయాది లసద్గుణగణ్యులన్ బరో
జనయన పాదపద్మ విలసన్మధుపాయితచిత్తులన్ సుశో
భనుల వసిష్ఠముఖ్యఋషివర్యుల; వారలలోన నత్రినా
జను ఋషివర్యుఁ డూర్జితయశస్కుఁడు తేజనమించె ఆక్కలన్
గొనబగు నేణలాంఛనున కున్బురుడై నిజధీప్రశస్తి; నా
యనఘుని యన్వవాయమునయందు నయాన్వితులాఢ్య శేముషీ
ధనులను రూపరూప గుణధన్యులు మాన్యులు నార్జవాదిపా
వన గుణధుర్యులార్య లగువారు జనించిరి పెక్కురందులో.

ననఘుడు వేంకటేశసుధి నానొకరుం డలరారు నాసుధీ
మణి కెనరారురూపమున మారజయంత వసంతముఖ్యులా
ఘనుని వితీర్ణి నెన్నదగు కల్పకసంతతి యొజ్జగాగ నా
గుణనిధిసీత యత్రియనుంగుం జెలియున్ సరివత్తురొక్కొ యీ
వనితకటంచు నీలువున వన్నియకెక్కినచాన మంగమన్
దనసతిగాగ జేకొని ముదంబున నాసతియందు సద్గుణాం
బునిధుల లోకమోహకరమూర్తుల నర్కసమాన తేజులన్
వనరుహనాభు బాహువులో వారిజసంభవు మోముదమ్ములో
వననిధులో యనందగినవారల నల్వురఁ గాంచెఁ బుత్రులన్
సునయవిదగ్రగణ్యులు విశుద్ధులునై తగువారిలోనఁ దే
జునఁ గడువన్నెకెక్కు సుయశోనిధియా మనరామశాస్త్రి యా
తని గుణసంపద్దెలుప ధాతకుఁ గుండలినేతకైనఁ దీ
రునె యన మాదృశుల్దగనిరూపణ సేయఁగలారె యాతఁడున్
దన కనురూపకృత్యము సదావసుధామర పాదపంకజా
ర్చనమని యెంచి సంతతము సజ్జనపూజన మింపుమీరఁగా
నొనరిచి యిందిరాధవగుణోత్కర ముజ్జపియించుచుండి పా
వనతర గ్రంథసంచయ మపారముగా గడియించి లోకమం
దున వెలయింప నెంచుతరి తోడుగఁ దత్తనుజాతుడైన యీ
తని వెలయించి సర్వవసుధాలసదాంధ్ర పవిత్ర వాఙ్మయం
బును మహిసర్వలక్షణ విభూషితమై వెలయించి యాస్థతో
జనతతి కందజేయునెడ సందియముల్గలపట్టఁ దీర్పగ
ల్గిన ధీషణాఢ్యుఁడం చెఱిఁగి గీష్పతి రామయశాస్త్రితోడ మం
తనము గొనంగ శక్రునిసుధర్మకు నాతనిబిల్వ వేడ్క నే
గిన మనమందు చింతిలి యొకించుక నెమ్మది నూరడిల్లి యీ
యనఘుఁడు వేంకటేశసుధి యాపనిపీడగబోక నుర్విదా
ననఘచరిత్రుఁడై యహరహమ్మునిహమ్మున బండితైక సే
వనమను రూపకృత్యమని వావిరి బండితసేవనం బొన
ర్చిన జనకాశయంబె దనుజేరిచి తత్పరితృప్తియున్ సుపా
వన ఘనకీర్తియుఁబడయు పద్ధతినెంచుచు నిద్ధరిత్రిలో
ధనమె సుపావనమ్మనుపథమ్మునఁ బోకఁ బరిష్క్రియార్హముల్
ఘనతరశాస్త్రముల్ రుచిరకావ్యములున్ రసవత్ప్రబంధముల్
మనుముఖ ధర్మపద్ధతులు మందసముల్లమగీము లైదివాం
ధనివహ మట్టులోచన పథమ్మును జేరనివేళ నెవ్వరేన్
గొనకొక కావ్యముజ్జదువఁ గోరినచో కలవారిపజ్జకున్
జని మునుగంగకై తపముసల్పు భగీరథుమాడ్కి వారలన్
దనుపగసిల్గులన్ గుడిచి తత్కరుణా పరిణాహలబ్ధమున్
ధనచయకల్పమున్ గ్రిమివితానచితమ్మగు ప్రాతపాత్రమున్

గని నిధిఁగన్న పేదయనఁగా ముదమందుచు దాటియాకులన్
దనకికఁ బొత్తమబ్బదుగదా యనుబీతున వ్రాయనెంచి య
ప్పనికిఁ గడంగి వేసరిలు పాఠకలోకముగాంచు బాధలన్
గని జనసంఘతుష్టికి జగజ్జనసంస్తవనీయ పండితా
గ్రణిమున కర్హకాలమిదరా! యని పాయకశౌరిమున్ను వే
దనివహముద్ధరించిన విధమ్మున నిమ్ములనున్న పొత్తముల్
గొనుచు మనీషివారములకు న్దగుటీకల వ్రాయనిచ్చికన్
దనియఁగ జేయు మౌక్తికగణమ్ములనన్దగు నక్కరమ్ములన్
దనరుచుఁ బాలమీఁగడ లనన్దనరారెడు పత్రసంతతిన్
గొనబగు సంపుటమ్ములుగఁగూరిచి లోకుల కందజేయుచున్
గొననగు గ్రంథసంతతులకు న్వెల కొంచెముగానొనర్చి యీ
యనువున గణ్యవిద్యలకునై యనయమ్ము ధనమ్ము లెక్కగాఁ
గొనక జనోపకారమునకు న్దగ వెచ్చమొనర్చునట్టి పా
వనగుణశాలికిన్ సుజనవంద్యునకున్ హిమశైల సేతుమ
ధ్య నిఖిలదేశబంధుర పయః ప్రసరాచ్ఛ యశోవిభాసికిన్
వననిధి కన్యకారమణ పాదపయోజల సన్మరందసే
వనరత బంభరద్విమలభావున కత్త్రి పవిత్రగోత్రపా
వనునకు వేంకటేశునకు వర్షము లర్వది నిండునేఁడు గా
వున నతఁ డాంధ్రభారతికిఁ బొల్పుగజేసిన సేవనెంచి యా
గుణనిధిగారవింప మనకున్దగు కర్జముగాదె; యీయశో
ధనుఁడు నితోధికమ్ముగ సదాలసదాంధ్ర సరస్వతీపదా
ర్చన మొనరించి లోకపరిచర్యనొనర్ప గడంగునట్టు లీ
ఘనమతి యీవియల్లశిబికర్ణనిలింప మహీజముఖ్యదా
తృనివహదానగాథల ధరిత్రి ననారతమున్ స్మరింపగా
ననువగురీతి లోకమునయం దనయమ్మురహించునట్టి లీ
యనఘుని సచ్చరిత్రభువి నాజలజాప్త సుధాకరమ్ముగా
గ నెఱయునట్టు లీఘనువికస్వరకీర్తి సితాబ్జమింపుమై
దినమున కొక్కవింతయగు తేజగడించుచు నూత్నసౌరభం
బును హరిదంగనామణులు మూర్కొన గార్కొనునట్టు లీయశో
ధనుమతి సుస్థిరంబయి సదాలసదాశ్రిత పక్షపాతియై
సునయపథానువర్తియగుచు న్వెలుగొంది చెలంగునట్టు లీ
వినయ వివేక ముఖ్యగుణవిశ్రుతు డుర్వినజస్రమున్సుధీ
జనపరిచర్యకున్ వలయు శక్తినొసంగి చెలంగునట్టు లీ
యనకును శ్రీసఖుం డభినవంబగుకల్మియు సౌఖ్యసంతతుల్
మణిమయసౌధముల్ సుజనమైత్రి చిరాయు వనామయంబు స
త్యనిరతి కార్యదీక్షయు ముదంబున మెచ్చుచు నిచ్చిపాలనం
బును బొనరింపనెంతయును మోదముతో హరివేడివేడ్క నీ

ఘనమతి షష్టిపూర్తికగు కానుకగా హరిశైలనాథుచే
ననుమతిఁగొంచు దత్పదయుగార్పితమై వలపింపజేసి సొం
పునసె సలారువాక్కృతి నపూర్వముతో కనకప్రసూన రా
శినిగొని మాలగాఁగ విరచించి యుదంచిత భక్తిభావలాం
ఛనముగ నేడు పేర్చినవసద్వెసల న్వెలుఁగంగ జేయుచుఁ చం
ద్రున కొక నూలిపోగనెడుత్రోవ సమర్పణచేసితీవిధిన్.

### ౩౩. శ్రీమారేపల్లి రామచంద్ర (కవి) శాస్త్రిగారు, ఎలమంచిలి.

శ్రీయుఁతుడు వేంకటేశుఁడు శ్రీలు సేమ, మాయురారోగ్యములు నిచ్చి, 'అనవరతముఁ
మేలు ప్రజలకు సమకూర్చి మించు!' మనుచు, వేంకటేశ్వరశాస్త్రిఁ దీవించుఁగాక!.
అహహా! వావిళ్ళవంశసుధాబ్ధిపూర్ణ, విధుఁ డనంగ రామస్వామిబుధుఁడు వెలసె;
తండ్రి మించిన సుతుఁడవై తనరుచుంటఁ. వేంకటేశశాస్త్రి! నీవే సుకృతివి!.
పలుకుతల్లిని సేవించి ప్రజలయెఱుక, పెంచి సిరియును మీయింటవెలసి చెలఁగ
'పేరుపొందెదుగా!' కని కూరిమి నిను, వేంకటేశ్వరశాస్త్రి! దీవించువాఁడ!

### 34. శతావధాని శ్రీ ద్వివేది సత్యకవిగారు.

తెనుగుపొలాలలోన గడిదేరిన దిట్టలకబ్బముల్ పరా
కున నయినన్ దొసంగుపడకుండగ వెల్వడజేసి వాఙ్మయాం
గణమున ముఖ్యతం బడయగల్గిన వావిళవంశ్య వేంకటే
శుని కిట షష్టిపూర్తి యన జొక్కనివా రెవరయ్య హర్షతన్?
అచ్చుపుతెన్గుపట్టి తడియారనిపండితు డంధ్రభాషపై
పెచ్చు నిలింప హూణముల బేర్కొనియున్న వివేకి ఆపయిన్
లచ్చికి గూర్చువాడు పదిరాళ్లగలాడు దిగంతకీర్తి సం
పచ్చయ ధీమనీషి ఒకపాటియె? సేవ్యుడు తెన్గుగడ్డకున్'
కృతులు రచించుటన్ గవులు కీర్తిగడింతురు కాంతు రట్టి కీ
రితి కృతినాథులౌ జనవరేణ్యులు; నిక్క, మితండొ శ్రద్ధమై
గృతుల సముద్ధరించి గడియించె యశం బొకక్రొత్తపద్ధతిన్
చతురుఁడు మెట్టుకున్ దెనుగుజాతికి బాంధవుడయ్యె నిమ్మెయిన్.

### 35. శ్రీగంద్రకోట వేంకటసుబ్బయ్యశాస్త్రి గారు

శ్రీలన్ జెన్నలరారి సంస్తవనమా సేవల్ నిరంతంబుగన్
మేలున్ జేయుచు జ్ఞానబోధనలకై మేలౌ త్రిలింగంచు, యాం
ధ్రాళిన్ భావమునందు నిల్పి, సకలం బాంధ్రంబు ముద్రించ, మా
పాలిన్ దైవము, వేంకటేశు కిడెడున్ భాగ్యంబు, నాయుష్యమున్!
ఆంధ్ర భాషకు నెంతో నందచందము దిద్ది నిండుజవ్వనిగాగ నొండుజేసె;
సారస్వతంబందు సాహిత్యగోష్ఠిచే సర్వదా ప్రకటించు సరసమతివి!
పండితవాదంబు పత్రికయందున ప్రకటించు ముమ్మారు పండితుండు!
యువకులరచనల నుత్సాహమతితోడ నైకొని ముద్రించుకల్పకంబు!
సర్వతోముఖవిజ్ఞానసరసగోష్ఠి పెంచి, సలిపెడు వావిళ్ల వేంకటేశు
కాయురారోగ్యభాగ్యంబు నహరహంబు, నిండు సంతోషమదితోడ నీశు డిచ్చు!

అఱువదియేండ్లు నీకు నొక యందపుమధ్యవయస్సుగాని యా
యఱువదియేండ్లు నీకు మదియందున నెట్టివికారభావముల్
గఱపెడి నీడుగాదు కలకాలము వెల్గెడి నూత్నభావముల్
తిరముగ గల్గునేడిది మదిన్ తలపెట్టు విధాత ప్రోచెడిన్.
ఒక్కటి షష్టిపూర్తియను నుత్సవమున్ దగ జేసికొన్న మే
మిక్కడ సంతసింపము ! నిదేమిటి ? మాకిది చాలదయ్య నీ,
కెక్కడిభాగ్య మబ్బెనయ ! నియ్యెడ నీవు ' కళాప్రపూర్ణవై "
నొక్కెడ షష్టిపూర్తి మరియొక్కటి సల్పి ముదంబుగూర్చుమా?
చిత్తము సంతసిల్లి నొకశీఘ్రతరం బగుకార్య మొక్కటిన్
తత్తరమొంద నీమదినిఁ దప్పక నేదొ దలంచి యాంధ్రులన్
నెత్తరినైన పూతచారిత్రులఁ జేయుము పూజ్యమూర్తి! మా
కిత్తరి నయ్యదే సుఖము నిచ్చెడు! వావిళ వేంకటేశ్వరా?
ఇప్పటికే సమస్తముగ నెన్నడొ జేసితివయ్య నీవు కా
నిప్పటితీరునున్ గనిన నెంచగలేని సమస్య లెన్నియో
కుప్పలు కుప్పలై భువిని కుల్లుచునున్నవి! తీర్చ లేమికన్
తిప్పగ దారిజూపుము! మతీంద్రుడ! వావిళ వేంకటేశ్వరా!
తమదుషష్టిపూర్త్యుత్సవ తరళకాంతిః పుంజములయందు మగ్నమై మురియుచు సప్త
పద్యముల నీకర్పించు భాగ్యయశము, ప్రాప్తమయె నాకు వైగొమ్ము! భవ్యచరిత!

## 36. శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు, మదరాసు.

శ్రీపతి వేంకటేశ్వరుఁ డశేషకృపామతి నర్వదేండ్లుగా
కాపయి నర్వదేండ్లుగఁ జిరాయుఁవు భాగ్యముఁగూర్చి దేశసే
వాపరుఁగానొనర్చి కవిపండిత సంస్తుతిపాత్రుఁజేసి ని
త్యోపకృతీద్వ్యసల్పుత మహోన్నతభావుని వేంకటేశ్వరున్.
'అఱువదియేండ్లమన్నడ మహాద్విషయంబె?" యటందు రేమొ నూ
టిఱువదియేడులుందునని నెవ్వడతండల నెన్నదేడు లేన్
దిరుగకమున్నె వీడె జగతిన్ దినగండపు జీవితంబునం
దఱువదియేండ్లు నిండుటె మహాతిశయంబిఁక నీయుగంబునన్.
జనకుని తరమ్మునుండియు, వినుతాంధ్రగ్రంధములను వెలువఱచి ప్రజన్
ఘనవిద్యావంతులఁగా, నొనరుచు మీఋణముఁదీర్చు టురవగుమాకున్.
క్రొత్తవొ ప్రాతవొ చెత్తలొ, సత్తులొ లభియించు గ్రంథజాలపుర క
చ్చొత్తింతువు దులుఁగేనిం బొత్తపురూపమున వాణిభూషణ మనఁగన్
తెలుఁగులచే వైనికమగు, 'త్రిలిఙ్గ' పత్రిక వెలుంగు దినమెపుడొ గదా?
కలిదోష విమర్శనముల నులుకక ప్రకటించుట కిదియొక్కటియగదా?
లాభము నష్టముఁజూడవు, లోభముఁగనవింత భాషలోఁగల కావ్యాల్
ప్రాభవమున వెలువఱుతువు, నీభవమే భవముగాయనిందితచరితా!
అంతో యింతో యొసంగఁ బెద్దలగువారాస్తిం 'దుబారా'గ దు
శ్చింతల్గల్గినవారు ఖర్చులిడుటల్ సిద్ధంబు నీవట్లుగా

కెంతేఁ దండ్రికిఁ బేరు దెచ్చుకొడుకం చెల్లరున్నతింపంగ వా
క్కాంతాపోషణకై వ్యయించితివి భాగ్యంబన్న నీదేసఖా!
పండితులకుఁ గవులకు మీ,రుండఁగఁగద పైకివచ్చు యోగ్యత గలిగెన్
కొండలరాయని కరుణన్, నిండాయువుగలిగి ఖ్యాతి నెగడుము సఖుఁడా !
'శతమానంభవతి' యనుచు, సతతము దీవింత్రు నిన్ను సద్బుధులా పం
డితవాక్యము విత యగునే?, బ్రతుకుమ! శ్రీ వేంకటేశ్వరా! నూఱేండ్లున్.
తరములనుండి కొల్చు కులదైవము మాకిలువేల్పు మీకు నా
తిరుమలవాసుఁ డాంధ్రజగతీపతి రాయల కిష్టదైవ మా
దరమున భక్తరక్షణవిధాయకుఁ డా యలమేలుభర్త నిన్
సిరులు సుఖంబు లున్నతియుఁ జెందఁగఁ బ్రోచుత వేంకటేశ్వరా!
ఇలను శతమాన పూర్ణాయువెసఁగ నీకుఁ, బదివసంతంబులకు నొక పక్వముగతిఁ
బద్యదళకాన నాశీస్సు పలికినాఁడ! బ్రదుకుమిఁకఁ బది కాలాలపాటు హితుఁడ!

## 37. వైద్యవిద్వాన్ శ్రీ నారు నాగనార్యగారు, కోడూరు, కడపజిల్లా.

ఆమయ మేమియొ యీమెయి, బ్రాముటచే గోము తఱిగి బాముల కిరవౌ
సామివి విన్నోముత శ్రీ, కామేశ్వరి యాయురర్థకామనుగాఁగన్.
తెనుగుపంటపొలాన మదింపులేని, కావ్యఫలముల సృష్టించు కవుల కెపుడు
వితతసత్ఫలసంప్రాప్తవిపణి వీవె, బొంకుగా దిద్ది వావిళ్ల వేంకటేశ!
వ్యాపారం బగుఁగాక యాపయిని లాభప్రాప్తి యౌఁగాక!యే
ప్రాపుం గల్గనుగాక! యెవ్వఁ డిటు లీ భాషాసముద్ధారణ
వ్యాపారంబున స్వీయజీవితము సర్వస్వంబు వెచ్చించి సే
వాపారంగతుఁ డయ్యె వానిఁ దలతున్ వావిళ్ల వంశోద్భవున్.
అరువదాకుల యొకచక్ర మమరినంత, విశ్వవిజ్ఞానమధురజీవితపుఁ దీర్ఘ
యాత్రకైన దనూరథ మరుగు నెట్లు, రెండవది యట్టిదియ యున్న బండి సాగు.
జనకునిజోలుతనూజుఁడు, జనియించుట దుర్లభంబ జనకునికీర్తిన్
గణనకు దెచ్చిన బిడ్డం,డన నీవే సుమ్ము వావిళాన్వయచంద్రా.

## 38. శ్రీ ఆం. సుబ్బరాయ గుప్తగారు, ఎమ్. ఏ., బి. ఓ. ఎల్.

ముందడుగు పత్రికాసంపాదకులు, మదరాసు.

శ్రీమంతం బగు చెన్నపట్టణమునం జెన్నారు నాంధ్రావళిన్
శ్రీమంతుండును నీతిమంతు డగుచుం జెల్వొంది వావిళ్ల శ్రీ
రామస్వామి కులాబ్ధిశీతకరుఁడై రాజిల్లు శ్రీ వేంకటే
శా ! మీ కిచ్చుత వేంకటేశుడు సుభాగ్యారోగ్యసౌభాగ్యముల్ .
ఆజ్ఞ యను చక్రమందు ననారతంబు, ఇడపింగళులను చెలు లింపుగూర్ప
వెలయు సత్యంబు ధీమంతు విమలు విజ్ఞు, వేంకటేశ్వరు మనుచుత విపులగతిని.
అంధకారమందుండు గ్రంథాళి కలర, వెలుగు గల్గించి తెల్గుల కొలయఁజేసి
సాహితీజ్ఞానకాంతుల షష్టిపూర్తి, జరుపుకొనుచుంటివి స్వతంత్రభరతమందు
ధన్యజీవివి నిన్నెన్న తరమె మాకు, సరసగుణ వేంకటేశ్వరశాస్త్రివర్య !

కూడు గుడ్డకు కొంపకు గుంద భార,తీయసోదరు లెల్లరు తృప్తిజీవ
నంబుగల్గి విరాజిల్లునటులఁ జదువు, సాగు వ్యాపారసత్పరిశ్రమలయందు
ముందడుగువేయునటు చేయ ముందడుగిడి, కృషి యొనర్చి త్రిలిఙ్గచే నింకొకపరి
షష్టిపూర్తి నెల్లరుఁజూడ జరుపుకొనగ, మీకు మాకందరికిని రమేశుకృపను
ఆయురారోగ్యభాగ్యంబు లలరుగాత.

39. కావ్యపురాణతీర్థ విద్వాన్ శ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు,
ప్రధానాంధ్రపండితులు, శ్రీలలితావిలాసము, కడప.

శ్రీవావిళ్లాన్వయ పారావారసుధాకరా! నిరంతరకృషి సం
భావిత సుకృతీ! సద్గుణ, హేవాకప్రకృతి! వేంకటేశ్వరశాస్త్రీ!
జననం బన్నఁ ద్వితీయజన్మమె ప్రశస్తం బంచు స్తోత్రింపఁగా
ననువుం గాంచెను దేశమంతటను ప్రఖ్యాతిం గనెన్ నీదుసే
వను గన్గొన్నజనాళి కెల్లరకు భవ్యప్రాభవా! యెట్టులే
మనుచున్ నీ కృతు లెన్నఁగాఁగలరు నూహాతీతభాస్వత్కృతీ!
ధరమై త్వత్కృషిలబ్ధసత్కృతిఫలప్రాప్తంబు లోకంబునం
దరయన్ మిక్కిలి తృప్తిఁ గూర్చు నమందానంద ముప్పొంగ వి
ద్వరకోటుల్ నుతియింతు రిట్టి కృషి నిత్యశ్రీదమా వేంకటే
శ్వరశాస్త్రీ! యిదె లోకసేవ యన సంభావ్యంబు నిక్కంబుగన్.
ఒకచక్కి వేదాంతనికరంబు వాదింప నొకవంక దార్కికు లూహసేయ
నొకదిక్కు శాబ్దికు లురుశబ్దములఁ గూర్ప నొకచాయ సాహిత్యయుతులు చదువ
నొకత్రేవ రాజకీయోక్తులు వెలుఁగంగ నొకప్రక్క లేఖకు లోసరిల్ల
నొకతేవ సకలభాషోక్తులు వినిపింప నొకవైపు తీర్పరు లొదిగి నిలువ
ఎల్లరను గాంచుచును వించు నెల్లరకును, నవసరం బిచ్చి సత్కృతు లర్హరీతి
నిచ్చు నీదీవిప్రాభవ మెచ్చె యనును, వేంకటేశ్వరశాస్త్రి! భావించి చూడ.
వరుసన్ వర్తనమం దొకించుకయినన్ భావింపఁగా మార్పులే
కరిగెన్ షష్టిసమల్ సుఖంబుగను; నిత్యానందముం గూర్చుచున్
బరఁగుంగావుత భోగభాగ్యములతో భాసిల్లి శ్రీవేంకటే
శ్వరశాస్త్రీ! చిరకాలమాయువు జగద్భద్రక్రియావంతమై.
దేశమంతెల్లఁ బండితుల్ దివ్యకృతుల, దేశము నలంకరించు నీదివ్యచరిత
మాత్మఁ దలఁచి యానందంబు నంది షష్టి, పూర్తిసభ రచియించిరి శాస్త్రివర్య!
భేదబుద్ధిని జూపక వాదమునను, దిట్టతనమున భయములే కెట్టి దోష
ములను జర్చించు పత్రిక పుణ్యరాశి, యా త్రిలిఙ్గ యుష్మత్కృతి నభినుతింతు.
ధనియాఁగాత మహాత్ముఁడౌతఁ బ్రబలోద్యద్దర్పసంయుక్తుఁ డౌ
జనుఁ డౌతన్ పరశాసనక్రియలసంశాసించువాఁ డౌతఁ; దో
షనిబద్ధుం డగునేఁ ద్రిలిఙ్గ వడి తాఁ జర్చించు నిర్భేదబు
ద్ధిని లోకంబున వెల్లడించు నరరే! ధీయుక్తి సత్పద్ధతిన్.
భూసురవర్య; సన్మతము పూనిక నిల్పఁ ద్రిలిఙ్గపత్రికన్
వాసి చెలంగ నేలుదువు వార్తల వ్యాఖ్యల వాఙ్మయక్రియా

భాష్యసములెల్లఁ దృష్టిఁ గన నాంగ్లమునందునఁ దమ్మిళంబునన్
జేసినసాయ మింత యని చెప్పఁగలారె త్వదీయసత్కృతుల్.
ఎన్నో సంస్థల నుద్ధరించితివి నీ వెంతేని విద్యార్థులన్
గన్నన్ గోరినయర్థ మిచ్చితిని నిష్కాపట్యముం జూపి యా
పన్నానీకము నాదరించితివి సంపన్నుల్ మదిన్ మెచ్చ నీ
కన్నన్ మిన్న యెవండు శాస్త్రివర! విద్యాదానసద్బుద్ధులన్.
జనకుం డూనిన సత్పథంబె మదిలో సంసిద్ధిదం బంచుఁ జే
కొని తత్కీర్తి నఖండరీతి నిలుపన్ గోర్కెన్ వడిన్ బూని నీ
వొనరింపంగఁదొడంగినాఁడవు మహోద్యోగంబునన్ నిన్నుఁ బో
లిన సన్మార్గగు లెందుఁజూచినను లే ర్లేరంచుఁ గీర్తింపఁగన్.
పండితపుత్త్రుఁడు పండితుఁ, డుండెనె లోకమున నెందు నుద్యన్మతి! యొ
క్కండు నినుఁదప్పఁ జూపఁగఁ, బాండితిగలవాఁడు గలఁడె! వా. వే. శాస్త్రీ!
సకలసౌభాగ్యములతోడ శాంతశమద,మాదిసద్గుణములతోడ నా రమేశు
కృపఁ జిరాయురారోగ్యంబు లపరిమితము, గాగ సత్కీర్తిఁ జెలఁగుదుగాత సతము.

40 శ్రీ తొగర్చేటి భాస్కరశాస్త్రిగారు, తెనుగుపండితులు,

యం. హెచ్. స్కూలు, ఆదోని.

వావిళ్లవంశాంబుధి పూర్ణచంద్రః, దిగంత విశ్రాంతయశః ప్రకాశః
అశ్రాంత భాషోద్ధరణైకదీక్షః, శ్రీవేంకటేశో జయతు ప్రకామమ్.
సనాతనాచారపరాయణోఽపి, విదేశ భాషోత్తమ పట్టభద్రః
అగర్భ సంపత్కలితోఽపి యోఽసౌ, జీయా న్నిరాడంబర వేషభూషః.
ప్రాచీనోత్తమ సంస్కృతాంధ్ర తమిళ గ్రంథార్జనోన్ముద్రణే
విద్యచ్ఛోధన సంపరీక్షణ విధిర్యత్సర్వథా సర్వదా,
భాషోద్ధారక! వేంకటేశ్వర! తవైతన్నిత్యకృత్యం ప్రియం
మన్యే ధన్యతమం హి జన్మసఫలం భాషైకసంసేవయా.
శ్రీవేంకటేశ్వర ఇతి ప్రథితాభిధేయః, శ్రీషష్టిపూర్తి మహితోత్సవ పుణ్యకాలే
విద్వత్సమూహ పరివర్ణిత సచ్చరిత్రః, సోఽయం ప్లవేత్ ప్రమదవార్ధి తరంగకేషు.
భారత్యాఃకిల యస్య సాధురసనా శ్రీనాట్యరంగాయతే
బాహుర్యస్య సమస్తయాచకతతే శ్శ్రీకల్పశాఖాయతే
యస్యాగార మశేషపండితతతేః స్వర్లోకవాసాయతే
సోఽయం సద్గుణమండితో విజయతే వావిళ్లవంశాగ్రణీః.
జయతు జయతు వంశస్సాధు వావిళ్లనామా
జయతు జయతు నిత్యా పత్త్రికా సా త్రిలిఙ్గా
జయతు జయతు ధర్మశ్శాశ్వతః పుణ్యభూమా
జయతు జయతు ధీరో ద్రావిడో వేంకటేశః.

41. అభినవతిక్కన పండిత శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు.

శా. 'వాణీప్రీణనసత్ప్రవీణ' మగు శ్రీవావిళ్లవంశంబునన్
క్షోణీవిశ్రుతకీర్తియై తనరు విజ్ఞున్ వేంకటేశార్యు న

క్షీణారోగ్యచిరాయురుజ్జ్వల యశశ్శ్రీసంయుతుఁ జేసి శ
ర్వాణీవల్లభుఁ డోముఁగాత సతముఁ వాత్సల్యసంపూర్ణుఁడై.

క. పితృపాదులు విద్వత్సన్మతి రామస్వామిశాస్త్రిమణి తొడఁగిన త
త్కృతి ముద్రణాది కార్యము, లతినైపుణిఁ బెంపొనర్చె నాత్మజుఁ డౌరా!

క. వైదికలౌకికముల 'పుత్రాదిచ్ఛే' త్తనెడుసూక్తి తథ్యము సేసెన్
సాదరత వేంకటేశమహోదయుఁడు స్వకీర్తి భారతోర్విన్ బర్వన్.

## 42. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్ట్యబ్దపూర్త్యభినందన పత్రికా.

ఇండియన్ ఇన్స్టిట్యూట్ అఫ్ మెడిసను ప్రిన్సిపలు, అడయారు లైబ్రరిడైరెక్టరునగు

కెప్టెను జి. శ్రీనివాసమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్., ఎం. బీ.

షష్టిపూర్తేః సభేయం శ్రీ వేంకటేశ్వరశాస్త్రిణః
జయతాద్యత్ర చాధ్యక్షః రామలింగ సుధీమణిః.
ప్రకటయ్య మహార్హాణి పుస్తకాని స్వమేధయా
ఆంధ్రాంగ్లసంస్కృతభాషాయాం చిరంజీవతు వేంకటః
షష్ట్యబ్దపూర్తే వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిణః
ఆశాస్తా చిరమాయుః శ్రీమంగళం భగవానిహ.

## 43. శ్రీగోపరాజు వైకుంఠరావుగారు, పి. డబ్ల్యు. డి. హెడ్ డ్రాఫ్ట్స్మన్, అనంతపురము

తమషష్టిపూర్తిమహోత్సవము జయప్రదముగ నెరవేఱినదనివినుట కమితానందమైనది. వావిళ్లసంస్థయే బయలుదేఱి యాంధ్రసంస్కృతసారస్వతోద్ధరణమును, తక్కిన వివిధశాస్త్రగ్రంథపరిశోధన ప్రచురణములను గావింపకయే యున్నచో ప్రజలు తమవిజ్ఞానమున నేస్థితిలో నుండెడివారో చెప్పజాలము. యశఃకాయులైన పండితులు, కవులు, శాస్త్రకర్తలు మున్నగువారి యాత్మలు మీకు శ్రేయస్సును ప్రసాదించునుగాక. భగవంతుఁ డారోగ్య మిచ్చుగాక.

## 44. శ్రీపి. చెంచయ్యగారు, యం. యల్., రిటైర్డు చీఫ్ జడ్జి, పుదుక్కోట.

సారస్వతాభివృద్ధికి పూర్వము రాజాశ్రయ మెట్టిదో నేటిప్రచురణాలయాశ్రయ మట్టిది. బ్రిటనులో ప్రచురణాలయములవల్లనే వారివాఙ్మయమున నొకచరిత్ర యేర్పడినది. నూతనపరిస్థితులలో ప్రాచీనసంప్రదాయములను కీ॥ శే॥ శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారును వారికుమారులు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారును దేశమంతట వెలయించి గౌరవపదమును పొందిరి. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారి షష్టిపూర్తిసందర్భమున ఆంధ్రదేశమంతయు వారిని వారిసంస్థను శ్లాఘించును.

శ్రీవావిళ్లసంస్థ నెలకొనుటకుపూర్వము అక్కడనొకటి యిక్కడనొకటిగా పత్రికాప్రచురణమును గ్రంథముద్రణమును తెనుగున సాగుచుండెను. కాని వానివలన స్థిరఫలమేమియు కలుగలేదు. ఆకాలమున పెళుసుకాగితములమీదను, ఉల్లిపొరల పోలిన కాగితములమీదను తప్పులకుప్పలుగా చేటలంత పరిమాణమున గ్రంథములు వెలువడుచుండినవి. కాగితములపై పెన్సిలుపెట్టి వ్రాయుట కనువుగాదు. పుస్తకముల యట్టలును ఆకర్షణీయములుకావు. ముత్యాలవంటి యక్షరములతో ముద్దులు మూటగట్టునట్టి యట్టకట్టుతో తప్పులులేని శుద్ధముద్రణములు తెనుగుదేశమునకు ప్రసాదించినవారు వావిళ్లవారే. వారికావిషయమున సాటివచ్చువా రొక్కరును కనబడరు.

వావిళ్లవారు సామాన్యముద్రాపకులేకాక సారస్వతచరిత్రమున తమకొక ఘట్టమును కల్పించుకొన్నారు. ఆసంస్థ స్థాపకులు మదరాసులోని పండితులనందఱ చేరదీసి తెనుగుకావ్యములను తాము పరిష్కరించుటయేకాక

వారిచేతను పరిష్కరింపించి వ్యాఖ్యానములతో ప్రకటించినారు. సామాన్య పౌరునకుగూడ నపురూపగ్రంథము లందుబాటులోనికి తెచ్చిరి. వాఙ్మయవ్యాపనమును దేశసేవయే యనుకొనుచో వావిళ్లవారిసేవ యీ విషయమున నిరుపమానమైనది.

అనేకవిధముల పరివర్తనము చెందుచున్న దేశములలో దేశీయభావములను, ఆదర్శములను, అభిలాషలను ప్రచారమొనర్చు ప్రధానసాధనము వాఙ్మయమే. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు తమసంస్థ నాకార్యమునకు మేళగించినారు. అందులకు వారు రచించిన శ్రీగాంధీజీచరిత్రయే నిదర్శనము. రాజకీయరంగమందును వారు దేశాభివృద్ధికార్యములకు చేయూత యిచ్చియున్నారు. తెనుగుదేశమున ప్రాచీనాధునాతనములకు సంయోగము కల్పించునట్టిది వారి త్రిలింగపత్రిక. అది వారపత్రికయేయైనను దినపత్రిక చేయవలసినంత సేవ చేయుచున్నది. త్రిలిఙ్గలోని భాష యట్లే పండితుల కూహ్యమైనదికాక సత్సంప్రదాయబద్ధమై పామరులకును రంజకమయినది.

తమ ఫెడరేటెడిండియా పత్రికమూలమున వారు దేశశ్రేయము నాపాదించుచు అభివృద్ధికరములైన మార్గములనే చూపుచున్నారు. శ్రీశాస్త్రులవారు అనారోగ్యమువలన తాము చేయదగినసేవను పూర్తికావింప నశక్తులైనను తమయనుభవమును యథాశక్తి ప్రజాసేవలో వినియోగించుచున్నారనుట యెంతో ప్రశస్తమైనది.

శ్రీశాస్త్రులవంటి యుదారులును వారిసంస్థవంటి గొప్పదియు నాధునిక భారతదేశమునకు అత్యంతమవసరము. కనుక వారితోధికముగ సేవచేయుటకై శ్రీశాస్త్రులవారికి దేవు డారోగ్యైశ్వర్యము లిచ్చునుగాక.

## 45. శ్రీ సాగి రామనాథశర్మగారు, కారెంపూడి.

తే 3-4-48 దీని భాషోద్ధారకుని షష్టిపూర్తిసభజరుగుట మిగుల ముదావహము. దేశమునకు మరికొంత శుభసూచకము. మీతండ్రి శ్రీ రామస్వామిశాస్త్రులవారు అపూర్వగ్రంథప్రచురణయను కల్పలతను ఆంధ్రదేశమున నాటిరి. దానిని తాము మిగులవృద్ధిపరిచితిరి. ఇప్పుడు ఏగృహస్థునింటచూచినను మీకల్పలతలు విరాజిల్లుచునే యున్నవి.

నిరుపమాన దీక్షాపరతంత్రులై కష్టసాధ్యమని తలంపక ద్రవ్యమును వ్యయపరిచి ఘొరొనరించిన దేశసేవ మిగుల గణనీయమైనది. మీజీవితము భాషోద్ధరణయందు లగ్నముచేయుటచే ధన్యతమమైనది. దేశ మెన్నిన్ని నడకల నడచుచుండినను, మీశిష్టాచారసంపన్నత, సనాతనధర్మాభిలాష మీపత్రికాప్రచురణ మరింత వన్నె దెచ్చినవి.

శ్రీవేంకటేశ్వరనామమును ధరించిన మీకు శ్రీవేంకటేశుడు ఆయురారోగ్యములను సమకూర్చుగాక యని అభిలషించుచున్నాడను.

## 46 శ్రీ తెన్నేటి లక్ష్మీనరసింహముగారు, గ్రామకరణము, నందబలగ.

సీ. స్థావర జంగమాత్మకమైన విశ్వంబు సృజియింప పద్మజాకృతివహించి
తద్విశ్వరక్షావిధానంబు నొనరింప భార్గవీరమణరూపము ధరించి
కల్పోపసంహారకార్యంబునకు పరభైరవరుద్రరూపంబు గాంచి
ఈశ్వరిలీల తిరోహితత్వంబును గాంచి సదాశివు కరణి నఖిల

గీ. జగములనను గ్రహింపంగ జాలినట్టి, శ్రీమహేశ్వరి సత్కృపాదృష్టిఁ గాంచి
ప్రకట "వావిళ్లవేంకటేశ్వర" సుధీంద్రు, సమధికైశ్వర్యముల నొసంగి సాకుఁ గాత. 1

మ. సరసామోద నిదానమౌ సకలభాషా గ్రంథరాజిన్ సుధీ
వరు లెంతేఁ బొగడంగ ముద్రణ మొనర్పంజేయుచున్ వాని నె
ల్లరకున్ లభ్యములైన రీతి తగు మూల్యంబులన్ బ్రసాదించుచున్
బరగున్ గావుత "వేంకటేశ్వర సుధీవర్యుండు ధన్యాత్ముడై." 2

గీ. ఒనర మరియొక షష్టిపూర్త్యుత్సవంబు నొసగఁ దగిన చిరాయుస్సమున్నతియును
పుత్ర పౌత్రాయురారోగ్యభూరిసుఖము నిచ్చుఁగావుత మీకు సర్వేశ్వరుండు. 3

## షష్టిపూర్తి సంపుటము

ఈమధ్య (తే 3-4-48 దిని) జరిగిన మహాసభను పురస్కరించుకొని శ్రీ శాస్త్రులవారివలన ననేక విధములుగా ధనసహాయమునుబొంది విద్యలనుబడసి యుచితగౌరవస్థానములనున్న చాలమంది తమకృతజ్ఞతను దెలిపికొనుటకు నీదినమున తే (25-4-48) దీని ఉదయము శ్రీ శాస్త్రులవారి భవనముననే సమావేశమయిరి. ఆసభ సరిగా 8 గంటలకు ప్రారంభమైనది. శ్రీ శాస్త్రులవారు సకాలముననే సభావేదిక నలంకరించిరి. సభకు శాస్త్రులవారి సహాయముపొందినవారేగాక పెక్కురు పెద్దలు విచ్చేసిరి. సభకు ప్రెసిడెన్సీకాలేజీ ఆంధ్రభాషాప్రధానాచార్యులగు శ్రీ జి. యస్. యన్. ఆచార్యగారధ్యక్షతవహించిరి. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, ఏం. ఏ., (మదరాసు విశ్వవిద్యాలయము) సూర్యభగవానునిగూర్చి దైవప్రార్థనమొనరించి సభకు వచ్చినవారికి స్వాగతమొసంగి సభోద్దేశములనుదెలిపి, అధ్యక్షుని నెలుకపఱచిరి. అధ్యక్షులు తాము చెప్పుటకు ముందు పైప్రదేశములనుండి యీసభకు రాజాలనివారినుండి సందేశములను శ్రీ జి. యస్. శిరోభూషణము సుబ్బరాయలుగారు చదివిరి. అధ్యక్షులు శ్రీ శాస్త్రులవారు చేసిన చేయుచున్న విద్యాదానమునుగూర్చి ప్రసంగించిరి. ఆవెనుక సన్మానపత్రమును శ్రీ సింగరాజు రామలింగశాస్త్రిగారు చదివి సమర్పించుటయేగాక తాము వ్రాసినపద్యములను చదివిరి. ఆవెనుక ఆంగ్లేయభాషలో వినతిపత్రము శ్రీ యస్. సుబ్బరాయలుగారు చదివిరి.

ఆపైని సభ్యులలో మొదట శ్రీ ఎక్. వి. సీతారామయ్యగారు అరవభాషలో ప్రసంగించిరి. ఆవెనుక శ్రీ జి. సింహాచలంగారు (Ex. M. L. C.), శ్రీ వి. వి. శేషయ్యగారు, శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, శ్రీ వేదము రామప్రభుగారు (వేదము సూర్యనారాయణశాస్త్రిగారి కుమారులు), శ్రీ పి. పాండురంగముగారు (ఆనందవాణి), శ్రీ ఉత్పల వేంకటరంగాచార్యులుగారు, శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు, శ్రీ రామనాథముగారు, శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారు, శ్రీ వేదము వేంకటేశ్వరశర్మగారు, శ్రీ కాళహస్తి చంద్రమౌళీశ్వరశాస్త్రిగారు, శ్రీ నారాయణరావు అప్పాజీగారు, తెలుగున తమకు తమకు ప్రత్యేకముగ శ్రీ శాస్త్రులవారు చేసిన విద్యాదానసహాయములగూర్చి శ్రీ శాస్త్రులవారి ప్రజాహితజీవితమును గూర్చి సముచితమైన ప్రశంసలుచేసిరి.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు తమ ఆశీస్సులను దెలుపుచు, దేశమునందలి బ్రాహ్మణసంఘములో పెక్కుచీలికలున్న వనియు నేడు మనమభివృద్ధిపొందవలెనంటే ఈబ్రాహ్మణసంఘములో నియోగి వైదికాదిశాఖాభేదములెంతమాత్రమును నుండరాదనియు నిప్పటికైన యట్టి భేదములను విడచిపెట్టిన మనదేశములో నీసంక్షోభముడిగి శాంతి చేకూరుననియు, విద్యార్థిదశనుండి ఇతర విద్యార్థులకు సహాయముచేయుట తమకు స్వభావసిద్ధమైనదనియు దీనికి ప్రత్యేకముగ ప్రశంసింపవలసిన పనిలేదనియు ఇంతమందియొక్క సద్భావమే తమ కారోగ్యము, ఉత్సాహము బలము జేకూర్చుచున్నదని సెలవిచ్చిరి.

అధ్యక్షులు, విద్యార్థులు తమ కృతజ్ఞతను తెలుపుకొనుటకు శ్రీ శాస్త్రులవారినామము చిరస్థాయిగ చేయుటకేదేనొకచిహ్నము నెలకొల్పుటకు తీర్మానించిరి దానికి తక్షణమే శ్రీ సింహాచలముగారు 116 లు, శ్రీ ఆచార్యగారు రు 25 లు. ఇట్లుగా నైదారుగురప్పుడే చందాల నొసంగిరి. అంత దీనికి ప్రత్యేకముగ నొక కమిటీ నియమింపబడి యీపని సాగించుటకు తీర్మానింపబడినది.

శ్రీ శాస్త్రులవారికి నిరంతరాయురారోగ్యభాగ్యము లొసంగునటుల భగవంతుని ప్రార్థించుచు సభ్యులు జయధ్వానములు కావించినమీద వందనసమర్పణములతో స్వస్తివాచకముతో సభ ముగిసినది. సభలో చదివిన వినతిపత్రములు, పద్యము లిందు పొందుపఱుపబడినవి.

### వినతిపత్రము

భాషోద్ధారకా ! తమ పితృపాదులు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు స్థాపించిన సంస్థను పెంచి పెద్దచేయుటేగాక ఎంతయో వ్యయప్రయాసలకోర్చి, సంస్కృతాంధ్రద్రవిడాదిభాషలలో బహుకాల పరిశోధనసాఫలితములుగా అనేకములగు ఉద్గ్రంథములను అందఱకందుబాటగునట్లు సుందరముగా చౌకగా ప్రకటించి తిరి

అసమానభాషాసేవద్వారా ఆంధ్రప్రజాసామాన్యముయొక్క నిరంతర కృతజ్ఞతను చూఱగొన్నమీకు ఈ షష్టిపూర్తి శుభసమయమున మా ధన్యవాదములు.

విద్యార్థికల్పద్రుమా ! అనవరతము సిరిసంపదలతో విలసిల్లుచుండిన భరతవర్షము బానిసదేశమయినప్పటినుండి బీదఱికమునకు పుట్టినిల్లయిపోయి అధికసంఖ్యాకజనులు విద్యనభ్యసించుటకు నశక్తులైయుండిరి. దేశమున అతివ్యాప్తమయియున్న అవిద్యను రూపుమాపుటుద్దేశముతో మా యట్టి బీదవిద్యార్థులు అడుగుటే తడవుగా మాయందపార దయతలచి మావంటి లెక్కలేని యనాథవిద్యార్థులకు వారి వారి కనుగుణమగు ప్రాచ్య పాశ్చాత్య విద్యలకేగాక సాంకేతికవిద్య లభ్యసించుటకును అనవరతము విద్యాదాన మొనర్చుచున్న మీకు భగవంతుడు అశేషమ్మగు ఐశ్వర్యమ్ము లొసగి ఇతోఽధికముగా దీనజనములకు తాము ప్రాపయి యుండుటకు తోడ్పడును గాక యని ప్రార్థించుచున్నాము.

దేశసేవాపారీణా ! భారతదేశమున జాతీయసంస్థయగు కాంగ్రెసు ఏర్పడిననాటినుండియు దాస్యవిమోచనమునకై అహోరాత్రములు కృషిసల్పి తమ యసువులనైతము దేశసేవలో ధారవోసిన శ్రీ తిలకు, శ్రీ గోఖలే, శ్రీ చిత్తరంజనదాసు, శ్రీ మోతీలాల్, శ్రీ లజపతిరాయి, శ్రీ మాలవ్యా, శ్రీ శ్రీనివాసఅయ్యంగారు, శ్రీ గాంధీజీ ఇత్యాదిమహామహులతో కలసి మెలగి శక్తివంచనలులేక వారివలె భారతమాతృస్వరాజ్యసిద్ధికి యథాశక్తితోడ్పడిన మీకు పరమేశ్వరుడాయురారోగ్యము లొసగి మరింతగా దేశసేవ తాము సేయుటకు అనుగ్రహించును గాక.

పత్రికానిర్వహణధురంధరా ! విదేశీయులపాలనలో పత్రికలు—అందును దేశభాషాపత్రికలు—నడపుటయెంత దుస్సాధ్యమో జగద్విదితము. అయ్యును, సత్యమును నిర్భయముగా చాటుటలో, అసత్యమును మొగమోటమిలేక ఖండించుటలో, వేషధారులను వెల్లడించుటలో తాము సిద్ధహస్తులు తాము స్థాపించిన "త్రిలిఙ్గ" అచిరకాలములోనే దైనికపత్రికయయి, దేశసౌభాగ్యమునకు ప్రభుత్వ చర్యలపర్యవేక్షణమునకు, సద్విమర్శలకు, నేడు ముఖ్యముగా అత్యవసరముగా కావలసియున్న లోపమును పూరించి, ఆంధ్రుల రాజకీయ సాంఘిక సారస్వత జీవితమునకు ఉత్తేజము కల్గించును గాక.

ఆశ్రితవత్సలా! విద్యార్థిదశలో తమ ఔదార్యమును సాహాయ్యమును పొందగల్గి తద్ద్వారా విద్య నభ్యసించి నేడు మేము ఆయాపదవులలోనుండుచు గౌరవనీయముగా జీవయాత్ర గడపుచున్నారము. ఈ సాహాయ్యౌదార్యములకు మేము ఆజన్మాంతము మీకు కృతజ్ఞులము. ఇంతేగాదు, విద్యార్థిదశ ముగించినపిమ్మటగూడ తమకు మాయందుగల వాత్సల్యము తగ్గలేదు సరిగదా, హెచ్చినదనియే మా దృఢ విశ్వాసము. ముందువెనుకలరయని ఎండచెందలో తమ్ము నాశ్రయించి యీప్సితార్థసిద్ధి బొందిరనుట మా కెల్లరకు అనుభవైకవేద్యము.

ఇట్లు విన్నవించు,

తమ ఆశ్రితులు.

శ్రీ సింగరాజు రామలింగశాస్త్రిగారు, పచ్చయప్పకాలేజీ, మదరాసు.

శ్రీ పుదూర్ద్రావిడులలోనఁ జెన్నుమీఱి, వావిళ్లాన్వయపాథోధి వరలు చంద్రు
డనఁగ శ్రీ వేంకటేశ్వరుం డలరుచుండ, నాయురారోగ్యసౌఖ్యంబు లందు నెపుడు.
చదువరె పెక్కుశాస్త్రములు సాహితిఁ గాంచరె యెందఱేనియున్
చదువరు లంతె గాక నిలఁ జాలుదురే స్థిరకీర్తి గాంచ నిం
పొదవఁగ గ్రంథజాలము మహోన్నతిఁ జెందఁగ నిల్పుచుండె నీ
సదయుఁడు వావిళ్లాన్వయుఁడు సాధులప్రస్తుతిఁ గాంచుచుండగన్.
కవిరత్నంబులు మున్ను పన్నగఁ గృతు ల్గావించి రెన్నేనియున్
కవికల్పద్రుము లష్టు సత్ప్రభువు లాకాంక్షింప వారొప్పి రి
ష్టవనిన్ వారలు లేకయున్నఁ గృతు లీమాహాత్మ్యుండు దామెచ్చి యా
కవిరత్నంబుల కీర్తి పర్వనటులన్ గ్రంథంబులన్ బ్రోచెడున్.

క్షితి నరుఁ డెవ్వఁడేనిఁ దను జేరెడువానిని బ్రోచి యాతనిన్
మతిఁ బరికించి స్వార్థమును మానఁడు గాని యదెంత చోద్యమో
సతతము పేదలన్ మనుపసాధనఁ జేయుచు వేంకటేశ్వరుం
డతులితకీర్తి గాంచెడు నహర్నిశమున్ సుగుణాభిమానియై.
సదమల నీతిశాస్త్రమును జక్కఁగ నేర్చిన నేర్వవచ్చు గా
కది యది యంచు వాదముల నందఱఁ భ్రాంతులఁ జేయవచ్చుగా
కెదియుఁ స్వధర్మమందు గణియింప రనేకులు వేంకటేశ్వరుం
డెది యెటులున్న ధర్మమును నేర్పడఁజేసె బుధు ల్నుతింపఁగన్.

## విద్యార్థి విన్నపము

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ., మదరాసు.

శా. శ్రీవర్ధిల్లఁగ నాంధ్రదేశజనయిత్రీ పాదరాజీవసే
వావిభ్రాజితవృత్తిచేఁ జెలఁగి గీర్వాణాంధ్రసద్వాఙ్మయ
శ్రీవైశద్యము పెంపుచేసి విబుధశ్రేయమ్ము నొందించు నో
వావిళ్లాన్వయదీప! సద్గుణకలాపా! వేంకటేశాగ్రణీ!

గీ. అవధరింపుము నిడుదవోలాన్వయుండు, వేంకటామాత్యు డత్యంత వినయ మెసఁగ
శతసహస్రమ్ము లగు నమస్కృతు లొనర్చి, నమ్రుడై చేయునట్టి విజ్ఞాపనములు. 2

సీ. అక్షరాభ్యాసంబు నందినదాదిగా చదువునం దెప్పుడు శ్రద్ధగలిగి
ప్రతితరగతియందు బహుమానముల్గొని ఒకయేడు తప్పక నొంది జయము
దేశచరిత్రంబు తెలుగుభాషయు నాకు నభిమానపాత్రములై చెలంగ
ప్రథమశాస్త్రపరీక్ష ప్రథమంబు తరగతి జయమొంది పట్టప్రశస్తిఁ జెంద
విజయనగరమహారాజవిశ్రుతాంగ్ల, సత్కళాశాల నిప్పుడు చదువువాడ
ఈపరీక్షకు కట్టుట కింక కొన్ని,దినములే గడువయ్య సుధీంద్రచంద్ర! 3

గీ. ధనసహాయము నొనరింపు డనుచు మిమ్ము, వేఱుగా గోర నిద్దియె విప్పిచెప్ప
నాయవస్థకు మాఱు విజ్ఞాపనంబు, చేతనైనంత యుపకృతి సేయవయ్య! 4

క. దానములలోన నుత్తమ, దానంబులు రెండు నన్నదానము విద్యా
దానం బని ధౌమ్యుఁడు యమసూనునితోఁ బలికె సుమ్ము సుగుణాధారా! 5

చ. ఇదివర కెన్నడే నొకరి యీవికినై చెయిచాపలే దికన్
కుదిరినదానిలోన సమకూర్చి పఠించితి నింతదాక ముం
దదియును చాలదన్నభయ మల్లనఁ బుట్టె కడంకదొట్టి మీ
పదములఁ బట్టినాడ సదుపాయ మొనర్చుము దేశబాంధవా! 6

ఉ. చాతకపక్షి దప్పిగొని చల్లని చిన్కుల రెండొమూడొ జీ
మూతముఁ జేరి వేడ నది భూమిని వర్షముచేత నించు నా
రీతి వదాన్యశేఖరు దరిద్రుడు స్వల్పమె గోరుచో నతం
డాతతసంపదాళి నిడునట్టిదసూ మహదాశ్రయం బిలన్. 7

శా. దేశక్షేమమునందు వాఙ్మయము వృద్ధిం జెందు మార్గంబులన్
ప్రాశస్త్యంబు వహించునాము మని సంభావించి మీపేరను
ద్దేశంబంతయు వెల్లడించితిని మీదే భారమం చెంతయో
యాశం జెందితి వేంకటేశ్వరసుధీంద్రా! వాఙ్మయోద్ధారకా! ౮

# కావ్యగతి

శ్రీ జమ్ములమడక
మాధవరామశర్మగారు.

[వైదికసాహిత్యము - సార్వజనికత - జైనబౌద్ధవిప్లవము - ప్రాకృతసాహిత్యము-సంస్కృతసాహిత్యము-వర్గభేదము - జై, బౌ, తెలుగుసాహిత్యము - నన్నయభారతసంహిత - మార్గ దేశిపద్ధతులు - తిక్కనాదులు-శ్రీనాథాదులకృషి - అష్టదిగ్గజములు - రాజన్యులసాహిత్యగోష్ఠి - జమీందారుల సాహితీగానము - అంధప్రాయత-భావదాస్యము - భావవిప్లవము - వంగీయుల ఉద్యమము - ఆంధ్రసంచలనము - అవధానశవిక్యము - తిరుపతి వేంకటకవులు - వీరేశలింగవిధి - గురజాడ గిడుగు భాషావిప్లవము - ఆంధ్రసాహిత్యపరిషత్తు - వావిళ్ల సదుద్యమము - పత్రికలసాహిత్యము - గ్రంథాలయ సహకారము - స్థానికసాహిత్య సంస్థలు - దేశీయోద్యమము - జాతీయసాహిత్యము - గాంధి ప్రాబల్యము - మొదటి ప్రపంచయుద్ధము - సంస్కృతాంగ్లవిద్యాశాలలు-ప్రచార సాహిత్యము - కాంగ్రెసుభటులరీతి - యంత్రయుగప్రభావము - మధ్యమ వర్గవికాసము - నవ్యసాహిత్య పరిషత్తు-ఆంధ్రదీప్తి - తక్కువికలు - ఆంగ్లభాషాసంస్కృతి - పాశ్చాత్యపత్రికానవలా సాహిత్యము - నానాభేదములు - రాజకీయములమార్పు - ఆదరానాదరములు - నాటకకళాపరిషత్తు - రేడియో - కాంగ్రెసువిప్లవము - కమ్యూనిష్టుసాహిత్యము - జాతీయత - స్వతంత్రభారతసాహిత్యము - సాహిత్యసంస్కృతి - సమన్వయరీతి - సాహితీ లక్షణప్రస్థానము - సాహితీవరివస్య.]

## సాహిత్యసూత్రమ్

"అథాతస్సాహిత్య జిజ్ఞాసా - శివాత్మకం సమరసం - రసాత్మప్రత్యయాత్ - నాట్యయోనిత్వాత్ - తత్తు సమన్వయాత్ - నిగమాగమరహస్సంహితత్."

శ్రీకారముచుట్టిన భారతీయులు రసాత్మసంవిదుల్లాసప్రాభవులు. వారి ప్రతిభోన్మేషము ఏవిషయమునకు గాని "ఇతి శ్రీ" పెట్టదు. స్వస్పందసుందరమయిన ఆత్మరసధారయవిచ్ఛిన్న గతికమై భావ్యభావానుభవ్యమై నానాభంగీభణిత భూషితమై పరమార్థలక్ష్యస్వభావకమగుటను భావించిన భారతీయాత్మ సర్వసహృదయహస్తములను ముకుళీకరించును. ఒకవస్తువు స్వాత్మరూపప్రస్పందితమై వస్తుత్వము విడనాడి శివీకృత మగుట స్వధర్మము. అది శివీకరింపబడుటకు ధారావాహికమయిన స్పందరసము శివలక్ష్యైద్దేశ్యమున నిరంతరభావన మొనరింపవలసిన యవసరము లేదు. అది స్వరూపాభిధేయమునందే రసీకృతము కాగలదు. రసీకరణము శివీకరణము బ్రహ్మీకరణము ఆత్మీకరణము పర్యాయములు. వాస్తవముగా రసాతిరిక్తమేమియు లేదు. జాగతికమయిన యపరమార్థదర్శనములో నాకల్పన కుదురుకొనును. సద్యస్సద్దర్శనములో నీప్రాతిభాసికములన్నియు నాధ్యాసికములు. ఆహతధ్వనులు ఎన్నియేని యనాహతవివర్తము లేకదా! అంతట ననాహతవిద్యోతన మున్నప్పుడు ఏకాత్మకతకు భంగము లేదు. ఇదియె విశ్వమయము విశ్వాతిగము నయిన శివరసము. ఏతదుచ్ఛ్వాసము ప్రవృత్తి; నిశ్వాసము నివృత్తి. ప్రవృత్తినివృత్తులసామరస్యము భారతాత్మ ప్రసాదించినభిక్ష. తానువిశ్వ

బింబితుడై విశ్వవిశ్వము స్వప్రతిబింబితమై యునికి మహాసాహిత్యసర్జనహేతువు. ఇది యుపాదానముగా కావ్యగతిసంభావనము స్వసంవాదవిజ్ఞాన సంభూతి సంపాదకము.

పరమశివుడు కవి, కవి స్రష్ట. శివేతరనివృత్తికై కవి శివేతరసృష్టి యొనర్చును. కవిరసాత్మ నుండి యుచ్ఛ్వానమయిన స్వశక్తి శబ్దరూపముపొందినది. కవిశబ్దము మంత్రము. ఆతడక్షర తపస్వి. ఆతని ప్రత్యభిజ్ఞ "అలమర్థైః" అనుట. అర్థేతరములు లోకభాషలో అనర్థములు. కాని యనర్థములును కవికి అర్థములు. ప్రత్యాత్మగృహీత మయిన యర్థము "నానార్థం" అనును. సాధకుడు శివేతరక్షతి కాంక్షించువాడగుట నానార్థసంభూతిలో వ్యాకులత పొందజాలడు. కావుననె స్వసంభూతికై శివేతరము గావించి తూలించి రస మాస్వాదించును. ఈ రసాస్వాదనలోలుపమధుకరుడు కవి. ఆతనివాక్కు మంత్రగీతి అయినది; అది వేదము.

వేదమునకు ఇయత్త లేదు. అది యొకనికి అదిగనె యందును. మఱియొకనికి అన్యముగ అందును. అందర కెల్లని యది యందును. అది యందినదని యందరు భావింప జాలరు. ఆచాలమి యెంతనో అన్వేషింపజేసినది. విశ్వాత్మయయిన వేదనాదము విశ్వముఖములో మధురపయోధారలు పిండును. క్షీరకంఠులు గుర్తింపవచ్చును, గుర్తింపక పోవచ్చును. వేదపయస్సు వడపోతపడి లోకమున కందినది; అందుచున్నది; అందనున్నది. కావుననే వైదికసాహిత్యము సార్వజనికసాహిత్యము. భారతీయులు ఒకనాట వేదభారతిని సార్వజనికసాహిత్యముగా చేసియుందురా? ఈసంశీతి నేడు కలిగిన కలుగు గావుత. స్వర సంహితముచేసి కొందరుపొందిన కొందరు విషయోపగూఢముగ పొందిరి. అందరిపొందిక యిప్పు డనుమేయము. అందలి వస్తూపధానము సార్వజనికము. అది త్రైలోక్యభావాను కీర్తనమయిన రసనాట్యము. లోకలోకమున కందొక యాలోక మున్నది. కావుననే జగ మంధతమసము కాలేదు. చేతనాచేతనములకు వలసినవన్నియు నందు కలవు. కావుననే యది విశ్వసాహిత్యము.

భారతావనిలో జైనబౌద్ధులవిప్లవ ముదయించిననాటనుండి సార్వజనికసాహితీపథము నుండి వైదికము దూరమయినది. రూపాంతరితమయిన యొకానొకవిప్లుతసంస్కృతిని అర్హత గణము ముద్దులు ముద్దులుచేసి అందింపగా ఆకలిగొన్న అజ్ఞలోకము ఆరగించినది. అది అరిగినదో లేదో! ఏమయినగానీ, మారువేసముపొందిన సాహిత్యము భారతజనతకు అందుబాటులోనికి వచ్చినది. అప్పుడు ప్రాకృతసాహిత్యము భారతీయులపంట. పంట అందరిపంట పండు నని నమ్మకమేమి? బహుజనత ప్రాకృతసాహిత్యముసేవించినది. అప్రాకృతపాలకుడును ప్రాకృతముననే యారగించినాడు. కాని సార్వజనికవ్యవస్థ నశించినపుడు అవతరించినది ఎంతగా బలీయమయినను దక్షవామపక్షములతో నుండకతప్పదు. కాలప్రభువు దక్షపక్షము ప్రాకృత మభిమానింపగా వామపక్షము అవామముగనే సంస్కృతసాహిత్య మభిమానించినది. ముఖ్యముగా అప్పటినుండి వర్గసాహిత్యము అడుగులువేసినది. సంస్కృతసాహితీసేవకులు కొందరు ప్రాకృతసాహితీసేవకులు కొందరును కలహించుకొనినవిమ్మటనైన ఒకరొకరి ముద్దు

మురిపెములు చెల్లించుకొనినారు. అప్పుడు హాలదేవుడు రెండు నేత్రములు కలవాడయి నాడు. కాని వర్గభేదము తప్పనిదె యయినది. ప్రాకృతవర్గము - సంస్కృతవర్గమన్న ద్వైత ముతో సాహితీరీతి ఆగలేదు. సంస్కృతము ప్రాకృతముచే "బహుస్యాం ప్రజాయేయ" యనిపించినది.

అది దేశభాషోదయ హేతువు. ప్రాదేశిక ప్రాకృతము లుదయించినవి. పుష్టితుష్టికలవా రుదాత్తప్రాకృతసాహితీ ప్రియంభావుకు లయినారు. ఇతరు లితరప్రాకృతసేవాసక్తులగుట తప్పనిసరికదా! తెలుగు-ఆంధ్రము-అదియొకమాట, ఇది యొకమాట. కాని రెండు నొకమాట. ఇది యీనాడు తెలుగునాడు భాష. దీనిమూలము ప్రాకృతము. ప్రాకృతము దేశభాషలన్నిటి కిని మూలము. మనభాషకును మూలము. హాలుడు పులమావి ఇక్ష్వాకులు ఎందరు పాలించి నను ప్రాకృతము సార్వజనికభాష యయినది. ఆ ప్రాకృతసాహితీసుందరత తెలుగునోటికి మధురత నాపాదించినది. జైనులు బౌద్ధులు ప్రాకృతమతులు. మహాతెలంగాణా అంతట వారి విహారములు. వానియన్నిట ప్రాకృతసాహితీమాధుధారానిష్యందములు. మాధు ధారలు తేనెవాకలు. తేనెవాకలు తెనుగుపోతలు ఎత్తిపోసినవి. ఆ యెత్తిపోతలలో తెలివి వెలుగులు తెలుగుపలుకు లయినవి. ఈ వీనిమధురిమలు ముందుగా ఆస్వాదించిన జైనులు బౌద్ధులు ఆంధ్రభూమిలో తెలుగుసాహిత్యమును ఎంతగనో సృజించియుందురు. వారికి తోడు వీరజాతిశైవులు. వారు వీరు తెలుగుతల్లికి గజ్జెలుగట్టి కులుకుగతులు నేర్పి యుందురు ఏవి అవి? ఆనాడు అవి అందరివి. ఈనాడు అవి ఎవరివి? ఏమో? కొంద రందురు. నన్నయభారతామ్నాయాగ్నిలో వారి గ్రంథసముదాయము భస్మమయియుండును అని. ధార్మికోద్యమమున కూతగా సాహిత్యము ప్రసరించినది. శైవజైనబౌద్ధధర్మములు సాహిత్యమున నవతరించి జనుల నలముకొన్నవి. అవి వైదికధర్మమున కెదురుదెబ్బలు. క్రమముగా వైదికమును ఆకాలమున ఎట్లో పుంజుకొని నిలద్రొక్కుకున్నది.

అపుడు రాజరాజనరేంద్రుడు పాలకుడు. పాల్యప్రజలో వర్గభేదములు కలహబీజ ములుగా నుండుటను గుర్తించినాడు. ఇటు వైదికధర్మానుయాయివర్గము సంస్కృత ప్రేమితతో సముదాత్తమై యారాధ్యమయినది. అటు అవైదికధర్మప్రేమితతో నున్నవర్గ మును బలీయమై యనుసరణీయముగ నున్నది. వర్గద్వయమును సమరంగమున సమన్వయ పఱచవలసిన యవసరము తనకు గలదు. కాకున్న తనపాలకత పాలలోని పంచదారయై పోవును. తా నేమి చేయవలయును? ఏమియయిన చేయవలయును. వారిని వీరిని బుజ్జగింప వలయును. అది యొక కుతంత్రము కారాదు. కుతంత్ర మెంతకాలము నిలుచును? రాజ నరేంద్రుడు సాహిత్యతంత్ర మారాధించెను. వైదికధర్మకేతనమయిన భారతామ్నాయ మును దేశభాషలో వ్రాయించినచో? అంతపనిచేయుటయే.

"భాషాయాం భారతం శ్రుత్వా
రౌరవం నరకం వ్రజేత్"

ఈ వచనము వైదికులకందరకు సువిదితము. ఈ కఠోరనిషేధ మూనాట నున్నది. అప్పుడు దేశభాషాగ్రంథములన్నియు వైదికధర్మదూషకములు. వానిలో భారత మనూదిత మగుటను భారతధర్మాభిమాని సహింపడు. కావుననే "రౌరవం వ్రజే"త్తనును. కాని భవిష్యద్గౌరవము నచ్చజెప్పి నన్నయభట్టారకునిచే భారతసంహిత నాంధ్రీకరింపజేసినాడు. అది ఆంధ్రభాషలో నాదికావ్య మనిపించుకొన్నది. ఆంధ్రమున "నూతనశ్ఛందసా మవతారః" అని సంభావితమయినది. ఈ సంభావనములో కేవల మాత్మీయత కారణము కాదు. అవసర సృష్టి హేతువు. ఇంకను నిమిత్తము కలదు. తత్పూర్వపు తెనుగు శాసనాభాషమున కొంతగా ననుమేయమే. అది సుపరిష్కృతమగునో కాదో! ఎవరి కెఱుక? మార్గపద్ధతిలో భట్టారకుడు భారతమును వెలయించినాడు. తెలుగంతయు తత్సమము తద్భవము. అంతయు తద్రూపరూపితము. తద్వినా తెనుగునకు సత్తువ లేదు. తత్సంబంధము దీనిసత్త. కావుననే లక్షణమంతయు సాంస్కృతికము, వృత్తములవి రీతిశయ్యాపాక గుణాలంకారము లన్నియు తదీయములు. తత్తు ప్రాణము. అది వలయునని నన్నయ యనిపించినాడు. లోకభాషలో ధర్మ మందించి కావ్యగతికి సుగతి నిచ్చిన నన్నయ ధన్యుడై తెలుగులోకము ధన్యము చేసినాడు. ఆ యావర్గములకు మధ్యనున్న కోట ఛేదిల్లినది. నెత్తి పూడినది. అడ్డు పోయినది. అనేకత్వములో నేకత్వము గుర్తించి లోక మేకపథ మనుసరించినది. భారతములోని మార్గపద్ధతి లోకములోని దేశీపద్ధతికి బడిపెట్టి పాఠము చెప్పినది. దేశీమార్గములు భారతములో మెలికలు వేసికొన్నవి. లోక మన్నిహృదయముల నల్లుకొన్నది. * * * నాట్యధర్మి లోకధర్మి అను రెండుపద్ధతులు భరతునినాట్యశాస్త్రములో నిర్దిష్టములు. నాట్యధర్మిసముదాత్తము. రసభావప్రాణము. లోకధర్మి లోకసంగ్రాహకమయిన మృదు పద్ధతి. ఇది పామరాదుల కనుకూలము. ఇది దేశీపద్ధతియయినది. నాట్యధర్మి మార్గపద్ధతి యయినది. లోకనాట్యధర్మిద్వితయము మేళనముపొంది ప్రబంధసంపద కాకార మిచ్చినది. ఈవిధి కేవలము కవితయందే కాదు, అసలు నాట్యమునందె కలదు. చతుర్విధాభినయాత్మక మయిన నాట్యము చతుర్ధావిభక్తమై కవితగా సంగీతముగా నృత్యముగా శిల్పచిత్రరూప ముగా లోకగ్రాహ్యమయినది. వానియన్నింటియందును లోకనాట్యధర్మలు కలవు. అవి మొదట వేరువేరయినను తరువాతికాలమున కలిసియుండి యాస్వాద్యమానము లగుట ప్రసిద్ధము. అన్నిటిలోని యీసామరస్యమే లోకతారకము * * * నన్నయభట్టు సమరస విధానమును తనసాహిత్యముఖమున లోకమున కుగ్గుపాలు చేసినాడు. సంపూర్ణముగ తన దేశీయవిధానమునే ఆత డవలంబింపకపోవుట యేల? మొదట కొందరిలో కలిగిన ఈ అతృప్తి ప్రబలి బలీయమై నన్నయభారతరచన నాపుచేసినది. కొంతకాలమునకు శస్త్రశాస్త్రముల పారంగతుడు తిక్కనసోమయాజి చూపుమెలికలలో లోకమును చిక్కబట్టి లోకసంతృప్తి నుద్దీప్తము చేసి కలహాగ్నిపై శాంతిజలము చల్లినాడు. తెలుగుప్రాణికి సంస్కృతిబలము సంపాదించుటకు తిక్కనాదులు సాహిత్యవాటికలు తీర్థములు ఏర్పఱచుట లోకమునకు మంచియవతారము కలిగినది. సాంస్కృతికమయిన ఐక్యమును ఆంధ్రు లనుభవింప

గలిగినారు. రాజకీయముగా ఐక్యములేకపోయినను సాహిత్యికమయిన యైక్యముండుట తెలుగునా డప్పటసంతుష్టమయినది. సాంస్కృతికము సాహిత్యికము అయిన యైక్యము కొంతగా భగ్నమగుటకు కొన్ని దుర్నిమిత్తములు గూడు కట్టుకొన్నవి. వానిపని నవిచేసినవి. మఱల సాంస్కృతికము ధార్మికము సాహిత్యికమయిన విప్లవము రాగా వీనిని సవరించుటకు రాజకీయైక్య ముపకరించు నని ప్రజ తలచినది. తత్ఫలముగా విప్రకీర్ణములయిన శక్తులు పాయలుపాయలుకాక విడిపోక ఒకే ఒకసుబద్ధవిధానమున రాగా రాజకీయైక్యము ఆంధ్ర భూమికి కొంత ఘటించినది.

అపుడు కాకతీయమహాసామ్రాజ్యపతాక ఆంధ్రావనీ సముద్ధారకమై యుండుట గుర్తింపదగిన రమ్యవిషయము. దేశము కేవలము వీరోద్రిక్తమై యుండుదినాలలో నిర్మాపక మయిన సాహిత్యము వెలువడదు. విధ్వంసనాత్మకము విప్లవాత్మకమునగు ప్రచారరూప మయిన ప్రోత్సాహికమయిన గేయసాహిత్య ముదయించును. స్థిరచిత్తులయిన సాహిత్య యోగులే పాఠ్యసాహిత్యము సృజింపగలరు. గేయ మూపామరముత్సాహకారి; పాఠ్యము దాత్తహృదయహారి. కాకతిపాలకపాలనసమయము తెలుగుజాతినంతను వీరపఱచి ఏకపఱచుటకు సమర్థమయినది. కవు లేకముఖులై సాహిత్యికశక్తులను కేంద్రీకరించుకొనుట కది సమయము. సమకాలీనజనతను తాత్కాలికసాహిత్య విన్యాసముతో సాహితీసమర్థము చేయదలచిన యప్పటికావ్యగతి యాస్వాదనసామర్థ్యమును లోకమున నెలకొల్పినది. వీరశైవ మొకచాయ వీరవైష్ణవము వేరొకచాయ డీకొనుచు వ్యాపించు నా దినాలలో పరస్పరస్పర్ధిసాహిత్య ముదయించినది. ఈస్పర్ధితసాహిత్యమున బింబించి జనతను తమ తమ పక్షమున నిలుపుకొనుట కుద్యమించినది. ఈసమయమునాటికి జైన బౌద్ధవిహారములు తెలుగునాడులో దిబ్బలయినవి. జనులుగూడ విస్మరించినారు. కాని లోలో జైనతబౌద్ధతకలజనత అవి పోగా, వానియునికి చిహ్నముగా వైదికవిద్వేషము మాత్రము మిగులగా తద్భావభావితుల భావములను అందుకొనినది. కేవల ముద్రిక్త పఱచుటకు స్పర్ధింపజేయుటకును బయలుదేరెడిసాహిత్యము తత్సమయప్రయోజనము కలిగినపిమ్మట స్థిరముకాదు. ఈదృశోద్యమములందు పాఠ్యకవులు ప్రయత్నింపరు. అల్లేయయిన యాసమయమున రాజకీయముగా నాంధ్రలోకమునకు ఐక్యము సంపన్నమయినది. కాని కొంతకాలమునకు కాకతిసామ్రాజ్యము విచ్ఛిన్నమైపోగా సారస్వతైక్యముతోపాటు రాజకీయైక్యమును నష్టప్రాయ మైనది. విజాతీయపాలకనియంత్రితులయిన రాజన్యులు కరగ్రాహులై యునికి నివురుగప్పిన నిప్పులయినారు. వారిని వారిపాలితులను సంఘటనపఱచుటకు శ్రీనాథాదిమహాకవులకృషి సాహిత్యముఖ మయినది. శ్రీనాథుడు తెలుగుమండలమునకంతకు సారస్వతైక్యము సంపాదించిన మహాసారస్వతేయుడు. ఆతని యుద్యమఫలమే విజయనగరసామ్రాజ్యసమయమున అష్టదిగ్గజప్రఖ్యాతివహించిన కవుల కావ్యగతులకు సుపథము సిద్ధముచేసినది. నన్నయాదులు ధార్మికోద్యమమును పునాదిచేసి కావ్యసౌధమును నిర్మించిరి. శ్రీనాథాదులు ఉక్తిచిత్రత నాపాదించి కావ్యకాంతపలు

*

కులలో పలుకుదనము నేర్పఱచిరి. పెద్దనాదు లావిధనందిపుచ్చుకొని విలాసవినోదమతులయిన భూపతులచిత్తరంజనముచేయుచు బ్రాహ్మక్షాత్రవిధానములను కుదించి ప్రబంధీకరించిరి. అప్పట అనేకులు రాజన్యులు; వారందరు మానమతులు. తదభివృద్ధికై సాహిత్యగోష్ఠి బంధములు నిబంధించిరి. కవులు వారివిజయగానముచేసినారు. ప్రౌఢసాహిత్యసరస్వతికి మంజుమంజీరములు తొడిగి లాస్యగతులు చూచినారు. అబ్రాహ్మము అక్షాత్రము అయిన జనత యానాడు "సారస్వతమునందు బ్రాహ్మక్షాత్రగతులే ఏల?" అని భావింపలేదు. అవి ఆదర్శప్రాయములు. లోకమునకు గమ్యములు. వానియనుసరణము తత్సంస్కృతిస్వీకృతి తమకుపకారకమనియే లోకము సంభావించినది. అప్పట సారస్వతేయజనతకొంతయే కావచ్చును. అప్పు డనక్షరాస్యలోకముకూడ యానాటిసాహిత్యకవిజ్ఞానసుముఖముగనే ధన్యమయినది. ఎంతగా వైలాసికవిధులు తత్కాలీనకావ్యగతులందును లోకాపేక్షితము లయిన ధార్మికనైతికవైజ్ఞానికసాహిత్యకవిన్యాసములును సునిరూపితములయినవి!

ధర్మశృంగారమర్థశృంగారము వెనుకబడి కామశృంగారము శృంగమెత్తివచ్చిన దినములు వెంటనే వచ్చినవి. అపుడు జమీందారులు సాహితీగానము వినిరి. హృదయముల చమత్కరింపజేసికొనిరి. పిదప బుద్ధులు పిల్లలుపెట్టినవి. జనులకందని శ్లిష్టసుశ్లిష్టకవితచమత్కారనికారబహుళాకారన్యక్కారగర్భితమై వెలువడినది. వారిది వీరికి వీరిది వారికి మాత్రము సుగమము. నానాజనులక్రమ కొందరివిలాసములకు పాదు అయినది. లోకమలోకమయినది. విజ్ఞానక్షామము కల్గినది. దేశము నిర్వీరమయినది. ఆంధ్రవిషయ మంధప్రాయమయినది. అది అప్పటి స్థితి. దానికిదోడు పాశ్చాత్యులసంక్రమణ సిద్ధమయిన భావదాస్యము. భారతజాతి తనజాతీయతను విస్మరించినది. ఆంధ్రజాతి ఆంధ్రతను మఱచినది. అందర కన్నియు పోయినవి. జనతకు శబ్దాహ్వాయజ్యోతి లేదు, ఒకచో నెక్కడో యున్నను దీపింప లేదు. ఆంధ్రజగము సంత నంధతమ మావరించినది. కావ్యజగత్తు నిద్రించినది.

ఈభావదాస్యముచే లోకము క్రుంగిపోవలసినదేనా? ఆర్థికదాస్య మావ్యక్తిని అంతగా నయినచో నాకుటుంబమును వ్యథించును. భావదాస్య మట్లు కాదు. పరంపరకు పురుగుజాతి దానిచే జీర్ణమగును. భావదాస్య మెట్లేని నశింపవలయును. దానిపోగొట్టుట కుద్యమ మవసరము. ఆయుద్యమము భావోద్యమము. భావోద్యమము సర్వతోముఖముగా వెలసిననే సాధ్యము సిద్ధించును. జాతికి పట్టినచీడ నానావిధముగా నున్నపుడు నానారూపమున నున్నదని కొందరచే సంభావితమయినపుడు తన్నివారణోపాయములు నానా కాకతప్పదు. భావోద్యమము ఆధ్యాత్మికముఖమై వివేకానందుని రామతీర్థుని ఇతరులను అందించినది. కవి తాను గతముకాగా రవీంద్రకవినాథుడు ప్రశస్తి కనినాడు. రాచరికములో భావవిప్లవ మాపాదించిరి. సంఘమర్యాదులు కొన్ని జాతివికాసమునకు తోడ్పడుటలేదని భావించిన కతిపయవ్యక్తులు సాంఘికభావవిప్లవము సాగించిరి. ఇట్లు భావోద్యమము సహస్రశీర్షమయి విరాట్టయినది. వంగీయు లుద్యమించి నవచైతన్యము

పొందినారు. అది యందర కందినది. ఆంధ్రుల కందినది. ఒకసంచలన మంతట నుదయించి నది. ఈసంచలనమును సంకలనముచేసి భిక్షపెట్టుట యవసరము. ఆయవసరకృత్యము నవధానకవితలో కవులు కలిపిరి. ఆంధ్రమండలమున నవధానకవితలు అల్లుకొనినవి. తమ తమప్రశస్తికే యగుగాక. కవులు ద్వారములు తెఱచుకొని వీధికెక్కి సభలుపెట్టి వధాన విధానకవితారమ్యతను లోకులకు చవిచూపిరి. తెలియుము. తెలియదు. ఏమయినను లోకమవధానాదృతమతి యయినది.

అని శ్రీతిరుపతివేంకటకవులయుగము. వారియవధానములు సద్వ్యుత్పత్తులు, సప్రతిభములు. ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కల తిరుపతివేంకటకవులవంటివా రప్పట ఎందరో లేరు. వారియవధానకవితపామరులకు మధ్యములకు ఉత్తములకు సర్వులకు సంతృప్తి సంపాదకమయినది. పల్లెలు పట్టణములు దరిద్రకుటీరములు రాజప్రాసాదములు వీథులు మహాసభలు అన్నియు వారియవధానకవితాలతాంతవాసితములు. వారిశిష్యులందరు కవు లయినారు. లోకమునకు కవితాదృష్టి కలిగినది. అప్పుడు యంత్రయుగప్రభావ మల్లుకొనుచున్నది. ఆంధ్రమండలమహత్త్వము మధ్యమవర్గము వారియునికి. వారికి యంత్రయుగము తీరిక నిచ్చినది. నాలుగుడబ్బులు గలగలలాడినవి. పుస్తకము కొనగలరు. సంజనితసారస్వతాసక్తులు కావున సశ్రద్ధము పఠింపగలరు. సంతసింపగలరు. ఈపరిస్థితిని సంపాదించినది తిరుపతివేంకటయుగము. ఇది నవకాలమయినది, ఆంధ్రమండలమునకు సంబంధించిన పరిసరరాష్ట్రములసంస్కృతి కొంతగా రైళ్లు ఎక్కి రోడ్లవెంబడి మోటారుపట్టి ప్రవేశించినది. ఈవిశిష్టతలనన్నిటిని తిరుపతివేంకటకవులు గ్రహించిరి. ప్రాక్కాల సాహితీ స్రవంతికి నవకాలసాహితీస్రోతస్సునకు వారు వంతెన నిర్మించినారు. అటు ఇటు రాకపోకలు సాగినవి. ఆసక్తి హెచ్చినది. భావదాస్యము కొందరిలో తిరుగుముఖమయినది. వీరేశలింగముపంతులు నిర్భీకకవితాత్మ. ఆంగ్లభాషాపరిచయమున న్యాయావిశేషములను తెలుగులో సంధానించిన సహృదయుడు. బాలురకబాలురకు వలసిన సారస్వతబ్రహ్మ. ఒకమహాభావవిప్లవసంపాదకుడు. వంగీయుడు రామమోహనరాయి తలపెట్టిన బ్రహ్మసమాజమును వీరేశలింగము తెలుగులో ప్రవేశపెట్టుట అవసర మని భావించి సంస్కార మారంభించినది మొదలుగా కవితావిషయమున మార్పు వచ్చినది. సాంఘికవిన్యాసములు కవులకు వర్ణనీయము లయినవి. ఉన్ననియమములను నిర్దయగా విమర్శించుటయు దూషించుటయు నట్టివారి కవితావిషయము. సంస్కృతభాషాసుబద్ధమయిన సాహిత్యకసంస్కృతిని వీరేశలింగము అనువదించి ప్రసాదించుటవలననే యాకాలమున గౌరవ్యుల మని భావించువారలకు భాషాసమాదరభావ ముదయించినది. వీరేశం గతించినాడు. ఆయనవిత్తినబీజములు మొలకలెత్తినవి. వృక్షము లయినవి. కొన్నికుంకుళ్లు కాచినవి. కొన్నిరసాలములు పండినవి. ఏమి కానీ, ఆయనకావ్యగతి విశిష్టము. భావవిప్లవమునకు తోడు గురజాడ గిడుగులు భాషావిప్లవము తెచ్చినారు. వ్యావహారికభాష లోకప్రాణుల కందినది. నాభాషలో నాభావములను నిరూపింతును అని గూఢగుప్తకవితాత్ము లుల్లసితచిత్తులై వెలికివచ్చినారు. కొంత

వెనుకముందు లెట్లయినను ఆంధ్రసాహిత్యపరిషత్తు సమర్థపండితకృషి యొనర్చినది. పత్రికా ద్వారమున కావ్యతత్త్వస్వరూపనిరూపణమున కుపక్రమించినది. లోకమున కొకయుత్తేజము ఒకసాహిత్యాసక్తి కలిగినది. ఈసమయమున వావిళ్ల అవతారము లోకోపకారకమయినది. ఈయుద్యమములకు పూర్వమె వావిళ్ల సహృదయతసారస్వతేయత విశదము. నానాగ్రంథ ముద్రణము, సారస్వతసంరక్షణము, సారస్వతేయులకుధాత్రి ప్రశమనము. ఈపూర్వాపర సందర్భశుద్ధికల సదుద్యమము వారలకే చెల్లినది. వావిళ్ల అట్లు చేయరుపో! లోకమున సారస్వతాసక్తియున్నది. గ్రంథము లవసరము. ఉత్తకొంతిమెరి సారస్వత మెంతయుపక రించును? మనసిద్ధసాహిత్యము మనది కాకపోవును. మనయాదృతి ప్రస్తుతము కాక పోవును. సాహిత్యతృష్ణ రూపుకట్టకపోవును. వావిళ్ల రూపసంపాదకరూపధారి. ఈ ప్రకటిత నానాపూర్వాపూర్వపుస్తకపఠనసామర్థ్యము పత్రికలకు మేతయిచ్చినది. పత్రికల సాహిత్యము ప్రసరించినది. ఎచటనో దాగియున్న కవిలోకము వెలికివచ్చి కవిత లల్లినది. భావ మావిష్కరించినది. వేదనపడినది. లోకమూపినది. జనత తలలూపినది. ధనికైక సాధ్యములయిన గ్రంథములు మధ్యమవర్గీయులకు అందుట వారధ్యయనించుట సమష్టిగా చర్చించుటలు హేతువుగా గ్రంథాలయములకు సుస్థిరస్థలములు లభించినవి. సహకార మొదవినది. స్థానికములయిన సాహిత్యసంస్థలు దేశమందంతట వెలసినవి. వైయక్తికము సామూహికమునయిన సారస్వతసేవ యతిశయించినది. మంది యధికము కాగా మజ్జిగ పలచన యగును. సారస్వతేయులసంఖ్య హెచ్చినదికాని సారస్వతాత్మ నీరసమై సన్నపడినది. కారణము లనేకములు. జాతీయోద్యమము ప్రధానహేతువు. అస్వతంత్రజాతికోల్పోయిన సామర్థ్యమును సంపాదింపవలయునుగదా! దేశీయోద్యమము ప్రజావ్యూహమునకు రాజకీయచైతన్య మిచ్చుట కుపక్రమింపగా కవులు సాయపడినారు. కవితలవిశిష్టసామర్థ్యము శ్లోకమును సుశ్లోకము చేయును. విశిష్టత లేకున్న లకారలోపము కల్గును. అన్నివిశేషములు రాజకీయవాతావరణచక్రమున బంధింపబడినప్పుడు, అందరిదృష్టి యటు లగ్నమయినప్పుడు తద్భిన్నమునకు రాణింపు కలుగదు. అట్లే యయినది. కవులు సాహిత్య మన్నపేరట జాతీయ రచనలు చేయదొడగినారు. జాతీయవ్యూహపతి శ్రీమోహనదాసకర్మచందగాంధి యంత జాతీయ మన్నముద్రతో నహింసాధర్మము వ్యాపింపజేయ దలచి కవులచిత్తవృత్తి నటు మలచినాడు. అయినను ఆతడు జాతీయవాది. పాశ్చాత్యవాసనావాసితులు రంగ మాక్ర మించిరి. వారిప్రాబల్యము సంఘమున నధికమయినది. వారియభిరుచులను వారిజీవితావ సరములను కవులు నిబంధింపవలసినవారయినారు. ఒకనాడు రాజచిత్తానుసరణము కవులకు న్నచో నీసమయమున నుద్యోగి చిత్తానుసరణము కొందరికవుల కావశ్యకమయినది. గాంధి వాదప్రాబల్యము కవితలో దిగినది. భారతీయసాహిత్యలాక్షణికులు నిర్వచించిన సాహిత్య లక్షణ మీవర్గమువా రధ్యయనము చేయలేదు. అధీతమయిన యాంగ్లసాహిత్యమున నీవిశిష్టతలు లేవు. అందలివస్తువిజృంభణము మనకవితలో లేదని వాపోయినవారిపోకడలు తమకనభీష్టమును తెగడుటకును సమర్థములయినవి. కావుననే "శబ్దముఖ్యమయిన సాహి

త్త్వము నియమశృంఖలితమై సరిగా వ్యాపింపదు. కొంతగా వ్యాపించిన నది యుపకారకము కాదు. తదుపకారమును సర్వవర్గీణము కాజాలదు" అనుమాట లచ్చటచ్చట విన్పడజొచ్చినవి. ఒకమహాయుద్ధము వచ్చుసూచన లున్నచో జనచిత్తములం దొక ప్రస్పందము కలుగును. అది యనేకముల నారంభింపజేయును. యుద్ధసమకాలములం దాయారబ్ధములు వాడిపోవును. యుద్ధానంతరమందు కొన్ని సమసిపోవును. కొన్నియె చిగుర్చును.

ప్రథమ ప్రపంచసంగ్రామము సమాప్తమయినది. కొన్ని ప్రాతపలుకుబడులుపోయినవి. కొన్ని క్రొత్తవివచ్చినవి. క్రొత్తవి గుర్తించినవారలకు దారులు కలిగినవి. దారులులేనివారు దూరమయినారు. ఇది పండితయుగ మంతరించుటకు మొదలు. సంస్కృతాధ్యాయులు నియతాంధ్రాధ్యేతలు దూరమగుటయే కాక లోకము దూరుటకు నవకాశ మిచ్చినవారయినారు. ఆంగ్లీరసికులు సారస్వతరంగ మాక్రమించినారు. ప్రచారసాహిత్య మధికమయినది. కాంగ్రెసుభటుల కందరకు కాకపోయినను కొందర కది కార్యమయినది. కాంగ్రెసుఉద్యమమును నడిపిన భటులు తెలుగుదేశమున తెలుగుసంస్కృతికలవారు కానందున కావ్యపఠనముచేయు లేదు వారు వైజ్ఞానికమయినవికాస మీయజాలనివా రయినారు. యంత్రయుగప్రభావమువలన మధ్యమవర్గమువారు ప్రబలురయినారు. తద్వర్గవికాసము కలిగినది. అందు తత్కాలీనకావ్యగతికారణము బ్రాహ్మణులే కాదు, ధనికులే కాదు, చొక్కాతొడుగనేర్చిన ప్రతివ్యక్తి కొంతగా వికసన్మతి యయినాడు. ఆవికసనమంతట కావ్యపఠనోపయోగి కానందున కొందరిలో నది టక్కరితనముగ మార్పుపొందుటను కప్పిపుచ్చవలసినయవసర మీనాడు లేదు. ఆసమయమునకు నానాభావులు వివిధవర్గులు కంఠశోష్యులై వాడవాడల తిరుగునపుడు విప్రకీర్ణములై శక్తులు చెదరుట సముచితముకా దని భావించిన శివశంకరశాస్త్రి నవ్యసాహిత్యపరిషత్తును స్థాపించుటయు నది యీనాటికవితాప్రియంభావులకందరకు సమరంగమగుటయు హృదయధార్యము. పరిషన్ముఖముగ వ్యక్తి యశఃప్రాప్తి కావలయును. వ్యక్తిబలము పరిషత్పుష్టి నీయవలయును. అప్పుడు సారస్వతైక్యసంధానము సుశకము. నవ్యసాహిత్యపరిషత్తునకు పూర్వమునను తరువాతను స్థానికసారస్వతసంఘము లెన్నియో కలవు. అవి స్థానికములు మాండలికములు. నవ్యసాహిత్యపరిషత్తు సార్వమాండలికమై నవసాహిత్యికులను ఏకసాహిత్యపతాకాచ్ఛాయలో నుండునట్లుచేయుట కుద్యమించి యుత్సుకత చూపినది. అప్పటికే యాంధ్రదీప్తదీపకకవిత లెన్నియో వచ్చినవి. నే నాంధ్రుడను. నాది ఆంధ్రభాష. అది మధురము. నావారు పాలకులు; మహాసాహిత్యస్రష్టలు? శిల్పనిపుణులు; చిత్రనిర్మాతలు; దివ్యగాయకులు; నాట్యాచార్యులు; సమరసులు. నే నాంధ్రుడను. ఈవీరభావ మాంధ్రుల నావేశించినది. ఈయావిష్టకవులు ఆంగ్లభాషాసంస్కృతికలవారగుట తమకు కొంతప్రశస్తికలుగగానే యాంగ్లసంస్కృతిని వడపోతపోసియో పోయకనో దింపుటకై పూనుకొనిరి. రావలసినకాలమున తగినసాహిత్యలక్షణము రాకపోవుట యిందు హేతు వని కొంద రీనాడైన భావింపగలుగుట శుభము.

ప్రథమయుద్ధానంతరము పాశ్చాత్యులు విజయులై విజిగీషువులై విశృంఖలముగా విప్రతీపముగా కవితాగతులు చూపినారు. వారిపత్రికలద్వారా వానిని దిగుమతిచేసికొన్న మనవారును రూపభేదభిన్నములయిన కవితల నాశ్రయించిరి. కాంతాకనకాభిలాషులయిన పాలకులు తమవిధానవ్యతిరేకులను నిర్బంధించుటకు స్వీకరించుచుపాయజాలములను గ్రంథములం దిమిడ్చి పాలకజాతివిధానములం దభిమానము నుత్పాదించుటకై యపరాధపరిశోధనాత్మకములయిన నవలలను నిర్మించిననాటనుండి భారతభూమిలో పాశ్చాత్యులు తమపాలనసుస్థిరతకై యేర్పఱచినపన్నాగమును తత్పరత తదాస్వాదనవ్యగ్రమయిన లోకము గుర్తింపకపోవుటవలన తాదృశగ్రంథప్రకటన ప్రచారములు విరివిగా సాగినవి. 1914 నుండి 1918 వరకు జరిగిన మహాసంగ్రామములో ఫ్రాన్సుదేశవిద్యార్థియువకులు భాగభాజను లయినారు. యువతులతో సహభావసమానవిద్యాగోష్ఠి వారలకు పరిచితమును అభీష్టమును. చతురాగము పొందినయువకులు యుద్ధభూమి కేగియు శత్రువులశతఘ్నిధ్వనులలో ప్రియాప్రణయసాదములను, వహ్నిజ్వాలలలో రక్తధారలలో ప్రేయసీకపోలారుణిమను అరుణాధరరాగవిస్ఫురణమును జూచిరి. క్షతగాత్రులై శిబిరములందు చికిత్సలపొందుచు తమకు వైద్యముచేయువనితల మంజులహాసములో యుద్ధభయంకరఘోషలను వినిరి. ఆచిత్తవృత్తు లట్లు మెలిదిరిగినవి. అవియన్నియు కావ్యనిబద్ధములయినవి. వానిని భారతీయులును ఉన్నవాని నున్నట్లుగు ర్తించి కవిత లల్లిరి. ఆపరిస్థితులు మనకు లేవు. కాని తద్భావనతో వాని నాస్వాదింపవలసినయవసరములు చుట్టు నలముకొనినవి. క్షతగాత్రులై వికలాంగులయినవీరులకు విజ్ఞానులకు యుద్ధానంతరము తగినంతగా సమాదరము కలుగలేదు. అట్టివారు నానాదేశాగతు లొకచో జేరి, యల్పమతులయిన తమసహపాఠులు అవసరసమయయుద్ధసహాయ మొనర్పకయే ధనికులబిడ్డ లగుట నున్నతోద్యోగముల నోరలెత్తుకొని తిరుగుట జూచి, వారివిఁందకై కావ్యము లల్లిరి. వేదనాతప్తమయిన యాత్మలోనిబాధ ఉబికి ఉబికి కవితయయినది. ఉపచేతనలో నెన్నియో భావము లుండును. అవి యన్నిసమయములం దుబుకవు. పరిసరవాతావరణము వానిని నణచిపెట్టును. అట్లు భగ్నములయిన యవితీరనిబాధను వేరువిధమున సంపాదించును. పరిసరబాధ లధికములయినచో నవి వృతిచక్రము భిన్నముచేసికొని బయటికివచ్చును. కవి వానిని కవితలో పొదుపును. వానిని చర్వణము చేయువారును తమమనమును నిశితము చేసికొనగలరు. తమదుష్ప్రవృత్తుల మానగలరు. ఇది కవితావస్తువు. ఇట్టిది జీవనసౌధములోని యొకయభావమును లేకుండ చేయగలదు. నానావిధక్షతిచక్రమును భగ్నమొనరింపగలదు. నిరంతరబాధానుభూతిని తొలగింపగలదు. సర్వమానవజీవనరక్షాదక్షము కాగలదు. ఈదృశఫలకములయిన కావ్యగతు లెన్నియో వచ్చినవి. అవియు నాంధ్రకవియువకులదృష్టి నాకర్షించినవగుట యథాతథముగా దిగినవి. అయితే తగినంతవ్యుత్పత్తిబలము లేక రచయిత లుద్యమించినందున వారి కృతు లంతగా లోకాదరపాత్రములు కాలేదు. మానవులకు జీవితావసరము

లధికములయినవి. అవియన్నియు నార్థికదౌర్గత్యమున సులభములు కాలేదు. అట్టి వారును రచయిత లయినారు. వా రేమి చేయుదురు? తమకావ్యములందు జీవనమునుండి పలాయనము నుద్బోధించిరి. ఒకవిద్యార్థి శ్రమించి చదివియు పరీక్షలో నుత్తీర్ణుడు కాలేదు. వేరుమార్గములన్నియు బాధకములయినవి. ఆతడు రైలు క్రిందపడినాడు. జగత్పరిసరబాధలుపోవునని మరణపూర్వతనభావన. పోయినవా? ఏమో? మొత్తము ఈజీవితము ముగించి పోవుటయ యాతనియుద్దేశము. ఆత్మహనన మాత్మత్యాగమని వానికి గలిగిన యుద్బోధ. ఆతనికి నరకచింతనము లేనందున బిభీషికలకు బెదరడు. ఆతని నుద్బోధించిన కవిత లావిధమున నతని చేసినవి. మరియొకడు జీవనానందము పొందుటకు కవిత వ్రాసినాడు. తన కావ్యము లోకారాధనమున కుపయోగింపవలయు నని యొకనిభావము. నా కావ్య మాత్మానుభూతి నిచ్చిన జాలు నని మరియొకనిభావ. స్థితిసిద్ధములను నాకావ్యము సంపాదింపవలయునని అస్యునియభిలాష. అతీతానందమునకే సాహిత్య మని యొకసాహిత్యయోగి వచనము. కేవలము వినోదమునకని వైనోదకుని కావ్యగవి. సృజనావశ్యకతగుర్తించి తత్పూర్తికై కావ్యము రచింపవలయు నని యాశావాదికవికావ్యబోధ. ఇట్లనేకములు కావ్యగతులు గబగబా వచ్చినవి. నాకావ్య మిట్టిది. అని యొకవిపలుకలేదు. లోకము స్తవ్యస్త మయినది. ఏభావప్రభావితుడై కవి యట్టిరచనము చేసినాడో తానుముందుగా తెలియజెప్పినచో సమకాలసహృదయసమాదర మధికముగ గలిగెడిది. ఈ నానాభేదభిన్నములు గుమికూడిరాగా లోక ముక్కిరిబిక్కిరియయినది.

ఇదియేసమయమున రాజకీయరంగమునందు మార్పులు వచ్చినవి. రాష్ట్రీయరాజకీయములు దేశీయరాజకీయానుసారమున మార్పుపొందుట, అవి దేశీయానుసారులు కావలసి వచ్చుట, అవియు నంతర్జాతీయ రాజకీయముల ననుసరించి సర్దుకొనవలసినవగుట సంభవించినది. ఈయలజడి తెలుగుకవులకావ్యములందు బింబించినది. లోక మాదరించుటయా? మానుటయా? కావుననే యాదరానాదరములు తప్పనిసరిగావచ్చినవి. నాటకకళాపరిషత్తు కవికావ్యముల కాదర్శము. రేడియో ప్రసార మాలంబనము. ఒక్కుమ్మడి ఇట్టివి సంఘటిల్లినవి. కావ్యగతు లింకను చిత్రములయినవి. కాంగ్రెసు విప్లవ మాచరించినది. విప్లవానుయాయులకు విజ్ఞానము ప్రసాదించినది కాదు. అది యొకలోటు. ఒకచోట ఇది యదనుగా లోకము వేడి కలిగిన దయినది. అంతర్జాతీయ మయిన విశాలదృష్టితో కావ్యగతి యుండవలయునన్న యుద్బోధమును కమ్యూనిష్టు లందుకొనినారు. కావ్యములు పాక్షికము లయినచో వర్గకలహములు తప్పవు. సర్వవర్గపుష్టి కలుగుటకు విశాలవిశ్వంభరాదర్శములను కవితలోకి దింపవలయును. ఈదృష్టితో అభ్యుదయసాహిత్యవాదులయుపక్రమము. యువకులయుపక్రమములో అయువకులు క్రమమును సంభావింపనందున ఆయుద్యమ మటు ఇటు తిరుగుచున్నది.

అంతర్జాతీయపరిస్థితులు జాతీయపరిస్థితులు రాష్ట్రీయపరిస్థితులు వర్గపరిస్థితులు ఆత్మీయపరిస్థితులును కవులను కలవరపెట్టుచున్నవి. ఇది తలచి అది పట్టును. అది వలచి ఇది విలుచును.

అంతట అవ్యవస్థకలిగినది. ఏమిచేయవలయును? ఈవిచికిత్సలో కావ్యరచనము వచ్చుచున్నది. సర్వసంశయములు తొలగిననే కావ్యగతి చక్కబడును. అందుకై జాతిధర్మములు కులధర్మము లవసరములు. ఉత్పన్నజాతికులధర్మ లేమియుచేయజాలవు. తెలుగుకవులు కేవలము తెలుగుదనము కావ్యములం దెన్నడుచూపిరో సంస్కృతసాహితీ ప్రభావితమయిన తెలుగు తీపిదనమును రుచిచూపి విభవ మాపాదించినారు. ప్రాకృతసంబంధరుధురతామహత్త నందించినారు. ప్రాంతీయభాషావిశేషము మెదుపుకొనినారు. భారతభాషాసాహిత్యగంధము పట్టించినారు. పాశ్చాత్యభాషాగతులను సాహితీప్రగతులను నిబంధించినారు. ఎన్నిటినైన నిబంధింపవచ్చును. కా దనరు. ఒకటొకటి రాగా పూర్వతన మొకటొకటి యేల విడువ వలయును? అప్పు డెట్లుపుష్టి? సనాతనములధునాతనములన్నియు మిళనముపొందునట్లు చేయ రాదో? ఇది కొందరివేదన. ప్రాచ్యపాశ్చాత్య సాహితీసామరస్య మందింత మని కొందరి తొందర. ఇప్పటికిని తెలుగుమండలమున అక్షరముఖులు నూటికి పదునైదుగురు. ఇందు నలుగురు ఆంగ్లరసికులు. అందొకడు సాహితీతత్పరుడు. వేయికి నలుగురు తెలుగుసాహితీ ప్రియులు. లక్షకయిదుగురుసంస్కృతాభిమానులు. వీరిలోనొకడు సర్వసాహితీ సంపాదనవ్యగ్రచిత్తుడు. ఈవిధాన మెందఱ కందును ?ఇట్లొకసాహితీనియంతృత వెలువడు నేమి? కనుక నే భారతజాతిని తజ్జాతీయసాహితీసంస్కృతితో చక్కదిద్దుట ప్రథమకర్తవ్యము. అందుకై సర్వవిధానములను జాతీయతానుకూలముగా సరిదిద్దుట యత్యంత మవసర మని కొందరి విధులయూహ. ఇట్టి కావ్యగతులు తల లూపించుచు తల లెత్తుచున్నవి. ఇంతదనుక తెనుగు నాటభారతభూమిని అవునని కాదని వెలువడిన కావ్యగతుల నిట్లు సంఖ్యానింపవచ్చును.

1. రసకవిత
2. భావకవిత
3. అలంకార కవిత
4. రీతి కవిత
5. బంధచ్ఛాయా కవిత
6. గుణమయ కవిత
7. కథా కవిత
8. వర్ణన కవిత
9. శాస్త్ర కవిత
10. వేదాంత కవిత
11. నగ్న కవిత
12. భగ్న కవిత
13. లగ్న కవిత
14. మగ్న కవిత
15. ఉద్విగ్న కవిత
16. వ్యక్తి వాదము
17. సమష్టి వాదము
18. ఛాయా వాదము
19. రహస్య వాదము
20. గాంధి వాదము
21. రవీంద్ర వాదము
22. ఫ్రాంజీ వాదము
23. స్వచ్ఛంద వాదము
24. ప్రతీక వాదము
25. ప్రభావ వాదము
26. అభివ్యంజన వాదము
27. సమాజ వాదము
28. ప్రగతి వాదము

29. రాష్ట్రీయ వాదము
30. యథార్థ వాదము
31. జడ వాదము
32. సామ్య వాదము
33. క్రాంతి వాదము
34. కలా వాదము
35. సాంఘిక వాదము
36. సాహిత్య వాదము

వీనిలో కొన్ని పునరుక్తములుగ నుండవచ్చును. కాని యవాంతరభేదము వాని కొకింత గలదు. వీనిస్వరూపము నిచట విస్పష్టము చేయుట యత్యంత మవసరము కాదు. కాని యన్నిట నొకసంవాదిసూత్ర మన్వేషించుట యవసరము. అదియు నశక్యము కాదు.

పాశ్చాత్యులు చిత్రజగమునందు సంపాదించిన నానావిధము లయిన ఇజములు కవితలో దిగినవి. అవి యన్నియు నిలుచునా నిలువవా యన్నసందేహ మేల? అవి నిలువకపోయినను వానికృతముగా లోకమున గలిగిన పరిణామము ప్రణష్టము కాదు. అవి పిలకలు వేయుచునే యుండును. కనుకనే వానిని సమన్వయింపవలసిన యవసర మున్న దనుట.

1. రొమాంటిసిజం
2. క్లాసిసిజం
3. ఐడియలిజం
4. మిస్టిసిజం
5. ఎస్కేపిజం
6. నిహిలిజం
7. రియాలిజం
8. సింబాలిజం
9. ఇంప్రెషనిజం
10. ఎక్స్ప్రెషనిజం
11. ఫార్మియిడిజం
12 సట్టియలిజం
13. డాడాయిజం
14. మార్క్సిజం
15. సోషలిజం
16. కమ్యూనిజం
17. కమ్యూనలిజం
18. ఫ్యూచరిజం
19. ఫ్యూడలిజం
20. ఫాసిజం
21. ఆపర్చ్యూనిజం
22. ఏజిటిజం
23. ఎగోటిజం

ఇట్టియిజములు కలవు. అవి యన్నియు పాశ్చాత్యదేశములందు మొలక లెత్తినవి. అన్నియు నీ నాడు లేవని యనుచున్నారు. ఉన్నవని లేవని యనువారు తమవాదభావ వ్యాప్తికి తంటాలుపడువా రనుట యవాస్తవము కాదు. ఇవి తాత్కాలికముగా సప్రయోజనము లయినవి. ఇక వానియప్రయోజకత నేలచాటుట? స్వీయోద్యమముల కవి విప్రతీపములయిన వనియా? ఇతరులు విమర్శింపగా సమాధానిరూపింపజాలక కోపతాపముల నసహానముతో జూపువారి వాదము దుర్బలముయియుండనోపు. అది సబలము యేని ప్రత్యపకారము ప్రత్యుపఘాత మవసరము కాదు. వానియందు బల మున్నవవి నిలుచును. కాకున్న కాలగర్భమున నిలువగలవు. ఊకరినితిట్టుట లుత్తబూకరింపులు. తద్ద్వారమున కలుగునది లేదు.

భారతదేశము స్వతంత్ర నవభారతదేశ మయినది. విప్లవనాదములు వేరు; విజయ గానములు వేరు. నేడు ఇక నెట్టి విప్లవవిధానమును అవసరము కాదు. ఇంకను అవసర మని ఎవరయిన భావించుచో నట్టి యకావ్యహృదయుల కవకాశ మీయరాదు. లోలోపల వేరొక పుండుపుట్టించుటకు యత్నించువారల నంతగ నుపేక్షచూచుట సముచితము. నవభారత సాహిత్యము సారస్వతేయులనందర చక్కనిసాహిత్యసంస్కృతి కలవారలనుగ జేయుట యవసరము. ఈయవసర మతిరాచరికపుభటులకు కలుగ లేదు. వారలకు సమన్వయము సంపాదించుటకు సమర్థమయిన శక్తియుక్తిజాలము లేదు. సారస్వతేయసహృదయులు సాహిత్యశాసన మవలంబించి సమన్వయరీతిగతి మతినీతులను నిర్దేశింపవలసినయవసరము కల్గినది. ఒక సాహితీలక్షణప్రస్థానము సమయావసరముగా నున్నది. దీని నందరు చేయజాలరు. ఏల చేయ జాలరు? ఇందనేకనిమిత్తములు కలవు. వాని నిచట నిర్దేశించిన లోకము సవరించుట నేర్చికొనగలదు. వెక్కిరింపువలన అవహేళనములవలన సర్దుబాటుకలుగునని పూర్వానుభవముల బట్టి యెవరు నాశింపరాదు. దూషణప్రక్రియ యెప్పుడును నిష్కృతినీయలేదు. జ్ఞాపనము విజ్ఞాపన ముపకారి. అది యిందున్నది. కావలయు ననువారు కా దనువారు భావములను పోతపోయగా వాని గ్రుచ్చియెత్తుల్లో నివి యవభాసించును.

౧. అంధయుగము వచ్చినదెపో! తదనంతర ప్రత్యుత్థానము పొందినసాహిత్యగతికి నవ్యమను నామ మేల? నవ్యత యెచ్చట నున్నది? పూర్వపరీతమునకు నవ్యమనుపే రుండుటా? ఇది "మాడరన్" అను ఆంగ్లనామమునకు మారు పేరు. ఆంగ్లవిద్యావాసన యిట్లు చేసినది. ఇది యేమి యునికి?

౨. ఇట్లు శతధా సహస్రధా వచ్చినరచనలు పామరుల కంటిరి. ఇవి పామరులకు తెలియునట్లు లేవు. పామరుల యాచారాదు లంతట లేనివి తదీయము లెట్లగును? పాశ్చాత్యులభావములు పామరులకు ఎట్లు జీర్ణములు కాగలవు?

౩. ఉన్నవానినే చెప్పి క్రొత్త యందురేమి? ఇవి యన్నియు పూర్వ మున్నవి. వారు చెప్పనివి వీరుచెప్పగలరా? అంతకన్న వ్యుత్పత్తి ప్రతిభాకుశలులు లేమి?

౪. భావకవిత్వ మట! ఏ మాపేరు. అప్పకవిత్వ మనరాదో? భావము లేనికవిత కలదా? అభావులు అహంభావులు నేమో యల్లి యీపేరు పెట్టుటా?

౫. యతి లేదు. ప్రాస లేదు. గణము లేదు. ఇది కవిత్వమా? వచనము కవిత యనుట ఎట్టిపాడి?

౬. పద్యము వ్రాయుదురు. ఆపాదము పూర్తి కాకపూర్వమే మధ్యలో......చుక్కలుంచుదు రేల? అచ్చటికి గుక్క ఆగెనా? పద్యలక్షణము పాడయిపోయెనే!

౭. గ్రామ్యభాష ప్రయోగార్హము కాదు. నింద్యము. దానియాతతోటిరచనలు ఎట్లు గ్రాహ్యములు? ప్రతిమండలభిన్నమయిన గ్రామ్యము సర్వోపకారక మగు నేమి? ఉదాత్తులుగా నుండవలసినరచయితలు గ్రామ్యరతులగు టేటి సుందరత?

౮. ఉదాత్తవస్తుబంధము కావ్యమున కళ్యాణము. నీచవస్తువు నిబంధించినచో ననుసరణీయమగు నాదర్శ ముండదు. దానివలన ఫలమును కలుగదు.

౯. ప్రసిద్ధములయిన కథల నిబంధము నీతిదాయకము ప్రవర్తకము. కేవలము కల్పిత కథల నిబంధింతురుకదా; వాని నాస్వాదించుటవలని లాభ మేమి?

౧౦. కవి తనజీవితమునే కావ్యీకరించి యిచ్చుచున్నాడు, అది మా కవసర మేమి? ఎందరో కవినామములు. ఎన్నియో కావ్యములు అవియున్నియు మా కేల?

౧౧. ధర్మదూరమయిననీతి యెంతయున్నను మాకు గ్రాహ్యము కాదు. ప్రణయ పాకము వీనియం దంతట సమాధికమగునది. అదియు విశృంఖలము; మాకు వానివితా డనమా? అచ్చుమాత్రము మెచ్చదగినది. పుట కొకపద్యము ముద్రింతురు. అందమయిన కూర్పు ఉండును. ఇదియంతయు కావ్యవాస్తవత కెట్లు మెరుగు?

౧౨. ఈకవులు పరస్పరము స్తుతించుకొందురు. ఆకర్షకవేషములు వేయుదురు. దాదాపు అందరు అవ్యుత్పత్తులు. ఏదేదో ఛందము కూర్తురు. గద్యముగా నుండుపద్యము, ఇత రులకు దెలియనిభావము. ఫక్కిలేనివర్ణనము, ఆంగ్లవంగానుకరణము, పూర్వాపుకట్టుబాట్లు లేని విశృంఖలవిహారము నానాభాషాసాంకర్యము, అపరిచితమచుంబితమయిన విషయ ఘటనము. అందును తగినయౌచిత్యముండదు. పరకీయాశృంగారమునే నిబాధింతురు. బ్రహ్మ చారికి రతిబంధము చెప్పుదురు. ఇది ధర్మద్రోహము. మా కెట్లు గ్రాహ్యము?

౧౩. లాక్షణికములయినపదములు నధికముగ బ్రయోగింతురు. అవ్యుత్పత్తికృతము అశక్తికృతమయిన గౌణపదప్రయోగము కావ్యతాపోషకమా? జుగుప్సితకథనము, విద్యా ర్థులవిచ్చలవిడితనము, కవిత్వములేని యుత్తుత్తనత్తనత్తిపద్యములు, వ్యాకరణాతిక్రమము, అశాస్త్రీయములకూర్పు, అన్యసంప్రదాయములమెప్పు కరుకులేనిసరణి, లోతుపాతులు లేనిరీతి మాకు రుచిరముకాదు.

౧౪. వీరెంతటివారు? ప్రాచీనప్రబంధముల దూషణముచేయు టేమి? వర్ణనలేని పాడిపాడి మాటలు కవితయా? అస్థిరములయిన గేయసంపద శాశ్వతవాఙ్మయత నెట్లిచ్చును? అస్ప ష్టార్థకశబ్దఘటన ఏల?

౧౫. అధికముగ విరహమును వర్ణించుట, నగ్నముగ స్థాయిభావమునేచెప్పుట, తాత్కా లికాలేశమును రూపించుట, అజాతీయభావముల కూర్చుట, అధార్మికవస్తువును నిరూ పించుట, వర్ణాశ్రమవిధుల వ్యతిరేకించుట, రాజధర్మముల అననుపాలనము, ప్రజలలో విప్ల వోత్పాదనము, మర్యాదాతిక్రమణము. కవితావిషయములు కాదగని మామూలువిషయ ములకూర్చుట, చప్పుచప్పనచప్పు ఇజములఘటనము, మనశాస్త్రముల సంబంధములేక పోవుట, పాశ్చాత్యశాస్త్రముల కలయికలు, భౌతికవాదములకు ప్రాముఖ్యమిచ్చుట, నాస్తిక వాదమును నిరూపించుట, అవైదికబౌద్ధధర్మాసక్తి గ్రథించుట, వర్ణసాంకర్యమునకు దోహద మిచ్చురీతి లోల్లాయిపదములు, విధవానురాగము వీనిచే నీకవితలు త్యక్తనీయము.

౧౬. విభావాదుల పుష్టి లేదు. గుణాలంకారముల సమాదరము లేదు. కవిసమయముల స్వీకృతి లేదు. వలదన్న దోషములు లేకపోవుట లేదు. అష్టాదశవర్ణనలు లేవు. శయ్యాపాకములు సరిగా లేవు. రీతివృత్తులు లేవు. అమ్లానరసభావములు లేవు, ఏవియు లేవు. సర్వాభావము సంతోషమీయదు.

౧౭. నాటికలు రచించిరి కదా! పేరు చెడినది. నాటికాలక్షణ మేమియున్నది? రూపకనియమములు లేని రూపకముల నాదరించుట యెట్లు! అభారతీయలక్షణము కలదందురా? దాననేమిగొప్ప? అన్నియు లక్షణరహితరచనలు. సమాదరింపుమని యడుగు టేల? గుణము లున్న వికసించును. శపథమున నివారితములగునా?

౧౮. దేవకథలకు పచ్చిగిలి నిరూపించుటా! రామ! రామ! సిద్ధరసప్రఖ్యములకు అన్యథీకరణ ముచితమా? సీత రావణుని ప్రేమించినదట! సావిత్రి యముని కామించెనట! పురాణకథల కపార్థకతన మేల? మేము మెచ్చము, ఏల మెచ్చవలయును?

ఈవిధానమున నవ్యసాహిత్యము నభిమానింపనివారున్నారు. తత్త్వభేదమున కారణభేదమును వా రాశ్రయించినారు. వారిపక్షమున నిట్టిహేతువు లెన్నియో కలవు. మెచ్చుకోలు చూపువారలలో నానాప్రకృతు లున్నట్లు చూపలేనివారలలోఁగూడ వివిధప్రకృతు లున్నారు. మరికొంద రీవిధమున ననాదరము చూపుదురు.

౧౯. పాశ్చాత్యసంస్కృతినిబంధనము వీనిలో నున్నది. అది వారి ప్రభుత్వవిధానసుస్థిరతా సంపాదనకే సమర్థము. పాశ్చాత్యులను సమాదరింపజేయుటకే యీయత్నము. ఒక వర్గము వారలకు ప్రాముఖ్యమిచ్చి రచించు టేల? ఒకప్పుడు ధనికులప్రాముఖ్యమున్నదని యట్లు సంభావితమయిన సాహిత్యమును దూయబట్టిరి కదా! ఇప్పుడు తమవిధానానుకూలము చేసికొనుటకు పామరు లనబడువారివర్గమునే ప్రముఖము చేసి యితరులను కించపఱచుట పాడియేమి? నేటిదనుకవచ్చిన మహాసాహిత్యప్రస్థానములో నొకవిశిష్టమగు నాస్వాద మొక వర్గము వారల కున్నది. దాని నీనాఁడీసాహిత్యమున బోల్తావేయుట కెవ రంగీకరింతురు? తమ దుశ్చేష్టలవలన సంఘములో పలుకుబడని నశింపజేసికొనినవ్యక్తులు ఏదేనివిధమున మఱల పలుకుబడిని సంపాదించుట కిట్లు యత్నించుట నెవరు పసిపట్టజాలరు? విలాసవినోదములందు కానలేక మానసికతృష్ణ తీర్చికొనలేక యీ కాపేయచేష్ట లేల? ఏమో గూఢపురాణి చేసి యొకయుద్యమమును లేవనెత్తుట కీకుంతత్రమును పన్నుదురా? మోసగింపుబ్రతుకు సాహితీరంగమునఁగూడ జూపుదురా?

౨౦. మేము మెచ్చజాలము, మెచ్చనీయము, మెచ్చిన మాసంఘములకు సంపాదించుకొనినగొప్ప పోవును. మా కాంగ్రేయపాలనమున నొకసుఖావస్థ కలిగినది. వారిని మేము ప్రేమింతము. ఇవి యాప్రేమను తగ్గించును. మాయుద్యోగరీతినీతుల కివి హానికరములు. మా పైయుద్యోగులు మాబంధువులు వీనిమెచ్చుట నలవఱచుకొనలేదు. మేమును అంతియ. ఇన్నాళ్లు మేము మెచ్చలేదు. ఈనాడు మెచ్చిన మమ్మెవరైన నేమైన నందురు.

ఆకస్మికముగా నిపుడు మెచ్చుట మాకు లోటు. చిన్నతనముకాదో ? మేము పురుషులము. మాకు వ్యతిరేకముగా స్త్రీలస్వాతంత్ర్యము నిరారు నిరూపించితిరి ? మేమెట్లు సహింప గలము ? మమ్ము హర్షింపుడందురు. ఇది బలవంతముకదా ! మమ్మే వెక్కిరించి మాదృశులు పరిహసించి హర్షింపుడనుట మా కవమానము. ఇది యంతయు కుజ్జుజట్టువారి దుండగీడు తనము కలిసిన దుర్లలితసాహిత్యము.

కావ్యగతివిధానము నీవిధమున మెచ్చనివారును కలరు. మెచ్చనివారిని తూకము వేయగా వారు మెచ్చలేకపోవుటకు కొన్ని కారణములను కొంద రూహించి నిరూపించు చున్నారు. మెచ్చుట కొకసహృదయత కావలయును. నానాసంస్కారసంకలనమవసరము. హృదయదర్పణ మమలినముగా నుండవలయును. సాహిత్యాత్మ కొందరిలో చచ్చిపోయినది. వా రానందద్వేషులు. స్వాదుపరాఙ్ముఖులు. కొందరకు భావదాస్యము పట్టినది. అది యొక చిలుము. ఎంతతోమినను పోదు. కొందరు ప్రజ్ఞాహీనుల్లు, ప్రతిభాదరిద్రులు. కేవలము వారు వృత్తిప్రవృత్తిదాసులు. వారలకు మనస్సుమాత్రము పొంగినది, హృదయము కృశించినది. తమయుద్యోగము లూడునని కొందరిభయము వారు లోలోన మెచ్చగలరు, అభినందింప గలరు. కాని పాపము జీవనగతి యట్లుచేసినది. ఎంద రిట్లు కాలేదు ? తమకు సాహిత్యరుచి లేదనుకొందురని కొందరు మెచ్చిన ట్లభినయింతురు. వారసహృదయాభాసులు. వారివలన నపకారమధికము. అస్తు.

ఇంతగా పెంపుపొందినకావ్యగతిలో వైశాల్య మున్నదా? లోతు గలదా? యనియు విచికిత్సింతురు. ఈసాహిత్యవిధానమందుగల కొన్నివిశిష్టాంశముల నిట్లు గుర్తింపవచ్చును.

1. రాచరికపు సంబంధము
2. దేశీయోద్యమము
3. స్వాతంత్ర్యకాంక్ష
4. సర్వవర్గ వివేకము
5. ప్రభుత్వముతో పోరాటము
6. భావదాస్యము పోవుట
7. భారతదేశాభిమానము
8. ఆంధ్రతేజోభావన
9. భావదీప్తి ప్రయత్నము
10. ప్రాంతీయ సాహితీపరిచయము
11. ఆంగ్లసారస్వత సంబంధము
12. బ్రహ్మసమాజభావ బంధము
13. సంఘ సంస్కరణవిధి
14. ఏకజాతి నిర్మాణయత్నము
15. విశ్రాంతి జననము
16. విజ్ఞానవివృద్ధి
17. నవీన సభ్యతా ప్రవాహము
18. వివిధ ప్రణయవిలాసములు
19. దారిద్ర్యవేదనా వైవశ్యము
20. బౌద్ధసాహిత్యాభి మానము
21. అహింసోద్యమము
22. విశ్వప్రేమచూపవలయునన్న దృష్టి
23. అంతశ్చేతనభావములు
24. ఏకదేశవిశేష విస్తరణము
25. ఉపేక్షితాంశ ప్రతిపాదనము

ఇవియు నిట్టివియు నీనాటికావ్యగతులు. అన్నిటినందరు మెచ్చవలయునన్న నియమ మెరికిని లేదు. లోకమున స్వభావసిద్ధముగా నెంతగనో భేదమున్నది. నానావిధభిన్నతత్వము

లందు అభిన్నతత్త్వము నవగాహనముచేసికొనుట నుగ్రహాలతో నేర్చిన భారతీయజాతి మెచ్చలేకపోదు. ఒక్కొకరికొక్కొక యాస్వాదకోశ ముండును. ఎవరి కేకోశము వికసించిన వా రాయా యాస్వాదమొనర్తురు. ఈద్వావింశద్భేదములు కావ్యగతులలో కన్పడు చున్నవి. ఇంకను ఉండవచ్చును. ఇంకను రావచ్చును.

1. గేయములు పాటలు
2. ముక్తకకావ్యరీతులు
3. వస్తు ప్రధానత
4. నానావిధనవలలు
5. కథలు ఆఖ్యాయికలు
6. నాటికలు గల్పికలు
7. గద్యవాఙ్మయ విస్తృతి
8. విమర్శ విస్తరణము
9. పద్యనాటికలు
10. గద్యరూపకములు
11. గేయనాటికలు
12. చిన్నకావ్యములు
13. క్రొత్తఛందస్సులు
14. అన్యభాషీయచ్ఛందము
15. లక్షణములో మార్పు
16. ఫలములో మార్పు
17. అన్యభాషాసంకీర్ణకలిత
18. నానావిషయ విన్యాసము
19. ఉక్తివక్రతా విశేషము
20. వ్యావహారికభాషాగతి
21. నాట్యాలంకారములు
22. కావ్యలక్షణములు

నేడు కన్పడుసర్వవిధకావ్యగతులను సమర్థింపవలసినయవసరము లేదు. లేకనుపోలేదు. వీని నభిమానింపనివారిని తెగడుట పాడిగాదు. అభిమానించువారిని భూషించుటయు నుచితముకాదు. హేతువులు వారలకు వీరలకు గలవు. నేటిసాహిత్యాభిమాను లొక తీరున లేరు. వారియందును స్వభావభిన్నత కన్పడుచున్నది.

1. ప్రతిక్షణనవ్యతను గుర్తించువారు
2. సాహితీభావనచేయువారు
3. సమకాలోద్యమ ప్రభావితులు
4. ప్రాంతీయభాషాధ్యేతలు
5. ఆంగ్లభాషారాధకులు
6. ఆంధ్ర శ్రీప్రత్యుజ్జీవనకాంక్షులు
7. స్వస్పందసుందరులు
8. ప్రత్యభిజ్ఞాదర్శనవిదులు
9. మధురభావభావకులు
10. జాతీయోద్యమాభిమానులు
11. కరుణార్ద్రమనస్కులు
12. సర్వస్వాతంత్ర్యకాంక్షులు
13. మనోవిజ్ఞాననిపుణులు
14. అంతశ్చేతనావిదులు
15. జాతీయాంతర్జాతీయభావులు
16. నాట్యమర్యాదాభిజ్ఞులు

ఇన్నివిధములనున్న ఈకావ్యగతులలో నెన్నిసార్వదేశికములు సార్వకాలికములు సార్వవర్గికములు కాగలవనునది కావ్యమీమాంస యొనర్చువారి ప్రశ్న. ఒకవిధానవర్గము లందు విజ్ఞానచైతన్యముకలిగినపుడు క్రమక్రమముగా సాహిత్యవిభక్తి ననుసరించి సముదాత్తకవితను నిలువరింపవచ్చును. ప్రతిక్షేపము పరస్పరముచేసికొనుట నవభారతమున తగనిపని. పామరులకును మనోవికాసము కలుగురీతిని యత్నించుట సముచితము. అందు

లకై మధ్యమవర్గమువా రుద్యమింపవలయును. యంత్రయుగ మెంతగా ప్రభావితమయి నను కృషిసభ్యత హతము కారాదు. కృషియంత్రసభ్యతలసమన్వయవిధానమున భారత భవిష్య మున్నది. దాని ననుసరించియే కవితాభవిష్య ముండును. ఇందులకై సర్వపరిషత్తు లేక ముఖాభ్యుదయకృషి యొనర్పవలసియున్నది. అనేకములం దేకత్వ మనుసంధాన మొనర్చిన మన కిది యశక్యక్రియ కాదు. పారిషదులపరిపోషణ ముత్తమగ్రంథముల నిర్మా ణింపజేయగలదు. అం దీనాడు నియమ మావశ్యకము. నియమప్రతిక్షేప మొనర్చుట యక్కర లేదు. లక్ష్యానుసారమున లక్షణ ముండు ననుట ప్రసిద్ధమే. అయినను నవ భారతమున లక్షణానుసారముగా లక్ష్యము వెలువడినచో సుగమవిధానమున కవితా పాటవము కలుగజేయగలము. ఇది కేవలము దమనరీతి కాదు. క్రమశిక్షణమును నియం తృత యనుట అనిచ్ఛను అసహకారితను సూచించును. సులక్షణతాపాదన మీనాడు సుశకము; తదనుసారమున వికాసము సర్వవర్గానుగత మగునట్లు చేయగలము. సాహిత్య కులు కేవలము పామరరసికు లగుట పాడికాదు. సాక్షరరక్షణమును యుక్త మావశ్యక మును కాకున్న సాక్షరులు విపరీతులై రాక్షసు లగుదురు. బుద్ధిపూర్వకముగా రాక్షసుల నేల సృజింపవలయును? క్రమవిధానమున పామరాభ్యున్నతి సంపాద్యము. సర్వవిషయ ప్రతిపాదనమున వాఙ్మయప్రతిబోధ మొనర్చి పిమ్మట సారస్వతధర్మ మందించి యనంతరము సాహిత్య మాపాదింతుము కాక. అది విధానము. అత్యాశచూపుట, అసలు చూపోపక భీష్మించుట, స్వతంత్రభారతమున నుండ రాదు.

నాట్యము సాహిత్యమొకటి. చతుర్విధనాట్యము సమష్టిగా నున్నపుడు సాహిత్య ధర్మము సుసంగతము తత్తదభినయములు వేరువేరుకాగా ఆహార్యాభినయము శిల్పము చిత్రమయినది. ఆంగికాభినయము నాట్యనృత్యనృత్తరూపముపొందినది. వాచికాభి నయము సంగీతప్రవేశముపొందినది. సాత్వికాభినయము సాహిత్యావతారముపొందినది. ఒక్కొకచో నొక్కొకటి ముఖ్యమయినది. అన్యమప్రధానమయినది. పరస్పరము వ్యస్తములయినపు డీగతి కలిగినది. ఇవి సమస్తములే యగుచో గతి సుందరమగును. ఈవిషయోపన్యాసమేల? సర్వభేదములందును జనతకు బలసంపాదనము చేయుట కిది ప్రణాళిక.

చిత్రశిల్పముల నవలోకింపుడు. అందు రసభావమయవిధాన ముండనేయున్నది. అయిన నితరఫలసంధాయకములుగ నవి జగమున వ్యాపించుట యపరిచితము కాదు. పామరులకు వాని నేర్పినచో వృత్తియు కలుగును. భారతజాతీయతయు సురక్షితమగును. కృతహస్తు లయిన పామరశిల్పచిత్రముల నుదాత్తు లాదరించువిధాన మావశ్యకముకదా! ఈజర్మనుభవనములు బ్రిటనుసౌధములు భారతదేశమున వెలయు టేమి? భారతీయతో ద్యోతకశిల్పసుందరచిత్రసుభగభవనము లేల నిర్మితములు కారాదు? అప్పు డుదాత్తుల కావ్యభావనాపటిమ పామరులకును సుగ్రహమగును. అభినయానుభావనము చేయుడు. తాళలయవిధానుసారి ప్రక్రియలు పామరహృదయంగమములు. భారతీయతాళవిధులు

వాద్యవిధులు పునరున్మిషితము లయినచో నెందరో పామరులు జీవనసుఖితులై కావ్యభావన సుఖితులు కాగలరు. నాట్యములోని చారిమండలవిధానములు కరణాంగహారములు యథావిధానమున వచ్చుచో దేహబలవర్ధకరీతి యలవడును. వీరభారతజాతి యాత్మరక్షణమునకు యుద్ధనియుద్ధవిధానమునకు సమర్థమగును. ఇది యేల యుపేక్షితము కావలయును? గౌరవమర్యాదాసూచకమయిన యభినయవిలోప మంతరించి భారతీయతాద్యోతకభావభంగిమ లలవడును. సంగీతవిధులను స్పష్టసంభావన మొనర్చినచో గీతవాద్యభేదము లని భావనము చేయుచో షట్త్రింశద్భేదగతులమతుల నిల్పుచో నాపామర మాపంచమ మెంతటివిజ్ఞానమునో యందింపవచ్చును. కవితలందు నిట్లే శ్రద్ధనాధానింతుమేని యెంతయేని చేయవచ్చును. కవితావస్తువువిషయమై బాలమతులు వాదవివాదములు చెలరేగునట్లు చేయుచున్నారు. ప్రాచ్యవస్తువ నప్రాచ్యవస్తు వీకాడు కలవరపెట్టుచున్నది. భారతీయులమానసభావములను పరివర్ధింపచేయుటకు బదులుగా పరివర్తింపజేయుటను, పరిణమింపజేయుటను కొందరభిలషించుచున్నారు. పరివర్తనము ద్వివిధము. భారతీయులభావములను అభారతీయభావానుకూలముగా పరివర్తింపజేయుట యొకటి; పాశ్చాత్యసంసర్గమున మార్పుపొందిన భారతీయులభావములను స్వస్థిత్యనుకూలముగా పరివర్తింపజేయుట మఱియొకటి. నేనందును కదా భారతీయులు భారతీయులే కావలయు నని! అప్పుడే జాతీయత సురక్షితమగును. వైదికసాహిత్యమునుండి నేటిదనుక వచ్చినసాహిత్యమువఱకు దేనిని మేము విడువము. అన్నియు మాకవసరము. సనాతనముల నధునాతనములతో సమన్వయించి యనుపానచిత్రతతో సేవింతుము. అది మాకావ్యగతి. ఇది సాహితీవరివస్య - విశ్వపూజ - విశ్వమయపూజ - విశ్వాతిగపూజ ఈసర్వము సాహిత్యసూత్రమహార్థము.



# ఔచిత్యమీమాంస

ఆచార్య శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
సాహితీ సమితి., M. A., M. LITT., DIP. IN GERMAN.

## ౧

ఔచిత్యరహితమైనది రాణించ దని, పరిత్యజింపదగిన దని వ్యావహారికజగత్తులో సహితము భావించుట కలదు. ఏదైన నొక క్రియను అనుచిత మనుచో ఆయాసందర్భమున నది చేయరాని దను అర్థప్రతీతి యున్నది. అనగా సందర్భానుస్యూతమై, ఆయాప్రకరణ ములతో సన్వితమైనది ఉచితవిషయము.

ఈఔచిత్యము కావ్యజగత్తులో ప్రధానముగా పాటింపబడవలె ననువాదమును దీర్ఘ ముగా క్షేమేంద్రుడు చర్చించినాడు.

ఔచిత్యము చమత్కారకారి, రసజీవితము. ఔచిత్యములేని గుణాలంకారములు నిర్జీవములు. ఉచితస్థానవిన్యాసముచే అలంకృతి నామసార్థక్యము నందును.

> "ఉచితం ప్రాహురాచార్యాః సదృశం కిల యస్య తత్,
> ఉచితస్య చ యో భావ స్తదౌచిత్యం ప్రచక్షతే."

అని ఇతని నిర్వచనము, అనగా లౌకిక జగన్నిష్ఠ విషయ సదృశమగు విషయము కావ్యలోకమును ప్రవేశించుటయే ఔచిత్యము. బాహ్యజగత్తుతో సంబంధములేని కావ్యము కావ్యము కాజాలదు. వాస్తవిక మగు అనుభూతి నాశ్రయించుకొని కావ్యము బయలుదేరవలెను. స్వప్నజగత్తును లాలించక, వాస్తవికజగత్తును సూక్ష్మముగా తరచిచూచి తత్తద్విషయములకు రూపము నాపాదింపగలవాడే కవి. అనగా దేశసంస్కృతి, కాలపరిస్థితి అనునవి కవితాభావములనుంచి వేరుచేయబడరా దను క్షేమేంద్రుని భావము యుక్తి యుతము. దీనినే Zeit-geist అని, Spirit of the Age అని యందురు.

## ౨

క్షేమేంద్రునికన్న పూర్వమే ఆనందవర్ధనుడు ఔచిత్యమీమాంసనుచేసినాడు. ధ్వనికారునిమతములో ఔచిత్యమున కింకను ఉత్తమమగు స్థాన మున్నది. కవికి ప్రతిభా వ్యుత్పత్తులు చాల అవసరము. నవనవోన్మేషశాలినియగు ప్రజ్ఞయే ప్రతిభ యని తౌతభట్ట పాదుల నిర్వచనము. వర్ణనీయవస్తు విషయనూతనోల్లేఖశాలిత్వమే ప్రతిభ యని అభినవ గుప్తునిభావము. ప్రతిభకై ఉపయోగపడు సమస్తవస్తుపౌర్వాపర్యపరిమర్శకౌశలమే వ్యుత్పత్తి యనినాడు అభినవుడు. ప్రతిభ లేకపోయినను, వ్యుత్పత్తి లేకపోయినను కావ్య మున దోషప్రతీతి యగు నని ఆనందవర్ధనుడు. ప్రతిభావంతుడైనకవివ్రాతలో ఒకానొకవేళ అవ్యుత్పత్తికృతదోషము కన్పించినను దోషముగా స్వీకరింప వీలు లే దనినాడు. కావుననే

కుమారసంభవములోని అష్టమసర్గలో దేవీసంభోగవర్ణనము అనౌచిత్యమైనను కవియొక్క ప్రతిభచే అన్వితమగుటచే దోషముకాదు. కవిప్రతిభచే వర్ణితమగుటచేత పౌర్వాపర్య పరామర్శచేయుటకు హృదయ మూరాటపడ దని అభినవునివ్యాఖ్య. అభిప్రేతమైనరసమును ప్రకాశింపజేయగలిగి రసాభివ్యక్తినిమిత్తభూతమగుటచే నిది యౌచిత్యవంత మని వీరి వాదము. అనగా అనౌచిత్య విశిష్టమైన విషయము సహితము కవిప్రతిభచే సమున్మిషత మైనచో ఉచితమగును. కాని క్రోద్దిపంక్తుల తర్వాత,

"తస్మాదభినేయార్థే చ కావ్యే యదుత్తమప్రకృతే రాజాదే రుత్తమప్రకృతిభి ర్నాయికాభిః సహ గ్రామ్య సంభోగవర్ణనం తత్పిత్రోః సంభోగవర్ణనమివ సుతరామసభ్యం. తథైవోత్తమదేవతావిషయం...... తస్మాదుత్సాహవద్రతావపి ప్రకృత్యౌచిత్య మనుసర్తవ్యం."

అనినా డానందవర్ధనుడు. తల్లిదండ్రులసంభోగమును వర్ణించుట ఎంతనీచమో ఎంతలజ్జాకరమో అదేవిధముగా ఉత్తమనాయికానాయకులగు దేవతల సంభోగవర్ణనకూడా అసహ్యమగుటచే కవి ఔచిత్యమును పాటింపక తప్పదు.

వినచో మహాకవి, మంత్రద్రష్టయగు కాళిదాసు కుమారసంభవములోని ఎనిమిదవ సర్గలో జగత్పితరులగు శివపార్వతులసంభోగమును వర్ణించుటలో అనౌచిత్యమును పోషించలేదా యనుప్రశ్న ఉదయించకపోదు. భారతీయజీవితములో వ్యక్తులకు సంఘమున విశిష్టస్థానము నొసగి విధులను హక్కులను నియమించునది వివాహము. ఈవివాహము సమావేశముతోనే పూర్తియగు నని సూత్రగ్రంథములవలన తెలియుచున్నది. రఘువంశములోని మొదటి ఎనిమిదిసర్గలలోను, శాకుంతలములోను ఈసమావేశము ధ్వనింపబడినది. కుమారసంభవమున నిది వాచ్యమైన దనవలసివచ్చును. ఈమహాకావ్యము కుమారునిసంభవమును సూచింప నుద్దేశింపబడినది. కుమారోత్పత్తిని ధ్వనింప చేయవలసినచో వివాహముతో కావ్యము పరిసమాప్తినంద వీలులేదు. సమావేశముకూడ చెప్పబడక తప్పదు. అనగా వివాహము శాకుంతలములో ననిసట్లు ప్రేయస్సుకొరకుగాక, శ్రేయఃపోషమునకు గావలెను. కావున మహాకవి జగత్పితరులసమావేశమును ధ్వనించుచు మహాకావ్యమును సప్తమముతో పూర్తిగావించినాడు. సూక్ష్మముగా పరిశీలించినచో ఎనిమిదవసర్గ మహాకవి కాళిదాసునిచే వ్రాయబడినది కా దని తేలగలదు. ఏది యెట్లున్నను సమావేశమే కావ్యార్థమైన ఎనిమిదవసర్గ అనౌచిత్యమును పోషించును. కుమారసంభవమే కావ్యార్థమైన, ఈభావము సప్తమసర్గాంతమున ధ్వనిత మగుటచే సప్తమాంతమే కాళిదాసకృతము కావుననే ఎనిమిదినుంచి సీతారామవ్యాఖ్య గలదు.

3

ఔచిత్యము వ్యంగ్యార్థము నాశ్రయించుకొనియుండునా, లేక వాచ్యముకా అను ప్రశ్నను గమనింతము. వక్తృవాచ్యనిష్ఠమైన ఔచిత్యము నాశ్రయించుకొని రసము లున్నవని ఆనందవర్ధనుని అభిప్రాయము. కవిగాని, కృతిలోని పాత్రగాని వక్త. ధ్వన్యాత్మక

మైన రసమునకుగాని, అభినేయార్థమునకుగాని అంగమైనది వాచ్యము. అనగా భావము వాచ్యమైనప్పటికిని, తద్విలక్షణమైన ధ్వన్యాత్మకముగురసమునకు దోహదముకావలెను. వాచ్యగతఔచిత్యము వాచ్యార్థనిష్ఠముకాక తదభిప్రేతరసనిష్ఠమైనది, లేనిది విచారింపబడవలెను. కుమారసంభవమున మొదటినుంచి ప్రేయశ్శ్రేయస్సులకు సంఘర్షణ కలదు. వీనిలో శ్రేయోదాయకమైన భావసన్నివేశముల ద్వారా ఆత్మసంస్కృతికలుగునని మహాకవి చెప్పుట గలదు. కాగా ఆత్మసంస్కృతినీయగల శ్రేయస్సు రసబంధోక్తమై శాంతములో పర్యవసితముకావలెను. కావున ఆనందవర్ధనుడు.

"రసబంధోక్తమౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా
రచనావిషయాపేక్షం తత్తు కించిద్విభేదవత్."

అని నాడు (3.9) రచనలేక రూపము తదంతర్లీనభావముతో అనన్యత్వమును చెందుటయేగాక, తద్భావము నుద్దేశించవలెను. అప్పుడే ఔచిత్యము రసముతో మేళనమునంది సర్వవ్యాపి కాగలదు. అనగా విభావభావానుభావ సంచార్యౌచిత్యచారువైన కథాశరీరమున రసముతో నభిన్నమై విలసిల్లునది ఔచిత్యము.

రసమునకు బహిర్భూతముకాదు ఔచిత్యము. ఔచిత్యములేనిరసము, రసములేని ఔచిత్యము లేవు. అట్లే రసములేని ధ్వని, ధ్వనిలేని రసము లేనేలేవు. కాగా రసము, ధ్వని, ఔచిత్యము అనునవి సమానజాతీయకములేగాక, అభిన్నవిషయములే యని తేలగలదు. రసముకాని ధ్వనికాని ఆత్మవికాసకారకములు; అనగా శాంతమును ప్రతీయమానముగా జేయునవి. ఈ ప్రతీతి యున్నకావ్యమును ఔచిత్యవంత మనవలెను. కావున సహృదయచక్రవర్తియగు ఆనందవర్ధనుడు

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్యకారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా."

అని పలికినాడు. రసభంగమునకు అనౌచిత్యమును మించినకారణము లేదు. ప్రసిద్ధమగు ఔచిత్యముతో అన్వితమగుటయే రసములో ముఖ్యరహస్యము. అనగా రసమునకు ఔచిత్యమే ప్రాణము. రసౌచిత్యములకు, రసధ్వనులకువలె అనన్యత్వ మున్నదని చెప్పవచ్చును. కాని ఈ ఔచిత్య మెట్టిది యనుప్రశ్న కిట సమాధానము లేదు. అనౌచిత్యమే రసభంగకారణ మనిన అర్థ మేమి? అని విచారించవలెను.

రసములు విభావానుభావవ్యభిచారిభావములనుంచి నిష్పన్నము లగునవి. ఈరసముల నాస్వాదించుటలో ఆనందమున్నదని ప్రాయోవాదము. ఇది లోకోత్తరానంద మని పెద్దలనుడి. లోకోత్తరానందము శాంత మనబడు బ్రహ్మను నిర్వచించునది. కాగా శాంతము మహారసము, సర్వరసములకు ప్రాణము. ఈశాంతము వివర్తించగా కల్గునవి శృంగారాది అష్టరసములు. శృంగారాదులు శాంతమునుంచి ఉత్పన్నములై శాంతమున పర్యవసితములు కావలెను. ఈశాంతమునే ఔచిత్య మనవచ్చునా? ఆనందవర్ధనుడు,

"వాచ్యానాం వాచకానాం చ యదౌచిత్యేన యోజనమ్
రసాదివిషయేణైతత్కర్మ ముఖ్యం మహాకవేః."

అనినాడు. ఇతివృత్తవిశేషములగు వాచ్యములను, వాచకులగుపాత్రలను రసాది విషయకమైనఔచిత్యముతో యోజించుటయే మహాకవియొక్క ముఖ్యకర్మ. ఇచ్చట రసవిషయకమైన ఔచిత్య మని ఆనందవర్ధను డుపయోగించుటలోని భావ మేమి ?

ఉపనిషద్వాక్యముల కన్నిటికి అద్వితీయబ్రహ్మలో సమన్వయమున్నట్లు, శృంగారాది రసములకు శాంతములోనే సమన్వయ మని స్థలాంతరమున నిరూపింపబడినది. శాంతమున అధ్యస్తములై శాంతమున పర్యవసితములు కాని రసములకు రస మను నామమే చెల్లదు. ఈ శాంతపర్యవసాయిత్వము లేనిచో రసములకు అనౌచిత్య మావహిల్లును. ఈశాంతమే నిగూఢమైనతత్త్వము. ఇదే రసోపనిషత్తనుచు "రసో వై సః" అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఈ రసోపనిషత్తగుశాంతమునే ఔచిత్య మని ఆనందవర్ధను డనినాడు. ఔచిత్యమునకు శాంతమునకు భేదములే దని ఆనందవర్ధనుడు చెప్పలేదుకాని వానియభిన్నతను అనుభవించినట్లు స్పష్టమే. శాంత మనబడు ఔచిత్యమే శృంగారాదులకు జీవిత మగుటచే ఔచిత్యము రసములకు బహిర్భూతము కా దని

"ఔచిత్యవతీ జీవితమితిచేత్, ఔచిత్యనిబంధనం రసభావాదిముక్త్వా నాన్య త్కించి
దస్తీతి కథేవాంతర్భాసి ముఖ్యం జీవితమిత్యభ్యుపగంతవ్యం, నతు సా."

అని లోచనలో (208) అభినవుడు పల్కినాడు.

౪

ఔచిత్యమే శాంతమనబడు మహారసము. ఈశాంతమే సర్వరసములకు వివర్తోపాదనము, సర్వరససమన్వయకారకము. జగన్నాథు డనినట్లు ఇదే భగ్నావరణయగు చైతన్యము. ఇది కేవలము ధ్వనింపబడును. కాగా భావరూపముల కనన్యత్వము సిద్ధించని ఔచిత్యప్రతీతి కలుగదు. మహాకవి యేవిధమైన భావమునైనను స్వీకరించవచ్చును. ఈభావమునే గ్రహించవలె నను నిబంధనను ఏర్పరచలేము. కాని యీభావమునకు శాంతపర్యవసానమున్నదీ లేనిదీ విచారించవలసిన విషయము. కాగా ఔచిత్యానౌచిత్యములు చాలవరకు రూపనిష్ఠములు. భావము లోకస్వభావవిరుద్ధమైనను, పూర్తిగా లౌకికవిషయములతో సంబంధము లేనిదైనను అనౌచిత్యవంతమగును. అనగా ఊహాగానము, లేక కేవలభావనపై ఆధారపడుకవిత కవిత కా దని స్పష్టముగా చెప్పవచ్చును. కావున నేటికాలపుభావకవులలో ఎంతమందికి కవి యనుపేరు చెల్లదో వివరించవలసినపని లేదు. వారిస్మరణకూడా కవితావిచారణలో పనికిరాదు.

ఏవంవిధభావనిష్ఠమగు ఔచిత్యమునకు ఉదాహరణార్థముగా కుమారసంభవమును చూతము. మహాకవి సాక్షాత్ మహాదేవుని ప్రణయగాథ వర్ణించినాడు. కాని శివపార్వతులకు మానవత్వ మధ్యారోపితమైనట్లు శివపార్వతులతపస్సులవలన సప్తర్షుల రాయబారము

వలన విశదము కాగలదు. అనగా జగత్పితరుల వివాహమును చెప్పుటలో మహాకవి వివాహ విషయమున విశదమగు భారతీయసంస్కృతిని అభివ్యక్తముచేసినాడు. భావములోని ఔచిత్యము దేశకాలముల సంస్కృతిపై నాధారపడియుండును. తనకాలమున కేంద్రీకరించిన శక్తులొనరించు కల్లోలములను సంప్రదాయసంస్కృతులతో మేళవించి అనుభవించి పలుకువాడు మహాకవి. రాష్ట్రీయత వైదికమతోద్ధరణ, స్వాతంత్ర్యదీక్ష యనునవి మహాకవి కాళిదాసు కావ్యములలో అనుస్యూతములుగా వచ్చునవి. శకహూణులపాలనకు లొంగి, దాస్యశృంఖలములలో నణపబడి, బాహ్యాభ్యంతరశక్తులను కోల్పోయిన దేశమునకు భావి ఉద్బోధన నిచ్చినాడు. అంతఃకలహములతో నరాజకమందజూచు గుప్తసామ్రాజ్యమునకు విశాఖదత్తుడు మార్గముచూపినాడు. ఈవిధముగా మహాకవులు తమదేశకాలముల నతిక్రమించక, సార్వజనీనభావములను స్వీకరించి మహాకావ్యముల నల్లినారు.

౫

భావౌచిత్యము రూపౌచిత్యములేనిది రాణించదు. రూప మనగా ఛందస్సని, పదములని అక్షరములని యెంచుట కలదు. భావము రూపము అనునవి అవినాభావసంబంధము కల్గినవేగాక అనన్యత్వము కలిగిన వనక తప్పదు. అంతేగాక భావోచితమగురూపము రూపోచితమగుభావముకూడా ఉండకతప్పదు. పశుస్వరూపమున మానవునిహావభావాదులు వసింపలేవు. అట్లే మానవాకృతిలోకూడా పశుప్రవృత్తియున్న అతనిని మానవుడనలేము. మేఘదూత వచనరూపముగాగాని, ప్రబంధశైలిలోగాని యున్న జుగుప్స కలుగకమానదు. మిల్టన్ (Milton) తన Paradise Lost ను నాటకముగా వ్రాయ తలపెట్టి, నాటకరూపము చెల్లదని నిశ్చయించి ఇతిహాసముగా వ్రాసినాడు. అట్లే బిల్హణునికథ గద్యరూపమున రాణించదు. ఇదేవిధముగా శాకుంతలమును గద్యముగా గాని ప్రబంధముగా గాని వ్రాయనెంచినవానికి కవితలో ముఖ్యముగా కావలసిన భావలావణ్యయోజన లేదని చెప్పవచ్చును. ఈతీరుననే మహాభారతమును కావ్యముగా వ్రాయనెంచినచో కావ్యత్వమే యుండదు. కాగా తిక్కన సోమయాజి విరాటపర్వమునుగాని, ఇతర పర్వములనుగాని ప్రబంధములుగా రచించి విశిష్టతను చూపించినాడనువారు కావ్యములోని భావరూపములను వేరుజేయుచున్నారనక తప్పదు. అట్లే ఆదికావ్యమైన రామాయణమును పురాణముగా పఠించువారికి గాని, పురాణముగా అనువదించువారికిగాని కావ్యమున భావరూపములు అనన్యత్వలక్షణలక్షితములని తెలియదనవలసివచ్చును. ఈ అనన్యత్వమును త్యజించుటయే అనౌచిత్యము.

కావ్యమున విశిష్టమైనది ఛందస్సు. ఛందస్సు భావముతో అన్వితమై యుండవలెను. భావమును అభివ్యక్తము చేయునదగుటచే, భావార్థము ఛందమున ఛందధ్వని భావమున కన్పడవలెను. కావుననే మహాకవి కాళిదాసు అజవిలాపమును, రతివిలాపమును వియోగినీ వృత్తములో చెప్పించినాడు. యక్షుని ఆర్తనాదము మందాక్రాంతములో నున్నది. విరహియగు యక్షుడు ప్రేయసి నుద్దేశించిన దౌత్యమునకై అచేతనము అస్థిరమునగు



ఇట్టి

మేఘునిపిలుచుటలో మందత్వము ఆక్రాంతత్వము కలవు. ఆచార్య శంకరుల సౌందర్యలహరి శిఖరిణిని పేర్కొన్నది. జగన్నాథుని లహరులు లహరులవలెనే యున్నవి. మోరోపంత్ వ్రాసిన కేకావలిలోని వృత్తము పృథ్వి. ఇదేవిధముగా వసంతతిలకా ప్రహర్షిణీ, మాలినీ మొదలగు వృత్తములు తత్తద్భావార్థసూచకములుగా బయలుదేరిన వని నిశ్చయింపవీలున్నది. అనగా అతిప్రాచీనకాలమునుంచి భావమును ధ్వనింపజేయు సాధనముగా ఛందస్సును పూర్వులు గ్రహించినా రని చెప్పవచ్చును.

"పద్మావతీ చరణచారణచక్రవర్తి" లో తృతీయరంగమున పద్మావతి అవలంబించిన ఛందము పైకి ఉబుకుచున్న భావావేగద్యోతకము, పరాశరుని భావములోని భావపరంపర అతడు గ్రహించినమంజరిలో గలదు. స్వోత్కర్ష అభిమానముకూడ నందులో నంతర్లీనములు. జయదేవుని తేటగీతిలో నిర్మలహృదయము, వినయవిధేయతలు, పవిత్రరాగము జేగీయమానములై కన్పించుచున్నవి.

౬

ఛందస్సుద్వారా, శబ్దములద్వారా భావమును అభివ్యక్తముచేయుటలో సాటిలేని మహాకవి కాళిదాసు. ఈమంజుల ప్రక్రియలో ఔచిత్యము ఏవిధముగా పోషింపబడినది తెలియబడగలదు. పార్వతీతపోవర్ణన సందర్భమున

"శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం, శుచిస్మితామధ్యగతాసుమధ్యమా
విజిత్యనేత్రప్రతి ఘాతినీం ప్రభా,మనన్యదృష్టిః సవితారమైక్షత." (5-20)

అనినాడు. పార్వతి పంచాగ్నిమధ్యమున తపస్సుచేయుచున్నదని తాత్పర్యము. ఈస్వల్పభావమును చెప్పదలచినచో మహాకవి ఒకశ్లోకము వ్రాయనక్కర లేదు. ఈయగ్నులను హవిర్భుక్కులనినాడు. అనగా మామూలు అగ్నులు కాక యజ్ఞయాగాదికముల కుపయుక్తములగు అగ్నులివి. కాని అట్టి త్రేతాగ్నులు గృహస్థాశ్రమముననే రాగలవు. అనగా పార్వతిపారమార్థికదృష్ట్యా అవివాహిత కాదను భావమును మహాకవి సూచించుచున్నాడు కావుననే ప్రథమసర్గలో సతీదేవివృత్తాంతమును చెప్పినాడు, పైగా "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" ఇత్యాదిపంక్తులలో ఆమె పూర్వజన్మను పల్కినాడు. కాగా ఈతప స్సొకదీక్ష. పునస్సమాగమార్థము ఏర్పరుపబడినది. నాల్గవ అగ్ని పార్వతియే. "యోషావావగౌతమాగ్నిః" అని ఉపనిషత్తులు పల్కుటచే (స్త్రీ)ని అగ్నిగా భావించుట సంప్రదాయసిద్ధము. ఈవిధమైన నాలుగు అగ్నులు జ్వలించుచుండగా వానిమధ్య చేరినది. "మధ్యగతా" యనుటచే ఆమె అగ్నుల నేర్పరచుకొన్నదని కాదు. ఆయగ్ను లీవరకే గలవు, వానిలోనికామె ప్రవేశించినది. ఈప్రవేశమునకై అగ్ను లింతకముందే జ్వలించితీరవలెను. కావున నాయగ్నులు గృహస్థాశ్రమమందలి మూడగ్నులు, స్త్రీయను అగ్ని. శుచిశబ్దము వైదికభాషలో అగ్నిపర్యాయవాచి. కావున అగ్నులను మాత్రమే శుచి యనక, స్త్రీయను అగ్ని పార్వతి యగుటచే ఆమె స్మితమును శుచి యనినాడు. పైగా నామె సుమధ్యమ. ఆమె

చక్కనినడుముతో కాళిదాసునకు ప్రసక్తిలేదు. సుమధ్యమా అనగా శోభిల్లు యౌవన మందున్నదని అర్థము.

ఈ విధ మగు పార్వతినేత్రప్రతిఘాతియగు ప్రభను జయించిన దని తర్వాత గలదు. ఈ ప్రభ సవితృదేవునిదని అంతమున గలదు. చివర "ఐక్షత" అను క్రియాపదము కలదు. దీనికి "దదర్శ" అని మల్లినాథునివ్యాఖ్య. ఇది అసంబద్ధమైన వ్రాత. ఇచ్చటి "ఈక్ష" శబ్దము ఉపనిషత్తులలోని "ఈక్షా" శబ్దముకాని వేరుకాదు. కాగా కామన అనుఅర్థము చెప్పుకొన వలెను. సవితను కోరిన దనగా అర్థ మేమి? అగ్నియే సవితృరూపము నందు నని అధర్వవేదము (13-3-13). రుద్రసవితలకు అగ్నికి భేదము లే దని ఋగ్వేదము (2-1-6, 7) లోను, అధర్వ వేదమున (7-81-1), తైత్తిరీయసంహితయందు (5 4-3 1), శతపథబ్రాహ్మణమున (6-1-3-10) కలదు. శతపథము (1-7-3 8; 6-1-3-7) అగ్నిరుద్రులు అభిన్నులనినట్లు, వాజసనేయిసంహిత (39-8) కూడా చెప్పుచున్నది. కావున పార్వతి సవితృదేవుని కాంక్షించిన దని మహాకవి పల్కుచో ఉద్బోధకారుడు, పారమార్థిక అగ్ని (Cosmic Fire) యగురుద్రుని కామించిన దని భావము. కావుననే బాహ్యచక్షువునకు ప్రతిఘాతము కల్గించు లౌకికాగ్నిని వదలి పార మార్థికాగ్నియగు రుద్రునియందు ఆత్మను నిలిపినది.

ఈ విధముగా నీశ్లోకమున పార్వతియొక్క భూతభవిష్యద్వర్తమానదశలను, వైదిక సంస్కృతిని పోషించి, మహాకవి ఔచిత్యమును ధ్వనింపజేసినాడు. ఇట్టియుదాహరణలు మహాకవి కాళిదాసుకృతులలో అడుగడుగునకు కలవు. ఇంకొక ఉదాహరణను చూచి కాళిదాసకవితలో భావరూపౌచిత్యము లేరీతి అభివ్యక్తములగుచున్నవో, గమనింతము. మన్మథుడు,

"తుర్యాం హరస్యాపిపినాకపాణేః, ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే"

అని బింకములుకొట్టి శివతపోభంగమునకై వచ్చినాడు. హరుని శరీరార్ధమును హరింప గలవని నారదునిదీవన గొని శివునిశుశ్రూషకై వచ్చినది పార్వతి.

"వికారహేతౌ సతి విక్రియంతే, యేషాం న చేతాంసి త ఏవ ధీరాః."

అని ప్రతిజ్ఞ చేసి శివుడు,

"స్వయం విధాతా తపసః ఫలానాం, కేనాపి కామేన తపశ్చచార."

పార్వతియొక్క బింబఫలాధరోష్ఠమున మూడుకన్నులను వ్యాపృతములనుగా జేసి కించిత్పరిలుప్తధైర్యుడైన శివుడు, వెంటనే తెప్పరిల్లుకొని మన్మథునిపై తృతీయనేత్రమును ప్రసరింపజేసినాడు. తారకవధకై శివపార్వతులపుత్రుడే దేవసేనను నడుపవలెను. తదర్థము మన్మథుని పంపిన దేవతలస్థితిని ఈ సన్నివేశమున చెప్పుచు,

"క్రోధం ప్రభో సంహర సంహరేతి, యావద్గిరః ఖే మరుతాం చరంతి
తావత్సవహ్నిర్భవనేత్రజన్మా, భస్మావశేషం మదనం చకార." (3-72)

అనినాడు. మనఃక్లేశమువలన దేవతలు "ఉపసంహరించుకొను" మని రెండుసార్లు పల్కుటయేగాక తొట్రుపాటుతో, ఏకవచనమును స్వీకరించినారు. ఆప్రార్థనలను దేవత లందరును చేయలేదు. కేవలము ఆకాశమున చరించుమరుద్గణములే చేసినవి. మరుద్గణ ములు రుద్రునిపుత్రులని వైదికసారస్వతము చెప్పుచున్నది. అనగా పుత్రులు తమతండ్రిని వేడికొనినారు. ఈమరుద్గణములవలెనే మన్మథుని భస్మముచేసిన అగ్నిసహితము శివుని నేత్రమునుండి జన్మించినది. అనగా కొందరుకుమారులు క్రోధ ముపసంహరించుకొన వలసిన దని ఒకవైపు ప్రార్థించుచుండగా, వేరొకవైపున మరొకకుమారుడు తత్ప్రతికూల క్రియను చేపట్టినాడు. ఈ అగ్నిని వహ్ని యన్నాడు. వహ్ని యనగా దేవతలకు హవిస్సు లను అందజేయునది అని అర్థము. కాగా మన్మథదహనముకూడా నొకమహాత్తరయాగమే నని, శివుడు దీనిచే నిందింపబడతగినవాడు కాడని ధ్వని. ఈవహ్ని భవునినేత్రమునుంచి పుట్టినదట. భవు డనగా లయకారకుడు కాడు, సృష్టికారకుడు. అట్టివాడే మన్మథుని సహింప లేడనగా సామాన్యులసంగతి చెప్పనక్కరలేదు.

౭

భావలావణ్యయోజనలో నభివ్యక్తమగు ఔచిత్యము వైదికకాలమునుంచి కొని యాడబడినది. లావణ్యమనగా సాహిత్యమున రూపము. కావ్యగతరూపము శబ్దాక్షరము లలో నుండును. మహాకావ్యమున శబ్దక్రమములు మార్చబడలేవు. కావుననే వేదములను అపౌరుషేయము లనినారు. అపౌరుషేయ మనగా భగవంతుడగు శుద్ధచైతన్యప్రేరితమని అర్థము, దీనిని ఆవేశ మని (Inspiration) అన్నారు. శబ్దాక్షరముల హ్రస్వదీర్ఘత్వాలు సహి తము ఔచిత్యవంతములై ఉత్తమకవితలో నుండును. శ్రీశివశంకరుల "దీపారాధన" అను సంవాదములోని ఈ క్రిందిపద్యమును గమనింపదగును.

"గాసిల్లు నీవిమల గాత్రము—లేవనేలా ? నీసన్నిధానమున నిల్చినవాడు యుష్మ
ద్దాసుండుగాని వసుధారమణుండు కాడో, వాసంతికాకుసుమపల్లరిసన్నిభాంగీ !"

అని కుంభరాణా ఝూబారాజకుమారితో నని నిజరాజకుమారిని బలవంతముగా పట్టితెచ్చినవాడు కుంభరాణా. ఆమెను వివాహముచేసికొన గోరినాడు. కాని ఆమె కిది సమ్మతముకాదు. తనప్రేమను చెప్పికొనగోరి ఆమెను సమీపించగా అతనికి గౌరవము చూప దలచి లేవబోయినది. కాని నాల్గక్షరములతో వారించినాడు. ఈనాల్గింటిలో మూడు దీర్ఘములు. భావవేగమును సూచించునవి. తృతీయపాదమందలి దీర్ఘాక్షరము లాతనిప్రతిభను, ఐశ్వర్యమును, శక్తిసామర్థ్యమును సూచించునవై యుండగా, అంత్య పాదగతహ్రస్వము లామె సౌందర్యద్యోతకములు తృతీయపాదమందలి దకార ధకారము లను ఉదాత్తస్వరమున పలికినచో నిది వ్యక్తమగును. చివరి రెండుఅక్షరములను తేల్చి పల్కవలెను.

ఏవంవిధమగు భావౌచిత్యమును ధ్వనించురూపౌచిత్యము శాకుంతలములోని దుర్వాసశాపమున గలదు.

"విచింతయంతీ యమనన్యమానసా, తపోధనం వేత్సినమాముపస్థితమ్
స్మరిష్యతిత్వాం న సబోధితోఽపిసన్, కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ" (4.1)

అని శాపము. ఇది వంశస్థవృత్తము. ఈవృత్తమున శాపము రాణించదు. శాపమునకు పరుషాక్షరములుగాని దీర్ఘసమాసములుగాని కావలెను. ఓజస్సులేని ఈశ్లోకము శాపమనిన అర్థము తెలియని శ్రోతలు నమ్మలేరు. ఐనచో మహాకవి యేల యీరీతి వ్రాసినాడు? దుర్వాసుని శాపము శాపముకాదు. లలితాక్షరములతో కూడుకొనిన ఈశ్లోకము కావ్యార్థసూచకము. ప్రేయస్సునుంచి శ్రేయస్సులోనికి శృంగారము పరిణమించివలెను. లేనిచో శృంగారమునకు రసత్వము సిద్ధించదు. అనగా ఔచిత్యముకాదు. కావున మనోముకురము నిర్మలమై ఆధ్యాత్మిక సుఖేచ్ఛ జన్మింపవలెను. ఈసుఖమునకు తృష్ణ పనికిరాదు. కాని శకుంతల చింతావీథి నున్నది. ఆత్మాఽలోకనకుబదులు అనన్యమానసముతో అన్యునిగూర్చి ఆలోచించుచున్నది. సమీపమందలి తపోవనములనే గుర్తించక శృంగారమున కొట్టుకొనిపోయినట్లు, ఇప్పు డీదుర్వాసునిగూడా గుర్తించలేదు. సరియైన శృంగారము వైరాగ్యమును జన్మింపచేయునదే కాని, తద్విపరీతముకాదు. కావున ధర్మకామములకు అనన్యత్వమును పొందింపలేనంతవరకు సుఖము లేదు. కావున శకుంతలాసౌభాగ్యమునుగూర్చి యిచ్చిన శాప మని ధ్వనింపజేయుటకై లలితశబ్దములు ప్రయోక్తములైనవి.

౭

ఈ ఔచిత్యమును పాశ్చాత్యసౌందర్యమీమాంసకులు Characteristic అందురు. అంతర్లీనమై, సమగ్రమై, స్వయంపోషకమై, వ్యక్తిత్వలక్షితమైనఔచిత్యము అభివ్యక్తముకాగా కళ యనిపించుకొనును. ఇట్టికళయే సమగ్రము, సజీవము. అనగా అంతర్లీనమై చోదకమగుభావము తనవ్యక్తిత్వము నభివ్యక్తముచేయగా కలుగు అనన్యత్వలక్షణలక్షితమైన భావలావణ్య యోజనయే ఔచిత్యము. కావున వ్యంజింపబడు భావమును ఔచిత్యమని నిర్వచింపవచ్చును.

లలితకళలలో మూలాధారమగు చైతన్యస్రవంతియే ధ్వనింపబడి అనుభూయమగుచుండును. ఈచైతన్యము తత్తద్రూపపరిచ్ఛిన్నమై భాసించుటచే కావ్యానుభూతిలో నీయావరణభగ్నము కావలెను. తదర్థము రసపరిపోషణ చేయబడుచున్నది. కాని కవికి, నాయకునకు, సహృదయునకు సమానానుభవము కలుగనిది ఈ ప్రతీతిరాదు. కాని అభినవగుప్తు డనినట్లు

"వస్తుతః కవిస్తు సామాజికతుల్య ఏవ."

కవి సామాజికునితో తుల్యానుభూతినికలిగి దానిని పరిశీలించి కావ్యరూపమున అభివ్యక్తము చేయువాడు. ఆత్రవిస్తృతివికాసములతో విశ్వజనీనభావానుభూతుల నందగలిగిననే మహాకవిత్వము సిద్ధించుటచే తత్త్వదర్శన కవికి అవసర మని ప్రాచీను లనినారు. తత్త్వదర్శన కలిగి నిష్కామముగా దానిని అభివ్యక్తముచేయుటయే లలిత కళల పరమావధి. దీనినే ఔచిత్య మనవచ్చును.

మరియొక ప్రశ్న. రసప్రతీతి బాహ్యవస్తువుల నాశ్రయించుకొని బయలు దేరుచున్నది. ఇంద్రియవేదనతో (Sensation) నుత్పన్నమైన రసము మానసికముగా ననుభూయమాన మగుచున్నది. ఈ మానసికానుభూతి ద్వారా ఆత్మవికాసము ధ్వనింపబడిననే రసత్వముగాని, కావ్యత్వముగాని సిద్ధించగలవు. శృంగారాదిరసములు శాంతమున పర్యవసితములై తత్ప్రతీతియగు ఆత్మవికాసమును ధ్వనింపగల్గుటయే ఔచిత్యలక్షణము. అట్లైనచో అనుచిత చేష్టాదులవలన హాస్యరసము నిష్పన్నమగు నని యెంచుట హాస్యాస్పదము కాదా? యనునది ప్రశ్న.

వికృతవేషాదులచేత, అనుచితచేష్టలవలన హాస్యము కలుగుననుచో హాస్యమునకు రసత్వము సిద్ధించదని వేరుగ చెప్పనక్కర లేదు. హాస్యరసముసహితము ఔచిత్యముతో అనన్యత్వము నందవలెను. కావుననే నిర్లిప్తమగు తత్త్వమున నిర్లిప్తముగా ప్రపంచించుటయే హాస్య మని స్థలాంతరమున నిర్వచించవలసివచ్చినది. హాస్యముకూడా ఔచిత్యము నాశ్రయించుకొనినరసమే. ఆత్మపరీక్ష, ఆత్మావలోకన గలహాస్యమున అనౌచిత్యము పనికిరాదు.

కావున సౌందర్యము, శాంతము, ఔచిత్యము అనునవి సాహిత్యజగత్తున పర్యాయ పదములు. వీనికే చైతన్య మని వేదాంతపారిభాషికశబ్దము. శృంగారాదిరసములు వీనిలో పర్యవసితములు కావలె నని వీనిని ధ్వనింపజేయగలిగి యుండవలెను. అనగా ఇంద్రియానుభూతి, మానసికానుభూతిని మాత్రమేగాక కావ్యము ఆత్మానుభూతి నీయజాలియుండవలెను. ఈ అనుభూతి కేవలము భావనిష్ఠము కాదు. భావరూపముల అనన్యత్వము నాశ్రయించుకొని తద్విలక్షణమైనప్రతీతియే శాంతానుభూతి, సౌందర్యప్రతీతి, చైతన్యానుభూతి, ఔచిత్యప్రతీతి. కాబట్టి ఔచిత్యమే రసోపనిషత్తు. రసమీమాంసారహస్యము ఔచిత్యమనబడు మహారసమున అనగా శాంతమున నున్నది.

---

# మాఘమహాకవి ప్రభాతవర్ణన

విద్వాన్ శతావధాని
చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి, బెజవాడ.

సంస్కృతసాహితీలోకంలో శిశుపాలవధ మహాకావ్యం చాలా ఉన్నతవర్గానికి చెందిన కావ్యంగా పరిగణింపబడుతోంది. ఈ కావ్యంలో మాఘమహాకవి కావ్యకళను ఎంతసుందరంగా చిత్రించినాడో అంత సౌందర్యాన్ని తదితర కావ్యాలలో మనం అంతగా చూడలేం. శ్రీకృష్ణమూర్తి ద్వారకానగరాన్నుండి ఇంద్రప్రస్థపట్టణానికి వెళ్లేటప్పుడు కవికిన్నీ శిశుపాలునిచేత వానిపాపఫలితాన్ని అనుభవింపజేసే ఉద్దేశ్యమే ఉత్పన్నమై ఉన్నది. శిశుపాలుడుగూడా సామాన్యమైనవ్యక్తి కాడు. అతడు శ్రీకృష్ణునికి చాలా సన్నిహిత బంధువున్నూ, మేనత్తకొడుకున్నూ, పరాక్రమవంతుడైన రాజున్నూ అయి ఉన్నాడు. అందుకని శ్రీకృష్ణుడాలోచించాడు "బలరామ ఉద్ధవులు సమ్మతించారుగాని ధర్మరాజ భీష్మాచార్యులవారితోగూడా సలహాచేసితీరాలి" అని ; ఎందులకంటే? విషయమల్లాంటిదిగనుక. ధార్మిక రాజనీతిక విద్వాంసుల వ్యక్తీకరణం దీనిలో చాలా అవసరమై ఉన్నది. దీన్ని సాధించడంద్వారా రాబోయే ఉపద్రవాలేమిన్నీ ఉండకూడదు. ఇల్లా ఆలోచించి శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి పయనమై వెళ్లేడు. మార్గం ఎంతదూరమంటారా? ద్వారక మొదలు ఢిల్లీవరకు నన్నమాట. ప్రయాణిస్తో మజిలీలుచేసుకొంటో చాలారోజులకు ఢిల్లీ చేరుకున్నాడు. అక్కడి సలహాలప్రకారం శిశుపాలుణ్ణి వధించడమే మంచిదనే నిర్ధారణముచేసికొనిన శ్రీకృష్ణమూర్తి శిశుపాలునితో ఘోరంగా యుద్ధంచేసియున్నాడు. దాని పరిణామమే మాఘమహాకవి ద్వారా శిశుపాలవధ అనేపేరుగల కావ్యంగా మూర్తిమంతమైనది. ఈసంఘటన శ్రీమహాభారతంలో చాలా అద్భుతంగా వర్ణింపబడింది. మాఘమహాకవి భారతం చక్కగా పఠించాడు కనుకనే పై సంఘటనలో అతడు సిద్ధహస్తుడైనట్లు తెలుస్తోంది. సరస్వతీప్రసన్నుడైన మాఘమహాకవి పైకథను ఒకమహాకావ్యరూపంలో చిత్రించడమేకాకుండా ఇరవై సర్గల సంపూర్ణ స్వరూపాన్నిగూడా దానికి ప్రసాదించియున్నాడు.

కావ్యంయొక్కా కవియొక్కా విషయంలో ఏమేమో గుదిగ్రుచ్చి వ్రాయదలచుకోలేదు కాని కావ్యకళాప్రపూర్ణుల ఒకపరిభాషోక్తినిమాత్రం జ్ఞాపకానికితెచ్చి మరి యితరవిషయానికి వస్తాను. ఏమంటే "కావ్యేషు మాఘః" అనికదా పెద్దలంటుంటారు? కవితావైశద్యాన్ని క్రోలవలసివస్తే మాఘాన్నే ఆస్వాదించితీరాలి. ఎందు కాస్వాదించాలీ అంటారా? అయితే వినండి!

శ్లో. ఉపమాకాళిదాసస్య భారవేరర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయోగుణాః.

కాళిదాసుని కావ్యరచనలో ఉపమాలంకారములోని నీటున్నూ - భారవి కావ్యరచనలో అర్థగౌరవమున్నూ దండికవి కావ్యరచనలో ముద్దులు మూటలుగట్టే పదాలపొందిక యున్నూ ఉండి మాఘమహాకవి కావ్యరచనలో పై మూడునొగసులున్నూ స్థిరవాసమేర్పరచుకొని ఉన్నాయని పై శ్లోకతాత్పర్యం. మాఘుని మాఘకావ్యాన్నే ఉదాహరణకు పరిగ్రహించండి! ఇందులో మీకు కాళిదాసుని ఉపమాలంకారములలోని ఆనందము లభిస్తుంది. భారవివేపు వెళ్లవలసిన అగత్యంలేదు. దీనిలోనే మీరు అతని అర్థగౌరవాన్ని కూడా అందుకుంటారు. దండికవిగారి పదలాలిత్యంలోని పాండిత్యంకూడా మాఘుని యెదుట నిరుపమానమైనదని చెప్పడానికి అవకాశం చాలదు. వీరి నలుగురిలోనూ మాఘమహాకవిని ఒకవైపునా తతిమ్మామువ్వుర్నీ వేరొకవైపునా ఉంచి తూచినట్లైతే పై శ్లోకంలోని ప్రత్యక్షరమున్నూ యథార్థమే నని మనకు నిర్ధారణఅవుతుంది.

ఇప్పటి మావ్యాసరచనకు ప్రధానోద్దేశ్యం మాఘునియొక్కగాని మాఘకావ్యం యొక్కగాని సమాలోచన కాదు. కాని కవిగారి కావ్యకళలోని నిదర్శనాలను కొన్నింటిని క్రోడీకరించడం మాత్రం అవును. అందుకని ముందుగా పై ప్రస్తావన చేయవలసివచ్చింది కనుక పాఠకులున్నూ పై శ్లోకంలోని దృష్టి నతిక్రమించకుండా మావ్యాసాన్ని పఠించవలసిందని మాకోరిక.

శ్రీకృష్ణమూర్తి రోజల్లా శ్రమపడి తన్నివారణార్థం సైన్యానికి డేరాల నిర్మాణంచేయడానికి అనుజ్ఞదయచేయించారు. అక్కడే సైన్యంకూడా నిదురిస్తోంది. శ్రీకృష్ణునికిన్ని విశ్రాంతితోపాటుగా నిద్రాభంగమున్నూ కలిగింది. ఆయన తనముకాములోనుంచి యివతలకు వచ్చినాడు. చూచీచూడడంలో తూర్పుదిక్కున ఒకవిలక్షణమైన గీతగీయబడుతున్నట్లు ఉంది. ఈదృశ్యాన్ని చూచిన శ్రీకృష్ణునిహృదయంలో ఒక ఆలోచన ప్రవహించింది. అది ప్రభాతకాలంలో అందమైనదృశ్యం. అప్పుడు కృష్ణునివలె కవి ఆలాటి అవస్థను అనుభవించి ఆప్రాతఃకాలాన్ని ఇల్లా వర్ణించియున్నాడు.

శ్లో. క్షణశయితవిబుద్ధాః కల్పయంతః ప్రయోగా, నుదధిమహతిరాజ్యే కావ్యవద్దుర్విగాహే
గహనమపరరాత్రప్రాప్తబుద్ధిప్రసాదాః, కవయఇవ మహీపాః చింతయం త్యర్థజాతమ్.

భావం: కొంతసేపు విశ్రమించి తత్కాలంలో మేల్కాంచినరాజులు కవులవలె ఉన్నారు. రాజకార్యములుకూడా కావ్యంవలెనే చాలా కఠినంగా ఉన్నాయి. మహాసముద్రంలో నిదురించిన వీరు ప్రభాతవేళలో మేల్కాంచి బుద్ధివైశద్యాన్ని అనుభవిస్తున్నారు. అనేకవిధములయిన ప్రయోగాలను కల్పిస్తూ గంభీర అర్థాలను ఆలోచించుకుంటున్నారు.

“కొంతసేపు విశ్రమించడం-మేల్కాంచడం” ఈలక్షణాలు ఉన్నతవర్గానికి చెందిన వ్యక్తులలో అందులోనూ ఏదో గొప్పవిషయాలనుగూర్చిన ఆలోచనలో నలిగిపోతోన్న వ్యక్తులలో ప్రతిబింబిస్తోఉంటాయి. కవి - రాజు - ఈయిద్దరిలోనూ సమానధర్మాలు లభి

స్తాయి. ఇరువురూ ఆలోచించేస్వభావం కలవాళ్లే ఒకనికి రాజ్యచింతయున్నా, వేరొకనికి కావ్యచింతయున్నా ఉంటుంది. ఎక్కడైతే ఆలోచన ఇల్లరికంజేస్తుంటుందో అక్కడ నిద్రకు తావు ఉండమన్నా ఉండదు. ఇది ప్రకృతిధర్మం.

రాజ్యంకూడా ఒకగొప్పసాగరంవంటిదే, అట్లే కవిత్వమున్నూ. పైశ్లోకంలో ఈ సమానధర్మాన్ని విడమరించి కవి రెండుమాటలు రచించాడు: ఒకటి—శ్రీకృష్ణమూర్తి ద్వారకకు చాలాదూరంలో తనమజిలీలోని డేరాలో ఉన్నప్పటికీ వానిబుద్ధిలో— హృదయంలో - అంతంలేనిసముద్రతరంగాలు చెలగాటలాడుతూనే ఉన్నాయి. రాజకార్యానికి సంబంధించిన ఆలోచనలు అతణ్ణి విడిచిపెట్టడంలేదు. ఇంక రెండవది—ఏపనికోసమై శ్రీకృష్ణుడు బయలుదేరినాడో అది ఎంతకఠినమైనదో అసాధ్యమైనదో కఠోరమైనదో భయంకరమైనదో అంటే రాజకీయ మనేది సర్వసామాన్యనదివంటిదికాక ఒక గొప్పసముద్రంవంటి దన్నీ దాట శక్యం కాని దనిన్నీ ప్రవేశించడానికికూడా అలవికాని దనిన్నీ [illegible] కాలంకూడా ఇన్ని లక్షణాలతోటిన్నీ ఘనీభవించి ఉంటుం దనిన్నీ బోధించ డమే [illegible] రచించడం ఎంతకష్టమో రాజ్యాన్ని నిర్వహించడంకూడా అంతకష్టమే అని ఇం[illegible]డికి తేలింది. ఇంక కష్టమంటే ఎట్టిదో తేలవలసిఉంది. కష్టమంటే రాజ్య-కవిత్వములు సంక్రమించినదిలగాయతు వాట్లయొక్క స్థిరనివేశనమునకు అనుకూలించే సాధన సంపత్తిని ఆర్జించడం పేరేనని కష్టస్వరూపాన్ని నిరూపిస్తున్నాము. దానియొక్కభావాన్ని గంభీరంగా కవి పైశ్లోక ఉత్తరార్థంలో వ్యక్తీకరించాడు.

"ఎవరైతే ప్రభాతకాలంలో మేల్కొంటారో వారు బుద్ధిశాలురు" అనేవిషయం ద్వారా కార్యకారణభావాన్ని నిరూపించాడు. అట్టి బుద్ధిశాలురైననాడే కవిగాని రాజుగాని కావ్య-రాజ్య-సముద్రాలలో ఒకతీరాన్ని కనుక్కోగల రని సారాంశము. ప్రభాత వేళలో లేవడంవలన స్వాస్థ్యము స్థైర్యము కలుగుతుంది. అవి కల్గిననాడే రాజ్యకావ్యముల లోని సమస్యలను విడమరించే ప్రకృతిసౌందర్యము సహాయంచేస్తుంది. పరిశుభ్రవాయువు శక్తివర్ధకమైనవిశ్వాసాన్ని కలిగిస్తుంది. ఇందువల్లనే మాఘకవికి ప్రభాతవేళను కావ్యసాగరంలో ప్రవేశపెట్టవలసిన అవసరం కలిగింది.

మాఘమహాకవి ప్రభాతకాలవర్ణననిమిత్తం పదకొండోసర్గను నిర్మాణంచేసియున్నాడు. ఈసర్గ అంతా ఇంచుమించుగా ప్రభాతకాలాన్నే వర్ణిస్తూవచ్చింది, అనగా మధ్యమధ్యలలో గృహమేధుల గ్రామ్యధర్మాలున్నూ నిరూపింపబడ్డాయి. సైన్యంయొక్కా గుఱ్ఱాలు ఏనుగలు వీట్లయొక్కా వర్ణనలున్నూ ప్రకృతిదృశ్యాలయొక్క వర్ణనలున్నూ కూడా ఉన్నాయి. కాని మొత్తంలో మెజారిటీమాత్రం ప్రభాతకాలానికే లభిస్తుం దని మానిర్ణయం.

తూర్పుదిక్కున ప్రకాశరేఖలు చాలా స్పష్టంగా కనిపిస్తున్నాయి. చంద్రుడు పడమటిదిక్కునకు పయనులెత్తుకుంటూ వెళ్లిపోతున్నాడు. తూర్పుదిక్కు ఈవిషయాన్ని పరిశీ

లించింది. పరిశీలిస్తోనే ఒకభావం ఆమెలో ఉదయించింది. అదేమి టంటారా? మాఘు డిల్లా చెపుతున్నాడు వినండి!

> శ్లో. ఉదయముదితదీప్తిర్యాతి యస్సంగతౌ మే, పతతినవరమిందు స్సోపరామేషగత్వా
> స్మితరుచిరివసద్యస్సాభ్యసూయం ప్రభేతి, స్ఫురతివిశదమేషా పూర్వకాష్టాంగనాయాః.

తాత్పర్యం. ఏచంద్రుడు నాసమాగమంద్వారాగా ఉదయాన్ని పొంది ప్రకాశమానుడైనాడో అతడే పశ్చిమంపై పునకుపోయి పతితుడై పోతున్నాడు.

ఈ విషయాన్ని తూర్పుదిక్కు నిందాగర్భంగా వెల్లడించింది. తాత్కాలికమైన చిరునవ్వుద్వారా వికసించిన కాంతిరూపంలో స్పష్టంగా విచ్చిపోయింది.

తూర్పుపడమరదిక్కులను అంగనలైనస్త్రీలనుగా పోల్చి స్త్రీస్వభావ సులభమైన భావాన్ని వ్యక్తీకరించడానికై ఉత్ప్రేక్షాలంకారాన్ని ఇమిడించి మాఘుకవి స్త్రీపురుషుల చరిత్రలమీద వ్రాసినాడు. తూర్పుదిక్కునకు ఆత్మచరిత్రమీదా పతివ్రతాధర్మంమీదా చాలా అభిమానం ఉన్నది. అందుచేతే "ఈచంద్రుణ్ణి చూడు! ఇతడు నాసమాగమంవల్ల ఉదయాచలాన్ని అధిష్ఠించి అభ్యుదయాన్ని పొందినాడు. నావెంటనుండి ఉదితదీప్తిలో సుసజ్జితు డైనాడు. అందుకని నాకు కోపంలేదు. వీనికీర్తికూడా వ్యాప్తిచెందింది." అని అంటున్నది.

ఈ విషయాన్ని కవి సచ్చరితము పాతివ్రత్యము దేవీపదవాచ్యలైన స్త్రీలసంబంధమున ఏమాదిరిగా పురుషులనే ఉదయాచలాన్ని అధిష్ఠిస్తున్నారో (అనగా దినదినాభ్యుదయమును పొందుతున్నవన్నమాట) ఆమాదిరిగానే పూర్వదిశాప్రతాపమువల్ల చంద్రుడు ఉదయాచలశీర్షాన్ని అధిష్ఠించి ఉదయోత్కర్షను పొందినాడనిన్నీ ప్రకాశమాను డైనాడనిన్నీ వ్యక్తీకరించినాడు.

తూర్పుదిక్కు పతివ్రత. ఆవిడ అభిప్రాయమున్నూ న్యాయమైనదే! ఏమంటారా? తూర్పుదిక్కు పెండ్లిచేసుకోవడానికి ముందు చంద్రుణ్ణి ఎవరు చూచేవారంటారు? అతగాడికి కాంతిమాత్రం ఉండేదంటారా? లేదనే చెప్పితీరాలిగదా? పూర్వదిశాసంబంధంవల్లనే చంద్రునియొక్క అస్తిత్వం ప్రజలకు తెలియనైనది, పూర్వదిశాసహవాసంవల్లనే చంద్రునిలో గుప్తశక్తిగలకిరణాలు బహిర్గతములై వానిరూపానికి ఒకఅందాన్ని తెచ్చినాయి. వానియశస్సుకూడా విరివిగా వ్యాప్తిచెందడానికి తూరుపుదిక్కే కారణం అవును గనుకనే ఆమెయూహ న్యాయమైన దని మానిర్ధారణ.

ఇట్టిపతివ్రతాశిరోమణియైనతూర్పుదిక్కు ఎప్పుడైతే చంద్రుడు తనకు పరాఙ్ముఖుడై పడమటిదిక్కునకు వేగంగా పరువెత్తుకొనిపోతోండగా వానిమొగంలో వెల్లదనంవల్ల పరస్త్రీగమనం వెల్లడికావడంమూలాన కలిగే ప్రత్యక్షఫలితం ప్రతిఫలించిందో, దానివల్ల చాలా దుఃఖాన్ని అనుభవించింది. తాను స్వయంగా ఋజువైననడవడికకల్గిఉంటూ ఉదయింపచేసుకున్న తనమగడు అన్యస్త్రీవద్దకుపోతోండగా చూచి దుఃఖపడకుండా ఏస్త్రీ ఉండగలదు?

ఉండలేదు సరికదా? అట్టిదుఃఖాన్ని వ్యక్తీకరించడంలో స్త్రీలు రెండుమార్గాలు అవలంబిస్తారు. అందొకటి వ్యభిచారపాపఫలితాన్ని భర్తకు బోధించడమున్నూ, రెండో దిఅట్టి పాపక్రియకు తా నెన్నడూ లోబడకుండా ఉండడమున్నూ; తూర్పుదిక్కు ఈ రెండు మార్గాలున్నూ అవలంబించింది. పైఅభిప్రాయాల్ని "నాసంయోగంలో ఉదయించిన చంద్రుడు పశ్చిమదిక్సతీసంయోగంకోసం అస్తాద్రిని పతితుడై పోతున్నాడు. ఇది అన్యాయం" అనేభావాలమూలంగా వ్యక్తీకరించింది.

ఇంతవిమర్శగల మాఘునిపైరచనలోని సౌందర్యంద్వారాగా వానిలోనిత్రివిధ శక్తులలో నొకటైన అర్థగౌరవశక్తి ప్రకటమగుచున్నది గదా?

ఇంకా పరిశీలించండి! ఇప్పటి కింకా ప్రభాతవేళలోని నిండువెలుఁగు రంగస్థలానికి అవతరించలేదు. మాఘుడుకూడా కాంతిమంతంకాని చంద్రునిముఖమండలాన్ని చూచి అల్లా ఉండడానికి కారణ మేమై ఉంటుందా అనే పరిశీలనలోనే తన్మయుడై ఉన్నాడు. చూడండీ! చంద్రునిమీద ఆపత్తనే పర్వతం విరిగి పడింది. అది యెల్లాఉందంటే గమనించండి!

శ్లో. సపదికుముదినీభిర్మీలితం హా! క్షపాపి, క్షయమగమదపేతాస్తారకాస్తాస్సమస్తాః
ఇతి దయితకళత్రశ్చింతయన్నంగమిందు, ర్వహతి కృశమశేషం భ్రష్టశోభం శుచేవ.

తాత్పర్యం. కలువపూవులు కాంతిసురిగినై అయ్యో! రాత్రికూడా గడిచిపోయింది. నక్షత్రాలన్నీ క్షీణించినై. ఈమాదిరిగా దుఃఖించే బంధుజాలాన్ని ప్రేమించేచంద్రుడు - క్షీణించిన శోభావిహీనమైన అంగములను ధరించియున్నాడు.

ఒకవైపున ప్రభాతంపరిణామావస్థలో ఉన్నది. మఱొకవైపున కవిఘోషిస్తున్నాడు. అయ్యో! చాలా అనర్థం సంప్రాప్తించింది. చంద్రునిపై అశనిపాతం జరిగింది. నిదానించండి! కవి నిజంచెపుతున్నాడు. చంద్రుని యుద్యానవనంలోని పువ్వులను ఈప్రాభాతకాంతి అరికట్టింది. చంద్రునిప్రియురాలైన రాత్రినికూడా అంతమొందించింది. చంద్రునిసర్వస్వమున్నూ భార్యపుత్రులు తోటలు దొడ్లు అన్నీ దొంగిలింపబడిపోయినై. ప్రభాతకాంతి జగతీతలంలో అడుగుపెట్టడంతోటే యీలక్షణాలన్నీ కలుగుతాయిగదా!

ప్రపంచంలోని జంతుజాలమంతాకూడా తమకు సంబంధించినపరివారాన్నీ ఆస్తిపాస్తులనూ ప్రేమించుతూ ఉంటుందిగదా? అల్లాగే చంద్రుడున్నూ ప్రేమించుకుంటున్నాడు. ప్రభాతవేళకు సంబంధించిన యేవస్తువునూ అతగాడు పాడుచేయడంలేదు. అవునుగదా? అల్లాంటప్పుడు చంద్రునిపై ప్రభాతవేళ యింతటినిశితకరవాలాన్నీ అశనిపాతాన్నీ ఎందుకు ప్రయోగించవలసివచ్చింది?

ఇది అత్యాచారంకాదా? ఆబీదపరివారంఅంటే యీధనికపిశాచానికి అంతలోకువా? కాని యేంచేయగలం? కావలసినపని జరిగిపోయింది.

"చంద్రసోదరా! విచారించకు! అందువల్ల ప్రయోజనంలేదు" అని ఊరడించినా వానిదుఃఖం తొలగిపోదు. వాని అవయవాలన్నీ క్షీణించినై, కాంతివిహీనాలయినై;

ఈలక్షణాలన్నీ ప్రకృతిలోకూడా అధికంగా విచారించేవారికి సంక్రమించేవే అని కవి నిరూపించాడు. మీరు ప్రభాతసమయంలోని చంద్రుణ్ణిచూచినట్లైతే కవివ్రాసిన ప్రతి అక్షరంలోని నిజమున్నూ తెలుసుకోగల్గుతారు. తెలుసుకొని చేతనధర్మరాశిని జడమైన చిత్తరువులో విలిఖించుకోగల్గుతారు. పదలాలిత్యంవిషయంలో ఇంకా మీకు సందేహం ఉండేపక్షంలో పైశ్లోకాన్ని మరోమారు ఆవృత్తిచేసి పఠించి మనస్సుకు పట్టించుకుంటే అది తీరిపోతుంది.

ఇంకా సూర్యోదయం కాలేదు. తూరుపుదిక్కున వెలుగురేకలు బాగా వికసించినై; వ్యాపించినై; ఇంతలో ఒకసంఘటన జరిగింది. ఎప్పుడైతే చంద్రుడు దుఃఖసముద్రాన్ని దాటలేక పరలోకయాత్ర సాగిస్తున్నాడో అప్పుడు అతనికి ఏకైకపుత్రికరైన ఒకకాంతి విహ్వాలురాలై తనప్రియజననియైన శ్రీమతి రజనీదేవి వెంటపరుగెడుతో అరవడం ప్రారంభించింది. ఆపిల్లయెవరు? ఆతల్లి యెవరు? ఆ అరవడం యేమిటి? అంటే యీశ్లోకం చదవండి!

> శ్లో. అరుణజలజరాజీ ముగ్ధహస్తాగ్రపాదా, బహుళమధుపమాలాకజ్జలేందీవరాక్షీ.
>
> అనుపతతివిరావైః పత్రిణాం వ్యాహరంతే, రజనిమచిరజాతా పూర్వసంధ్యాసుతేవ.

తాత్పర్యం. ఎఱ్ఱని కమలపంక్తివలె అందములైన కాళ్లుచేతులతో నున్నదిన్నీ తుమ్మెదగుంపులను కాటుకవలె నేత్రకమలములలో ధరించినదిన్నీ అప్పుడేపుట్టిన కన్యకవలె నున్నదిన్నీ అయిన పూర్వసంధ్య పక్షిసమూహముల నానావిధములైన ధ్వనుల ననుకరిస్తో తల్లియైన తేయివెంట పరువులెత్తుతున్నది.

పూర్వసంధ్య రాత్రి కుద్భవించిన ఒకకన్యక. రాత్రి మిగిలిపోయిన తనజీవితచిహ్నంగా ఈకన్యారత్నాన్ని కని లోకానికి అప్పగించి తనకష్టాన్ని గట్టునఁ బడవైచుకున్నది. కాని తనకష్టానుభవంలోనే నశించిపోయింది. కన్యకపుట్టడంతోనే భూమియొక్క కరకు స్పర్శ తగిలింది. తగలడంతోనే లోకంలో బిడ్డలు అందులోనూ ఆడబిడ్డలు ఏడ్చినట్లుగా యేడ్చింది. లోకంలో పాడుఅభిప్రాయాలతో నిండిఉన్న భయంకరమైన కూటమి నైసర్గికంగా శుద్ధహృదయంగల యీబాలికయొక్క మునిజనోచితమైన మానసమాధిమీద మొదటిసారిగా పెద్దపిడుగును రాల్చింది. బాలికయేడుస్తో ఆత్మరక్షణనిమిత్తం తిరిగి తిరిగి అరుస్తో వాపోతోంది ఎవరూ వినుపించుకోవడంలేదు. విచారిస్తో అరిచి-అరిచి కాలయాపన చేయగా చేయగా గొంతుక పూడిపోయింది. పూడిపోవడంతోనే సంసారబంధం ఈప్రాణిని గూడా తనకు సహచరిని చేసుకున్నది. ఈకన్యకయొక్కరూపంగూడా ఏమంత విలక్షణంగా లేదు. తత్కాలంలోపుట్టిన కన్యకలమాదిరిగానే ఉంది. అంటే? ఎఱ్ఱనిచేతులు కాళ్లు నీలి నేత్రములు ఇత్యాదులతోనే పరిపూర్ణంగా ఉందన్నమాట.

పూర్వసంధ్య యనగా ఉషస్సులోని యౌవనకాలమన్నమాట. ఈకాలంలో తూరుపు దిక్కున ఎఱ్ఱనినీడ వ్యాపించిఉంటుంది. యౌవనావేళ మెప్పుడైతేవస్తుందో అప్పుడు సర్వే సర్వత్ర యెఱ్ఱదనం వ్యాపిస్తుంది. అది ప్రకృతిలోనే నైసర్గికం స్వాభావికంకూడాను.

మాఘుడు కవిత్వసామగ్రి యావత్తూ పూర్వసంధ్యాకాలంలో ప్రతిబింబింపజేశాడు: అల్లాంటిసమయంలో ఎఱ్ఱకలువలు వికసించి ఉంటాయి. నల్లకలువలమీద తుమ్మెదలు బారులు గట్టి నీలిరేకలుగీస్తున్నాయి. నల్లటియాకాశమ్మీద రాత్రిలో మిగులుసమయం కొంచెంగా అంధకారమనే కాటుకలో యిమిడిపోయింది. పక్షిగణం నానావిధశబ్దధ్వనులతో కరుణ కోలాహలాన్ని చేస్తోంది. "తల్లివెంట పిల్లబడడం" అనేపోలికను పైవిశేషములవల్లనే మేము పోల్చినాము. ఏమాఘకవి తొలిసంజెను తొలికరింపజేసి దానికి నామకరణసంస్కారాన్ని కల్పించి ప్రకృతిసంఘటనలనున్నూ అన్యోన్యసంబంధబాంధవ్యములున్నూ ఎల్లాంటిసమర్థతతో పైశ్లోకంలో అంతర్గర్భితంగా ఇమిడించియున్నాడో ఆమాఘకవిలోని సామర్థ్యమును మహత్తును గూర్చి ఏమివర్ణించివ్రాయాలో మాకేమీ తెలియడం లేదు.

ఆప్రభాతసమయంలో కుఱికొంచెంవేళ గడచింతర్వాత ఆకాశం ఒకతేజోమూర్తిని ప్రసవించింది. ఆకుఱ్ఱవాడు పుట్టడంతోనే "ఉదయశిఖరిశృంగప్రాంగణేష్వేషరింగన్" (అనగా పొడుపుకొండచిటారికొమ్మలనే ముంగిలివాకిలిలో) ఆడుకుంటున్నాడు. అల్లాంటి బాలుణ్ణి "సకమలముఖహాసం వీక్షితః పద్మినీభిః" (అనగా పద్మినీదర్శితుడై నవ్వుపువ్వులు విప్పుతున్నాడు.) పద్మినులు చూచి నవ్వుతున్నాయి—"విততమృదుకరాగ్రః"(అనగా కోమలములైనచేతులు బారజాచుతున్నాడు) "శబ్దయన్త్యా వయోభిః పరిపతతిదివోంకే హేలయాబాలసూర్యః" (పక్షులకలకలారావములతో పిలువబడుతూ విలాసంగా ఆకాశపుటొడిలోనికి వచ్చిపడుతున్నాడు.) ఎవరంటారతగాడు? ఆకుఱ్ఱవాడే బాలసూర్యుడు!

చూచారా ఎటువంటిరూపకాన్ని చిత్రించినాడో కవిరాజు—? సూర్యరూపంగల బాలకుడుపుట్టినాడు. పుట్టింతరవాత స్త్రీలముఖకమలములెల్లా వికసిస్తాయో అల్లాగే పద్మినీజనంకూడా వికసించి ప్రసన్నతను ప్రదర్శించింది. పక్షిగణం లాలిపాటలుపాడి వినిపించడం ప్రారంభించింది. తల్లి వత్సలభావంతో "రావోయి! నాచిట్టితండ్రీ!" అంటోంది. కుర్రవాడు మృదులములైన పాణిపల్లవములు సారించి పాకికొంటూ నడుస్తున్నాడు. ఎవరిదగ్గిరికి! తల్లిదగ్గిరికే! ఎవరాతల్లి? ఆకాశమే! పరిశీలించండి! అక్కడున్నాడో? లేడో? ఆకుర్రవాడు!!!

ఇక్కడ కవిప్రతిభను చాటే ఇంకో విశేషంకూడా గమనింపబడుతోంది. సూర్యరాజ్యం అస్తమించడంతోటే తుమ్మెదలు చాలాకాలంనుంచి కారాగారంలో కఠినమైన శిక్షల ననుభవిస్తున్నాయి. అవ్వి సూర్యునికి పునశ్శాసనాధికారం రావడము మూలంగా జైలుతలుపులు విడజీల్చుకొని తమస్వరాజ్యంలో విలాసంగా విహరిస్తున్నాయి. ఏచంద్రుడైతే కమలములను కాంతిహీనంచేశాడో వానికి సూర్యుడు దయదలచకుండా కరాగ్రాలతో పీడనుగావించి (అదయమివకరాగ్రైరేషనిష్పీడ్యసద్యః) వానిసౌందర్యసారం యావత్తూ వెడలించి తెల్లకలువలకు దానంచేశాడు.

ఇంకో సొగసేమిటంటే "పద్మినులను నవ్వించడం" "ముంగిలివాకిలిలో పాకడం" "కర్మకిరణముల కోమలత్వం" వీట్లను వ్యాఖ్యానించి సూర్యుణ్ణి ఏకళానైపుణ్యంతో కవి బాలకుణ్ణిచేసినాడో ఆచేయడంలోని వానిశక్తి పూర్వానికిన్నీ అపరానికిన్నీ అన్యోన్యం క్షీరనీరన్యాయంగా ఔచిత్యాన్ని సన్నిహితబంధువుగా చేసుకొనేటప్పుడు వళ్లు జలదరించి కవిలోని భావనాశక్తికి లెక్కలేనన్ని జోహార్లు అప్రయత్నంగా మనస్సును హెచ్చరించి చేయించితీరుతుంది.

ఇల్లా చూపించి ఆలోచనసాగిస్తే ఎంతేనా వ్రాయవచ్చును. వీరరసప్రధానమైన యీకావ్యంలో శ్రీకృష్ణమూర్తి "చంద్ర" ద్వారాగా జరిగించిన ప్రభాతవర్ణనావ్యాజం వలన సూర్యుణ్ణి సృష్టించడంలో ఎంతకౌశల్యం కవిచూపించాడో అంతకౌశల్యం తదితరత్రా మనం ఎన్నడూ కనీ వినీకూడా ఎరగం. అందుకనే లోకంలో "కావ్యేషు మాఘః" అనేకీర్తి దిగ్దిగంతాలా వ్యాపించిం దని మామనవి.

ఓమితిశివం.

---

అభినవతిక్కన

# తెనుఁగుతీపి

శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

స్వవస్తుప్రీతి ప్రాణిజాతమున కెల్ల సహజము. కాకిబిడ్డ 'కాకికి ముద్దు' అనులోకోక్తి యీతత్త్వమునే చాటుచున్నది. పుత్త్రమిత్త్రగృహక్షేత్త్రాదులయందువలెనే అంతగాఢముగాఁ గాకపోయినను స్వస్థానవేషభాషాదులయందును అభిమానము జనుల కనివార్యముగా జనించుచున్నది.

శ్లో. స్వస్థానవేషభాషాభిరతా స్సంతో రసప్రలుబ్ధధియః,
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దవహాయ.

అన్న వాగనుశాసనోక్తియు

శ్లో. ఆంధ్రత్వ మాంధ్రభాషా చ ప్రాభాకర పరిశ్రమః,
తత్రాపి యాజుషీశాఖా నాల్పస్య తపసః ఫలమ్.

అన్న అప్పయ్యదీక్షితోక్తియు

తే. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

అన్న కృష్ణరాయల ప్రశంసయు

తే. సొబగు లెగయు తారకలరాసులకు నడుమ, దర్శనీయమౌ క్షీరపథంబుపగిది,
దేశభాషాప్రవాహ వీథికలలోన, తెనుఁగుపాయ రంజిలుఁ దేనె తొనఁకులాడ.

అన్న రాయప్రోలువారి రమణీయ కల్పనమును ఈయభిప్రాయమునే స్థిరీకరించుచున్నవి. కాఁబట్టి యాంధ్రులు ఆంధ్రభాషాగౌరవము నుగ్గడించుకొనుటయందు విశేషము లేదు. కాని మనయాంధ్రభాషను పాశ్చాత్యులును 'The Italian of the East' అని యగ్గించియున్నారు. ద్రవిడభాషలలోను భారతీయభాషలలోను మాత్రమే గాక, ప్రాచ్యభాషలన్నింటిలో మన తెనుఁగు మధురమైన (తీపిగల) భాష యని వారు వాకొనియున్నారు. పడమటివారిభాషలలో ఇటలీభాష మాధుర్యమునకు అగ్రగణ్యమఁట. అట్లే, తూర్పువారిభాషలలో (చీనా, జపాన్ మొదలగు దేశములవారి భాషలును ఇందుఁ జేరవలసియున్నవి) తెనుఁగు అట్టిదఁట. ఈయభినందనము స్వవస్తుప్రీతిప్రేరితము గానందున మనకు అత్యంతాదరణీయమైనది. ఈప్రశంస యెపుడు పుట్టినదో, ఎట్లు వెలసినదో సువిదితము కాదు. కాని ఒకపరిమాత్రము ఆంధ్రభాష కత్యుత్కటమైన గౌరవము ఒకమహాకవివలనఁ గలిగినవిషయము మనకు గ్రంథస్థముగా నున్నది. 1875-వ సంవత్సరం ప్రిన్సఫు వేల్సు (ఆవల సప్తమ ఎడ్వర్డు) మనహిందూదేశమును సందర్శింపరాఁగా, తదాగమనవర్ణనాత్మకముగాఁ గాఁబోలు దేశభాషాకవులు పద్యములు వ్రాసి, ఆంగ్లానువాదసహితముగాఁ దమదేశమునకుఁ బంపవలసినట్లు లండన్ (London) పట్టణములోని

క్రౌన్ పెర్‌ఫ్యూమరీ కంపెనివారు (Crown perfumary Company) ఒక పోటిపరీక్ష నేర్పాటుచేసిరఁట; ఆపరీక్షలో దేశభాషాకవులు పాల్గొని తమరచనల నింగ్లీషుతర్జుమాలతోఁ బంపఁగా, ఊహాపోహాలకు ఉత్తమముగా నున్నదని నిర్ణీతమైన బహుమానకరణము బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారికిఁ జెందించినట్లు వారు తమబిల్వేశ్వరీయమునఁ జెప్పుకొనియున్నారు. ఇట్లు ఆంధ్రభాషాప్రాశస్త్యమును ఆంగ్లదేశమున వెలయించిన ప్రథమకీర్తి కొక్కొండపండితునకుఁ దక్కినది. ప్రభుత్వమువారు వారికి 'మహామహోపాధ్యాయ' బిరుదము నిచ్చుటకుఁగల కారణములలో ఈయంశమును ఒక్కటి కానోపును. ఆంధ్రులయందు ఈమహాబిరుదమును బొందినవారిలో వీరే యాద్యులు. ఈయర్థమును వారు తమబిల్వేశ్వరీయములో సావష్టంభముగా నెట్లు చెప్పుకొనియున్నారో చిత్తగింపుఁడు.

సీ. 'కవికులతిలకా'ఖ్యఁ గావించితివి మొట్టమొదట నీ నరసింహముఖమున, నను
శ్రీకాళహస్తీశుచే నొనరించితి 'విద్వత్కవి'కాఖ్య వెలయఁగ నను
'పండితరాయా'ఖ్యఁ బచరించితిః జగద్గురుశంకరాచార్యవరసభ, నను
పేర్మి శ్వేతద్వీపవిద్వత్కవిపరీక్ష సత్కృతుఁ జేసితి జానుగ నను

తే. విజయనగరేశుసత్కృతి విద్వదాఢ్యుఁగా నొనర్చితి 'కవిరత్న' గరిమను నను
చేయి దొడఁగితి బిల్వేశ్వరీయకృతిని, నను నెటు లొనర్తొ తనుమధ్య! వినతసాధ్య!

ఇందలి నాల్గవపాదములోని 'శ్వేతద్వీపమే' ఆంగ్లదేశము; అచ్చటి విద్వత్కవిపరీక్షయే లండన్ క్రౌన్ పెర్‌ఫ్యూమరీ కంపెనీవారు ఏర్పఱిచిన పోటీపరీక్ష:—ఈయాశయము బిల్వేశ్వరీయములోని యీక్రిందిదుష్కరప్రాసోత్పలమాలికయు రూఢిసేయుచున్నది.

ఉ. ప్రిన్సపువేల్సు నాఁబరఁగు శ్వేతముఖాధిపురాకసాహచే
తన్సముదంచితమ్ముగను దారకహారము పంచి పెల్లదీ
విన్సభవల్ల నీ కెనసి విశ్రుతకీర్తిని సాంధ్రభావమున్
మున్సమకూర్చి తౌర గుణముల్ 'గవిరత్నమ' ధీరరత్నమా!

ఇతరభాషలతోఁ బోల్చి, తెలుఁగుమాధుర్యాతిశయము నెన్నుటకు బహుభాషాకోవిదులే యర్హులు. కొంతకుఁగొంతయైన సజాతీయతలేని రెండుభాషలలోనితీపి నొండొంటితోఁ బోల్చుటయే యసాధ్యమని నాతలంపు. ద్రవిడాదిభాషల కన్నిటికిఁ బరస్పరసంబంధమున్నదని భాషాతత్త్వకోవిదు లంగీకరించిన విషయమే. ఆవిషయముఁ బురస్కరించుకొని సహజచమత్కృతితో, కొక్కొండ వేంకటరత్నపంతులవారు వ్రాసిన యీసీసమును మరలఁ దిలకింపుఁడు.

సీ. క్రమముగ 'శ్రీమత్సకలగుణసంపన్న' యనియంన్నఁ జదివెను నఱవవాఁడు
కదఁగి 'చిరిమదుచకలకుణచంపణ్ణె' యని కన్నడమువాఁడు మొనసి 'సిరిమతు సకలగుణ'యని తోడనే 'శంపణ్ణ' యని మహారాష్ట్రుఁడు పనివడి పడిఁ
తెలఁగుచు 'శ్రీమతూసేకలగూణాసె పన్నాసె'యని యోఢ్రభావణుండు

ఆ. వెలయ 'శ్రీమతో సాకాలా గుణసాంపాన్నొ',యని యిఁ కెన్నసేల యన్యభాషలాంధ్రుఁ డున్నయట్లె యలరఁ బఠించుఁగా, యంచు హాస్యవేది యాడునాడు. (బి. ప్ర. 55)

"శ్రీమత్సకలగుణసంపన్న" యను పదావళికి వేర్వేఱుభాషలలో నెట్టివికృతి గలిగినదో చూడుఁడు. ఆంధ్రభాషలో నాపదములు ఎట్టివికారమును బొందక, స్వరూపమున నే యున్నవి. ఆంధ్రభాష, సంస్కృతమునుండి యేమైనను ఎంతైనను తీసికొనవచ్చుం గావున, సంస్కృతములోని మాధుర్యమంతయు నాంధ్రభాషసొత్తే. అది యాంధ్రభాషకు నిసర్గమైనమాధురితోఁ గలసినపుడు, ద్విగుణీకృతమై శోభిల్లుచున్నది. నిజానకు, సంస్కృతము మిక్కిలి ప్రౌఢమైనభాష దానియందు మాధుర్యమునకన్న, గాంభీర్యమే యెక్కువ. నేను ఈరెండుమాటలను ఆలంకారికమతానుసారముగాఁగాక, లోకానుసారముగా వాడుచున్నాను. ఆలంకారికులు "పృథక్పదత్వము" మాధుర్యమనియు, 'ధ్వనిమత్త' గాంభీర్యమనియు నిర్వచించియున్నారు. నేను ఇపుడు ఆపదముల నాయర్థమున వాడుటలేదు. మాధుర్యమనఁ దీపి. చంద్రాలోకకారుఁడు తేలిచినసారము:—

'మధురం మధు, పీయూషం తస్మాత్తస్మాత్కవేర్వచః' తేనె తీపఁట, అమృత మంతకంటెను కవివాక్కు అంతకంటెను తీపఁట. సంస్కృతకవులు యీమాధుర్యపరత్వమున కెన్నో యుత్కర్షములు సేయవచ్చును.

శ్లో. కాక పృచ్ఛామః సురా స్స్వర్గే, నివసామో వయం భువి
కింవా కావ్యరసః స్వాదుః, కింవా స్వాదీయసీ సుధా ?

శ్లో. సరసపరిమత్కర్ణశ్రావ్యం కవిత్వరసాయనం,
విరసమనసాం నేతుం నేహామహే శ్రవణాంతికం,
మృగమదరసం బింబోష్ఠీనాం కఠోరకుచోచితం
జఘనినికటే క్లిన్నే లింపే జ్జరన్మహిషస్య కః.

కవిత్వము రసాయనమఁట, అది కర్ణశ్రావ్యమఁట; మఱిదానిని శ్రవణాంతికమునకుం గూడఁ జేర్పఁదగనివారు 'జరన్మహిష' కల్పు లఁట!

వేఱొకకవి యేమనుచున్నాఁడో వినుఁడు:—

శ్లో. వదంతు కతిచి ద్ధఠాత్ ఖఫఛఠేతి వర్ణచ్ఛటా
ఘటః పట ఇతీతరే కటు రటంతు వాక్పాటవాత్
వయం మకుళమంజరీ గళదమందమాధ్వీఝరీ
ధురీణ పదరీతిభిః భణితిభిః ప్రమోదామహే.

వైయాకరణనైయాయికుల నితఁ డిట్లు నిరసించియున్నను, సమయముంబట్టి వారును తమవాక్కులను మృదుమధురములఁ జేసికొనఁ గలుగుదురని వేఱొకకవి:—

శ్లో. తర్కే కర్కశవక్రవాక్యగహనే యా నిష్ఠురా భారతీ
సా కావ్యే మృదులోక్తిసారసురభా స్యా దేవ మే కోమలా,
యా ప్రాయః ప్రియ విప్రయుక్తవనితా హృత్కర్తనే కర్తరీ
ప్రేమోలాలితయావతేన మృదులా సా కిం ప్రసూనావళీ.

ఇంకొకకవి - తనవాక్కు సరసమైనదే యైనయెడల, రసజ్ఞులు తనవేఁడికోలక్కఱ లేకయే దాని నాస్వాదింతు రనుట నెట్లు చమత్కరించినాఁడో యారయుఁడు:

శ్లో. వాణీ మమైవ సరసాయది రంజయత్రీ, నప్రార్థయే రసవిదా మవధానదానమ్
సాయంతనీషు మకరందవతీషు భృంగాః, కిం మల్లికాసు పరమంత్రణ మారభంతే.

ఎంతమిక్కుట మైనను, వెగటు కొలుపనిది కావ్యరస మొక్కటే యని మఱియొక్క కవి యన్నమాట యాలింపుఁడు.

శ్లో. పరిచ్ఛిన్నస్వాదోఽమృత గుడమధు క్షౌద్ర పయసాం,
కదాచి చ్చాభ్యాసా ద్భజతి నను వైరస్య మధికమ్,
ప్రియా బింబోష్ఠేవా రుచిరకవి కావ్యే ష్వనవధిః,
నవానందః కోఽపి స్ఫురతితు రసోఽసౌ నిరుపమః.

ఇట్లు వాఙ్మాధుర్యమునకుఁ బ్రియపడినసంస్కృతకవులు, దానిఁ బ్రియాధరాసవము తోను, మృగమదముతోను, మల్లికాసౌరభముతోను, అమృతముతోను, చంద్రాతపము తోను, పోల్చినశ్లోకములు నూర్లకొలఁది కలవు.

శ్లో. స్ఫారేణ సౌరభభరేణ కిమేణనాభేః, తద్గానసార మపి సార మసార మేవ
స్రక్స్వామనస్యపి నపుష్యతి సౌమనస్యం, త్రస్యందతే యది మధుద్రవ ముక్తిదేవీః.

ఇట్లు సంస్కృతకవులేగాక కావ్యామృతము నందలితీపిని తెలుఁగుకవులును ప్రశం సించి యున్నారు. 'కావ్యంబు సరసులైనకవులచెవుల కెక్కవలయు' నని తిక్కన, సుకవి సూక్తులకు శ్రవణదారణమైన 'విషమశబ్దస్నేహము' ఘటిల్లనే ఘటిల్లదని 'రమ్యాలోక' కారుఁడు. ఇట్లు నన్నయభట్టు దొరఁకొని యీనాఁటికవులవఱకు తెనుఁగుకవు లందఱును ఈతీపి కాసపడినవారే—ధ్వనిరసాలంకారాదు లెన్నియున్నను, శ్రవణప్రసాదనము కూర్పనికవిత్వము క్షణములో క్షయించి పోవును. కావ్యవిషయమున 'తీపి' యనుమాట కిదియే యర్థము. తొల్లిటి తెలుఁగుకవు లందఱుఁ బ్రాయికముగా శ్రుతిసుభగముగా వ్రాయఁ గలవారేయైనను, వారిలో విశిష్టఖ్యాతి పోతన్నతిమ్మన్నలకు లభించియుంట సువిదితము. ఈవిషయమును గొన్నియేండ్లనాఁడు 'భారతి'లోఁ బ్రకటితమైన 'కవిత్వము - పద్యరచన' అనువ్యాసమున విస్తరించియుంటంజేసి, దాని నిట సంక్షేపించుచున్నాను.

తెలుఁగుభాషకు-మధురిమ నిసర్గము, పూర్వోక్తకావ్యభాష యటుండ, లోకుల నానుడులగు 'సామెత'లలోను ఎంత తీపి కలదు! సంస్కృతలోకోక్తులను, తెనుఁగుసామెత లను పరిశీలించిచూచిన, ఈభేదము వ్యక్తమగును. తెనుఁగుసామెతలు సాధారణముగా యతిప్రాసములలో నొకదానితో ఘటితములయియే యుండును. సంస్కృతమునను యతి ప్రాసము లున్నను, అవి అక్షరమైత్రీనిరపేక్షములు కావున, తెనుఁగుసొంపు వానికి లేదు. ఈయతిప్రాసములు మనము ఎచ్చటనుండియో తెచ్చుకొన్నయవి కావనుటకు, లోకమున శతసహస్రములుగా వెలసియున్న యీసామెతలే తార్కాణము. వీటినన్నింటిఁగూర్చి ప్రక

టం

టింపవలయునను నిదానీంతనుల యుద్యమమునకు ఆంధ్రులెల్లఁ జేయూఁత నొసఁగఁగల రని నామనవి.

యతిమైత్రికి ఉదా:—అన్నచొరవే కాని, అక్షరచొరవలేదు.
ముంతెడుపాలకు ముత్యమంత చేమిరి.
కూత లార్భాటలేకాని కుప్పల్లో గింజలేదు.
పిల్లకాయలకు, పీటకోళ్లకు చలిలేదు.
బ్రాహ్మలలో చిన్నా, బెస్తలలో పెద్దా.
సాతాని జుట్టుకూ, సన్యాసి జంధ్యానకు ముడిపెట్టినట్లు.

ప్రాసమైత్రికి ఉదా:—ఆడే కాలు, పాడే నోరు ఊరకుండవు, ఏటియీతకు, లంక మేతకుసరి.
ఎంచబోతే మంచమెల్లా కంతలే, మాటలు కోటలు దాటుతవి, కాలు కడపదాటదు.
మూర్తి కొంచెము—కీర్తి విస్తారము.

తెలుఁగుశబ్దములు—అజంతములు ఏకొన్నియో తక్క నన్నియు హ్రస్వాంతములు. ఇతరభాషలలోనివి ప్రాయికముగా హలంతములు కావున, వాని ప్రక్కఁ గూర్పఁబడుపదములతో నవి సంధిం బొరయక వేఱుపడియుండును. వానికి శ్లేషము అనగా ఏకపదవ దవభాసనము లభించుట కష్టము. తెనుఁగుమార్దవమునకుఁ గలముఖ్యహేతువులలో నిది యొకటిగాఁ బరిగణింపఁదగును. అరవవారును 'త్యాగరాజు' తెలుఁగుకృతులపై నభిమానము చూపుటకు తెనుఁగునుడికారపుఁ దియ్యఁదనమే కారణ మనుట నిరవద్యము.

లయవిభాతి. చెలువగల వెన్నెలల చెలువునకు సౌరభము, గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత, నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గల్గి జగముల మిగులఁ బెంపెసఁగు, మలయపవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడుమఱికలదనఁగవచ్చుఁగదు, వెలయఁగ నీయాసుకవిపలుకులకు బెంచన్.

(కళాపూర్ణోదయము)

అభినవవాగనుశాసనులు పింగళిసూరనార్యుని యీపద్యమునట్టి పద్యము 'నభూతో నభవిష్యతి' యన్నారు. ఇందులోని 'యీసుకవి' అను పదములను 'ఈతెలుఁగు' అని మార్చినయెడల అది మనభాషకు అన్వర్థముగా సరిపోవఁగలదు.

# అన్యాపదేశములు

విద్వాన్ కావ్యతీర్థ
మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి,
కవితాసామ్రాజ్యము.

శ్లో॥ సంక్షోభం వినివార్య యే మనసి కావ్యానంద మాతన్వతే
సామాన్యేన కథాచ్ఛలేన సదస ద్యే బోధయంతి స్ఫుటమ్,
సాక్షాద్దర్శనతోఽ ప్యతీంద్రియచరాన్ యే దర్శయం త్యద్భుతం
సర్వేషాం సుకవీశ్వరాః కిము న తే నిష్కారణా బాంధవాః! (నా సంస్కృతీకరణము.)

మనోగతాభిప్రాయమును వెల్లడించుటకు కేవలవాచికమే గాక ముఖవికాసాదులు, సైఁగలు, సాంకేతికములు, ఆంగికాభినయములు, అన్యాపదేశములు మున్నగు సాధనము లనేకములు గలవు. ఇవి లోకమున నిత్యానుభవసిద్ధములు. మానవేతర మగు పశుపక్ష్యాది మూకప్రపంచ మంతయు నొక్క భాష తప్పఁ దక్కినవానితోనే వ్యవహరించుచున్నది. యజమానుని ముఖవికాసాదులను బట్టి కోపప్రసాదములను గుర్తింపఁగల జంతుజాలము గలదు. సైఁగలు, సాంకేతికములతో నడుచువ్యవహార మెంతయో చెప్పనక్కఱలేదు. ఇఁక భాషావిషయములో భావప్రకటనమున కుపకరించెడి మార్గములలో వ్యంగ్యమర్యాద అత్యుత్తమమైనది.

వ్యంగ్యము వాచ్యమునకన్న అతిశాయియై విలక్షణముగ వేఱొక మనోహరమైన భావమును వెల్లడించుచుండును. ఇదియే ధ్వని. ఇందులో చమత్కారకారిత్వమును, హృదయాహ్లాదిత్వమును ప్రధానములు. కనుకనే ధ్వనికావ్య ముత్తమశ్రేణిలోఁ బరిగణింపఁబడినది. ధ్వనిస్ఫోరకములగు వానిలో అన్యాపదేశ మనునదియు నొకటి.

ఈయన్యాపదేశ పాండిత్యము కేవలము పండితులలోనేగాక, నిరక్షరాస్యులగు సామాన్య స్త్రీ పురుషులలోఁ గూడ వ్యక్తమగుచుండును. అందులోను స్త్రీలలో నెక్కుడుగాఁ గాన్పించును. చెట్టుమీదనో గుట్టమీదనో, పిల్లమీదనో మల్లమీదనో పెట్టి వెళ్లఁగ్రక్కవలసిన భావమును అన్యాపదేశముగా వెళ్లగ్రక్కుచునే యుందురు. ఇది సహజగుణము.

ఈపాండిత్యము ప్రకటన మగుట కవసర మనునదియొకటి దొరకవలె. అది దొరకినచో విషయమును బట్టి వక్తృశ్రోతల తారతమ్యమును బురస్కరించుకొని తూఁకము కొలఁదిని ధోరణి నడుచుచుండును. ఈ ధోరణి పొడిమాటలతో నారంభించి, సామెతలలోనికి దిగి, పద్యములక్రిందికి మాఱి గ్రంథరూపము దాల్చి ప్రపంచానుభవమును బ్రకటించుచున్నది. ఈవిధముగా బయలుదేఱిన వాఙ్మయ మకారణబంధువులగు కవీశ్వరుల ప్రౌఢోక్తులతో వెలసి సహృదయహృదయాహ్లాదిత్వమును సంపాదించుచు, ప్రపంచమున

కెంత గుణపాఠము నేర్పుచున్నదో తెలియఁ గలందులకే యీ వ్యాసము. ఇందలి యనుభవములతో మనము గూడ మనజీవితమును సమన్వయించుకొని సంస్కరించుకొన వలసిన వానిని సంస్కరించుకొనుచు సంతోషింతముగాక.

౧

శ్లో. గణేశ స్తౌతి మార్జాలం స్వవాహ స్యాభిరక్షణే, మహా నపి ప్రసంగేన నీచాశ్రయ మిచ్ఛతి.

కార్యావసరమును బట్టి యెంతవాఁడుగూడ నీచుల నాశ్రయింపవలసి వచ్చును. అట్టియెడ మాననీయుఁడగువాఁడు మనసు నొచ్చుకొని అన్యాపదేశముగా గణేశుని మీఁదఁ బెట్టి తనకుఁ బట్టిన దుస్థితిని గుఱించి చింతించుచున్నాఁడు.

గణపతి పిల్లిని స్తుతించుచున్నాఁడఁట! ఎందుల కనఁగా తనవాహనమును రక్షించుకొనుటకఁట! దానిని స్తుతింపక పోయినచో అది తనవాహనము నెక్కడ మ్రింగిపోవునో యని దానిని స్తుతించుచున్నాఁడఁట! అంతటి దేవుఁడుగూడ అట్లుల చేయవలసివచ్చెఁ ననగా గొప్పవాఁడుకూడ సందర్భమును బట్టి నీచులను సేవింపవలసి వచ్చు నని సమర్థింపఁబడినది. కనుక తనస్థితిగూడ అట్లే తటస్థించిన దని ఆమాననీయుఁడు తనమనోభావము నీరూపముగా వెల్లడించెను.

౨

దారిద్ర్యమునకు కఱవు లేని యొక గృహస్థునకు కడుపునిండ పిల్లలై తాను సంపాదనపరుఁడు గాక తిండికి జరుప లేక అవస్థ పడుచుండఁగా ఇంటిలో, సిల్లా లేదో సర్దుబాటు చేయుచు నెట్లో కుటుంబయాత్ర జరుపుచుండఁగా ఈస్థితి నీశ్వరునిపైఁ బెట్టియొక కవి యిట్లని ఉపదేశించుచున్నాఁడు.

శ్లో. స్వయం పంచముఖః పుత్రౌ గజానన షడాననౌ, దిగంబరః కథం జీవే దన్నపూర్ణా నచే ద్గృహే?

ఈశ్వరుడు దిగంబరుఁడు. కట్టుకొనుటకు గుడ్డగూడ లేనివాఁడు. తిండి కేమి సంపాదించి పెట్టఁగలఁడు? పోనీ ఉన్నదైన తిని సర్దుబాటు చేసికొనుటకా? అయిదు నోళ్లవాఁడు. కొడుకులఁ జూడఁబోవుద మన్నా? ఒకఁడు గజాననుఁడు! ఏనుఁగుతిండి తినువాఁడు. ఒకఁడు షడాననుఁడు! ఆఱునోళ్లుగలవాఁడు. ఇట్టి స్థితిలో వీరిగతి యేమి కావలె? ఇంటిలో అన్నపూర్ణాదేవి యుండఁ బట్టి సరిపోయెఁ గాని లేకపోయినచో దిగంబరుఁ డెట్లు జీవించును? ఈ బీదకుటుంబి పరిస్థితిగూడ ఇట్లనే యున్న దని భావము.

3

ఒకపండితుఁడు లేక లేక పుట్టిన యేకైకపుత్రుఁడగు తనకుమారుని గురుకులవాసమునకుఁ బంపి, బహుకాలమెడఁబాసియుండి, అతఁ డుద్దండపండితుఁడై యింటికిరాఁగా మిక్కిలి సంతోషించుచు ఇంక కొడుకును జూచుకొనుచు నుండవచ్చుఁగదా యని యనుకొనుచుండ నొక మహారాజు విద్వత్సభ చేయించి అందుల కీపండితుని నాహ్వానించి తన యాస్థానములోనే నిల్పుకొనెనఁట. అప్పు డింటియొద్దనున్న తండ్రి తనస్థితిని స్మరించుకొని కుమారునితోడి యెడఁబాటునుకూర్చి చిలుకమీఁదఁ బెట్టి యిట్లని వర్ణించుచున్నాఁడు.

శ్లో. అఖిలేషు విహంగేషు హంత ! స్వచ్ఛందచారిషు,శుక ! పంజరబంధ స్తే మధురాణాం గిరాం ఫలమ్?

ఓచిలుకా! అన్ని పక్షులును స్వేచ్ఛగా సంచరించుచుండఁగా నీకు పంజరబంధమా? నీమధురవాక్కులకు ఫలమా యిది?

అనఁగా నీ వొకరికన్న మిన్నగా చదువుకొన్నందులకు నా కన్నులయెదుట నుండకుండ ఎక్కడనో ఉండుట ఆరోఁగదా యని భావము.

౪

లోకములో తమ కెట్టిలాభము లేకపోయినను పరులదుఃఖమును గుర్తింపక ఊరక హింసపెట్టుచుండువారు కొందఱుందురు. అట్టివారి నుద్దేశించి దెబ్బదిన్న యొకవ్యక్తి కమసలివానిపైఁ బెట్టి బంగారమన్నట్టు లన్యాపదేశముగా తనకడుపులోని కసిని వెళ్లఁగ్రక్కుచున్నాఁడు.

శ్లో. హే హేమకార ! పరదుఃఖవిచారమూఢ ! కిం మాం ముహుః క్షిపసి వారశతాని వహ్నౌ ?
సందీప్యతే మయి తు సువర్ణగుణాతిరేకో, లాభః పరం తవ ముఖే ఖలు భస్మపాతః !

పరులదుఃఖమును గుర్తెఱుంగఁ జాలని మూఢుఁడవగు నో స్వర్ణకారుఁడా! మాటిమాటికి నీవు నన్ను (బంగారమును) అనేక పర్యాయములు నిప్పులోఁ బడవేయుచున్నావు. ఇట్లు చేసినందువలన నాకేమో యింకను మెఱుఁగే యెక్కుచున్నది. కాని నీ ముఖమున బూడిద పడుటకంటె నీకేమీ లాభము లేదుగదా? ఎందులకు నన్నిట్లు చేసెదవు?

౫

ఒకధనికుఁడు విశేషముగా దానధర్మములు చేసి రిక్తుఁడై యుండఁగా అట్టి రిక్తస్థితిలోఁ దన్ను యాచింపవచ్చిన కవీశ్వరునిఁ జూచి యేమి యిచ్చుటకును లేకపోయెనే యని యాతఁడు ఖేదపడుచుండ ఇంగితజ్ఞుఁడగు నాకవీశ్వరుఁడు మేఘునిపైఁ బెట్టి యారిక్తునిఁ బ్రశంసించుచున్నాఁడు.

శ్లో. ఆశ్వాస్య పర్వతకులం తపనోపతప్త, ముద్దామదావదహనాని చ కాననాని
నానానదీ నదశతాని చ పూరయిత్వా, రిక్తోసి య జ్జలద ! సైవ త వోత్తమశ్రీః.

మేఘుఁడా! ఉన్నయుదక మంత పోగొట్టుకొని రిక్తుఁడనైయుంటి నని ఖేదపడకుము. నీసంపద కిట్టిదశపట్టుటయే ప్రశంసనీయము. ఎట్లన? ఎండలకాలములో పర్వతములన్నియు మండు టెండలచే కాలియుండఁగా అట్టిపర్వతములను అమృతము పోసి ఆదరించితివి. అట్లే కాఱుచిచ్చంటుకొని కాలిపోయిన కాననములను చల్లఁబఱచితివి. ఇంతయేగాక నదులు, నదములు మొదలుగాఁగల నానాజలాశయములను నిండించితివి. ఇంత మహోపకారము చేసి యిపుడు రిక్తుఁడవైపోయితివి. అయిన నేమి? నీసిరి సద్వినియోగమైనది గనుక నీ యీరిక్త స్థితియే నీకు మహాసంపదయై వెలసినది. కనుక నీ వెంతమాత్రమును ఖేదపడకుము.

౬

నెఱిదాత యని పేర్వడసిన యొకమహారాజుకడ కొక పండితకవి వచ్చెనఁట. అప్పుడారాజు 'విధి విరామము లేకుండ ఎప్పుడు ఇదే ఆయె'నని యించుక మనసులో విసుఁగుపడినట్లు కనిపించెనఁట. అది చూచి ఆకవి యాతని మనోభావమును గనిపెట్టి యొక ఫలవృక్షముపై నపదేశించి యిట్లు చెప్పెనఁట.

శ్లో. కిం జాతోఽసి చతుష్పథే ? ఘనతరచ్ఛాయోఽసి కిం ? ఛాయయా
ఛన్నశ్చే త్ఫలితోఽసి కిం ? ఫలభరైః పూర్ణోఽపి కిం సన్నతః ?
హే సద్వృక్ష ! సహస్వ సంప్రతి చిరం శాఖా శిఖాకర్షణ
క్షోభామోటన భంజనాని జనతః స్వైరేవ దుశ్చేష్టితైః.

ఓ సద్వృక్షమా ! నీవు 'నన్ను జనులు కొమ్మలు పట్టుకొని గుంజుచున్నా రని, విఱచుచున్నారని, రాళ్లతో రువ్వుచున్నారని ఖేదపడుచున్నావే! ఇది యెవరితప్పు ? నీతప్పే గదా! నీవు నల్వురు నడుచునట్టి చతుష్పథమున (నాల్గుత్రోవలు కలియుచోట) ఏల మొలిచితివి? మొలిచితివిపో మోటు చెట్టుగా నుండక నల్వురకు వచ్చి చేరుటకు తగినట్టుగా నీడగలదాన వేలయైతివి? ఐతివిపో, నీడకొఱకు వచ్చినవారు కొమ్మలజోలికిఁబోరుగదా! అంతమాత్రముతో నుండక నీవేల ఫలించితివి? ఫలించితివిపో ఎందులకు వంగితివి? ఇదంత నీ స్వయంకృతాపరాధము లేగదా ! కనుక నీవు స్వయముగాఁ జేసికొన్న దుశ్చేష్టలచేతనే నీ కిట్టిబాధలు గలుగుచున్నవని భావించుకొని యెవ రేమి చేసినను సహించుకొనియుండుము. ఇప్పుడు ఖేదపడిన నేమగును? అని చెప్పెనఁట.

౭

ఒక సజ్జనుఁడు సకలవిధములఁ దనసర్వస్వముచే లోకమున కానందము చేకూర్చువాఁడై యుండఁగా ఆతనికడ కొందఱు దుష్టులు చేరుకొని మంచివారికి ప్రవేశము లేకుండఁ జేయసాగిరి. అట్టిపరిస్థితిఁ జూచి, వా రాతనిని పూర్తిగా నాశనము చేయుదురే యని జాలిపడుచున్న యొకయనుభవజ్ఞుఁడు మంచిగందపుఁ జెట్టుపైఁ బెట్టి ఆతనికి భవిష్యద్భోగము నిట్లని తెలియఁజేయుచున్నాడు.

శ్లో. లోకానందన ! చందన ద్రుమ ! సఖే ! నాస్మిన్ వనే స్థీయతాం
దుర్వంశైః పరుషై రసారహృదయై రాక్రాంత మేత ద్వనమ్,
తే హ్యాన్యోన్యవిఘర్షజాత దహన జ్వాలావళీ సంకులా
న స్వా న్యేవ కులాని కేవల మమీ సర్వం దహేయు ర్వనమ్.

ఓమిత్రమా! లోకమున కానందము చేకూర్చునట్టి ఓచందనవృక్షమా! నీ వీయరణ్యమునం దుండఁబోకుము. ఈయరణ్యము పరుషములగు దుర్వంశములచే (పాడువెదుళ్లచే) ఆక్రమింపఁబడియున్నది. (వెదుళ్లు పైన కఠినముగాను, లోపల బోంగుగాను నుండును, మఱియు ముండ్లమండలచే పాడుపాడుగా నుండు ననుట.) అవి యున్న

నన్నేమి చేయఁగలవని తలంపఁబోకుము. అవి యేమి చేయునో తెలియునా? ఒకదాని నొకటి రాచుకొని అందువలనఁ బుట్టిన యగ్నిజ్వాలలచే తాము మాత్రమే కాలిపోక అందున్న తరుకులము నంతయు భస్మము చేసి ఆయరణ్యమునే దహించివేయుచున్నవి. కనుక లోకానందకరుఁడవగు నీ విక్కడ నుండఁబోకుము. తొలఁగి చనుము.

అనఁగా ఓసజ్జనుఁడా! నీ వున్న సంఘమువారు మానవహృదయము లేని పరుషాత్ములును, నిస్సారహృదయులును, దుష్కుల సంజాతులును అగుదురు. వారు తమచేష్టితములచే తాము నాశన మగుటయే గాక తమకులమును, లోకమును గూడ నాశనము చేయుదురు. కాన వారితోఁ గలిసి యున్న నీకును చేటు తప్పదు గనుక నీవు తొలఁగి పొమ్మని హితోపదేశము.

౨

ఒక పండితుఁ డఖండపాండిత్యమును సంపాదించుకొని యొక రాజాస్థానమునకుఁ బోయెనఁట. సాధారణముగా నాస్థానపండితులుగా నున్నవారు తమప్రతిష్ఠకు భంగము రాకుండ గౌరవము దక్కించుకొనవలెనని ప్రయత్నించుట సహజమేగదా! ఆ పండితుఁడు రాజాస్థానమునకు రాఁగానే ఆయాస్థానపండితు లాతనిముందరఁ దమగౌరవము నిలువదని ఆపండితుని పాండిత్యప్రకర్ష బయటికి రాకుండ ఎన్నివిధముల నణఁగఁద్రొక్కవలెనో అన్ని విధముల నణఁగఁద్రొక్కిరఁట. ఇంతకు స్థానబలముగదా! ఎట్లయిన నేమి? చివర కక్కడ ఆపండితుఁ డెంత పండితుఁడైన నేమి? కించిన్మాత్రమేని సత్కారము లేకుండనే అవమానించి పంపివేయఁబడెనఁట. అప్పు డాపండితుఁ డొకచోఁ గూర్చుండి తన పాండిత్యమును గుర్తింపలేకపోవుట యట్లుండ, పైపెచ్చు అవమానించికూడ పంపిరిగదా యని యీర్ష్యాళువైన లోకము నీసడించుచు వ్యసనపడుచుండెనఁట. అప్పు డాతనినిజూచి గుణజ్ఞుఁడగు నొక పండితుఁడు రత్నముపైఁబెట్టి కోఁతికొకరత్నము దొరకినట్లును, ఆకోఁతి దానిగుణమును గ్రహింపలేక పారవేసినట్లును, అందుపై ఆరత్నము వ్యసనపడుచున్నట్లును, వ్యసనపడుచున్న ఆరత్నము నూరార్చినట్లును ఇట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో. ఆఘ్రాతం పరిచుంబితం పరి ముహుర్లీఢం పునశ్చర్వితం
త్యక్తం వా భువి నీరసేన మనసా, తత్రవ్యథాం మా కృథాః,
హే సద్రత్న! త వైతదేవ కుశలం య ద్వానరే ణాదరా
దంతస్సారవిలోకన వ్యసనినా చూర్ణీకృతం నాశ్మనా.

ఓ మంచిరత్నమా! నీవు వ్యసనపడకుము. నిన్ను గ్రహించిన కోఁతి నీలో నేమైన సారస్యమున్నదేమో యని వాసనచూచినది. తన ఘ్రాణేంద్రియమున కేమి సారస్యము దొరకకపోఁగా ముద్దుపెట్టుకొని చూచినది. అందులోను ఏమి సారస్యముగపడకపోఁగా త్రిప్పి త్రిప్పి చుట్టునాఁకినది. కాని అందులోను ఏమి స్వాదుత్వము చిక్కకపోఁగా నోటిలో వేసికొని చప్పరించి చూచినది. అప్పటికిని ఏమి రుచి దొరకకపోవుసరికి 'ఛీ పాడుది'

అని నిరాశచేసికొని విసరిపుచ్చి దూరముగఁ బాఱవేసినది. ఇట్లు చేసెనే నావిలువ గుర్తెఱుఁగలేకపోయెనే యని నీ వెంతమాత్రమును జింతింపకుము. ఇంకను నీయదృష్టము మంచి దని సంతోషింపుము. ఎందుల కంటివా? ఆకోఁతి నిన్నంతమాత్రముతో విడువక నీ పైభాగమున నేమి సారస్యము కనఁబడ లేదు. గాన లోపల నేమైన సార ముండునేమో యని నిన్ను రాతిమీఁద రాఁచి పెట్టి కొట్టి పొడిచేసిన నే మగుదువు? స్వరూపమే లేకుండఁ బోయియుందువు గదా? అట్లు చేయక వదలివేసినది. ఇదియే నీకు గొప్ప కుశల మను కొనుము. ఏనాఁటికేనియు నీ విలువఁ దెలిసికొనఁగలవారు లేకపోరు. సంతోషింపు మని యాశ్వాసించెను.

౯

ప్రపంచములో మంచితోపాటు చెడ్డగూడ నున్నదేగదా! తేజస్తిమిరములు, సుఖదుఃఖములు, పుణ్యపాపములు, గౌరవాగౌరవములు, మానావమానములు—ఇవన్నియు నొకే కోటిలోనికిఁ జేరినవేగదా! అభిమాన మనునది యొకటి యున్నచో బ్రహ్మిని తిమ్మిని, తిమ్మిని బ్రహ్మినిఁ జేయవచ్చును. ఉద్దండపండితుని వట్టి పనికిమాలిన వానినిగను, పనికి మాలిన వానిని మహాపండితునిగను మార్చివేయవచ్చును. కాని యది దురభిమానమే యను కళంకముమాత్రము తప్పఁబోదు. ఇట్టి సందర్భములోనే అర్హుఁడైనవాని కర్హస్థానమీయక అల్లుని నందల మెక్కింపఁగా నిజమైన సత్త నిల్కడమీఁదఁ దెలియకపోదనుచు నుచితజ్ఞుఁడిట్లని మణిమీఁదను, గాజుపూసమీఁదను బెట్టి వస్తువునకు విలువఁ గట్టుచున్నాఁడు.

౧౦

శ్లో. మణి ర్లుఠతి పాదాగ్రే కాచః కంఠావలంబితః, క్రయ విక్రయ వేళాయాం కాచః కాచో మణిర్మణిః.

రత్నము కాలితోఁ దన్నఁబడుఁ గాక, గాజుపూస కంఠమున ధరింపఁబడుఁగాక. అంతమాత్రముతో గౌరవాగౌరవములు దక్కినట్లు గాదు. కొనఁబోవునపుడును, అమ్మఁబోవునపుడును గాజుపూస గాజుపూసే; మణి మణియే. అనఁగా చేతనైనట్లు క్రిందుమీఁదులు చేయవచ్చునే గాని విలువ గట్టినప్పుడు బ్రతుకు బయటఁ బడకపోదని భావము. ఇట్టిదే 'కాకః కృష్ణః, పికః కృష్ణః' అన్న శ్లోకము గూడ !

౧౧

ఒకఁ డుత్తముఁ డని, ఒకఁ డధముఁ డని భేద మెందులకు? ఇరువురు నొకేవిధముగా నున్నారుగదా? అని పేడ—బెల్లము ఒకటిగానే చేసి మాట్లాడఁగా అర్హతానర్హతలను గుర్తింపక అవమానపఱచిరే యని యాందోళన పడుచున్న యొకవ్యక్తి సమయము వచ్చినపు డెవరియోగ్యతలు గూడ బైటఁబడఁగల వని కాకకోకిలములపైఁ బెట్టి కడుపులోని కసిని యిట్లని వెళ్లఁ గ్రక్కుచున్నాఁడు.

శ్లో. కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పిక కాకయోః, వసంతకాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః!

కాకి-నల్లగానే ఉన్నది! కోకిల-నల్లగానే ఉన్నది! ఇఁక ఆ రెంటికి భేద మేమున్నది అని సంతోషింపవచ్చును? కాని వసంతకాలము వచ్చినపుడు వాని భేద మేమో తేటపడఁగలదు. వసంతకాలము రాఁగానే కాకి కాకియే; కోకిల కోకిలయే. చెట్లయిగుబ్లొదిని కోకిల మధురకంఠముతో మనోహరముగా కూసినపుడు కోకిలఘనత అప్పుడు తెలియఁబడఁగలదు. ఊరక వాకొనినఁ బ్రయోజన మేమి? పైకిఁ జూడ నొకే విధముగాఁ గన్పడినంతమాత్రముచేతనే పోలికలు గావు, యోగ్యతను జూడవలె నని భావము.

౧౨

రాజమందిరములో నిరాటంకముగాఁ దిరుగుచున్న రాజసేవకులు అదియే తమపాలిటి కొక గొప్పగా భావించి గర్వించి, రాజదర్శనార్థమై వచ్చిన పండితులను చూచిచూడనట్టుగా వ్యవహరించుచు, కసరుకొనుచు విఱ్ఱవీఁగుచు నుండఁగా వీం డ్రు తమ బ్రతు కెంతమాత్రమో గమనించుకొన రైరని యొకకవి పిల్లిపైఁ బెట్టి యిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో. మా గర్వ ముద్వహ బిడాల! మహీపతీనా, మంతః పురం మణిమయం సదనం మమేతి
పట్టాభిషేకసమయే పృథివీపతీనాం, బాహ్య స్థితస్య కలభస్య హి మండనశ్రీః!

ఓసీ పిల్లీ, నీవు మణిమయమైన రాజాంతఃపురములోఁ దిరుగుచున్నా నని, ఇదియే నా గృహ మని గర్వపడకుము. రాజులకుఁ బట్టాభిషేకమహోత్సవము జరుపవలసిన సమయములో వెలుపల నున్న గున్నయేనుగునకే అలంకార వైభవము. కనుక అట్టి శుభసమయములందు నీ మొగము చూచువా రుండరు. పైగా నిన్నుఁ జూచుట అపశకునముగాఁ గూడ నెంతురు. ఇంతమాత్రమునకే యింత గర్వింపవలయునా?

౧౩

బ్రతికి చెడిన యొకని జీవితము నుద్దేశించి తుమ్మెదపైఁ బెట్టి యిట్లని వ్యక్త పఱచుచున్నాఁడు.

శ్లో. యే వర్ధితాః కరికపోలమదేన భృంగాః, ప్రోత్ఫుల్ల పంకజ రజస్సురభీకృతాంగాః,
తే సాంప్రతం ప్రతిదినం గమయంతి కాలం, నింబేషు చార్కకుసుమేషు చ దైవయోగాత్.

ఏ తుమ్మెదలు మదపుటేనుఁగుగండస్థలములందలి మదోదకమును ద్రావి వృద్ధిగాంచెనో, మఱియు వికసించిన పద్మములలో మకరందపానము చేయుచుండఁగా అందలి పుప్పొడి పడి శరీర మంతయు గుమగుమవాసనలు గుప్పుచుండెనో అట్టి తుమ్మెదలు నేఁడు దైవయోగమువలనఁ బ్రతిదినము వేపపువ్వులలోను, జిల్లేడు పుష్పములలోను కాలమును గడుపుచున్నవి! అనఁగా అంత మహాభోగము లనుభవించిన తుమ్మెదలు కాలము తప్పి వచ్చునప్పటికి మహానీచపు బ్రతుకు బ్రతుకవలసి వచ్చినది! బ్రతికి చెడిన భోగపురుషుని స్థితి గూడ నిట్టిదే యని భావము.

## ౧౪

పండితరాయ లని ప్రసిద్ధి వడసిన జగన్నాథ పండితుఁడు తనతో వాక్యార్థమునకు నిలువఁజాలిన పండితుఁడు ప్రపంచములో నెక్కడేని యొక్కఁడైనను లేక పోఁగా అప్పుడు తన పాండిత్య ప్రకర్ష ఎక్కడఁ జూపవలె నని నిర్వీర్యమైన యీ ప్రపంచము నీసడించుచు సింహముపైఁ బెట్టి యిట్లని తన యభిప్రాయమును వెల్లడించెను.

శ్లో. దిగంతే శ్రూయంతే మదమలిన గండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలా శ్చ హి మృగాః,
ఇదానీం లోకేస్మి న్ననుపమశిఖానాం పున రయం
నఖానాం పాండిత్యం ప్రకటయతు కస్మిన్ మృగపతిః?

ఈసింహము తన పరాక్రమమును జూపుటకు మదగజము లున్నవిగదా! అక్కడఁ జూపుదమనుకొన్న అవి (దిగ్గజములు.) దిగంతములఁజేరి యెక్కడనో ఉన్నవని విను చున్నాము. (చూడలే దన్నమాట.) మదగజములు లేకపోయిన పోనీ ఆఁడేనుఁగులైన నున్నవిగదా! వానిపైఁ జూపరాదా యన్న అవి ఆఁడు వగుటవలన దయ దలఁపఁదగి నవిగా నుండి పోయినవి. పోనీ లేళ్లున్నవిగదా వానిపైఁ జూపుద మన్న అవి అసమశీల ములు. అనఁగా సమానులతో డీకొనుట గౌరవప్రదము గాని, అసమానులతో డీకొనుట గౌరవభంగమగును గనుక వానిపైఁ బోవుట గౌరవాస్పదము గాదు. కనుక ఈప్రపంచ ములు నెందుఁజూచినను ఇట్లే యున్నది కాఁబట్టి ఇఁక నీమృగరాజు నిరుపమాన తైక్ష్ణ్యము గల తనగోళ్ల పాండిత్యము నెక్కడ ప్రకటింపవలెె? ఎక్కడను లే దని భావము.

## ౧౫

ఒకఁ డొక పెద్దధనికుఁడుగా నుఁడఁగా అతని నాశ్రయించినచో తనదారిద్ర్యము తీఱునని యొకదరిద్రుఁ డట్టె కనిపెట్టుకొని యుండెనఁట. ఉండి ఉండి చిట్టచివర కేమిలేక పోఁగా అట్టివానిపరిస్థితి నభివర్ణించుచు వాచ్యముగాఁ జెప్పక బూరుగుచెట్టు నాశ్రయించిన చిలుకపైఁ బెట్టి యి ట్లని చెప్పుచున్నాఁడు.

శ్లో. విశాలం శాల్మల్యా నయనసుభగం వీక్ష్య కుసుమం, శుక స్యాసీ ద్బుద్ధిః ఫలమపి భవే దస్య సదృశమ్
ఇతి ధ్యాత్వోపాస్తం ఫల మపి చ దైవా త్పరిణతం, తద న్త స్తూలాంభూ త్సపది మరుతా సోప్యపహృతః.

ఒకచిలుక బూరుగుచెట్టు అన్నిచెట్లలోను బ్రహ్మాండమంతి చెట్టుగా నుండి, చెట్టు నిండ కనులపండువుగా పూఁత పూసి యుండుటచేత దానిని చూచి ఆనందించి, ఇంతచెట్టున కింత పూఁత పూసినదిగదా! ఈపూఁతకుఁ దగినపంట గూడ నుండగలఁ దనియు, అప్పుడు హాయిగా ఇక్కడనే ఉండి యనుభవింపవచ్చు ననియు, ఇంకొకచోటికి పో నవసరిము లే దనియు అనుకొనుచు ఆచెట్టునే కనిపెట్టుకొని యుండెనఁట. దైవికముగాఁ గొన్నాళ్ల కాచెట్టు కాఁపు కాసి పండ్లుగూడ పండనయ్యెనఁట. పండ్లుపండినవి! ఇంక తినవచ్చుఁ

గదా! యని ఆచిలుక ఆశపడుపడుచుండఁగా ఆపండ్లలోనున్నది దూది యాయెనఁట. పోనీ తన్నింత యాశగొల్పి యిన్నాళ్లపాటిక్కడ నిల్పిన దీ దూదియేగదా! దానినైనఁ జూచుకొనుచుంద మనుకొనుసరి కెక్కడనుండియో యొక గాలివచ్చి అది కూడఁ గనఁబడకుండ ఎగురఁగొట్టుకొనిపోయెనఁట! అర్థిజనులను రిత్తపుచ్చు ధనాంధుల సేవ యిట్లుండు నని ధ్వని!

## ౧౬

శ్లో. దృష్ట్వా హృష్టోఽభవ దళి రసౌ చిత్రసంస్థే హి పద్మే,వర్ణం రూపం కిమితి కిమితి వ్యాహార స్నాజగామ
సాస్మిన్ గంధో నచ మధుచయో నైవ తత్సౌకుమార్యం, ఘూర్ణన్ ఘూర్ణన్నవనతముఖో వ్రీడయా నిర్జగామ.

సాధారణముగా ఎక్కడనైన సభ అనియో, అవధానమనియో, హరికథ యనియో పురాణమనియో లేక మరేదియో యొకటి జరుగు ననఁగా ప్రతివారును గంపెఁడాశతో అక్కడికిఁ బోయి, ఏదో యొక యపూర్వమైన విషయము తెలిసికొని ఆనందింత మని అక్కడికిఁ బోవుచుందురు. అంతదూర మక్కడికిఁ బోయినతర్వాత అక్కడ అనుకున్నంతగా లేక నీరసిల్లియుండఁగా అట్టియనుభవమునకు సూటిగా జగన్నాథపండితుఁడు తుమ్మెదపైఁ బెట్టి పైశ్లోకమును వ్రాసియున్నాఁడు.

ఒకతుమ్మెద చిత్తరువులో వ్రాసియున్న పద్మమునుజూచి కన్ను భ్రమసి, ఎంతమంచి పద్మము దొరకినది! తనివిదీఱ సువాసన గ్రోలవచ్చును! పూదేనె త్రావవచ్చును! అని ఆశపడి, యేమి వర్ణ మేమి వర్ణము! ఏమి రూప మేమి రూపము!! అని వర్ణించుకొనుచు ఆపద్మముదగ్గఱకుఁబోయెనఁట! పోయి ఆఘ్రాణించెనఁట. గంధ మేమి అగపడకపోఁగా మకరంద మేమైన నున్నదేమో యని యాస్వాదించి చూచెనఁట. అం దేమి కనఁబడక పోఁగా పోనీ అసలు పద్మమున కుండవలసిన సౌకుమార్యమైన నున్నదేమో యని వెంపరలాడెనఁట. అది గూడఁ గాన్పింపకపోవుసరికి అప్పుడు అయ్యో! యెంత ఆశపడి పరుగెత్తుకొని వచ్చితిని! చివర కేమయ్యెను!! అని గిరగిరఁ దిరుగుచు సిగ్గుతోఁ దల వంచుకొని వెళ్లిపోయెనఁట!

## ౧౭

అల్పుఁడు అధికునితో పోటి పెట్టుకొని వానిగొప్పతన మేమి? అని వానివలెనే తానును మెలఁగవలె నని ఆవేషాలే వేయుచుండఁగా, ఆవేషాలు వేయవచ్చుఁగాని, ఆఘనత యెక్కడినుండి వచ్చు నని యీవిషయము నక్కపైఁ బెట్టి యిట్లని చీవాట్లు పెట్టుచున్నాఁడు.

శ్లో. ఉద స్యోచ్చైః పుచ్ఛం శిరసి నిహితం జీర్ణజటిలం, యదృచ్ఛావ్యాపన్నం ద్విపపిశితకేశాః కబళితాః
గుహాగర్తే శూన్యే సుచిర ముషితం జంబుక! సఖే!, కి మేతస్మిన్ కర్మో యదసి న గత స్సింహసదృశామ్!

ఓ చెలికాఁడా! జంబుకమా! నీవు సింహముయొక్క ఘనతను సంపాదింపవలె నని వేషాలు వేయుచున్నావు. సింహము కుచ్చుతోఁకను ఎత్తి తలపైఁ బెట్టుకొనుచున్నదని

నీవును దోఁచిపోయిన నీ మొండితోఁకను పైకెత్తి నెత్తిపై నుంచుకొనుచున్నావు. సింహము మదపుటేనుఁగును జంపి దాని కుంభస్థలము వ్రీల్చి, అందలిమాంసమును దినుచుండఁగా నాచేతఁ గాదా యని నీవును కాలము దీఱి చచ్చిపోయిన యేనుఁగు మాంసలేశమును కబళించుచున్నావు. సింహ మెక్కడనో మృగసంచారము లేని గుహలో నున్న దని నీవును అట్టి గుహలోనే చిరకాల ముండుచున్నావు. కాని యింత చేసినను నీకు సింహముతో సామ్యము లేకపోయెనే అనియే నా చింత! పాపము! ఏమి చేయవలె? వట్టియనుకరణముతో గౌరవము రా దని భావము.

౧౭

లోకములో కొందఱు తమయం దెట్టి యోగ్యతయు లేకపోయినను ఏదో యొక సామ్యమును జూచుకొని ఆపెద్దవారికంటె తా మేమి తక్కువ? వారియొక్కువ యేమి? అని ధిక్కారభావముతో విఱ్ఱవీఁగుచుందురు. ఏదో యొకపోలిక సరిపోవఁగనే సరిపోయెనా? యోగ్యత యుండవలదా? అటువంటి నీలకంఠశబ్ద సామ్యముతో ఈశ్వరుఁడును, నెమలియు, కలవింకపక్షియు నొక్కటే కావలసియుండును గదా? యని కలవింక పక్షిపైఁ బెట్టి యిట్లని బుద్ధి చెప్పుచున్నాఁడు.

శ్లో. గళిత గరళ కంఠ శ్శంకరో నీలకంఠః, ప్రబలతర విషాశీ బర్హిణో నీలకంఠః
అజర తృణ విసర్పత్కీట దర్పాపహారీ, కలయసి కలవింక! త్వం చ భో నీలకంఠః!

ఓ కలవింక పక్షీ! నీవు, నేనును నీలకంఠుఁడనే యని యనుకొని విఱ్ఱవీఁగుచున్నావు, బాగుగనే యున్నది! అనుకొనవచ్చు! అభ్యంతరము లేదు. కాని శంకరుఁ డున్నాఁడనుకో. ఆయన నీలకంఠుఁడే. ఆయన లోకోపద్రవకారియగు విషమును మ్రింగి అది కడుపులోనికిఁ బోయినచో అందున్న ప్రపంచము నాశన మగు నని కంఠమునందే యిముడ్చుకొని లోకమునకు సౌఖ్యమును గల్పించినవాఁడు. ఆయనసంగతి అట్లున్నది! ఇఁక నెమలి యున్న దనుకో అదియు నీలకంఠనామమును ధరించినదే కాని శివునివలె లోకోపద్రవము నణఁపలేకపోయినను ఘోరమైన పామువిషమును దినుచున్నది. ఇఁక నీవో విషభక్షణాదు లేమి లేకపోయినను పచ్చిగడ్డిపై సంచరించు పురుగులను పొగరణఁచుటలో పేరు పొందినదానవు. కనుక ఇంత మహాఘనకార్యము చేసెడినీవును నీలకంఠుఁడనే యని యనుకొనుచున్నావు. అనుకొనుటలో నేమి లోపము లేదు. అనుకొనవచ్చు. అర్హతానర్హతలలోనే యాలోచింపవలసినది!

౧౮

అభిమాన ముండఁ దగదని యెవ్వరు చెప్పరుగాని దురభిమానము మాత్రము కూడదని యందఱు ఒప్పుకొందురు. ఈదురభిమానము లేకుండ తమధర్మమును దాము నిర్వహించుకొనెడి వ్యక్తులే చాల నరుదుగా నుందురు. అందులోను అధికారపదవిలో నున్నవారి కీవిషయములో నుండవలసిన జాగ్రత్త కత్తిపై సాముగనే యుండఁబోవును.

ఇట్లున్న సందర్భములో ఒక ప్రభువు అర్హులైనవా రుండినను వారి నాదరింపక అల్పులైనవారిని దగ్గఱ దీసికొని అధికారమును చెలాయించుచుండఁగా అట్టివారి యనౌచిత్యమునకు చీవాట్లు పెట్టుచు నీశ్వరునిపైఁ బెట్టి యిట్లు చెప్పుచున్నాఁడు.

శ్లో. త్వం చే త్సంచరసే వృషేణ లఘుతా కా నామ దిగ్దంతినాం ?
వ్యాళైః కంకణభూషణాని కురుషే హాని ర్న హేమ్నా మపి,
మూర్ధన్యం కురుషే సుధాంశు మయశః కిం నామ లోకత్రయే
దీప స్యాంబుజబాంధవస్య ? జగతా మీశోసి !, కిం బ్రూమహే !

ఓయీశ్వరా ! నీవు వాహనముగా నుపయోగించుకొనుటకు దివ్యములైన దిగ్దంతు లుండఁగా వానిని గాదని యెద్దుపై నెక్కి తిరుగుచున్నావు. అంతమాత్రముతో దిగ్దంతులకుఁ గల్గిన లాఘవ మేమి లేదు. భూషణములకు బంగార ముండఁగా దాని నుపయోగించుకొనక సర్పములతో కంకణాదిభూషణములను గల్పించుకొన్నావు. అంతమాత్రముచేత బంగారమునకు వచ్చినహాని యేమిలేదు. శిరోభూషణముగా ధరించుటకు ముల్లోకములను బ్రకాశింపఁజేయు సూర్యుఁ డుండఁగా అట్టివానిని పోఁద్రోసి చంద్రుని తలపై నెక్కించుకొన్నావు. అంతమాత్రముచేత సూర్యునకు వచ్చిన అపకీర్తి యేమియులేదు. కాని యింత యౌచిత్యము లేకుండ వ్యవహరించినను నీవు జగత్తుల నేలు ప్రభుఁడవే యయితివి ! ఏ మనవలె ?

## ౨౦

ఒక పండితుఁడు కేవలము దరిద్రుఁడుగా నుండెను. అభిమాన మాదారిద్ర్యమును మించియుండెను. ఒకరిని బోయియడుగనిది పొయ్యిలోని పిల్లి లేవదు. యాచనమే జీవనము! యాచనకుఁ బోయినప్పటి యనుభవములు చెప్పవలసినది లేదుగదా! ధనికులను జూడవలె, వారు పెడమొగము పెట్టినను సహించుకొనవలె; ముఖప్రీతివచనములు కల్పించుకొని చెప్పవలె. వారి యీసడింపులకుఁ బడవలె, గర్వోక్తులను వినవలె. ఈయవస్థలన్ని పడి, ఆ పండితుఁడు విసిగి యీదురవస్థ లేకుండిన నెంత బాగుండు నని విచారించుచు, ఇట్టి దురవస్థ యేమి లేకుండ హాయిగా నున్న లేడిని దలఁచుకొని దానిపైఁ బెట్టి యిట్లని తనకడుపులోని వ్యసనమును వెళ్లఁగ్రక్కుచున్నాఁడు.

శ్లో. య ద్వక్త్రం ముహు రీక్షసే న ధనినాం, బ్రూషే న చాటూ న్మృషా
నేషాం గర్వవచ శ్శృణోషి, న చ తాన్ ప్రత్యాశయాధావసి
కాలే బాలతృణాని ఖాదసి, పరం నిద్రాసి నిద్రాగమే
త న్మే బ్రూహి కురంగ! కుత్ర భవతా కింనామ తప్తం తపః?

ఓకురంగమా? నీ వేమి తపస్సు చేసితివి? మాటిమాటికి ధనికుల ముఖము చూడవు గదా! వారిని గుఱించి యూరక చాటూక్తులను బల్కవుగదా ! వారనెడి గర్వోక్తులను నీ చెవులతో వినవుగదా! ఆశతో వారిచుట్టుఁ దిరుగవుగదా ! ఏదో ఆకలైనప్పుడు లేఁత

గడ్డిపోచలను తిందువు, నిద్రవచ్చినప్పుడు హాయిగా నిద్రపోవుదువు! ఈ విధముగా నుండఁ గల్గుటకు నీవు ఎక్కడ నేమి తపముచేసితివో నాకు చెప్పు?

నీ వెంత ధన్యుఁడవు! ఇట్టి పాడుపీడ లేకుండ హాయిగా నున్నావుగదా! అది నాకు లేకపోయెనే నా దురదృష్టమేమి? అని భావము. అనఁగా లోకములో యాచకులను జూచి నచో ధనికుల ప్రవర్తనమంత దారుణముగా నుండు ననునది ధ్వని.

౨౧

ఒక యల్పజ్ఞుఁడగు పండితుఁ డేవిధముగానో యొక రాజాస్థానములోఁ జేరి అక్కడ స్థానబలము చూచుకొని తాను సర్వజ్ఞుఁడైనట్టు లెంతవారినిగూడ లక్ష్యపెట్టకుండ ఊరక వాగుచుండుట చూచి ఆతని సత్తతెలిసికొన్న పండితు లతనిని 'నోరు తెరవకుండనుండినచో గౌరవము దక్కఁగలదు; కాన నోరు మూసికొని గౌరవము దక్కించుకొను' మని చెప్పి నట్లుగా కాకిపైఁ బెట్టియిట్లని చెప్పఁబడుచున్నది.

శ్లో. కర్ణారుంతుద మంతరేణ రణితం గాహస్వ కాక! స్వయం
మాకందం మకరందశాలిన మిహ త్వాం మన్మహే కోకిలం
ధన్యాని స్థలవైభవేన కతిచి ద్వస్తూని; కస్తూరికాం
నేపాలక్షితి పాల ఫాలపతితే పంకే న శంకేత కః?

ఓ కాకీ! మకరందసంపదచే మనోహరమైన మామిడిచెట్టుపైఁజేరి స్వేచ్ఛగాఁ గూర్చుండుము. నిన్ను కోకిల యనియే అనుకొందుము. కాని నీవు మాత్రము కర్ణకఠోరమైన ధ్వనిని చేయకుము. ఏల యందువా? లోకములోఁ గొన్ని వస్తువులు స్థలవైభవమును బట్టి ధన్యము లగును. చూడు! నేపాల మహారాజునొసట బురద పడియుండఁగా దానిని జూచిన వా రది కస్తూరియే యని యనుకొందురు గాని బురద యని యెవ్వరైన ననుకొందురా? కనుక ఓ కాకీ! నీవు నోరుమూసికొని యుండుము. అప్పుడు నీవు కోకిల వని యనిపించుకొందువు.

౨౨

ప్రపంచములో ఏదో భవిష్యదోగ్యమును దలఁచుకొని చిటుకలపందిళ్లు వేసికొని, ఊహాగానముచేయుట గలదుకదా! అట్టివారి యూహలను జూచి పద్మగర్భమునఁ జిక్కి పోయిన తుమ్మెదపైఁ బెట్టి వారి యూహలన్ని యిట్లున్నవని చెప్పుచున్నాఁడు.

శ్లో. రాత్రి ర్గమిష్యతి భవిష్యతి చ ప్రభాతం, భాస్వా నుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచారయతి పద్మగతే ద్విరేఫే, హా హన్త! హన్త! నళినీం గజ ఉజ్జహార.

ఒక తుమ్మెద సూర్యాస్తమయసమయమున పద్మములోఁ దూఱి మకరందపానము చేయుచుండఁగా నింతలో సూర్యాస్తమయ మగుటయు, పద్మము ముకుళించుకొని పోవు టయు జరిగెను. తుమ్మెద అందులోనే చిక్కుకొనిపోయెను. అప్పు డా తుమ్మెద యిట్లను కొనుచున్నదఁట! రాత్రి గడచిపోఁగలదు, సూర్యుఁ డుదయింపఁగలఁడు, అప్పుడు పద్మము

వికసింపఁగలదు. అప్పుడు నే నీబంధనమునుండి తప్పించుకొని పోఁగల్గుదును. అని యూహా చేయుచుండఁగా ఇంతలోనే యొకవనగజము వచ్చి పాపము! ఆతామరతీఁగను మొదలంట నూడఁ బీకివేసెను. తుమ్మెద అనుకొన్న దేమో! అయినదేమో చూడు! అట్లనే యున్నది యీయూహాగానము గూడ.

౨౩

ఒకఁడు స్థానబలమును జూచుకొని యెంతెంతవారిని లక్ష్యపెట్టకుండ పరిహాసకము లాడుచుండుట లోకములో సాధారణముగా జూచుచుందుము. స్థానము వదలి వచ్చినచో ఆనల వారి బ్రతుకు బైటఁ బడును. ఇట్టి సందర్భమునకే ఉదాహరణముగా ఈశ్వరుని మెడలో నున్న నాగేంద్రునిపైఁ బెట్టి యిట్లని చెప్పుచున్నాఁడు.

శ్లో. స్థానం ప్రధానం న బలం ప్రధానం, స్థానస్థితః కః పురుషో న శోభతే?
జానాసి నాగేంద్ర! తవ ప్రభావం, కంఠం వినా గర్జయ శంకరస్య.

ఒకమారు ఈశ్వరునిఁ జూడ విష్ణుమూర్తి గరుడవాహనారూఢుఁడై వచ్చెనఁట. అప్పు డీశ్వరుని మెడలో నున్న నాగేంద్రుఁడు గరుత్మంతునిఁజూచి 'బావా! బా గున్నావా?' అని యెత్తిపొడుపుగా అనెనఁట! అంతట గరుత్మంతుఁడు 'నాగేంద్రా! స్థానబలమే బలము గాని, వట్టిబలము బలము గాదుసుమా! స్థానములో నున్నపు డెట్టివాఁడు ప్రకాశింపఁడు? స్థానబల మున్నపుడెట్టివాఁడైనను ప్రకాశింపఁగలఁడు. నీ కిప్పుడు నన్ను హెచ్చరింపఁగల యీప్రభావ మెక్కడనుండి వచ్చినదో నాకుఁ దెలియక పోలేదు! ఒక మా రాశంకరుని కంఠము వదలి యీవలకు వచ్చి గర్జింపుము చూతము !' అని హెచ్చరించెనఁట.

౨౪

ఏదో ధనికు లున్నా రని విని వారిదగ్గఱకుఁ బోయినచో ధన మిత్తు రని కొండంత యాశతో పరుగెత్తుకొని పోఁగా అక్కడ నేమియు లేక పైపెచ్చు కాళ్లత్రిప్పులుమాత్రమే దక్కఁగా అట్టి సందర్భమును మనసులోఁ బెట్టుకొని చాతకపక్షిపైఁ బెట్టి యిట్లని చెప్పుచున్నాఁడు.

శ్లో. చాతక ! ధూమసమూహం, దృష్ట్వా మా ధావ వారిదబుద్ధ్యా,
ఇహ హి భవిష్యతి భవతో, నయనయుగా దేవ వారిణాం పూరః.

ఓ చాతకపక్షీ! నీవు, పొగ దట్టముగాఁ గనఁబడఁగానే అది మేఘ మనుకొని ఊరక పరుగెత్తుచున్నావు, కాని పరుగెత్తఁబోకు. అది మేఘము గాదు, పొగ. అక్కడికిఁ బోయి తివా? నీకు లభించెడిది నీ వాశించిన మేఘోదకము గాదు. నీకన్నుల నీరేసుమా! ఆపొగ కన్నులకు గప్పినచో నీకు వచ్చెడివి కన్నీళ్లు గాక యే మగును?

౨౫

బాగు పఱచుటకుఁగాని, ఓగు చేయుటకుఁ గాని అవకాశములు గల అధికారి విచికిత్స్యమైయున్న విషయమును గూర్చి తత్సంబంధికుల నావిషయములను గుఱించిన

యంశములను దెలియఁగోరినపుడా హెచ్చరికపై సుప్పతిల్లెడి యూహాపోహల కంతుం డదు గదా! అటు బాగునకు, ఇటు ఓగునకు ఎవరిబుద్ధి కందినట్లు వారు వారు వ్యాఖ్యా నించి గాలిమేడలు గట్టుకొని విహరించుచు అది యనుగ్రహమో, నిగ్రహమో అనుభవము మీఁదఁ దేల్చుకొనవలసినదిగానే యుండగలదు. ఇట్టి సందర్భములో అయినవారిదృష్టి శ్రేయోమార్గమునను, కాని వారిదృష్టి హేయమార్గమునను నడుచుచుండును. ఇట్టి సంద ర్భమే యొకటి ప్రస్తావనార్హమై యున్నది.

1946 ఫిబ్రవరిలో డైరెక్టరుగారు ఉపాధ్యాయపండితుల వేతనములస్కేల్లెట్లు న్నవో తెలుపవలసిన దని హెడ్మాస్టర్ల నడుగఁగా కొందఱు శ్రేయస్కాములు ఏదో జరగఁబోవుచున్న దని, మాతృభాషలకుఁ బ్రాధాన్య మిచ్చినా మన్నందులకు గుర్తుగా భాషాపండితులకుఁగూడా హెచ్చువేతనము లేమో యిచ్చుటకై యడుగుచున్నారు, ఇఁక మీ కేమి? యని మంచిభావముతోనే గాలిమేడలలో విహరించుచుండఁగా మాయూహాలు చాతకపక్షి నిరీక్షణమును బోలియున్న వని నేనే యీ శ్లోకమును వ్రాసితిని.

శ్లో. ఉన్నమ్య వక్త్రం పయసః కణాయ, వ్యోమ్ని స్థిత స్యోపరి చాతకస్య
ముఖే పతేయుం ర్జలబిందవో వా, పర్జోపలా వా శని తీవ్రఖండాః !

ఈశ్లోకమునకే నా వ్రాసిన పద్యము:—

చ. జలకణ మాసఁ జేసి, కొనసాగిన కోరిక మోర సాఁచి మిం
క్కేలి కుతుకంబుతోడఁ దమకించి నభంబున నిల్చు వానకో
యిల వదనంబునకా జినుకులే పడునో! వడగండ్లె రాలునో!
యెలమి లయింపఁగాఁ బిడుగులే పడి యొక్కట రూపు మాయునో !

అన్నట్లు పర్యవసానమునకు ఆంగ్లభాషాశనిపాతముతో భాషాపండితులగతి అధః పతితమే ఆయెగదా! ఎక్కడియూహా! యెక్కడియనుభవము ! !

ఈ ప్రకారముగా కవిలోకము లోకము నంత ఆకలించి, అర్థము చేసికొని అభి ప్రాయప్రకటనమున కన్యాపదేశము గూడ నొకమార్గ మని అపారముగా వాఙ్మయమును సృజించియున్నది. అది పనిగా వ్రాసిపెట్టినవే అసంఖ్యాకములుగా నున్నవి. ఇఁక గ్రంథ భాగములందుఁ గూడఁ దత్తత్ప్రకరణములయందు సందర్భములను జూచుకొని అనుకరించిన వెన్నేనియుఁ గలవు. ప్రకృతవ్యాసమునందు సంస్కృతకవుల రచనలలోనివే కొన్ని దిఙ్మా త్రముగాఁ బ్రదర్శింపఁ బడినవి. ప్రతి భాషలోను ఇట్టివి యుండనే యుండును. వాని నెల్ల సందర్భానుసారముగ అనుబంధించుకొని ఆనందించుటయే ఆ కవులయెడ ఆనృణ్యమును సంపాదించుకొనుటగా భావింతము.

ఓం తత్సత్.

# భట్టారకుని భారతానువాదము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీవాణీగిరిజల ననవరతము వక్షోముఖాంగములఁ దాల్చిన హరిహర బ్రహ్మలకుఁ గైమోడ్పు లిడి యాంధ్రకవిత్వవిశారదుఁడు మహితాత్ముఁడు నన్నయభట్టారకుఁడు తనబుద్ధి బాహువిక్రమమున భారతభారతీసముద్రముఁ దఱియఁగ నీఁద సమకట్టి అందాదిఁ దొడఁగి మూఁడుకృతు లతిదక్షతతో నొనర్చినాఁడు. కవిబ్రహ్మయగు తిక్కన మఖిచే బహునుతులఁ బడసినాఁ డిట్టికృతినిర్మితికి కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు. భారతఘట్టోల్లంఘనపటిష్ఠగాఢ ప్రతిభఁ బాటించి యాతనికి కవితాసార్వభౌమతఁ బట్టాభిషేక మొనరించినాఁడు. ఆంధ్రకవి మూర్ధన్యులందఱు నాఁడు మొదలు నేఁటివఱకుఁ బద్యము వ్రాయఁ గలమునో గంటమునో చేఁబూనినచో భట్టారకున కంజలింపకమానరు. వాగనుశాసనుఁడు నాదికవియునగు నామహనీయుని యాంధ్రానువాదసరణి యెట్టు లనలుకొనలుసాఁగినదో పాఠకుల కెఱిఁగించుటకై యీవ్యాసము వ్రాయదొరకొంటిని.

ఈతనికవితావిన్యాసమున ఛందోవ్యాకరణనియమములను బాటించుటలో విశిష్టత యేర్పడియుండుటచే వాగనుశాసకత్వ మీకవికి సార్థకమేగాని యొండుగాదు. కేవల మైతిహాసికదృష్టితోడనేగాక యీతనికైత రసపరిపుష్టిని భావపరిశుద్ధతను బాటించినది. యథాతథానువాదముగాక ప్రబంధధోరణి పట్టుపడినది. గాఢమైన ప్రతిభ కలిగియుండుట చేతనే భారతఘట్టముల నుల్లంఘింపఁగలిగినాఁడు. అవిరళజపహోమతత్పరుఁడు గనుకనే భారతభారతీశుభగభస్తిచయంబుల నాంధ్రావని వ్యాపింపఁజేయఁగలిగినాఁడు. వ్యాసభగవానుఁడు భారతకవితలోఁ జొనిపినఘట్టముల నర్థముచేసికొనునప్పుడు గణపతి యంతటి వ్రాయసగాఁడు నైతము గంటము త్రిప్పుకొనుచుఁ గొంతతడ వాఁగవలసివచ్చినది. అట్టి సంస్కృతకవిత నర్థముచేసికొనవలయునన్న భట్టారకుని నాఁటికి నేఁటి కున్నన్ని వ్యాఖ్యానములు లభించునవకాశము లేదు. సర్వసమర్థము పూర్వోక్తవిరోధపరిహృతమునగు నీలకంఠీయమువంటివ్యాఖ్యాన మానాఁటికి వెలువడనైనను లేదు. నరునకు నారాయణునట్టులు నారాయణభట్టుసహాయముమాత్రము లభించినది. అట్టితరుణమునందును మహాభారతేతిహాసమును భట్టారకుఁడు రసవత్తరప్రబంధమునుగా రచియింపఁగలిగినాఁడన్న, నింతకంటె మహత్తరము స్తుతిపాత్రమునగు విషయము వేఱొండుగలుగునా? విమల గోదావరీతీరభూమినివాసము, ధార్మికుఁడైన రాజరాజనరేంద్రుని ప్రేరణము, ఆశ్రయము లభించినది గావున ధర్మానుబంధియగు భారతసంహిత యాంధ్రులమహాభాగ్యమునఁ దెలుఁగున నవతరించినది. ధన్యుఁడు భట్టారకుఁడు.

నన్నయవృత్తరచనమాత్రము కమ్మచ్చునఁబట్టినట్టు తీఁగసాఁగుచు నడచినది. చిన్నచిన్నయమకములతోఁ జెవులకుఁ జవులుపుట్టించునదిగ భాసిల్లినది. కందము లందముగఁ జేరినవి. ఆటవెలఁదులు నాట్యభంగిమలు నెఱపినవి. ప్రాచీనకవితాపరిపాటి విడనాడక

యక్కరలు తరువోజలుకూడ నెడనెడఁ బొడసూపినవి. సీసములు మాత్రము వచనముల కీడుజోడయియున్నవి. వానిలో వృత్తములందలి పొంకము గానరాదు. వానినడకమాత్ర ముడుగడున నెగుడుదిగుడుగనే యున్నది. లక్షణపరిశుద్ధిమాత్రము వాని కవియే సాటి. భట్టారకుఁడు పాటించిననియమములే గద నాఁటినేఁటికి లాక్షణికుల కందఱకుఁ బథప్రదర్శకములు. వచనరచన యసదృశ కావుననే వచనరచనలో నూతనసృష్టిని గావించిన చిన్నయసూరి యీతనివచనముల నెక్కుడుగ ననుకరించినాఁడు. నన్నయరచనలోనివృత్తముల నొండురెం డుదాహరించెద.

మేనక యింద్రునియాజ్ఞనొందలఁదాల్చి విశ్వామిత్రునితపోభంగమునకై మందములయానిలము తోడురాఁగ వనముఁ బ్రవేశించు; నంత—

క. చల్లని దక్షిణమారుత, మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాధ
మ్మిల్లకుసుమాంగరాగస, ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్.

చ. అనిమిషకాంతయున్ నవలతాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవిలాసగతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వరప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతిసం
జననమహాతపశ్చరణ సంయతచిత్తు శిరస్థచిత్తజున్. (భార. ఆది. 4. 40, 41.)

ధేనువు లింటికివచ్చినవానితోడన కచుండు రాకయున్న దేవయాని దనమనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిటవచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వ్రేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో? భార. ఆది. 3. ౧౧౨.

కరుణరసభావభరితమై కడుహృద్యమైన దీపద్యము. వృత్తములన్నియు భావానుగుణముగనే నడచినవి.

రాజరాజనరేంద్రుని ప్రాపున సనాతనవైదికధర్మపునరుద్ధరణమునకై భారతసంహితనాంధ్రమునకుఁ గొనితెచ్చినభట్టారకునిదృష్టి ప్రధానముగ ధర్మబోధనమునకై ములుసూపినది. అట్టితఱి శకుంతలోపాఖ్యానమున చాలశ్లోకముల కనువాద మీతనికవితలోఁ గానవచ్చుటలేదు. దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించినపుడు సభలో నామె వాకొనిన వాక్యములన్నియు ధర్మసంబద్ధములై యున్నవి. అంతియ గాదు. ఆప్రసంగములన్నియు స్త్రీజాతిగౌరవమును, పతివ్రతల పాతివ్రత్యతేజోమహిమములను, విపులముగను విస్పష్టముగను నుగ్గడించునవియై యున్నవి. సంస్కృతభారతప్రతులన్నిటియందును రెండధ్యాయములలో విపులముగ వర్ణింపఁబడిన యీధర్మము లీయనువాదమునఁ జాలవఱకు సంక్షిప్తములైనవి. దాక్షిణాత్యప్రతులలో నీభాగము మఱికొంత యధికముగనే యున్నది. ఇట్లనువదింపకుండుటకుఁ గారణమేమో మన మీనాఁ డూహింపఁజాలము. ధర్మసూక్ష్మబోధకము

లగు నీయంశముల కనువాదము లేకుండుటమాత్రము కొఱఁత యనిపించుచున్నది. ఉదాహరణమునకై కొన్ని శ్లోకముల నిటఁజూపెదను.

నేను నీభార్యను. ఈతఁడు నీపుత్త్రుఁడు. నన్ను నీవు కణ్వాశ్రమమున గాంధర్వ విధిని బెండ్లియాడితివని శకుంతల తెలుపఁగా దుష్యంతుఁ డిట్లు సమాధానముచెప్పెను.

శ్లో. ధర్మకామార్థసంబంధం నస్మరామి త్వయాసహ, గచ్ఛవా తిష్ఠవా కామం యద్వాపీచ్ఛసి తత్కురు.

నీతోడ నాకు ధర్మార్థకామములలో దేనికొఱకైననుగాని సంబంధముండినట్లు జ్ఞాపకములేదు. కావున నీవు పోయిననుసరియే ఉండిననుసరియే. నీయిచ్ఛవచ్చినట్లు చేయుము.

అనినంతనే క్రోధామర్షములు పెచ్చురేఁగఁ గన్నులెఱ్ఱనై కటాక్షములచే దహించునదియై పెడమూపున రాజుం జూచెను.

ఆకారం గూహమానాపి మన్యునాభిసమీరితా, తపసా సంభృతం తేజో ధారయామాస వై తదా.

కోపోద్రిక్తయై వికృతమైన యాకృతిని గప్పుకొనుచు పుట్టుకచేతను పుటినదాదిగను సంపాదించిన తేజమును దాల్చెను. బ్రహ్మమానస పుత్త్రికయగు మేనకకుఁ దపోరాశియైన విశ్వామిత్త్రునివలన జనించుటచేతను, కణ్వాశ్రమమునఁ బెరుగుటచేతను, గాంధర్వవివాహమైనది మొదలుగ నహర్నిశము మానసమున దుష్యంతు నెడఁబాయకుండుటచేతను నామెకు తపస్సంభృతతేజ మేర్పడినది. క్రోధ ముద్భవించినంతనే నిగూఢమైన యాతేజము పైకెగసి వచ్చి యామెముఖమం దుద్భాసించెను. మహర్షులకు నైతము కోప ముప్పతిల్లినంతనే నిగూఢమైనతేజ ముద్భాసించుచుండెననుట పురాణప్రసిద్ధము. అట్టితేజోవతి గనుకనే—

యది మే యాచమానాయా వచనం న కరిష్యసి, దుష్యన్త శతధా మూర్ధా తతస్తేఽద్య ఫలిష్యతి.

దీనురాలనై యాచించునాపలుకును నెఱవేర్పకుండెదవేని ఓదుష్యన్తా నీశిర మిప్పుడే నూఱుప్రక్కలు కాఁగలదు అనెను.

పతివ్రతలకు శాపానుగ్రహసామర్థ్య మేర్పడియుండు ననుట నిర్వివాదము. సభలోఁ బదిమందియెదుటఁ దన్నవమానముచేసిన భర్తనుగూర్చి కోపోద్రిక్తయై యిట్లనినదనిన ననౌచిత్యము స్ఫురింపనేరదు. ఈయంశ మనువాదమున విడువఁదగినదిగాఁ గానరాదు. ఆప్రసంగముననే స్త్రీకిఁ గలపూజ్యత నిట్లుగ్గడించినది—

ఆత్మాత్మనైవ జనితః పుత్త్ర ఇత్యుచ్యతే బుధైః, తస్మాద్భార్యాం నరః పశ్యే న్మాతృవత్పుత్త్రమాతరమ్.

తనచే భార్యయందుఁ బుట్టించుకొనఁబడిన తానే పుత్త్రుఁడని విద్వాంసులచేఁ దెలుపఁబడుచున్నాఁడు కావునఁ బుత్త్రరూపుఁడైన తన్నుఁ గన్నతల్లి యగుభార్యను, తన్నుఁగనిన తల్లినివోలెఁ జూడవలయును. ఇది పురుషులకందఱకు నెఱుఁగఁదగినది, స్త్రీజాతికంతకును గౌరవము నాపాదించునదియునగు ధర్మవిశేషము. వివాహితలైన స్త్రీలను నికృష్టముగ దాసీలనువోలెఁ గాంచువారివిషయము నెఱిఁగి తగిననీతిని గఱచుట కుపయుక్తము. దీనిని భట్టారకుఁడు తప్పక యెఱిఁగింపవలసినవాఁడై యుండెను.

ఆత్మనో జన్మనః క్షేత్రం పుణ్యం రామాస్సనాతనం,
ఋషీణామపి కా శక్తిః స్రష్టుం రామామృతే ప్రజాః.

స్త్రీలనాదిసిద్ధమైన యాత్మోత్పత్తిక్షేత్రములు. బీజోత్పత్తికి క్షేత్రము లెట్లో పుత్ర రూపమునం దా నుద్భవించుటకు స్త్రీలునట్టివారే. స్త్రీ లేనిదే సంతానముం గనుటకు ఋషులకు సైతము శక్తి యెక్కడిది ?

ఇంకం బుత్రునిగూర్చి యామె దెలిపినధర్మవిశేషములు, వానిం బోషింపవలసిన యావశ్యకతయు నవశ్యముగం దెలియందగినవి.

పరిపత్య యదా సూను ర్ధరణీరేణుగుంఠితః, పితురాశ్లిష్య తేఽఙ్గాని కిమి వా స్త్యధికం తతః.

నేలమీందం బొరలి బూడిదచేఁ జిన మేనితోం బుత్రుండు వచ్చిపడి కౌంగిలించుకొను నప్పుడు తండ్రికిం గలుగు నానందముకంటె నధికమైనసంతోషవిషయ మే ముండును. ఈయభిప్రాయమును కాళిదాసు తనశాకుంతలమునందును విడువక యీక్రిందిశ్లోకమునం జక్కంగం జిత్రించినాండు.

అలక్ష్యదంతముకులా ననిమిత్తహాసై, రవ్యక్తవర్ణరమణీయవచః ప్రవృత్తీన్
అంకాశ్రయప్రణయినస్తనయాన్వహన్తో, ధన్యా స్తదంగరజసా మలినీభవన్తి.

కారణములేనినగవులతో మాటిమాటికి మొగ్గలవంటిదంతములను గానంజేయు వారును, స్పష్టముగాని వర్ణములుగల ముద్దుపలుకులగులకరించువారును, ఒడిలోంబడుట కుత్సుకులునగుపుత్రుల నెత్తుకొని ధన్యాత్ములైనవారే వారియొడలిబూడిద నలముకొనం జాలెదరు.

ఈ ప్రసంగముననే హృదయమున గ్రుచ్చుకొనుమాట వెలువడిన దామెనోట.

అండాని బిభ్రతిస్వాని నభిన్దన్తి పిపీలికాః, నభరేథాః కథం నుత్వం ధర్మజ్ఞః సన్స్వమాత్మజమ్.

అల్పజంతువులగు చీమలుసైతము తాము కనినగ్రుడ్లను నోటంగఱచుకొని జాగ్రతతోం బెంచునుగదా! సమస్తధర్మముల నెఱింగిననీవు నీ కుద్భవించినయీపుత్రు నేలభరింపవో యెఱుంగరాకున్నది! పుత్రులను తప్పక భరింపవలయుననుటలో నీయుక్తి సహృదయుల హృదయములను దల్లడంబడంజేయకమానదు.

దుష్యంతుం డెన్నివిధములం దనవివాహాసత్యతనుగూర్చి తెలిపినను వినక, శకుంతల పలుకులను నమ్మక పొమ్మనినపు డామె తన యుత్కృష్టత నిట్లుగ్గడించినది.

రాజ న్సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి, ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి నపశ్యసి.
మేనకా త్రిదశేష్వేవ త్రిదశాశ్చానుమేనకామ్, మమైవో ద్రిచ్యతే జన్మ దుష్యన్తతవజన్మతః.
క్షితావటసిరాజం స్త్వమన్తరిక్షేచరామ్యహమ్, ఆవయోరన్తరం పశ్య మేరుసర్షపయోరివ.
మహేన్ద్రస్య కుబేరస్య యమస్య వరుణస్యచ, భవనా న్యాశు సంయామి ప్రభావం పశ్యమేఽనఘ.
సత్యశ్చాపి ప్రవాదోఽయం యం ప్రవక్ష్యామి తేఽనఘ, నిదర్శనార్థం న ద్వేషాత్ తచ్ఛ్రుత్వాక్షన్తు మర్హసి.

రాజా! ఇతరులరంధ్రముల నావగింజలంతలను లెక్కించుచున్నావు. నీ వొనర్చినవి బిల్వఫలము లంతటివైనను లెక్కింపకుంటివి. మేనక దేవతలలో వన్నెకెక్కినది. మేనక ననుసరించియే దేవతలు పెద్దగం గొనియాడంబడుచున్నారు. కావున నీపుట్టుకకంటె నాపుట్టుకయే గొప్పది. నీవు భూమియందుమాత్రమే సంచరించెదవు. నే నాకసమున సంచరించెదను.

కావున మనయిద్దఱకును ఆవగింజకు మేరుపర్వతమునకును గలయంతర మున్నది. నేను దేవేంద్రుఁడు కుబేరుఁడు వరుణుఁడు యముఁడు మున్నగువారి భవనములకుఁ దలఁచిన వెంటనే పోయెదను. నా ప్రభావము చూడుము. నీకు నేఁ జెప్పినదంతయు సత్యమేగాని యొండుగాదు. నీకుఁ దార్ఢ్యమునకై చెప్పుచుంటిని. నన్ను క్షమింపుము.

పై విషయమంతయు శకుంతలకుఁగలసామర్థ్యమును వ్యక్తముసేయుచున్నది. ఇట్టి శక్తిగలదిగనుకనే ధార్మికభాషణము నంతవిశిష్టముగఁ జేయఁగలిగినది. ఈరీతి సమాధాన మామెయెడ ధార్ష్ట్యమును వ్యక్తముసేయునదియేయైనను ఇతిహాసమున బాధించునది గానేరదు. కావుననే.

> సుసంరబ్ధోఽపి రామాణాం నకుర్యా దప్రియం నరః,
> రతిం ప్రీతించ ధర్మంచ తాస్వాయత్తమవేక్ష్యహి.

పురుషుఁడు స్త్రీ తన కెంతకోపముగలిగించినను నామెమనస్సు నొచ్చునట్టిపనిచేయ రాదు. తృప్తి ప్రీతి ధర్మము వారలయధీనము కావున వారు వ్యతిరేకించిన న వన్నియుఁ జెడును.

> త్వామృతేఽపి చ దుష్యన్త శైలరాజావతంసకాం,
> చతురన్తా మిమా ముర్వీం పుత్రో మే పాలయిష్యతి.

ఓదుష్యన్తా! ఈ నాపుత్త్రుఁడు, నీ వాదరించి పోషింపకున్నను పర్వతరాజభూషితమై చతుస్సముద్రముద్రితమైన యీభూవలయమును బాలింపఁగలఁడు. అనియు ననినది.

స్త్రీలకుఁగలపాతివ్రత్యపటిమ నుగ్గడించుచు, స్త్రీజాతి కత్యంతగౌరవాపాదకములు సన్మార్గప్రదర్శకము లనగు నీధార్మికవచనములు నన్నయభట్టారకునినోట వెలువడియుండినచో నెంత సమంజసముగ నుండెడివో? ధర్మబోధైకతత్పరుఁడగు నామహనీయుఁ డీయంశము నేల యనువదింపకుండెనో విమర్శకు లరసెదరుగాక.

మఱియొక్క ఘట్టమునఁ గూడఁ బ్రవేశింతము. ధృతరాష్ట్రుని యాదేశమునఁ బాండవులు వారణావతమునకుఁ బోవునపుడు, వారివెంటనంటి సాఁగఁబంపుచు "విదురుఁ డొరులు వినియు నెఱుంగరాని వచనంబుల బహుప్రకారవచనరచనా విశారదుండైన యుధిష్ఠిరున కెల్లకార్యంబులు గఱపెను." భట్టారకానువాదమున నాకార్యము లేవియో యిట్లో యెఱుఁగఁబడుటలేదు. అంతటఁ గుంతి ధర్మరాజును డాయవచ్చి యిట్లనియె—

గీ. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగఁ, గాని యట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి
నట్లచేయుదు నంటి నీ వతనిమతము, సెప్ప నగునేని యెఱుఁగంగఁ జెప్పుమయ్య. (భార. ఆది. ౬. ౧౪౪.)

వ. అనిన నగుచు ధర్మతనయుండు విదురువచనంబులయభిప్రాయంబులు దల్లి కిట్లని చెప్పె.

ఆ. వె. ఎల్లకార్యగతులు నెఱుఁగుదు రయినను, నెఱుఁగఁ జెప్పవలయు నెఱిఁగినంత
కనికరము లేక మిమ్ముఁ బాపినకురురాజు, హితుఁడపోలె మీఁద నెగ్గుసేయు.

వ. కావున మీర లేమఱక విషాగ్నులవలన నప్రమాదులరై బుద్ధిగలిగి యుండునది; యని కఱపి మఱియు దురోధను చేసెడు దుష్క్రియ లిమ్ముగా నెఱింగి వానికిం బ్రతీకారము సెప్పి పుత్తెంచె ననియె.

(భార. ఆది. ౬. ౧౪౬, ౧౪౭.)

విదురుఁడు, ధర్మరాజునకుమాత్రమే యెఱుఁగఁబడి, దగ్గరనున్న భీమాదులకునైత మెఱుఁగరాకయుండెడి తెఱఁగున వారణావతమునకు ధృతరాష్ట్రుఁ డంపువిధమును, అక్కడి లాక్షాగృహనిర్మాణమును, దానివలనఁ గలుగనున్న యనర్థమును, దాని నుత్తరించునుపాయములు మున్నగువానిని మ్లేచ్ఛభాషలో నుపన్యసించెను. ఆశ్లోకము లీక్రిందివి.

అలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనమ్, యో వేత్తి న తు తం ఘ్నన్తి ప్రతిఘాతవిదం ద్విషః.

లోహనిర్మితముగానిది తీక్ష్ణమైనది శరీరమును ఛేదించునదియు నగు శస్త్రము నెవఁ డెఱుఁగునో, శత్రువు చేయుదానికి బదులుగఁ జేయ నెఱుఁగు నాతని నెవరును బాధింపఁ జాలరు. ఇది సామాన్యముగ స్ఫురించునర్థము. ఇఁక మ్లేచ్ఛభాషావశమున వర్ణలోపము వర్ణాధిక్యము వర్ణవికారము మున్నగునవి యేర్పడుటచేఁ దెలివయర్థము తననిజస్వరూపమును గప్పిపుచ్చి యితరులకు హానిని గలుగఁజేయునదియు, అగ్నిసమూహము నెగయఁ జేయు ద్రవ్యములతోఁ గూడినదియు, నగు నాగృహము రాత్రియందు మిమ్ములను గాల్చుటకు నిర్మింపఁబడినది. శత్రు వేర్పఱిచిన యీహింసాపద్ధతిని దెలిసిన మిమ్ముల నాతఁ డేమియుఁ జేయఁజాలఁడు.

కక్షఘ్నః శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలేశయః, న దహేదితి చాత్మానం యో రక్షతి స జీవతి.

పెద్దపొదలో కలుగునందున్న పాము చలిని వేడిని దూరము చేయుచు పొదతగులఁ బడినను నది చావదు. ఈరీతి నెఱిఁగి యెవఁడు తన్నుఁ దారక్షించుకొనునో యాతఁడు జీవించును.

రెండవయర్థము—పార్శ్వమునఁ జరించువాఁడు పురోచనుఁడే ఆయింటికి నిప్పుముట్టించుట కేర్పడినవాఁడు. ప్రబలమైనశత్రు వేర్పడియున్నపుడు ప్రత్యక్షముగఁ బ్రతీకారము చేయరాదు. బిలములోపలఁ (సొరంగమున) బ్రవేశించినచోఁ బైన నిప్పంటుకొనినను తగులఁ బెట్టఁబడక మిమ్ములను మీరు రక్షించుకొనఁగలరు. ఈరీతిగ మెలకువగలిగియున్నపుడే జీవింతురు.

నాచక్షుర్వేత్తి పన్థానం నాచక్షుర్విన్దతే దిశః, నాధృతిర్బుద్ధిమాప్నోతి బుధ్యస్వైవం ప్రబోధితః.

కన్నులులేనివాఁడు మార్గము నెఱుఁగలేఁడు. సరిగాఁ జూడనివాఁడు దిక్కుల నెఱుఁగఁజాలఁడు. ధైర్యములేనివాఁడు సరిగ నాలోచింపలేఁడు. మేలుకనినవాఁడవై యిట్లెఱుఁగుము.

వివేకములేకున్న నాపత్సమయమున బయటకుఁ బోవుటకు మార్గము తెలియదు. దిక్కులు గానరావు. ధైర్యములేకున్న సంపదయు చేఁబడదు. కావున నతివివేకముతో నప్రమత్తులరై యుండుఁడు.

అనాప్తైర్దత్తమాదత్తే నరశ్శస్త్రమలోహజమ్, శ్వావిచ్ఛరణమాసాద్య ప్రముచ్యేత హుతాశనాత్.

మనుజుఁడు శత్రువులు నిర్మాణముచేసిన లోహరహితశస్త్రముయొక్క వాతఁబడును. ఏదుపంది నివసించెడిచోటువంటి చోటును (రెండువైపుల ముఖముగలిగిన బొరియను) ఆశ్రయించినచో శత్రుప్రయోగమునుండి విడువఁబడును.

అనాప్తులైన శత్రువులు అగ్నిని రగుల్కొల్పు ద్రవ్యములతో నిండిన గృహమును తయారుచేసియున్నారు. దాని నిప్పును మీరు స్వీకరింపవలయును. ఏనుపంది బొరియ వంటి యుభయముతోముఖమైన సొరంగము నేర్పఱచుకొని, యందుండి యగ్నిప్రమాదమువలనఁ దప్పించుకొనవలయును.

చరన్మార్గాన్విజానాతి నక్షత్రైర్విందతే దిశః, ఆత్మనా చాత్మనః పంచపీడయన్నానుపీడ్యతే.

ఎల్లపుడు తిరుగుచుండినచో మార్గములు తెలియును. నక్షత్రములనుబట్టి దిక్కులను దెలిసికొనవచ్చును. తనపంచేంద్రియములను వశమునందుంచుకొనినచో నితరులచేఁ బీడింపఁబడఁడు. పగలంతయు నడవులందుఁ దిరిగి ఏమార్గ మెక్కడికిఁబోవునో యెఱుఁగవలయును. బిలములోఁ బ్రవేశించిన మీరంధకారమున నక్షత్రములనుబట్టి దిక్కుల నెఱుఁగవలయును. ఇంద్రియనిగ్రహముగలిగి ధైర్యమువహించినచో శత్రువులు మిమ్మేమియుఁ జేయఁజాలరు. తిరిగి మీరాజ్యము మీకు లభించును.

ఏవముక్తః ప్రత్యువాచ కుంతీపుత్రో యుధిష్ఠిరః, విదురం విదుషాం శ్రేష్ఠం జ్ఞాత మిత్యేవ పాండవః.

ఈరీతిగ విద్వాంసులలో శ్రేష్ఠుఁడైన విదురుఁడు తెలిపినంతనే ధర్మరాజతనితో "తెలిసె" ననెను.

ఇంతటి యర్థవిశేషము గలిగి భావికార్యార్థమును సూచించువిషయమును వ్యాసభట్టారకుఁ డతినిగూఢముగ నెఱిఁగింప, నీలకంఠాదివ్యాఖ్యాతృమహోదయు లీయర్థమును దేటతెల్లముసేయ, భారతఘట్టోల్లంఘనపటిష్ఠగాఢ ప్రతిభుఁడగు నన్నయభట్టారకుఁడు అనువదింపక వదలినాఁడు. శ్లేషప్రచురము మ్లేచ్ఛవాగ్గుంభితమునగు నీఘట్టము తెనుఁగునకు దెచ్చుట యతిదుర్ఘటము కాని వచనరూపమునఁ గొంతవఱకైన నెఱిఁగించుట యత్యావశ్యకము. ఏమందురా? కొంతకాల మేఁగినపిమ్మట సొరంగమును ద్రవ్వుటకై విదురుఁ డంపినఖనకుఁడు, ధర్మరాజు తన్నుగుర్తించి విశ్వసించుట కాన వాలుగ—

"కించిచ్చ విదురేణోక్తో మ్లేచ్ఛవాచాసి పాండవ, త్వయాచ తత్తథేత్యుక్త మేత ద్విశ్వాసకారణమ్."

అని దెలిపినాఁడు. (ధర్మరాజా! విదురుఁడు నీకు మ్లేచ్ఛభాషతోఁ గొంతవిషయమును దెలిపినాఁడు. ఆవిషయమున నీవును అట్లే యని సమాధాన మిచ్చియుంటివి. కావున నిది నన్ను విశ్వసించినట్టుకుఁ దార్కాణము.)

ఈవిషయమునుగూడ ననువాదమున స్పష్టముసేయక సూచనామాత్రసారముగ నిట్లు తెలిపినాఁడు. "అట హాస్తిపురంబున విదురుండు దుర్యోధనుదుర్మంత్రంబంతయు నిమ్ముగా నెఱింగి కడువిశ్వాసి నొక్కఖనకు నతికుశలుం బాండవులపాలికిం బుత్తెంచినవాఁడును వచ్చి రహస్యంబునఁ బాండవులఁ గనిఁ తన్ను నమ్మునట్లుగా సాభిజ్ఞానవచనంబు లెఱింగించె." వెనుక శ్లోకముల కనువాదము లేమినిక నిచట నింతమాత్రమే తెలుపవలసివచ్చెను. ఇంతియగాదు. "అటఁ బాండవులును భాగీరథి లంఘించి" యని ఒకయధ్యాయమునందలి విషయ మర్ధవాక్యముతో ముఁగింపవలసివచ్చెను. ఈయధ్యాయమునందును పైశ్లోకముల పరామర్శము గలదు.

ఏతస్మిన్నేవకాలేతు యథా సంప్రత్యయం కవిః, విదురః ప్రేషయామాస తద్వనం పురుషం శుచిమ్.
సగత్వాతు యథోద్దేశం పాండవాన్దదృశేవనే, జనన్యాసహకౌరవ్య మాపయానాన్నదీజలమ్.
విదితం తన్మహాబుద్ధే ర్విదురస్య మహాత్మనః, తతస్తస్యాపి చారేణ చేష్టితం పాపచేతసః.
తతః ప్రవాసితో విద్వాన్విదురేణ నరస్తదా, పార్థానాం దర్శయామాస మనోమారుతగామినమ్.
సర్వవాతసహాంనావం యన్త్రయుక్తాం పతాకినీమ్, శివే భాగీరథీతీరే నరైర్విస్రంభిభిఃకృతాన్.
తతః పునరథోవాచ జ్ఞాపకం పూర్వచోదితం, యుధిష్ఠిరనిబోధేదం సంజ్ఞార్థం వచనం కవేః.
కక్షఘ్న శ్శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః, నహన్తీత్యేవ మాత్మానం యోరక్షతి సజీవతి.
తే న మాం ప్రేషితం విద్ధి విశ్వస్తం సంజ్ఞయానయా.

పాండవులు సొరంగమునంతను గడచి గంగానదియొడ్డునకుఁ జేరినసమయమునందే ఊహాపోహాకుశలుఁడగువిదురుఁడు, ఆనవాలుతోఁగూడఁగఁ బరిశుద్ధుఁడగు నొకపురుషుని పాండవులుచేరువనమున కంపెను. ఆపురుషుఁడును విదురుఁడు తెలిపినయడవిలో వారినిఁ గనెను. వారును దల్లితోఁగూడి యాసమయమున గంగాజలమునందలిలోఁతును దెలిసికొనుచుండిరి. పాపమును జేయ సమకట్టినదుర్యోధనుని చారుఁడగుపురోచనుఁడు చేయనెంచిన దౌష్ట్యము విదురుఁ డెఱిఁగియుండుటచే నాచారునిఁ బంపెను. విదురునిచేఁ బ్రవాసితుఁడైన యానరుఁడు మనోవాయువేగములు గలదియు, జండాలతోఁగూడినదియు, వలయు సాధనములతోఁగూడినదియు నగునావను బాండవులకుఁ జూపించెను. ఆనావయుఁ బవిత్రమైన భాగీరథీజలమున విశ్వాసపాత్రులైన మనుజులచే నమర్పఁబడియుండెను. తరువాత నాపురుషుఁడు పూర్వమం దెఱిఁగింపఁబడినది జ్ఞాపకమునైన విదురునివాక్యమును ధర్మరాజునకు గుర్తుతెచ్చుట కిట్లనెను. ధర్మజా! నేఁ జెప్పునది వినుము. "కక్షఘ్నశ్చ" ఇత్యాదిశ్లోకముల నీకెవఁడుచెప్పెనో నన్నాతఁడు పంపినట్లు తెలిసికొనుము. ఈయానవాలుచే నన్ను విశ్వసింపఁదగినవానిఁగా నెఱుఁగుము.

శ్లోకరూపమయిన యీయానవాలు ధర్మరాజునకు విదురునకుఁగాక యొరులకుఁ దెలియదు. కావున ధర్మరాజు నాపురుషునినమ్మి యానావపై నెక్కి ప్రచ్ఛన్నముగ గంగానదిదాఁటుట యేర్పడినది.

ఇట్టియంశము లింకను నెన్నియో సంస్కృతభారతమున నున్నవి భట్టారకునియనువాదమునఁ బ్రవేశింపలేదు. ప్రధానమయినయంశములు లేకుండుట కొఱఁత యనక తప్పదు. నాఁటియామహనీయుల యాశయము లేమయియుండునో యీనాఁడు మన మూహించుటయు కడునశక్యము. ఏమయినను భారతమును నాంధ్రమున నవతరింపఁజేసిన యామహనీయుల కవితావైభవ మద్వితీయము.

ఆంధ్రభారతపాఠకులకు సాంజలిబంధముగ నొక్క విజ్ఞప్తి. మహనీయులార! నన్నయభట్టారకుని భారతమును బఠించుతఱి వ్యాసభట్టారకునిభారతమునుగూడ జోడించి చదివి, సంపూర్ణమైన విజ్ఞానమునంది కృతార్థులగుదురు గాక.

# శ్రీ నారాయణ తీర్థులు

(జీవిత చరిత్రాదికము)

స్వామి శ్రీ శివశంకర శాస్త్రి
తీర్థాశ్రమము: వేటపాలెము.

## ౧

కొందరు బహుగ్రంథములు రచించినను ఒక్కగ్రంథమువలననే వారినామము లోకములో వ్యాప్తమగుచుండును. శ్రీనారాయణ తీర్థులవారు వివిధదర్శనగ్రంథములు రచించినను శ్రీకృష్ణలీలాతరంగిణివలననే ఆయనకు జగద్విఖ్యాతివచ్చినది. ఏమాత్రము భక్తిపరులయినను ఈషన్మాత్రము సంగీతజ్ఞానముకలవారయినను కృష్ణలీలాతరంగిణిని పఠించి కాని, పాడికాని, ప్రమోదము చెందుచుందురు. కోవిదులకు, గాయకులకు, యత్కించిద్విద్యావంతులకు, జనసామాన్యమునకును కమనీయమార్గమున కృష్ణభక్తిని రేకెత్తించు కావ్యము సర్వజనసమాదరణీయమ్మగుట సముచితమే.

"పాండిత్యహీనాః కవయో భవన్తి" అను ఆభాణకము చాలవరకు సత్యమే. రాగతాళయుక్తములైనకృతులు, పదములు రచించువారెల్లరును పండితులనుటకు వీలులేదు. కాని గీతికావ్యములందు సర్వోత్కృష్టమైన కృష్ణలీలాతరంగిణీకర్త సంగీతవిద్యానిధియే కాక షడ్దర్శనీపారగుడు. ఆయన యెన్నిగ్రంథము లేయేసందర్భములలో రచించినాడో ప్రకృతమున బయలుపరచు నవకాశములేదు. ఉన్నగ్రంథములనుబట్టి ఆయన ఉత్తమకవి యనియు, పండితు డనియు బహుపారదృశ్వ యనియు ప్రస్ఫుటము.

తత్కృతులలో నేటికి లభించినవి పండ్రెండు. శాండిల్య భక్తిసూత్రవ్యాఖ్య, భక్త్యధికరణమాల, భక్తిసిద్ధాంతసంబంధములు సాంఖ్యకారికావ్యాఖ్య, సాంఖ్యతత్త్వకౌముదీవ్యాఖ్య సాంఖ్యపరములు. నామమును బట్టియే న్యాయకుసుమాంజలి టీక, న్యాయముక్తావళీటీకయు తర్కశాస్త్రగ్రంథములు. భాట్టభాషాప్రకాశము పూర్వమీమాంసా గ్రంథము. యోగసూత్రవ్యాఖ్య, సిద్ధాంతబిందు లఘుచంద్రిక, వేదస్తవటీక, వేదాంతవిభావనాటీక తీర్థులవారి గ్రంథజాలములోనివి. ఇందు కొన్ని ముద్రితములు, అముద్రిత గ్రంథప్రతులు కాశీ విశ్వవిద్యాలయ పుస్తకభాండరములో నున్నవి.

కొందరు కొందరు కవులు, విద్వాంసులు తమపుస్తకములకు లాంఛనములుంచుట కానవచ్చుచున్నది. భారవి 'కిరతార్జునీయమును' లక్ష్మీపదలాంఛితము చేసినాడు. మాఘుని 'శిశుపాలవధము' శ్రీపదాంకితము. వేరొకకవి తనకృతి ఆనందాంకితము కావించినారు. వ్యాఖ్యాతలుకూడ నిట్లే చేసినారు. తీర్థులవారు నిజవ్యాఖ్యలు చంద్రికాలాంఛితములు చేసినారు. కొన్ని లఘుచంద్రికలుగాను, కొన్ని గురుచంద్రికలుగాను గానవచ్చుచున్నవి.

వీనిలో భాట్టభాషాప్రకాశమును పూర్వాశ్రమములో ప్రారంభించి నారాయణ తీర్థులు సన్న్యాసాశ్రమములో ముగించినారు.

"భగవచ్ఛివరామ తీర్థశిష్యో ముని నారాయణ తీర్థనామధేయః
వ్యతనో దధికాశి భాట్ట భాషా గ్రథనం భాట్టనయ ప్రకాశహేతోః."

అని భాట్టభాషాప్రకాశములో కానవచ్చును.

తీర్థులు వాసుదేవపండితునికడ సర్వశాస్త్రము లభ్యసించినట్లును, రామగోవింద శిష్యులైనట్లును ఈశ్లోకమువలన తెలియుచున్నది.

"శ్రీరామ గోవింద సుతీర్థపాద కృపావిశేషా దుపలబ్ధ బోధమ్,
శ్రీవాసుదేవాదధిగత్య సర్వ శాస్త్రాణి వక్తుం కిమపి స్పృహా నః."

ఈశ్లోకము భక్త్యధికరణ మాలాశాండిల్య సూత్ర వ్యాఖ్యలోనిది.

శ్రీనారాయణతీర్థుల గురుపరంపర:— శ్రీరామ గోవింద తీర్థులు (శివరామతీర్థులు) గోపాల సరస్వతి, గోవింద సరస్వతి, రామానందులు. పూర్వాశ్రమములో రామానందుల నామధేయము వారణాసి ధర్మభట్టు. ఈయన సాహిత్యరత్నాకరము, రత్నప్రభావ్యాఖ్య రచించినారు.

శ్రీనారాయణతీర్థుల శిష్యపరంపర:— నారాయణతీర్థులు, గౌడ బ్రహ్మానందులు, కాశ్మీరక సదానందులు, ఆంధ్రమహేశ్వరతీర్థులు.

లఘుచంద్రికావ్యాఖ్యాయామ్:

"శ్రీనారాయణతీర్థానాం గురుణాం చరణస్మృతిః, భూయాన్మే సాధి కేష్టానా మనిష్టానాం చ బాధికా.
అద్వైతసిద్ధివ్యాఖ్యానం బ్రహ్మానందేన భిక్షుణా, సంక్షిప్తచంద్రికార్థేన క్రియతే లఘుచంద్రికా.
మహానుభావధౌరేయ శివరామాఖ్యవర్ణినః, ఏతద్గ్రంథస్య కర్తారః లేఖకాః కేవలం వయమ్.
శ్రీనారాయణ తీర్థానాం షట్‌శాస్త్రీపార మీయుషామ్, చరణౌ శరణీకృత్య తీర్ణస్సారస్వతార్ణవః.

మహేశ్వర తీర్థస్య రామాయణవ్యాఖ్యాయామ్,

"ప్రణమ్య నారాయణతీర్థదేశికాన్, భవానకార్తామృత పూరనీరదాన్
కరోతి రామాయణ తత్వదీపికాం, మహేశ తీర్థాఖ్య ముని ర్యథామతి.

ఏకవాక్యములో సగుణ నిర్గుణములను బోధించుశక్తి విద్యాశంకరులతరువాత నారాయణ తీర్థులవారికే కల దనియు, వాచస్పతిమిశ్రుని, మధుసూదనసరస్వతిని మించెడి ప్రజ్ఞ కల దనియు, కాశీపండితులు, తీర్థులవారి గ్రంథభూమికలో లిఖించినారు.

౨

శ్రీనారాయణతీర్థులవారి విశేషములు పరిశోధనవలనగాని బయలుపడవు. ఉడయార్పాళెయము రాజావారు ప్రకటించిన 'కృష్ణలీలాతరంగిణి' ప్రస్తావనలో విశ్వనాథ సత్యనారాయణగారు పద్యరూపమున రచించినకథలో తీర్థులవారు కూచిమంచి అగ్రహారనివాసి యన్నట్టు స్ఫురించును.

డాక్టరు మాడభూషి కృష్ణమాచార్యుల సంస్కృతసాహిత్య చరిత్రలో మాధవానల కవి బిల్హణుడుగా, బృహన్మంగళుడుగా, జయదేవుడుగా, తుదకు నారాయణతీర్థ

లుగా అవతరించినట్టు కానబడుచున్నది. తీర్థులవారు శివరామానంద శిష్యు డనియు క్రీ. శ. 1700 ప్రాంతము వాడనియు, కూచిమంచి అగ్రహారనివాసి యనియు లిఖించియున్నది.

శ్రీ కామకోటి పీఠాధిపతులు వ్రాయించి పంపినపత్రికలో క్రిందివిషయములు కలవు.

'శివోత్సవము' అను గ్రంథములో మూడవపుటలోను, ప్రస్తావనాదికములోను, నారాయణతీర్థులచరిత్రయు, పటమును గలవు. తీర్థులు ఆంధ్రబ్రాహ్మణుడు, కృష్ణాతీరనివాసి. కృష్ణ కావలియొడ్డుననున్న వేదాద్రి క్షేత్రము ఆయన యత్తవారియూరు. ఒకనాడు తీర్థులు కృష్ణయీదుకొనిపోవుచుండగా ప్రాణాపాయస్థితి యేర్పడినది. గత్యంతరము కానక ఆయన ప్రైషోచ్చారణచేసి, మానసికముగా ఆపత్సన్న్యాసము నవలంబించినారు. ఇంతలో చేతికి ఆలంబనము దొరకినది. ఇంటికి బోయి, భార్యాస్వీకృతి పడసి సక్రమసన్యాసము స్వీకరించి దేశాటనము ప్రారంభించినారు. కాలక్రమమున దక్షిణదేశములో 'వరఘూరు' చేరినారు. తంజావూరు జిల్లాలో కావేరికి ఉపనది యగు 'కుడుముపత్తికి' దక్షిణతీరమున ఆగ్రామమున్నది. కొంతదూరమున, ఆయుపనదీతీరముననేయున్న 'తిరుప్పూంతుర్తి' గ్రామములో నారాయణతీర్థులు సిద్ధిపొందినారు. తిరువాడునుండి తిరుక్కట్టిపల్లికిబోవు రాజమార్గముననే యీగ్రామము లున్నవి. ఈమహాపురుషునిసిద్ధి రోజున ప్రతిసంవత్సరము ఉత్సవము జరుగుచుండును. బోధేంద్రసరస్వతీస్వామి నారాయణతీర్థులశిష్యుడు. కుంభకోణమునకు తూర్పున రమారమి యేడుమైళ్ళదూరములో నున్న గోవిందపురగ్రామములో ఆయన నివసించుచుండెడివారు.

సంగీతవిద్యాచార్యులైన శ్రీ సాంబమూర్తిగారు వ్రాసినవిషయములకు సంగ్రహము.

నారాయణతీర్థులు జయదేవునియవతారము. క్రీ. శ. 17 శతాబ్ది చివరలోనివాడు. తంజావూరుజిల్లాలోని తెలుగుబ్రాహ్మణుడు. విజయనగరరాజులకాలములో తెలుగుబ్రాహ్మణులు ద్రవిడదేశమునకు వచ్చి నివాసము లేర్పరుచుకొన్నారు. ఆయనతండ్రి గాంధర్వదేవుడు, తల్లి పార్వతి. తీర్థులు చిన్నతనముననే గొప్పవిద్వాంసుడయినాడు, సంగీత భరతనాట్యములందు ప్రవీణుడు. తంజావూరుజిల్లాలోని వెణ్ణాడునదికి ఆవలితీరమున ఆయన యత్తవారియూరు. ఈతగాడగుటచే ఆయన ప్రతిదినము నది యీది భార్యకడకుబోవుచుండువాడు. ప్రవాహవేగమువలన ప్రాణములమీదియాశపోగా ఆపత్సన్న్యాస మవలంబించినాడు. అనంతరము సశాస్త్రీయసన్యాసము స్వీకరించి నిజస్థానము విడిచి, ఆంధ్రదేశమునకు బోయి చల్లపల్లి ముక్త్యాలసంస్థానములలో కొంతకాలమున్నాడు. కాలక్రమమున కడుపునొప్పివలన తిరుపతికి జని స్వామిదర్శనముచేసి, తదాజ్ఞాప్రకారముగా దక్షిణమున వరఘూరుపోయి ఆలయముకట్టించి మూలస్థానప్రతిష్ఠ, చక్రప్రతిష్ఠచేసినారు. ఆరోగ్యముకలిగినది. మూలవిగ్రహమును, పూజాసామగ్రియును నేటికిని కలవు. అక్కడ తీర్థులు రెండుమూడుసంవత్సరములు నివసించినారు. వరఘూరు పూర్వనామము భూపతిరాజపురము. మహాభక్తుడయిన తిరుజ్ఞానసంబంధార్ కీర్తించిన తిరుపుంతిరుత్తి అనుగ్రామ

ములో మాసీనెల శుక్లపక్షాష్టమీ, కృత్తికానక్షత్ర గురువాసరమున జీవసమాధిలోనికి బోయినారు. ఆయన ప్రతిదినము మామిడిచెట్టు క్రింద గూరుచుండువారు. అది సమాధికి ఉత్తరదిక్కున నున్నది. వరఘూరాలయములో తీర్థులచిత్తరువు, గోపాలభాగవతారుల చిత్రపటము కలవు. శొంఠి వెంకటసుబ్బయ్య ప్రభృతులు తీర్థులశిష్యకోటిలోని వారు. తీర్థులానాడు ప్రతిష్ఠించిన శిక్యోత్సవము (ఉట్లపండుగ) నేటికిని భాద్రపదమాసమున జరుగుచుండును.

డాక్టర్ వి. రాఘవన్ ఇట్లు వ్రాసినారు: నారాయణతీర్థుల జీవితవిశేషములు తెలియవు. తీర్థులు త్యాగరాజుకంటె పూర్వుడు. ఈయన కృష్ణలీలాతరంగిణి వరఘూరులో రచించినాడు. తంజావూరు పుస్తకభాండారములో 'పంచకోశమంజరి' అనుగ్రంథము తీర్థుల శిష్యుడు రచించినది కలదు. ఆవ్రాతప్రతి తంజావూరు తులజాప్రభువుది. ఆయన క్రీ. శ. 1765 - 1782 కాలములో పరిపాలనచేసినవాడు. కాబట్టి తీర్థులు అంతకుపూర్వుడు. తెలుగులో పారిజాతాపహరణమును పారిజాతనాటకమును యక్షగానముగా తీర్థులు రచించినారు. అందలి తుదికీర్తనలో అచ్యుతాబ్ధిప్రభో వరదరాజ అనుచరణ మున్నది. మెరట్టూరుకు అచ్యుతాబ్ధి యనునామాంతరము కలదు. అచ్యుతప్పనాయకుడు క్రీ. శ. 1561 - 1614 లో పరిపాలకుడు. అచ్యుతప్పనుబట్టి మెరట్టూరుకు అచ్యుతాబ్ధి యనుపేరు వచ్చినది. తీర్థులు ఉభయప్రభువులమధ్యకాలములోవాడు.

నారాయణ తీర్థుల గ్రంథములు:—

1. కృష్ణలీలాతరంగిణి. ఒ. యం. యల్ లో కృష్ణలీలాతరంగిణీవ్యాఖ్య అసంపూర్ణముగా నున్నది. దీనిని గోవిందతీర్థునిసాహాయ్యముతో వేంకటేశ్వరుడు రచించినట్లు కానవచ్చుచున్నది. దీనిసంఖ్య 4064.

2. హరిభక్తిసుధార్ణవము (సంస్కృతకావ్యము). భాగవత దశమస్కంధమునుబట్టి రచించినది. కొన్ని ప్రకరణములు లోపించినవి. సంఖ్య 12,782.

3. అద్వైతవేదాంతమున సురేశ్వరాచార్యుల పంచీకరణ వార్తికముమీాద వివరణ దీపిక అనువ్యాఖ్య. తంజావూరు పుస్తకభాండారము. సంఖ్య. 7306.

4. పారిజాతాపహరణము (తెలుగుయక్షగానము).

కొల్లూరు గ్రామవాస్తవ్యులు బ్రహ్మశ్రీ చెరవు లక్ష్మీనారాయణశాస్త్రులవారు వ్రాసిన విషయసంగ్రహము:—

నారాయణతీర్థులవారు పూర్వాశ్రమములో తల్లావజ్ఝల వంశములోవారు. కాజ గ్రామనివాసి. పేరు శ్రీగోవిందశాస్త్రి. తండ్రి పేరు శ్రీనీలకంఠశాస్త్రి. పరిణామశూలవలన బాధపడుచు తన్నివారణార్థము గుళ్ళమ్మ (అద్దంకి) కావలనున్న సింగరకొండగ్రామములోని నరసింహదేవాలయమునకు బోయి నలుబదిరోజులు స్వామికి ప్రదక్షిణములుచేయగా వ్యాధి కుదిరినది. గోవిందశాస్త్రి అచ్చటనే తరంగములు రచించి, అద్దంకిసీమలోని అరువదిగ్రామ

ములు

ములవారికి స్వయముగా నేర్పినాడని యచ్చటి పెద్దలు చెప్పుచున్నారు. ఆప్రాంతములో శిష్యపరంపర కలదు. గోవిందశాస్త్రి ఆకాలముననే యనేకనరసింహక్షేత్రములు దర్శించినాడు. కంచిలో శివరామతీర్థులవద్ద సన్యాస మవలంబించి నారాయణతీర్థనామము ధరించినాడు. క్రమముగా కాశీక్షేత్రము చేరి, అచ్చట బహుకాలముండి, భౌతికదేహము చాలించినాడు. మధుసూదనసరస్వతియంతవానిని వృద్ధః అని ఇట్లుండిన మేలని ఆ మునవాక్కులను సరిదిద్దినాడు. సంగీతసాహిత్యములలోను, షడ్దర్శనములలోను ప్రవీణుడు. అన్నిటిని మించి మహాభక్తుడు, జ్ఞాని. ఏతదాశ్రమగురువగు శివరామతీర్థులు, గురుచంద్రికాకర్త వి.శ. 1718.30, (క్రీ. శ. 1675) ప్రాంతములోవారు.

ఈవిషయము లేకాక, ప్రథమప్రకరణములోని గ్రంథనామాదికమును, ప్రమాణ వాక్యములనుగూడ లక్ష్మీనారాయణశాస్త్రులవారు సమకూర్చినారు.

## 3

తీర్థులు కాశిలో నివసించిరే కాని భౌతికశరీరమును దక్షిణదేశమున చాలించిరని విశ్వసింపవచ్చును. నేటికిని సంవత్సరోత్సవము జరుగుచుండుటయు, సమాధిస్థానము కానవచ్చుటయు ప్రబలనిదర్శనములు. ఆయన తెలుగుబ్రాహ్మణు డని యెల్లరు నంగీకరించిన విషయమే. తంజావూరు జిల్లాలో జన్మించినా డని యొక రన్నారు; తండ్రి పేరు గాంధర్వదేవు డన్నారు. ఈ రెండువిషయములను సమన్వయము చేయవలెను. ఒకవేళ తంజావూరు జిల్లాలో జనన మొందినను చిక్కు లేదు. తండ్రిపేరు మాత్రము సహజముగా లేక బిరుదనామమువలె నున్నది. నీలకంఠ శాస్త్రి యనునదే సహజము. ఆంధ్రదేశములోని ఐతిహ్యములనుబట్టి ఆయనపేరు గోవింద శాస్త్రి, తండ్రి నీలకంఠ శాస్త్రి, తల్లిపేరు తెలియదు. ఆయన గుంటూరు మండలాంతర్గత మగు కాజగ్రామనివాసి. ఒకవేళ కృష్ణాతీరమున వేదాద్రి కీవలియొడ్డు గ్రామమున కొంతకాలము నివసించి యుండవచ్చును. వాసిరెడ్డి ప్రభువులకు తల్లావఝ్ఝల వారిమీద ఆదినుండి నేటివరకును ఆదేశము కలదు. తల్లావఝ్ఝల వంశోద్భవుడైన గోవిందపండితుని తత్ప్రభువు లాదరించియుందురు. రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు తల్లావఝ్ఝల శ్రీరాజగోపాల శాస్త్రులవారికి అయాచితముగా నాలుగువందల యెకరముల ఖండ్రిక సమర్పించినారు.

నదీతీరవాసి యగుటచేతనే ప్రవాహములో నొకనాడు ప్రమాదము సంభవించినదని యూహింపవచ్చును. తల్లావఝ్ఝలవారు ఈతలో నిపుణులు. శ్రీకృష్ణ శాస్త్రి గారు కృష్ణానదిని బహుపర్యాయము లీదినారు. నరసింహశాస్త్రి గారు కృష్ణా, గోదావరీ, గంగానదుల నీదినారు.

నారయణతీర్థులు కూచిమంచి అగ్రహారనివాసి యని కొంద రన్నారు. దేశాటనము చేసినమహనీయుడు శిష్యవాంఛితమును బట్టి కొంతకాల మాప్రదేశమున నుండియుండును. అంతమాత్రమున కొన్నివందల సంవత్సరములనుండి తల్లావఝ్ఝలవారికి ఆటపట్టగు కాజ [illegible]

గ్రామనివాసము పరాస్తము కానేరదు. నేటికిని తద్వంశజులు భూగృహావసతులతో నచ్చట నున్నారు.

నారాయణ తీర్థులు తిరునల్వేలి జిల్లాలోని శీర్ణమహాదేవి గ్రామమునుండి బయలుదేరి కాశికి బోవుచు మంగళగిరిక్షేత్ర సమీపవర్తి యగు కాజా గ్రామమున ఆగె ననియు, ఆయనవెంట నారుమంచి కుటుంబమునకు జెందిన యొకసజ్జనుడును, తల్లావజ్ఝల నరసింహ శాస్త్రి గారును ఉండిరనియు, నరసింహశాస్త్రిగారు ఆరోగ్యము సరిగా లేకపోవుటచే కాజలోనే నిలిచిపోయి రనియు, తీర్థులవారు కాశికి వెడలి రనియు నొకానొక ప్రతీతి కలదు. శీర్ణమహాదేవి గ్రామములో నేటికిని తల్లావజ్ఝలవారు రమారమి రెండువందల గడప లవా రున్నారట. రామకృష్ణకవి (నామాంతరము శాస్త్రి) కుమారుడు వేంకట కృష్ణ శాస్త్రి తల్లావజ్ఝలవారికి మూలపురుషుడు. నేటికి రమారమి 475 సంవత్సరములనాటివారు. కాజ గ్రామములో తల్లావజ్ఝలవారికి మూలపురుషుడు నరసింహశాస్త్రిగారు. తీర్థులవారి వెంట వచ్చిన నరసింహ శాస్త్రియు ఈయనయు ఒకరో, భిన్నులో చెప్పుట కాధారము లేదు. సన్యాసి పర్యటనము చేయునపుడు పూర్వాశ్రమములోని పుత్రుని వెంటబెట్టు కొనరు. కాబట్టి ఆనరసింహశాస్త్రి నిజపుత్రుడు కాక సన్నిహితజ్ఞాతులలో చిన్నవాడు కావచ్చును. ఈవిషయము యథార్థమయినను కాకపోయినను బాధకము కానేరదు.




శ్రీకృష్ణశాస్త్రిగారు జీవించియున్నచో నిప్పటికి నూటనాలుగు సంవత్సరము లుండును. తండ్రికి కుమారునికి 30-35 సంవత్సరముల కాలవ్యవధి యంగీకరించుచో నారాయణతీర్థులవారు నరసింహశాస్త్రిగారు సమకాలికు లగుదురు.

తీర్థులవారు కాజలో జన్మించి పెరిగి, కాలక్రమమున దక్షిణదేశమునకుబోయి, శీర్ణమహాదేవిలో నుండి మరల ఉత్తరదేశమునకు బోవుచు అభిజనముమీది యభిమానముచే కాజకు జనియుండవచ్చును. తీర్థులతాతపేరు తెలియదు. ఆయనకు సంతాన మున్నట్టు తోచదు. యౌవనములోనే సన్న్యసించినట్టు స్పష్టముకదా!

## షష్టిపూర్తిసంపుటము

తల్లావఝ్ఝలవారికి మొదట పీసపాటివారు అని యింటిపే రయినట్లు వంశవృద్ధులు పూజ్యశ్రీ వేంకటశాస్త్రిగారు అన్నారు. ఇంతకంటె వేరుగా ఆధారము లేదు. తల్లావఝ్ఝలు అను మహనీయునివలన ఈయింటిపేరు వచ్చియుండుననని శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు గారు అన్నారు. అట్టిపేరు వంశవృక్షములో నేశాఖలోను గానరాదు. తల్లశబ్దము జ్ఞానార్థక మని విన్నాను. వఝ్ఝలు గురువు. ఇదే ఒజ్జ, ఓఝా, ఝా రూపములు పొందినది. వఝ్ఝలు జ్ఞానోపదేష్ట యని కొందరును, మంత్రగురు వని మరికొందరును నిర్వచించినారు. తల్లావఝ్ఝల వారిలో నేటికిని స్త్రీలకుకూడ అద్వైతవిద్యావిషయములు కరతలామలకములు. బ్రహ్మ వాదుల సంతతిలోనివా రగుటచేతనే ఎల్లరకును పరమార్థచింత ప్రధానముగా నున్నది. ఇందుచే తల్లావఝ్ఝలవారు జ్ఞానోపదేష్ట లనుటయే సమంజసము.

తీర్థులవారు పూర్వాశ్రమములో తల్లావఝ్ఝల వంశోద్భూతు లని లిఖితపూర్వక ముగా లేదు. కాని కృష్ణా, గుంటూరు, విశాఖపట్టణ మండలములోని కులీన బ్రాహ్మణులు తీర్థులు పూర్వాశ్రమమున తల్లావఝ్ఝల వంశమువా రని పరంపరాగతముగా తాము విను చున్నట్లు చెప్పుచున్నారు. వరివేసివారు, మల్లాదివారు, భాగవతులవారు, చెరువువారు, పురాణమువారు, నేతివారు, పుచ్చావారు, ప్రబలవారు, జంధ్యాలవారు, బలిజేపల్లి వారు, యనమండ్రవారు, కురుగంటివారు, ప్రఖ్యవారు, రాళ్ళబండివారు, జనస్వామివారు, పోలేపెద్దివారు మొదలయినకుటుంబములవారి విశ్వాస మిదియే. విశేషించి రెండువందల యేబది సంవత్సరములనాడు విశాఖపట్టణ మండలములో వర్ధిల్లిన తల్లావఝ్ఝల విజయగోపాల శాస్త్రిగారి సంతతివారు తీర్థులవారు పూర్వాశ్రమములో తమవంశమువారే నని పరంపరా గతముగా స్పష్టముగా వినుచున్నట్లు వక్కాణించుచున్నారు.

కాజగ్రామ శాఖలో మహనీయు లనేకులు తీర్థసంప్రదాయ ప్రకారముగా యతు లయినట్లు ప్రతీతి. తీర్థులవారు వీరివంశగురువను వ్యవహారము సుస్పష్టము. తద్విరచిత మైన శ్రీకృష్ణలీలాతరంగిణి వంశములో నెల్లరకును అవశ్యపఠనీయము. అశక్తు లగువార లధమపక్షము మూడుతరంగము లయినను చెప్పుకొనక తప్పదు. అట్లు చేయనివారు దూష్యులు అనునియమ మీనాటికిని వర్తిల్లుచున్నది.

చిత్తరువులోని నారయణతీర్థులవారి యాకృతికిని, అస్మద్వంశీయులలో ననేకుల యాకృతికిని సంపూర్ణసమ్మేళనము గోచరించును. ఉపపత్తులన్నియు నట్లుంచి, సతాం హి సం దేహాపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః” అను నార్యోక్తి ననుసరించుచో తీర్థులవారు తల్లావఝ్ఝల వంశములోనివారే అనువిషయము అస్మదాదుల విమలాంతః కరణమునకు విదితము. అలం. విస్తరేణ!

ఈమహనీయునివలన దేశము, సారస్వతము, గీర్వాణాంధ్రవాణులు, భక్తహృద యములును పునీతములయినవి!

# సర్వంకషా విశేషములు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

శృంగారనైషధమునకు కీ. శే. వేదం వేంకట్రాయశాస్త్రిగారు వ్రాసినవ్యాఖ్యకు 'సర్వంకష' యని పేరు. అందలి కొన్నివిశేషములను వెల్లడించుట యీవ్యాసముయొక్క యుద్దేశము.

సామాన్యసాహిత్యపరులకు కొరుకుపడనిగాఢపాకములో నున్న శ్రీనాథునిరచనకు సర్వంకషమయినవ్యాఖ్యానము వెలయించి శ్రీశాస్త్రిగారు ఆంధ్రలోకమునకు మహోపకారము చేసినారు. భట్టహర్షుని కవితానుగుంభములను భాషాకావ్యమునకు దిగుమతి చేయుటలో, కవిసార్వభౌముడు-శ్రీనాథుడు త్రొక్కినత్రోవలను మిక్కిలి మెలకువతో కనిపెట్టి, వ్యాఖ్యాతలు చాలవరకు చక్కగా - సులభముగా - సూటిగా తెలిపియున్నారు. కాని, ఒక కొన్నిపట్టులలో, 'సర్వంకష' శ్రీనాథకవిహృదయమునకు భిన్నముగా నడిచినట్లు నాబుద్ధికి పొడకట్టినది. అట్టిపట్టు లొకకొన్ని పండితపరిశీలనముకొరకు కిక్కడ చూపించుచున్నాను.

## అంగుళము

"ధరణీకాంఘ్రికనిష్ఠికాంగుళము నాధారంబుగా నిల్చి, ని
ర్భరలీలం గృతవేళ నొట్టన యధర్మంబుం దపస్విత్వముం బొరసెన్." (1-55.)

అనుపద్యమునకు, 'సర్వంకష'లో,- "అధర్మము, ఏకా...య(?)—ఏక=ఒక, అంఘ్రి=పాదముయొక్క, కనిష్ఠికా = చిటికెనవ్రేలియొక్క, అంగుళము అ=ఎనిమిది యవల ప్రమాణము మాత్రమే ('యవోదరైరఙ్గుళమష్టసంఖ్యైః' లీలావతి) ఆధారంబుగాన్ = నిలువరముగా, నిలిచి—తాపసత్వమును పొందెను. అధర్మము చిటికెనవ్రేల నంగుళప్రమాణభాగముపైని మాత్రమే నిలిచినదనుటచే కొంచెము కొంచెము అటనట నుండెనని, భా. ఒంటికాలి కనిష్ఠికపై నిలుచుట కఠోరతపతపశ్చరణప్రకారము." అని యర్థము భావము చెప్పబడి యున్నది.

కఠోరమైనతపస్సు చేసినట్లు చెప్పవలసినఘట్టములలో, కవులు సాధారణముగా ఒంటికాలిబొటనవ్రేలిమీద నిలబడి తపస్సు చేసినట్లుగా చెప్పుచుందురు.

(1) "ధర బొటనవ్రేల నూని,రవిఁ దప్పకచూచుచు." (శా. శ. 1-22.)

(2) "చిటచిటఁ బ్రేలుచు నలుగడఁ, బటుతరశిఖిశిఖలు నెగయఁ బదిలముగా నుం
గుటము ధరమీది సుస్థితిఁ, గుటిలాలకవదన మెత్తుకొని రవిఁ జూచున్." (నన్నె. కు. సం. ౩వఆ.)

ఇత్యాది రచన లందుకు ప్రమాణము.

అధర్మముచేసిన తపస్సు కఠోరతరమని యేర్పడుటకు శ్రీనాథుడు 'కనిష్ఠికాంగుళము'ను చెప్పినాడు. కనిష్ఠికాంగుళము=చిటికెనవ్రేలు, అని శ్రీనాథు డుద్దేశించినయర్థము. చిటికెనవ్రేలిపై నిలిచినట్లు చెప్పుటచేతనే ఆతపము కఠోరతర మని స్పష్ట మగుచుండగా,

'సర్వంకష' "చిటికెనవ్రేలిలో అంగుళప్రమాణభాగము" అని యర్థము చెప్పవలసిన అక్కర యేమి? ఏమియును లేదు. అమరకోశములో, 'వ్రేలు' అనువర్గమున 'అంగుళి' శబ్దమేగాని 'అంగుళ' శబ్దము చెప్పబడలేదు. అందువలన వ్యాఖ్యాతలు, 'లీలావతి' (లెక్కలపుస్తకము) లోని అంగుళమును తీసికొని "కనిష్ఠికయొక్క, అంగుళము = ఎనిమిదియవల ప్రమాణము" అని యర్థము చేసినారు. అది క్రమమైనమార్గము కాదు. సరసకవితారచనాసమర్థుడైన శ్రీనాథమహాకవి అట్టి యక్రమమార్గమున అంగుళశబ్దమును వాడియుండుననుకొనుటయు పొరపాటే.

'అంగుళ' శబ్దమునకు 'వ్రేలు' అన్నయర్థము ప్రసిద్ధమే. ఒక్క అమరకోశములోనే లేదుగాని, యితరనిఘంటువులలో పెక్కింట నున్నది. పూర్వకవు లనేకులు వ్రేలు అన్న యర్థమున 'అంగుళము'ను వాడియున్నారు. చూడండి—

(1) "అంగుళము = వ్రేలు (శ. ర.)

(2) "అంగుళము A finger" (బ్రౌను)

(3) అంగుల A finger" (కన్నడ-నిఘంటువు)

(1) "ముక్కుపయి నంగుళముం గదియించి." (భా. విరా. 2-356.)

(2) "అంగుళాగ్రముల్ సిటికెనలందు మొదలు, లనఘ దేవర్షి తీర్థములనఁగ బరఁగు." (అను. 4-113.)

(3) "కరతలాంగుళములఁ గను జెవ్వ లెత్తి, నెరసున్నదని పాఱ నిక్కించి యూఁదు." (బస.పు. 3-763.)

(4) "కొలుకులు రెండు నంగుళముల నడుమ." (బస. పు. 3-768.)

(5) "విశాయకు నుంగర మంగుళంబునన్." (హంస. 7-156.)

(6) "తనదగు బాహాంగుళములు." (భోజ 4-97.)

ఇట్లు అంగుళశబ్దమునకు వ్రే లన్న యర్థము సుప్రసిద్ధమై యుండగా, కఠోరతరతపశ్చరణప్రకారమును తెలుపుటకు 'చిటికెనవ్రేలే' చాలియుండగా, 'చిటికెనవ్రేలియొక్క యెనిమిదియవలప్రమాణ' మని యర్థము చెప్పుట, అనవసరము కాదా? అనుచితము కాదా?

'కనిష్ఠికలో అంగుళప్రమాణము' అనుటయు సరికాదు. అసలు (కాలి) కనిష్ఠిక యెన్నియంగుళములుండును? ఒక్కయంగుళముకంటె ఎక్కువపొడుగుండునా? కనిష్ఠిక యనగా, అతిశయేన అల్పా కనిష్ఠా మిక్కిలి చిన్నది. అనికదా వ్యుత్పత్త్యర్థము. ఆ మిక్కిలి చిన్న (చిటికెన) వ్రేలిలో అంగుళప్రమాణమేమి! దానిపై నిలిచి తపస్సు చేయుటయేమి?

ఎందు కిన్నిమాటలు 'కనిష్ఠికాంగుళము=చిటికెనవ్రేలియొక్క అంగుళప్రమాణము' అనుట కవిసార్వభౌముని హృదయమునకే కాదు, అతనిరచనకు మూలమైన శ్రీహర్షరచనకును తద్వ్యాఖ్యానమునకును విరుద్ధము.

"భువం యదేకాంఘ్రి కనిష్ఠయా స్పృశన్"

అని మూలము.

"ఏకపాదస్య కనిష్ఠయా కనిష్ఠాంగుళ్యా భువం స్పృశన్"

అని మల్లినాథవ్యాఖ్య.

## మడవక

"మడవక ముష్టియోగ్య మగు మధ్యములో నెలవంకయైన య
ప్పడతుక భ్రూలతాధనువు పట్టి మనోభవుఁ డింతనుండియుం
విడుచునకాని మానఁ, డిది నిక్కము, షట్పదకీటజుష్టమై
యుండుగక కమ్మధూళి నుసియొల్కుచు నున్న పురాణచాపమున్."                                                                                    (5-12.)

అనుపద్యమునకు:—

"మనోభవుఁడు, ఇంతనుండియున్, - మడవక=(సహజముగా వంగియుండుటవలన) వంప నక్కఱ లేకయే,...చంద్రరేఖవలె వంపు అయిన, ఈతరుణియొక్క బొమతీవ యనెడి వింటిని, పట్టి = కేలవహించి,... (తన) పురాణ చాపమును విడిచివైచునే కాని విడువకుండఁడు." అని, సర్వంకషావ్యాఖ్య.

మడచుట—యనగా వింటిని వంచుటయట ! బొమతీవయనెడివిల్లు సహజముగానే వంగియుండును గనుక, వంచవలసిన శ్రమ యెప్పటికిని ఉండదు గనుక, మన్మథుడు తనవింటిని వదలి ఆపడతి బొమతీవవింటినే ధరించునట ! ఇది వారివ్యాఖ్యాసారము.

మడచుటకు విల్లేమి ఆకా? చాకా? వింటిని వంతురుగాని మడవరు. కాబట్టి, 'మడవక = వంపనక్కఱలేకయే' అనుట సరి కాదు.

తొలుత ఋజువుగా - అనగా చక్కగానుండి, ఎక్కిడుటచేత వంగెడివిల్లే శరప్రయోగమునకు పనికివచ్చునుగాని, సహజముగా, అనగా పుట్టుకతోనే వంగియుండువిల్లు శరప్రయోగమునకు పనికిరాదు. అది లక్కబొమ్మలచేతివింటివలె వినోదముగా చూచుటకు మాత్రమే పనికివచ్చును.

కాబట్టి ఆపడతి బొమతీవవింటికి - సహజముగానే వంగియుండుట నొకగుణముగా చెప్పుటయు, అట్టివింటి కాసపడి, కైకొని, మనోభవుడు తనతొంటితుంటవింటిని పారవేయుననుటయును సరి కాదు.

'మడవక' అను క్రియకు అర్థమును గ్రహించుటలోనే 'సర్వంకష' తప్పుత్రోవ త్రొక్కినది. మడవక = తప్పక, కాదనకుండా, నిష్కర్షగా, అని సరియైన అర్థము.

మనోభవుడు, ఆపడతుక భ్రూలతాధనువును, మడవక = తప్పకుండా గ్రహించుననియు; మునుపటి తనపురాణచాపమును పరిత్యజించుననియు, పద్యమున సారాంశము.

పడతుకలకనుబొమలకు, ఎక్కిడిన వింటితోనే పోలికగాని, వంపనక్కరలేకయే - పుట్టుకతోనే వంగియుండువింటితో పోలిక చెప్పబడదు. సహజముగా వంగియుండువిండ్లు లోకమున నుండనే యుండవు. ఎక్కువెట్టి సిద్ధముగా నున్నది కావుననే, మనోభవుడు ఆబొమతీవవింటిని మడవక గ్రహించుట.

మడవక—అను క్రియ భారతములో ఇట్లు ప్రయుక్తమై యున్నది. "వమిపంచినన్, మడవక చేయుమీ." (ఆది. 2-43) శ. ర. కర్త "మడవు = విముఖమగు" అని యర్థము

చెప్పి, "మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్" (ఆది. 2. ఆ.) అను ప్రయోగమును కూడా ఇచ్చియున్నాడు.

శృం. నై. పద్యమున, 'మడవక...పట్టి' యని యన్వయముకాని, 'మడవక...నెల వంకయైన' అని యన్వయము కాదు.

## మరుకీర్తి

"కిన్నరకంఠి యొూర్తు మరుకీర్తియుఁబోని పటీరపంకమునన్, విన్నువొప్పఁగా నలఁదె." (6-50) అనే పద్యానికి,—"మరు...మున్—(నలుని యవయవములకు) మదన సుందరుఁ డనుకీర్తి యనఁదగినట్టి గంధపుఁబూఁతను,...అలఁదెన్=పూసెను." అని, స. వ్యా.

'మరుకీర్తి' అనుమాటకు, 'మదనసుందరుఁడనుకీర్తి' అనేయర్థము సిద్ధించుమార్గ మున్నదా?

'మరుకీర్తియుఁబోనిపటీరపంకము' అనగా, ఈరాజు మదనసుందరుడు, అనుకీర్తి యనఁదగినగంధమట! ఇది సమంజసమైన అర్థమేనా? గంధమునకు - మన్మథునితో సమాన మైన అందగాడను కీర్తితో పోలికయా! ఇట్టిపోలికలును భాషలోకలవా?

మరుకీర్తియుఁబోని = మన్మథునికీర్తినిపోలిన, పటీరపంకము = గంధము. అని సుఖ మైనయర్థము కనబడుచుండగా, 'సర్వంకష' అట్లు అనుచితమైన డొంకతిరుగుడు అర్థమును వ్రాయుటయేందుకు?

గంధము తెలుపుగావున కీర్తితో పోలిక. మన్మథోద్దీపకము గావున, మరునికీర్తితో పోలిక. ఇంత కమ్మనియర్థమును చెరిచి మరునికీర్తిని బలాత్కారముగా లాగి నలునికంట గట్టుట యెందుకు?

## నెలులు

"బలరామకృష్ణసంజ్ఞలఁ, తెలుపు నలుపునైన దివ్యతేజంబులతో
నిలమీఁద నవతరించిన, జలజాక్షుని నెలులు శర్మసౌరభ మొసఁగున్." (8-137.)

అనుపద్యమునకు సర్వంకషావ్యాఖ్య యిట్లున్నది.

"బలరామకృష్ణనామములతో, ఇలమీఁదన్ - అవతరించిన - నారాయణునియొక్క - నెలులు = ప్రకారములు (విలాసములు), సుఖవ్యాప్తిని, కలుగఁజేయునుగాక.—శ్రీహరికి కృతయుగమందు ధవళవర్ణము (కలియందు) కృష్ణవర్ణమును నియతములు: శ్వేతగణమందు 'బ్రాహ్మణానాం వర్ణోధర్మః ఓతరళ్ళ కృతాచ్యుతః' అనియు, కృష్ణగణమందు 'కృష్ణానికేశవః సీరిచీర చన్ద్రాశ్చ కారావః' అనియు కా. క. ల."

ఈవ్యాఖ్య నా కేమీ బోధపడలేదు. శ్రీహరికి కృతయుగమందు ధవళవర్ణ మట; కలియుగమందు కృష్ణవర్ణ మట; అగుగాక. బలరామకృష్ణులిద్దరును కలియుగములోనివారే కదా! మరి, ఒకరు తెలుపు; ఒకరు నలుపు కానేల? సర్వంకషాకర్తలు, చూపినకృష్ణగణ

ములో 'కేశవః' అనియున్నదేగాని 'కలియుగకేశవః' అని లేదే. కలియుగకేశవుడు నలుపనియు, ఇతరయుగకేశవుడు తెలుపనియు నేర్పడుటెట్లు? ప్రకారములు, విలాసములు మొదలగువానికిని - భాషలో నలుపు - తెలుపురంగులను చెప్పునాచారము కలదా? అతని ప్రకారము నలుపు; ఆమెవిలాసము తెలుపు, అనురీతిరచనలు కావ్యములలో నెందేని కలవా?

విస్తర మెందుకు. ఈగొడవ అంతయు, "నెఱులు = ప్రకారములు." అనుటచేత వచ్చినదేగాని మరేమీకాదు. నెఱులు - అనుమాటకు 'వెండ్రుకలు' అని లోకప్రసిద్ధమయిన అర్థముగదా వ్యాఖ్యాతలాయర్థమును మాని 'నెఱులు = ప్రకారములు' అనుటకు హేతువేమి? నెఱే; నెఱులు - కేశార్థకములని యెరిగియుండరా!

"వెండ్రుక, నెఱే, నెఱిక, నాఁగఁదనరుఁగేశము" అని, ఆంధ్రభాషార్ణవము (2-145) లోను, "నెఱికలు వెండ్రుకల్ నెఱులనంగఁ, గేశసమాఖ్యలౌ" అని సాంబనిఘంటువు (మానవ. 14.)లోను, చెప్పబడియున్నది కావున వారెఱిఁగియుండరనుట పొసగదు. నెఱులు = వెండ్రుకలు, అన్నసంగతి యెరుగక కాదుగాని, వెండ్రుకలకును, పైపద్యములోని గాథకును గలసంబంధమేమో యెఱుకపడక, వారు - 'జలజాక్షుని - నెఱులు = ప్రకారములు, విలాసములు' అని యర్థముచేసి - ఆయర్థమును సమర్థించుట కటువిమ్మటి గొడవయంతయు నూహించి వ్రాసియుంటారు.

జలజాక్షుని నెఱులు - అంటే, నారాయణునివెండ్రుకలేగాని, ప్రకారములూకావు; విలాసములూకావు. తెలుపు - నలుపువర్ణములతో; బలరామకృష్ణసంజ్ఞలతో, ఇలమీద నవతరించినవి నారాయణుని తెలుపు - నలుపు వెండ్రుకలే. ఈయంశము, భారతమునను, భాగవతమునను కూడా స్పష్టముగా చెప్పబడియున్నది. చిత్తగించండి.

"సచాపి కేశౌ బహిరుద్బబర్హ శుక్లమేకమపరంచాపికృష్ణం,
తౌ చాపికేశౌ నివిశేతాం యదూనాం కులే స్త్రియౌ దేవకీం రోహిణీంచ."
తయో రేకో బలదేవో బభూవ యోసౌశ్వేత స్తస్య దేవస్య కేశః,
కృష్ణోద్వితీయః కేశవ స్సంబభూవ కేశో యోసౌ వర్ణతః కృష్ణ ఉక్తః.—(భార. ఆది. 197. అధ్యా.)
"యదా బ్రహ్మాదయో దేవాః ప్రార్థనార్థం హరిం గతాః,
హరిణాచ తదా దత్తౌ కేశౌ ఖలు సితాసితౌ
శ్యామవర్ణ స్తతః కృష్ణః శ్వేతస్సంకర్షణ స్తథా." (—దేవీభా. ౪. స్కం. 22. అధ్యా.)

వ్యాఖ్య.—"సితాసితావితి. తథాచ కృష్ణః పూర్వోక్తరీత్యా నారాయణస్య అసితకేశస్యావతారః, బలరామస్తు శేషస్య సితకేశస్యావతారః."

సర్వంకషాకర్తలు, భారతభాగవతములను తిలకింపకపోయిన పోయిరిగాక, ఆపద్యమునకు మూలమయిన శ్రీహర్షశ్లోకమునైనను చూచియుండకూడదా?

"తావకాపరతనోః సితకేశ స్త్వం హలీ కిల స ఏవచ శేషః,
సాధ్వసా వవతర స్తవధత్తే కజ్జలచ్ఛికురజాలవిలాసః." (21-85.)

ఈశ్లోకమును చూచియున్నచో, వారు 'నెఱులు = ప్రకాశములు, విలాసములు' అని వ్రాసియుందురా?

చెప్పమరచినాను. ఈ తెలుపు నలుపు నెఱులకథ తెనుగుభాగవతమునను ఉన్నది సుమండీ.

"సీ... నారాయణుండు, చెచ్చెరఁ దనసితాసితకేశయుగమున, బలరామకృష్ణరూపములఁ దనరి, యదుకులంబున లీలమై నుదయమయ్యె." (2-173.)

## శంభు

"నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధదేవ నిజము, శంభు సర్వజ్ఞుఁ డగుటలాక్షణికవృత్తి." (8-140.)

"శంభు = శంభువు, సర్వజ్ఞుఁడగుట, లాక్షణికవృత్తి = లక్షణావృత్తి—గౌణవృత్తి ('ఈబాలుఁడు సింహము' అనువాక్యములో బాలపరముగా సింహశబ్దము బీరముకలవాఁడను గౌణార్థమును చెప్పినట్లే, శంభుపరముగా సర్వజ్ఞశబ్దము బుద్ధునివంటివాఁడని గౌణార్థమును చెప్పుచున్నది. అని భా.)—'శంభు' అనియే ఉపలబ్ధపాఠము. రాహ్వాదులలోఁ జేర్చి వు లోపమును సాధింపవలయును" అని, స. వ్యా.

ఉపలబ్ధమయిన 'శంభు' అనుపాఠము తప్పుకాదనియు, వు లోపము సాధింప నక్కఱ లేదనియు నాయభిప్రాయము. అది యెలాగంటే:—

లక్షణావృత్తి, (గౌణవృత్తి) యనునది శబ్దవ్యాపారమునకు చెందినమాట. అనేక లక్షణములలో, ఏదో యొకలక్షణము నుద్దేశించి జరుగఁబడుశబ్దవ్యాపారము, లక్షణావృత్తి; అదే లాక్షణికవృత్తి.

అట్లే, అనేకగుణములలో, ఏదో యొకగుణము నుద్దేశించి జరుపు శబ్దవ్యాపారము గౌణవృత్తి. చూడండి సింహమునకుగల అనేకలక్షణములలో ఒకటియైన బీరమునుమాత్రమే యుద్దేశించి 'ఆబాలుడు సింహము' అనుట లాక్షణికవృత్తి. సింహశబ్దము లాక్షణికముగా వాడబడినందున ఆబాలునియందు సింహలక్షణ మేదో యొకటి ఒక్కింతయున్నది, అంతే గాని వాడు నిజముగా, సింహముకాడు. అని యేర్పడుచున్నది.

అట్లే, శంభుని(లోకము) సర్వజ్ఞుడనుట లాక్షణికము కావున, శంభునియందు సర్వజ్ఞ (=బుద్ధునియొక్క)లక్షణ మేదో కొంతయున్న దేగాని, నిజముగా సర్వజ్ఞుడు కాడు, అనిభావము.

ఇక్కడ ముఖ్యముగా గమనింపవలసినయంశ మేమనగా—బాలుని సింహము 'అనుట' లాక్షణికవృత్తిగాని ఆబాలుడు ఏసంస్కారవిశేషముచేతనైనను నిజముగా సింహమే యగుచో ఆ 'అగుట' లాక్షణికవృత్తికాదు.

అట్లే శంభుని సర్వజ్ఞుడు 'అనుట' లాక్షణికవృత్తియగునుగాని శంభుడు సర్వజ్ఞుడే 'యగుట' లాక్షణికవృత్తికాదు. కావున 'శంభుసర్వజ్ఞుఁ డగుట లాక్షణికవృత్తి' అనుపాఠము సరియైనదికాదనియు కవిపాఠము 'శంభు సర్వజ్ఞుఁ డనుట' అని యుండుననియు, 'అనుట' లోని 'ను' కాలక్రమమున వ్రాతలలో లేఖకాదప్రమాదమున 'గు'గామార్పుచెంది యుండుననియు నానమ్మకము.

ఏమైనను వు లోపమును సాధించి, శంభునికి భాషలో లేని రూపము కల్పించి, గాథా బాహులలో చేర్చి 'శంభు' అనుటకంటే 'గు' వర్ణమును 'ను' గా సవరించుట సముంజసము కాదా! పెద్ద లింకను విచారింతురుగాక.

## విరోధాభాసము

"అనుచున్ సారథు సారసారణికి నెయ్యాంపుం జెలిం బోని తి
య్యని వాక్యంబున బోటి భీమసుతమాత్రై యేర్పడం బల్కు నన్,
మనమాహ్లాదముఁ బొందుచూడఁగను భూనాథుండు గంభీరతన్,
వినఁడయ్యెన్ సురరాజకార్యఘటనావిఘ్నంబు వాటిల్లుటన్." (4-102.)

"అనుచున్-బోటి-తియ్యని వాక్యంబునన్-పల్కు నన్, సురరాజకార్యఘటనావిఘ్నంబు వాటిల్లుటన్, భూనాథుండు-వినఁడయ్యెను. [ఆహ్లాదకరమైనను వినమి విరోధము, సురకార్య విఘ్నముచే సమాధానము, విరోధాభాసము.]" అని సర్వంకషావ్యాఖ్య.

నిజముగా పై పద్యములో విరోధాభాసాలంకారమున్నదా? ఆహ్లాదకరమైనను వినక పోవుట విరోధమట! సురకార్యవిఘ్నముచేత సమాధానమట! విరోధాభాసలక్షణమిదేనా? కాఫీ కమ్మగానున్నను పైత్యము చేయునన్న భయముచేత వాడు తాగలేదు'-అంటే విరోధాభాసాలంకారమగునా ?

'కమ్మగానున్నను త్రాగకపోవుట విరోధము
పైత్యముచేయునన్న భయముచేత సమాధానము.'

అని, అలంకారవివరణము వ్రాయవచ్చునా? దయయుంచి పండితులు తెలుపుదురుగాక.

## నకారయతి

'సర్వంకష' శృంగారనైషధమును పరిష్కరించుటలోను కొంత సాహసము జరిగినది. ఒక్కవిషయమును మాత్రమే ప్రస్తావిస్తాను. "శృంగారనైషధము ప్రతులన్నిటిలోను.—

"నముచిదమనుండు పుత్తెంచినాఁడు నీకు" (3-120)

అనుపాఠమేయున్నను, 'పుత్తెంచినాఁడు' అనుక్రియలోనున్న నకారములో ఆకారమే గాని నకారము లేదు గనుక నకారముతో యతి చెల్లించుట తప్పు" అని చెప్పి, 'పుత్తెంచె నాతి నీకు' అని దిద్దినారు సర్వంకషాకర్తలు.

ఆ నకారయతిని శ్రీనాథుఁ డాస్థలముననే కాదు, దానికి ముందు. వెనుక కూడా వాడియున్నాడు.

"వచ్చుచున్నాఁడని భీమభూమిపతి నందన." (3-104.)
"చేరియున్నాఁ రిదె శీతభానుదిననాయకవంశజులైన. (5-33.)

పై రెండు తావులలోను, సంస్కర్తలు ఆక్షేపించనూలేదు, సవరించనూలేదు.

శ్రీనాథుఁడా నకారయతిని తన కాశీఖండములో కూడా వాడియున్నాడు.

"నాడు మొదలుగ నిపుడు నున్నారమందు." (5-9.)

కాబట్టి, ఆయతి శ్రీనాథుడు బుద్ధిపూర్వకముగా వాడినదేగాని ప్రమాదమున వాడినది కాదు, లేఖకాదులు కల్పించినదియును కాదు.

శ్రీనాథుడు బుద్ధిపూర్వకముగనే వాడియుండుగాక, అది తప్పై యుండకూడదా? అంటారు కాబోలు. అదియు నిజమే కాని, ఈ నకారయతిని కూర్చిమాత్ర మట్లనుకొనుట కవకాశము లేదు. ఎందువల్లననగా, శ్రీనాథునికి ముందరివారును వెనుకటివారును, ప్రామాణికులైన కవు లనేకులు వాడియున్నారు.

పాఠకవినోదమునకు కొన్ని ప్రయోగములు—

(1) 'నాకు దక్షిణగా నిచ్చినాఁడవింక' (భార. శాంతి. 2-87.)
(2) 'జనపతుల్ దమరాజసంబున దండించి నారుగా కొల్లక నరులకవ్వ.'' (అను. 5-113.)
(3) 'నాదుగుణుతు సెప్పి నా రెవ్వ రనినను.'' (అశ్వ. 1-45.)
(4) 'దప్పిలో నుండంగ నెప్పాటఁ జూడఁగ లేఁడనే నను నా లలన మీరు' (అశ్వ. 4-237.)

(సర్వంకషాకర్తలమతము ప్రకారము ఈలకారయతియును తప్పేయగును.)

(5) 'పాయక పోషాపోవవు నాయెడ నే యెగ్గు దలఁచినాఁడవా.' (భాస్క. అర. 245.)
(6) 'దాశరథులు వచ్చి, నారు మనచూచు సామాన్యనరులుకారు.' (భాస్క. అర. 172.)
(7) విశ్వకర్మ తత్పవిత్రి కొసఁగినాఁడు కరుణఁ గర్మనై పుణ్యముసఁ దన.'' (భాస్క. యుద్ధ. 234.)
(8) నోరఁబోసికొ, న్నారము గాఁ దలంపు లలనా.' (ఉ. హరి. 5-158.)
(9) 'నన్నుఁ గనలించి బ్రదుకఁ గన్నారు లేరు' (ఉ. హరి. 4-60.)
(10) 'చైద్యున కిత్తు నంచు నున్నాఁడను, గొరికీశ్వరికి నావలన' (భాగ. 10. పూ. 1727.)
(11) 'నీవలినీక్షై వందుచు, నా పేరను లేక యనిపినాఁడని.' (ప్ర. ప్ర. 4-43.)
(12) 'నారసింహానిపురాణ మొనర్చి హరి మెచ్చి
నన్ను నెన్నఁడుచూచినాఁడ వనఁగ' (మల్ల. విప్ర. 1-13.)
(13) 'రంగప్ప సొమ్ము మేము తినంగను సుతులమయి పుట్టినారము' (విప్ర. 5-18.)
(14) 'సురియాళు చేతికత్తికి, నరులందఱు పేరు పెట్టినారు.' (దేశ్యశాబ్దార్థకోశము.)

ఇట్టి ప్రయోగములు కావ్యములలో వందలుకావు; వే లున్నవి. ఇంత సుప్రసిద్ధమయిన యతినిగూడా గుర్తింపక సంస్కర్తలు కవిసార్వభౌముని రచనను మార్చివేయుట సాహసము కాదా?

ఒక విశేషము:—ఉన్నాఁడు; కలాఁడు వంటి క్రియలలోని నకార లకారములు ఉభయవళులు. అకారముతోడను వానిని చెల్లింపవచ్చును. అందు కీక్రింది మహాకవి ప్రయోగములు ప్రమాణము.

"దేహంబువలనను దివిరి జనించి యున్నాఁడవు నారాయణాంశజుఁడవు." (భాగ. 4-533.)
"అలవొందఁ గట్టుమన్నాఁడు, నాతవ్వ." (నవనాథ. పుట. 68.)

సర్వంకషావ్యాఖ్యలో దొరలిన ప్రమాదములను, నేను గుర్తించినవానిని కొన్నిటి నిందు తెలిపినాను. ప్రతిభావంతులైన పండితులు పరిశీలించుచో ఇంకను బయల్పడగలవనియు అట్టి ప్రమాదములను తొలగించి శ్రీశాస్త్రులవారి వ్యాఖ్యానమును శ్రీనాథుని రచనను కూడ సర్దుష్టము కావించుట భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి పరమ ధర్మమనియు విన్నపము.

---

# భోజరాజీయము : కొన్ని విశేషములు

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి. ఎ.
ఆంధ్రాధ్యాపకుఁడు, 'పీఠికాధీశకళాశాల'
రామారావుపేట, కాకినాడ.

ప్రాచీనాంధ్రకవిశేఖరు లెందఱో తమజీవితములందువలెనే తమకావ్యములందును బహునియమములను గడుదీక్షతోఁ బాటించి యాదర్శప్రవర్తనముతోపాటు సలక్షణకవితామృతమును లోకమున కొసఁగియున్నారు. ఈబహునియమానుసరణము కాలక్రమమునఁ గవులలోఁ దఱుఁగుట గమనింపఁదగినవిషయము. ఒకవిధముగా బహునియమోల్లంఘనమున స్వాతంత్ర్యపథ మవలంబించినకవులకతన భాషామాత కెన్నోశృంఖలలు వైతొలఁగిన వని యానందించువారుకూడ బహునియమపూర్వకముగా భాషామాతకుఁ బరిపుష్టిసుందరతలను గూర్చినకవితల్లజులను మిక్కిలి ప్రశంసింపక తప్పదుగదా! అటు నన్నయతిక్కనాదులకుఁ దరువాతివాఁడు నిటు ప్రబంధకవులకుఁ బూర్వుఁడు నగుననంతామాత్యుఁడు తన 'భోజరాజీయము'న ననుసరించిన విశిష్టనియమములును, జూపినప్రయోగవిశేషములును నాతని సహజసుందరకవితకు వన్నెఁ గొనితెచ్చి యాతనిప్రతిభను మఱింత స్తోత్రపాత్ర మొనరించి వైచినవి. కావున, నేతద్విషయము లిట దిఙ్మాత్రముగఁ బరిశీలించుట కీవ్యాస ముద్దేశింపఁబడినది.

## ప్రాసనియమము

మనయాంధ్రకవిపుంగవులలో నొక్కనన్నయమాత్రము ఖండాఖండప్రాసము వాడలేదు; రేఫశకటరేఫసాంకర్యము చేయలేదు. తిక్కన భారతాదులలో సానుస్వారనిరనుస్వారప్రాససాంకర్యము కలదని 'సర్వలక్షణసారసంగ్రహాదులు' ధ్రువపఱచినవి. తక్కిన కవులునైతము పెక్కెడల నీప్రాససాంకర్యము చేసియున్నవారే. కాని, యనంతామాత్యుఁడుమాత్రము తనభోజరాజీయమునఁ బ్రాససాంకర్యము చేసియుండలేదు.

## సమప్రాసము

అనఁగా మొదటిపాదమున ననుస్వారపూర్వకముగు నక్షరము ప్రాసస్థానముననున్నఁ దక్కినమూఁడుపాదములు నట్లే యుండుట. ఈసమప్రాసములం దర్ధబిందుప్రాసము, శకటరేఫప్రాసము, సాధురేఫప్రాసము భోజరాజీయమునఁ జక్కఁగాఁ బాటింపఁబడినవి. మఱియొక్కవిశేష మేమన నుభయప్రాసము శిష్టజనాంగీకృతమయ్యు ననంతామాత్యుఁడు దీని నంగీకరించియుఁ దానుమాత్రము సమప్రాసమే వాడియున్నాఁడు. పద్యమందలి నాలుగు పాదములందలి ప్రాసము నొకేవిధముగ నుండవలె నను నియమము నెల్లెడల సీతఁడు పాటించెను. పలువు రిటీవలికవు లిది పాటింపలేదు. మఱికొందఱు మూఁడుపాదము లొకవిధముగను నాలవపాదమును భిన్నముగను వాడిరి. ఈసూత్రమే యనంతామాత్యుఁడును

పాటించె ననువారి కాధారములు భోజరాజీయమున ముద్రితప్రతులలో రెండుచోట్లఁ గలపాఠములు. కాని, తాళపత్త్రప్రతిలో భిన్నపాఠములుగాననై ముద్రితప్రతిలోని పాఠము లగ్రాహ్యము లని ధ్రువపఱచుటచే నింతగ్రంథమున నెన్నియో తావులఁ బ్రాససాంకర్యముచేయక యొకటిరెండుతావులఁ జేసినాఁ డనుటకన్నఁ దాళపత్త్రప్రతిలోని పాఠములే గ్రహించి యనంతామాత్యుఁడు ప్రాససాంకర్యము చేయనివాఁ డనుటే సమంజసముకదా! ఈప్రాసమును పాటించుట కష్టసాధ్యమయ్యుఁ బద్యమాధుర్యము చెడకుండ నీమహాకవి దీని ననుసరించె ననుటకుఁ గొన్నియుదాహరణములు చూపెదము.

అర్ధబిందు సమప్రాసమునకు:—

"కాఁగానిమాట లాడెదు, రాఁగూడదు, నేఁ దపశ్చరణమై యుండం
గాఁ గోమలి యిటు నిల్వక, యేఁగుము మగనాలి కేల యీదుర్గుణముల్." (౪, ఆ. ౧౪౮.)

"ఆఁకొని యఱచెడిఁ బ్రేవులు, నేఁకట నోకనములవలయు నీమాంసము న
ట్టాఁక యిడి యిప్పుడంబున, దేఁకువచెడి పల్కెఁదగునె దేవునకాత్రోన్." (౪, ఆ. ౨౧౨.)

"నాఁ డెల్లవారు నీపూఁబోఁడి వఁదు మాను మనఁగఁ బుయిలోడకతాఁ
దూఁడరిదై తలియఁబడిన,వాఁ డితనికి నేఁడు వగవవల దనువారున్." (౬, ఆ. ౧౦౯.)

శకటరేఫ సమప్రాసమునకు:—

"తెఱవకుఁ గుచమండలమును, మఱి పిఱుఁదును ఘనముచేసి మధ్యమునకుఁ జే
దఱిక మొనఁగు నని యజుసం,దఱు దూఱుట మాని: జాలం దాల్చుటవలనన్." (౩, ఆ. ౧౩౦.)

"పాఱఁగ నమ్మహీపతియుఁ బాయక తోడన పాఱెఁ బాఱ న
క్కాఱడపిం గిరాతతతి కాపుర ముండెడుపల్లె సొచ్చి పె
న్నోఱకుభంగి మాంసములు ముక్కనబంటిగ మ్రింగుచుండ నై
వాఱెడుభక్తి నత్త్రిమునిపట్టియుఁ దా మదిలోఁ దలంచుచున్." (౧, ఆ. ౧౧౫)

ఇట్లే యితరస్థలములఁ బ్రాసమున నేకాక యనంతామాత్యుఁడు 'భోజరాజీయము'నఁ గాని 'రసాభరణము'నఁగాని ద్విరేఫములకు యతిమైత్త్రియు నంగీకరింపలేదు. చూడుఁడు.

"ఉవ్వను మ్రోఁతలో నెదు రెఱుఁగనివీఁక..." (౩, ఆ. ౨౦౦.)

"ముందరఁ బురోహితుండు పిఱుంద సచివుఁ డాయుధపుమొఱుంగులు మెఱయన్." (౪, ఆ. ౯౨.)

మఱియు న ణ లకు బ భ లకుఁ బ్రాసము చెల్లుట శిష్టసమ్మతమయ్యు ననంతామాత్యుఁడు భోజరాజీయమున సమప్రాసమే పాటించుట విశేషము.

"అని దనుజుఁడు ధట్టించిన, వనజాననకలఁకె నంతవాఁడవుగావే
నిను నిప్పుడు గాదంటినె,విను యుక్తాయుక్తపదవివేకమువలదే." (౪, ఆ. ౨౯౮.)

"బాణము పెఱుకుము తనువునఁ, బ్రాణంబులు నిలువ వనిన రాజుతఁ డదియున్
శోణితముగఁ బెఱుకఁగ నలి,వేణి తదుద్ధతదురంతవేదనవలనన్." (౫, ఆ. ౧౧౪.)

"సౌభాగ్య మెట్టిదో నిను, నీభంగిని దూఱవలనె నిప్పుడు నాకున్
శోభన మొనర్పఁ దలఁచిన, నోభవ్యచరిత్ర చేయు మొకకార్యంబున్." (౬, ఆ. ౪౦౫.)

ఇదే విధమున 'భోజరాజీయమున' ననంతామాత్యుఁడు విశిష్టనియమముల ననుసరించుట తెల్లము కాఁగలదు.

### కొన్ని శబ్దముల ప్రామాణ్యము

ఇతర ప్రామాణికగ్రంథముల నిర్ధారకములుగాఁ గానరానిపదములలో 'ఎలనాగ' యీ గ్రంథమున నిర్ధారకముగా నిరనుస్వారముగ నున్నది.

'రోగమున కోడి ప్రాణ, త్యాగము సేయుటకుఁ జెంపు తలకొనుమదిలో
నాఁగాతమి కరుగుచు నెల, నాగను బొడగంటి నొకవనస్థలిపొంతన్." (౧, ఆ. ౧౨౪)

ఇట్లే 'వీఁకు' 'కాపు' రెండును నిరనుస్వారము లని యీతనిమతము.

"అకటా జెంగి యచ్చట, నీకన్నియ నుండనీక యిట తెచ్చితి మా
రాకొమరుఁ డెందుఁబోయెనొ, వీఁకవ నిది మూర్ఛవోయె విరహాతురతన్." (౩, ఆ. ౨౩౬.)

"మోపెడు కట్టెలు గాల్చిన, కాపే యద్భుఁ దగవఁటె జగన్మోహనలీ
లాపరిచయ దృగ్దీప్తి, వ్యాపారాపాంగమైన యంగనఁ గవయన్." (౪, ఆ. ౧౯.)

మఱి యన్యగ్రంథముల నిరనుస్వారముగ నున్న 'తోకొను' అనుపద మిందు సానుస్వారముగ నిర్ధారింపఁబడినది. 'తోడు+కొను' అనునపుడు 'తోకొను' అనియు 'తోఁక+కొను' అనునపుడు 'తోఁకొను' అనియు నొకేపదమునకు ద్వైరూప్యము సిద్ధించుచున్నది. కాని, యీకవి నాలుగైదుతావుల 'తోఁకొను' అనియే నిర్ధారకముగ వాడుటచే నీతనిమత మది యని నిర్ణయింపవలయును.

"తేఁకువ యలరఁగ నీగతిఁ, దోఁకొని చని చదల రత్నతోరణదీప్తుల్
ప్రాఁకెడుఘనగృహముల న, మ్మూఁకల విడియించె రాజముఖ్యుం డంతన్." (౪, ఆ. ౧౪.)

"అఁకొని వచ్చినవిప్రులఁ, దాఁకింపక యశన మిడుము తత్పరమతి న
ట్లాఁకలి సేయకు కుడువం, దోఁకొని రా వర్వమగు లిథులమన వారిన్." (౬, ఆ. ౧౬౧.)

ఇట్లే ౩ ఆ, ౨౩౬ మున్నగుపద్యములను నిది నిర్ధారకమై యున్నది. ఈ విధముగా ఛందోదర్పణకర్తయగు ననంతుఁడు తనగ్రంథమునఁ బైశబ్దములపట్ల నభిప్రాయము సూచించినాఁడు.

### "హేమపాత్రములు, కాంచనాపాత్రములు"

భోజరాజీయమున నీరెండుపదములుఁ బ్రాసస్థానయతిస్థానములఁ బొడకట్టుచున్నవి.

"జామాతృప్రముఖప్రభూత్తమజనుల్ సంతృప్తులౌనట్లుగా
హేమాపాత్రములన్ జతుర్విధములై యింపారునాహారముల్
ప్రేమాధిక్య మెలర్ప షడ్విధరసోపేతంబుగాఁ బెట్టె సు
త్రామానోకహవైభవం బెసఁగ సాధ్వీ త్రిశుఁ డత్యున్నతిన్." (౪, ఆ. ౧౦౧.)

"అంతఁ బోక కాంచనాపాత్రమునఁ బెట్ట, రుచులు గల్గుభోజ్యనిచయ మిడిన
గలటి మంటి పసుమఁ గడుపారఁ గుడిచి యవ్వలికిఁ జూచి యిట్టు లనియె నతఁడు." (౫, ఆ. ౩౪౨.)

ఈపదములు తాళపత్త్రప్రతిలో నిట్లే యున్నవి. హేమకాంచనపదము లాకారాంతము లని కవి పొరపడె ననుటఁ బొసఁగమి నాలోచింప "హేమామత్త్రములు" "కాంచనామత్త్రములు" నై యుండుట సమంజసమని తోఁచినది. "సర్వమావపనం భాండమ్ పాత్రామత్త్రేచ భాజన" మ్మని యమరము. (ద్వితీయకాండ. వైశ్యవర్గ. 33 వ శ్లోకము.) ప్రాచీనలేఖకులపొరపాటే యచ్చున కెక్కినదనుట స్పష్టము. నా "భోజరాజీయభూమిక" నాఁటికిని స్ఫురింపక యీపదములు చింత్యములని వ్రాసియుంటిని.

## పాఠభేదములు

భోజరాజీయమునకుఁ దాళపత్త్రప్రతి యొక్కటిమాత్రము గలదు. అదికాక చిన్నయసూరి సేకరించిన కొన్నిపాఠములుమాత్రము సూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయమునఁ గలవు. ఈరెండిటిమూలమునను బూర్వోదాహృతము లగు ప్రాససాంకర్యదుష్టప్రయోగశంక వైతొలఁగ సలక్షణము లగుపాఠములు లభించినవి. అందు ముఖ్యమైనవి కొన్ని మాత్ర మిటఁ జూపుచున్నాను.

1. "ఆఱుమొగంబు లాతఁడు మహాత్ముఁ డాతని నుద్దునేనుఁ జో
నాఱుముఖంబులుం బలయు నంబిక యేనును నీవుఁ గూడఁగా
నాఱుముఖంబు లయ్యెడి రయంబున రమ్మని నీవునవ్వుచుం
జేరుట యోగివర్యులకుఁ జింత్య మగున్ ముఖపంచకోజ్జ్వలా?" (౫, ఆ. ౨౦౧.)

ఇది ముద్రితపాఠము. దీనివలన 'ఱ, ర' ప్రాససాంకర్య మిట సిద్ధించినది. దీనికిఁ జిన్నయసూరిపాఠములలో "...నవ్వుచుం, జేఱుట యోగివర్యులకుఁ జింత్యమగున్..." అని కలదు. ఇదే సమంజసము నిర్దుష్టము నగు పాఠము.

2. "నూతుల దరులను లోఁతగు, పాతటికసవ్వులను గట్టి పచ్చిక యున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము; మూతి నిడకు మగ్రసత్త్వములు గలనీటన్." (౬, ఆ. ౩౫.)

ఇది ముద్రితపాఠము. ఇందును ప్రాససాంకర్యము కలదు. దీనికిని జిన్నయసూరి పాఠము "ప్రీతిపడి మేయఁబోకు" మని. ఇదియే నిర్దుష్టము.

3. "నవ్వుచుఁ జెక్కుమీటి నలినస్ఫుటలోచన మాటలేల నీ
యవ్వనలక్ష్మికిన్ భటుఁడ నైతి ననుం గరుణింపుమంచువాఁ
డువ్విళు లూరుచుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ నీ
కివ్విధ మెట్లు చొప్పడియె నేనొకబ్రాఁతియె నీదుకొక్కకున్." (౭, ఆ. ౧౦౭.)

ఇందలి ద్వితీయ పాదమందలి "యవ్వనలక్ష్మి" వ్యాకరణదుష్టము. ఇది ముద్రిత పాఠము. దీనికిఁ దాళపత్త్రప్రతిలో,

"నావ్వుడు..., యౌవ్వనలక్ష్మికిన్..., దూవ్విళులూరుచుం..., కీవ్విధమెట్లు..."
అని లిఖింపఁబడియున్నది. ఈలేఖకదోషములు ముద్రాపకులదోషములై యచ్చున కెక్కినవి కాని కవిదోషములు కావు. పూర్వాక్షరముల లేఖనపద్ధతిఁ దెలిసినవారు,

"నావుడు...యౌవనలక్ష్మికిన్...ఉవిళులూరుచున్...ఈవిధ మెట్లు..." అనియే లిఖింతురు. ఇదియే సుసంగత మగుపాఠము. ఈవిధముగా బరిశీలనానంతరము భోజరాజీయము నిర్దుష్టగ్రంథమని విస్పష్టము.

## కొన్ని ప్రయోగములు

భోజరాజీయమునందలి ప్రయోగములలో గొన్నిమాత్రమే ముఖ్యమైన వాని నుదాహరించుచున్నాను.

1. 'బాలకి', 'బాలిక' యనియే కాని 'బాలకి' వ్యాకరణమునకుఁ బూర్ణసమ్మతము కాదు. కాని బహుశాసనములఁ గననైన యీపద మిందు నిర్ధారకముగా నున్నది.

"ఒకసహకారశాఖ తుద నోలిఁ బెనంగొని యున్న పువ్వుఁ దీఁ
గకుఁ దనహస్త మెత్తుటయుఁ గ్రక్కున లేఁజిగు రంచుఁ గోకిలం
బొకటి రయంబునం గదియ నుల్కి పడంకుచుఁ బాఱె నొక్కబా
లకి తనబోటికిం దెద నబలా! యిది కాటుకతీగె పొమ్మనన్." (3, ఆ. ౧౨౫.)

2. 'బిట్టుబిట్టు' ఈపద మొక్కభోజరాజీయమునఁ దక్క మఱియే యితరగ్రంథమునను బ్రయుక్తమయినట్లు కానరాలేదు.

"అప్పుడు బిట్టుబిట్టు విభుఁ డాశరుణిం గనుఁగొన్న..." (౪, ఆ. ౮౯.)
"...అ, తని యేతెంచుట బిట్టుబిట్టు గని కాంతల్ విస్మయాక్రాంతలై." (౫, ఆ. ౭౭.)

పై రెండిట నిది యవ్యయ మని 'తటాలున' నని యర్థమని శబ్దరత్నాకరము గ్రహించినది.

3. 'బిట్టుబిట్టు'యు నిందుఁ గాననగు నపూర్వపదములలో నొకటి. ఇది దేశ్యవిశేష్య మనియుఁ, (బిట్టు+బిట్టు) యని శబ్దరత్నాకరము గ్రహించి మిక్కిలి బిగువని యర్థము చెప్పినది

"అనవుడు నట్ల కాక యని యాఁగతి విప్రునియింటి కేఁగి య
ల్లన నకఁ డొంటి యున్కిఁ బదిలంబుగఁ జూచి సమీపమందు ని
ల్చినఁ గని బిట్టుబిట్టుఁ దనచిత్తము జల్లన మోముదేరకోఁ
గనుఁగొని యింతప్రొద్దిటకుఁ గామిని రాఁగత మేమి నావుడున్." (౪, ఆ. ౩౦౯.)

4. "చిటికెనవట్టు = వివాహమాడు." దీని కీక్రింది చక్కనిప్రయోగము గలదు.

"...కాంతుఁడొం కల్గిన నగ్నిసాక్షిగాఁ జిటికెనవట్టి కాక వృథసేయుట ధర్మమె కన్యకాత్వమున్." (౪, ఆ. ౨౩౩.)

5. 'బిట్టు' అనుపద మకర్మక్రియగా భోజరాజీయముననే ప్రయుక్తము. అన్య గ్రంథముల నీపదము కానరాదు.

"...నెత్తుటం జేసనోరమీసములు బిట్టిన వెంద్రుకలున్." (౪, ఆ. ౧౧౫.)

ఇట 'బిఱుసైన' నని యర్థము శబ్దరత్నాకర మిచ్చినది.

6. "ప్రక్కవాయు=తెగు" అని శబ్దరత్నాకరము. ఈపదము నితరగ్రంథములఁ గానరాలేదు. భోజరాజీయము (౫, ఆ. ౧౯౫) ననే కలదు.

7. 'వాలయించు'. ఇది 'వాలాయించు' నకు రూపాంతరము, నపూర్వమును.

"...నీ వెఱుఁగవె నీజీవన మేవారికి నిన్ను వాలయింపఁగ నేలా." (౫, ఆ. ౩౫౨.)

8. 'మొకమోట'. ఇది మొగమాటకు రూపాంతరము. సంకోచమని యర్థము.

"...మొక, మోట దరిద్రత్వమునకు నొగిఁ బొత్తయ్యెన్." (౬, ఆ. ౫౫.)

9. 'మొగమిచ్చుమాట' యు నపూర్వము, నిందుఁ బ్రయుక్తమును.

"మొగమిచ్చుమాటల కేల చెల్పెడితి భూపాలతిలక." (౬, ఆ. ౧౦౭.)

10. 'గరవడు'. 'అనఁగా గర+పడు = గడ్డకట్టు' అని యర్థము. ఇదియు నపూర్వమే.

"కరఁగు టెన్నఁడు లేక గరవడ్డ లేమంచు వచ్చియున్నకమునుగాఁ దీర్చి రొక్కొ." (౭, ఆ. ౨౧౫.)

భోజరాజీయము నిర్దుష్టమగు కావ్యరత్నమనియు నిం దనంతామాత్యుఁడు బహునియమానుసారియై పరమమాధుర్యోపేత మగుకవితామృతమును జాలువారించినవాఁ డగుట నాతఁ డమృతకవితల్లజుఁ డనియు నాతని 'భోజరాజీయము' సహజసుందరకవితాధార, సలక్షణప్రయోగబాహుళ్యము, సద్విషయములము గలసత్కృతి యనియు నీవ్యాస సారాంశము.*



* ఈవ్యాసముతో నేనిదివఱలో రచించి ప్రకటించిన 1. ఆంధ్రకథానిక కావ్యములు : భోజరాజీయము. (భారతి. 24 స. 4 సంచిక. 381 పుట.) 2. అనంతామాత్యునియమృతశైలి. (భారతి. 24 సం. 6 సంచిక. 513 పుట.) 3 'భోజరాజీయభూమిక' (వావిళ్లవారి ద్వితీయముద్రణపీఠిక.) అనుసంధించుకొనునది. ఇ॥ శే॥

# "దివ్విటీ - దివ్వెటీ"

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

అనంతమైన యాంధ్రభాషలోని కనేకరీతులఁ దద్భవపదములువచ్చి చేరినవి. సంస్కృతప్రాకృతభాషలనుండి తెనుఁగులోనికి దిగునపు డట్టిపదములకు వర్ణాగమవర్ణలోప వర్ణవ్యత్యయాదులు సహజము లని శాస్త్రకారు లన్నారు.

ఇట్టి వైకృతరూపములలో మూలరూపము యొక్కపోలికలుమాత్ర ముండునుగాని మూలపదమందలి యచ్చులకు సారూప్యములుగాని సాజాత్యములుగాని తప్పక నిల్వవలె ననునియమము లక్ష్యములఁ గాంచినఁ గానరాదు. చూడుఁడు.

| సంస్కృతము | ప్రాకృతము | తెనుఁగు |
|---|---|---|
| కాష్ఠమ్ | కట్ఠా | కట్టియ |
| దుర్గా | దుగ్గ | దుగ్గి |
| కటకమ్ | కడఙ | కడియము, కడెము. |

పై లక్ష్యములందు పదమధ్యపదాంతములందలి అ, ఆ, లు తెనుఁగులో ఇ, ఎ, లుగా మార్పునందినవి. ఇట్లే సంస్కృతప్రాకృతపదములలోని వివిధములగునచ్చు లాంధ్రమున విజాతీయములుగాను మార్పుచెందుట గలదు.

ఇట్లే కరదీపిక అనునర్థముగల "దీపయష్టిః" అనుసంస్కృతభాషాపదము ప్రాకృతమున "దీవ అట్ఠి, దీవట్ఠి" అని మార్పునందినది. అది తెనుఁగుభాషలో "దివటి, దివటీ, దివ్వటి, దివ్వటీ, దీటి, దీవటీ, దివిటి, దివిటీ, దివ్విటి, దివ్విటీ, దివ్వెటి, దివ్వెటీ" అనునవి మొదలగు రూపావతారములనంది ప్రయుక్తమైయున్నది. కన్నడభాషలోఁగూడ దీనిరూపము 'దీవటి' అని గలదు.

కాని శబ్దరత్నాకరకర్త "దివటీ వై. వి. ఇనుపసలాకకు గుడ్డలుచుట్టి ముట్టించెడు దీపము అనియు, దివ్వటీ" వై. వి = దీవటీ, అనియు గ్రహించి రెండవదాని కొకప్రయోగ మిచ్చి "ఒకానొకనిఘంటుకారుఁడు దివ్వటి, అని హ్రస్వాంతముగాను వ్రాసియున్నాఁడు" అని చూపియున్నాఁడు. తదితరరూపములకుఁ గల కవిప్రయోగము లాతనికంటఁబడమి వాని ప్రసక్తి విడిచియుండనోపు.

లక్ష్మీనారాయణకర్త యీరూపాంతరములను బన్నెండింటిని జూపియున్నాఁడు. అం దిన్నమధ్యరూపములును గలవు. కాని వేనికిని బ్రయోగము లిచ్చియుండలేదు. ఈతఁ డిచ్చినరూపములలో 'దీటి, దీవిటి' అనునవి క్రొత్తవిగా నున్నవి.

ఆంధ్రభాషార్ణవముగూడ "దీవటీ, దివ్వటి, దివటి" అనురూపములనుమాత్రమే చూపినది.

శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు "దివటి, దివ్వటి, దివ్వటీ, దీవటి, దీవటీ" అను రూపములను సప్రయోగముగఁ జూపినది. 'దివటీ' అనుదానిని ప్రయోగములేకున్నను

దిన్యాటీవిభక్తి ద్విత్వలోపరూపముగా గ్రహించినది. తదితరరూపాంతరము లగ్రాంథికము లని కాంబోలు గ్రహింపలేదు. అనఁగా 'దీప' లోని అత్వమును, ప్రాకృతభాషాపదమందలి యన్యథ్యత్వము నాధారముగా, అన్యథ్యరూపములే గ్రాంథికములుగా గ్రహించియుండ వచ్చును. కాని వికృతులలో నట్టియత్వారూప్యము గాని, సాధాత్మ్యముగాని సరిపడదుగదా! దీనికి మొదట నేఁజూపిన శబ్దరూపములే సాక్ష్యములు.

సత్యముగా నిట్టిపదములకు నిర్ధారకములగు ప్రయోగములు చూపలేకున్నను విభిన్న గ్రంథముల ముద్రితమైనప్రయోగములను గ్రహించుట న్యాయమేమో? అత్వమునకుఁ గాని, ఇత్వమునకుఁగాని, ఎత్వమునకుఁగాని యీరూపములకు యతిస్థలములఁ బ్రయోగ ములు గానరావు. అట్టితఱి వీనిని అన్యథ్యరూపములవలెనే వీలున్నంతలో గ్రహించుట నైఘంటికులకర్తవ్యము. లేదా యివి వాడుకలోనిరూపములనియైనఁ జూపనగును. "చూ. సూ. ని. ఆగాయిత్యము. వి. కొంచెమును గొప్పగాఁజేసి కానించెడియఱవు; ఏన్పలో నగు నది. ఇది వాడుకలోనిది. ఆగాత్యము ఆకాత్యము. ఆగాయిత్తు, ఆగాయిత్యము, ఆఘా త్యము, ఓగాత్యము అని బ్రౌను" అని చూపియుండెనుగదా! ఇందు దేనికిని ప్రయోగ ములు లేనే లేవు.

అట్లని ప్రకృతిప్రత్యయవిభాగములేక వ్యాకృతివిరుద్ధరూపములనెల్ల ముద్రితములం దున్నవియున్నట్లు గ్రహింపవలెననియు, గ్రామ్యరూపములఁగూడ నెత్తిచూపిన నిఘంటు వులఁ బ్రమాణముగా గ్రహింపవలెననియు నాయూహ కాదు. వీలున్నంతవఱకుఁ బ్రయోగ శరణ్యములనేగాక బహుగ్రంథముద్రితములను, బహుళవ్యవహారసిద్ధములను, పూర్వ నిఘంటువులలోనిరూపములనుగూడఁ జూపవలసినబాధ్యత నూతననిఘంటువులకుఁ గలదు. లేనిచో భాష మిగుల సంకుచితమైపోవును. చూడుఁడు.

భోజనపాత్రము, కంచము, అనునర్థముగల "స్థాలికా" అనుసంస్కృతపదమునకు వికృతులుగా నిఘంటువు లీక్రిందిరూపముల గ్రహించియున్నవి.

తెలె      తలిగ      బ్రౌణ్యము. ఆంధ్రభాషార్ణవము (క్రొత్తప్రతి)
తెలె      తలియ      ప్రాంత. ఆం. భా.
తలి, తలిగ, తెల,      తాటాకు. ఆం. భా. లు.
తెలె      తలియ,      సాంబనిఘంటువు.
తెలె      తళియ,      ఆంధ్రనామసంగ్రహము.
తెలె      తళిగ, తళియ,      శబ్దరత్నాకరము.
తెలియ      తలియ      చిన్నయసూరినిఘంటువు.
తళిగ      తలియ, తళియ,      వైకృతదీపిక.

కన్నడమున 'తళిగె, తలిహై' అనురూపము లున్నవి. ఇందు తెలె, తలిగ, తలియ, తలి, తెల, తళియ, తళిగ, తళియ, తెలియ, మున్నగురూపాంతరము లాధునికనిఘంటువులు చూపియుండవలయును.

ఇట్లే పటాకత్తి అనునర్థముగల 'తరవారిః' అను సంస్కృతపదమునకు వికృతులుగా

| | | |
|---|---|---|
| తరవళి | బ్రౌణ్యము | ఆంధ్రభాషార్ణవము (బ్రౌ. ప్ర.) |
| తరవలి | ప్రాంత ఆం. భా. | |
| తరవరి | తవళి | శాటాకు ఆం. భా. లం. |
| తరవరి | తరవళి | చిన్నయసూరినిఘంటువు. |

మున్నగురూపములను గ్రహించినవి. హిందీభాషలో 'తల్వార్' అనియు ప్రాకృత భాషలో 'తరవారి' అనియు రూపము లున్నవి. 'తరువలి - ఉత్తరహరివంశము' 'తరవారు' - రంగారాయచరితము మృత్యుంజయవిలాసములలోఁ బ్రయోగములున్నవి. కాఁగా 'తరవళి, తరవలి, తరవరి, తవళి, తరువలి, తరవారు' మున్నగురూపాంతరము లాధునిక నిఘంటువులు చూపవలసియున్నది. దేశ్యపదములందుఁగూడ వడ్రంగి దూలములను జెక్కు సాధనమును పిఠాపురము ఏలూరుమండలములలో 'బాడిత' అనియు, బాడిద - శ్రీకాకుళము, బాడిదె - విజయనగరము, బాడిసె - గుంటూరు, బాడిస - తిరుపతి, బార్చి - దత్తమండలము, అనియు వాడుదురు. ఇట్టి వ్యవహారసిద్ధములనుకూడ నాధునిక కోశకర్తలు చూపవలసియున్నది.

కాఁగా దీపయష్టికి తద్భవరూపములను సూర్యరాయాంధ్రనిఘంటువు గ్రహించిన వడ్విథాన్మథ్యరూపములేగాక "దివిటీ, దివ్విటీ, దివ్వెటీ, దివ్వెటి, దివిటి, దివ్విటి" అనునవి మొదలగురూపములుగూడ కవిప్రయోగసమ్మతము లనియు గ్రహింపఁదగిన వనియుఁ జెప్ప వచ్చును. ముద్రితములు స్వతంత్రించి దిద్దివేయకున్నచో పై వానియథాస్థితి స్పష్టము కాఁగలదు.

### 1. దివిటీ - దివిటి

పై రూపములకుఁ బ్రయోగములు:—

"మ. జగతీజ్యోతులు కాఁగడాలు బలుబంజాయీలు చెంబత్తులుం, బగలొత్తుల్ దివిటీలుఁ దిర్వశికులున్.
......(హంసవింశతి. 3, ఆ. ౨౮, ప.)

గీ. వారు చేఁబట్టి దివిటీలు వహ్నిగూర్చ కయి రసల్ల్యానుడై ల సంగతముగాక. (చెన్నబసవపురాణము ౫, ఆ. ౫, ప.)

మఱియుఁ బై రూపము లంగీకరించుచో లోకమందలి బహుజనవ్యవహారముగూడఁ బాటించినట్టు లగును. బ్రౌణ్యనిఘంటువునందుఁగూడ (ప్రాఁతప్రతిలో) పై రెండువిధము లైన రూపములును గ్రహింపఁబడినవి. రెండవది మొదటిదాని హ్రస్వరూపము.

### 2. దివ్విటీ - దివ్విటి

పై రూపములకుఁ బ్రయోగములు:—

"గీ. పైఁడిపిడి దివ్విటీలు చే.బట్టి రగులఁ, గొలువునంతటిలోన నక్కొటి దివ్వి
టీలుగూడినమాడ్కిఁ గడింది మంట, లాత్మ తనుశాఖ మొనరింప......" (చెన్నబసవ. ౫, ఆ. ౧౨.)

క. అరిగెడుచో సీతేడు సెఱి నరయుం జెడక తెలుంగువలయుం జని కేకేల్వా [సుం. కాం. ౩.)
విగిఁబట్టు దివ్విటీ యనఁ దిరముగ కేతేఁడు దూర్పుదెసఁ గన్పట్టెన్. (అచ్చతెనుఁగురామాయణము.

చ. నరవర వింటివే బసవనాథుని యల్లుని సన్నిధానముం
దిరువురు పూరుషోత్తము లహీనబలాఢ్యులు దివ్విటీలవా, రు... (చెన్నబసవ. ౫, ఆ. ౪, ప.)

సీ. ...కరదీవి, కలపేర్లు నింగిలాయలన దివియ లన దివ్విటీలనఁ బెనుపంజులనఁ బొల్చు......
(వేంకటేశాంధ్రము. మానవవర్గు ౭౨.)

ముద్రితప్రతులలోని యీపైప్రయోగములు పైరూపములకు సాధకములుగా నున్నవి. మొదటిదానిహ్రస్వరూపము రెండవది.

## 3. దివ్వటీ – దివ్వటి

పైరూపములకుఁ బ్రయోగములు:—

గీ. అదరు ప్రేతుల రొదల బ్రహ్మాండమగల సెందుఁ జూచిన దివ్వటీలే వెలుఁగ.
(దశావతారచరిత్ర. ౭. ౧, ఆ. ౫౧. ప.)

ద్వి. మడివాలు మడివాలు మాచిదేవయ్య కడమలనంది సొప్పడ దివ్వటీఁడు. (బసవపురాణము. ప్రాఁతప్రతి.)

ద్వి. జాలవారిని దివ్వటీలను బల్ల గొలలవారిని గుడిపూజరులను. (బసవ పు. ౫౮, పు. ౮, పం.)

శాసనము:—కాసేవారికి ఖ (౪) మడివాలునకు ఖ (౭) దివ్వటికిని ఖ (౭) అల్లి బోయకు ఖ (౭)...., చేబ్రోలు శాసనము ౧౧౩౫ సం. ౧౩౪ పరుస.

సీ. ఒకలిమెల్ల వణంపు టారపుమానికములు మలయు దివ్వటులతో మార్వెలుఁగ. (అచ్చ. రా. సుం. ౧౧.)

ముద్రితప్రతులలోని పైప్రయోగములు పైరూపములకు సాధకములుగానున్నవి. బసవపురాణము ప్రాఁతప్రతిలో నెల్లెడల, ఎత్వయుక్తరూపములే ముద్రితమున నున్నవి. క్రొత్తప్రతిలో వానిననర్థ్యరూపములుగా సంస్కరించిరి. రామాయణపద్యము ముద్రితమున 'దివ్వెలలతో' అని యున్నది. 'దివ్వెల' అనఁగా దీపావళ్యమావాస్యయని ప్రయోగ ప్రసిద్ధార్థము. అది యిచటఁ బొసగదు. 'తొట్టి, తొట్టెల' వలె 'దివ్వె, దివ్వెల' అను రూపము ఏకవచనముగ దీపార్థమున నున్నదనుకొందమా! 'దివ్వెల' అనురూపము ప్రయోగములఁ గానరాదు. కాఁగాఁ జిన్నమార్పుచేసికొని 'దివ్వటులతో' అని సవరించికొనుట యుక్తము. మొత్తముపై అన్యదేశ్యసంస్కృతప్రాకృతపదములనుండి, ఇన్యర్థములుగాను, ఎన్నర్థ్యములుగాను దెనుఁగుపదములు పుట్టుచుండుటచేతను, గ్రంథములం దిట్టిరూపములు ప్రాఁతప్రతులఁగాంచియే ముద్రించియుండుటచేతను, బ్రౌను, వేంకటేశాంధ్రము, లక్ష్మీనారాయణీయము మున్నగునిఘంటువులుగూడ నిట్టిరూపాంతరముల గ్రహించుటంబట్టియు, లోకవ్యవహారమం దిట్టివి వినంబడుటను, బైని నేను జూపిన యాఱువిధములైన రూపములను నిటీవలినిఘంటువులు గ్రహింపవలసియున్నది.

# కావ్యంలో భావవస్తురచనలు

శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యులు, ఎం. ఏ.,
(కార్యదర్శి, హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్తు)

'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం', 'సద్యఃపరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే' అనులాక్షణికవచనాలకూ, 'విశ్వశ్రేయః కావ్యం' అనువాగనుశాసనవచనానికీ పరిణామం మేమంటే, ఆనందోపదేశాలు పరమాశయాలుగా కలిగిన శబ్దార్థసమ్మేళనం కావ్యమని నిశ్చయించటం శబ్దార్థాలు - రమణీయత - ఆనందోపదేశాలు - ఇది పరంపర!

రమణీయతాసంపాదనంలో శబ్దార్థాలు సామగ్రి. వీటిని విభజింపవలసివస్తే భావవస్తురచనారూపంగా విభజింపవచ్చును. శబ్దార్థసంబంధం అవినాభావం కలది. అర్థం శబ్దమూలం. శబ్దం వినా అర్థోత్పత్తి లేదు. అర్థం మళ్లీ రెండువిధాల ఉండవచ్చు, వస్తురూపమూ, భావరూపమూను. కావ్యచమత్కారమూ, రసోత్పత్తీ కావ్యమూర్తి అయిన శబ్దంమీద నేగాక, అర్థంమీదకూడా ఆధారపడి ఉంటుంది. అనగా వస్తుభావాల మీదకూడా ఆధారపడి ఉంటుంది. కవిసందర్భాన్నిబట్టి వాటికి ప్రాముఖ్య మిస్తాడు. ఒకచోట ఒక మేఘగర్జనంగాని, కదీకుర్మరధ్వనిసిగాని కవి వర్ణించవలసివస్తుందనుకోండి; అప్పుడు ధ్వన్యనుకరణంవల్ల దాన్ని వర్ణింపవలసివస్తుంది. ఒక్కొక్కప్పుడు మధురమైన వస్తువును అనగా విషయాన్ని మధురమైనపదాలతో వర్ణింపవలసివస్తుంది. మరిఒకప్పుడు పాఠకుడి మనశ్చక్షువుకు విషయాన్ని గోచరింపచేయవలసివచ్చినపుడు మరోవిధమైనరచనను అనుసరించవలసివస్తుంది. ఇట్టి సందర్భాలలో రచనకు ప్రాముఖ్యం ఇవ్వవలసివస్తుంది.

ఒక్కొకసమయంలో చెప్పదలచుకున్నవిషయానికి ప్రాముఖ్యం కావాలె. సూర్యోదయవర్ణనకాని, సూర్యాస్తమయవర్ణనగాని చేయవలెననుకోండి, అప్పుడు శబ్దానికిగాక వాటిసంపుటివలన కలిగే అర్థం అవసరమవుతుంది.

పై రెండుగాక ఒక్కొకచోట పాత్రలచిత్తవృత్తులనుగాని భావాలనుగాని చిత్రింపవలసివస్తుంది. అప్పుడు భావం ముఖ్యమౌతుంది. కాబట్టి యీమూడు అనగా భావవస్తురచనలు శబ్దార్థాలపై ఆధారపడిఉన్నవి. అనగా కవితకు లేక కావ్యానికి ఈమూడు సామగ్రి అవుతవి.



శబ్దమూలం రచన. అర్థమూలాలు భావవస్తువులు.

ఉదాహరణపూర్వకంగా చెబితే బాగా తెలుస్తుంది. నా ఉదాహరణాలను పూర్వకవులనుండే సాధ్యమైనంతవరకు గ్రహిస్తాను. ఈ క్రిందిపద్యం మీ రందరు ఎరిగినదే.

"ఆటజని కాంచె భూమిసురు డంబరచుంబిశిరస్సరిజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలమున్
కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్."

ఈపద్యంలో ఆధునికుల కనేకులకు ఎట్టిరసం కనిపించకపోగా కొందరు శబ్దాడంబరం చేత సందర్భాన్ని పాడుచేసినాడనికూడా అంటున్నారు. కాని రచన కిది పరమోదాహరణంగా నేను భావిస్తున్నాను.

'అంబరచుంబి' లో ఉన్న బకారద్విరావృత్తివలన ఏవో రెండువస్తువులు రాచుకున్నట్లు సహృదయుడికి స్ఫురిస్తుంది. 'శిరస్సరిజ్ఝరీ' లో ఉన్న రకారావృత్తీచివర రకార దీర్ఘమూ ఔన్నత్యద్యోతకాలుగా కనపడకమానవు. ఆ ఔన్నత్యమూ క్రమక్రమంగా పెరుగుతున్నట్లుకూడా ద్యోతకమౌతుంది. 'ముహుర్ముహుర్లుఠత్' లో తరంగముల ఊపు ప్రత్యక్షంగా మనశ్చక్షువునకు కనపడకమానదు. 'అభంగతరంగమృదంగనిస్వన' అనేచోట మృదంగనిస్వనస్వారస్యాన్ని ద్యోతకంచేసే బిందుపూర్వక గకారపౌనఃపున్యం లోనూ "స్ఫుటనటన" అనేచోట నాట్యసాదృశ్యద్యోతకమైన టకారద్విరావృత్తిలోనూ శబ్దరచనాగతమైన రసన ఉన్నది. పరిఫుల్లకలాపకలాపిజాలం చేసేనాట్యానికి గంగాతరంగ నిస్వనం, మృదంగనిస్వనంగా పరిణమించింది. నాట్యసాదృశ్యమూ, మృదంగనిస్వనసాదృశ్యమూ, ఉపయోగించినశబ్దాలచేత సాధ్యాలవుతున్నవి. ఆకాశాన్ని ఒరుసుకునే హిమవచ్ఛిఖరమూ, అక్కడ ఊగులాడే తరంగపరంపరా, అందువలనకలిగే శబ్దమే మృదంగశబ్దం కాగా ఆశబ్దానికి పింఛాలనెత్తి నాట్యమాడే నెమళ్లూ, ప్రక్కనున్నసాలవృక్షాలూ వాటిని తమతొండాలతో ఊపే యేనుగులూ, కండ్లకుకట్టినట్లు కనపడటంలేదా. ఏనుగులనూ సాలాలను వదిలితే పద్యమంతా శబ్దగతరసనకు పరమోదాహరణమని నామనవి.

మరియొకసంగతి. శబ్దం ఆపాతతః శ్రవణసుఖాన్ని ఇస్తుంది. అర్థం తెలియకపోయి నప్పటికీ మనం ఆనందం అనుభవిస్తాము. ఉదాహరణంగా రాయప్రోలువారివిగాని, దేవులపల్లి వేదులవారివిగాని కొన్నిపద్యాలు చదువుతూఉంటే ఒకవిధమైన శ్రవణసుఖం మనకు కలుగుతూ ఉంటుంది.

"పవనపులకితచంద్రాతపప్రఫుల్ల చారుశారదయామినీసమయమందు."

"ప్రబలతీరంధ్రాభ్రజనితగాఢధ్వాంత నిబిడ హేమంతరాత్రీకుంతలములలో."

ఇట్టి పదబంధాలు ఆపాతతః శ్రవణసుఖాన్నియిస్తవని వాటిని జిహ్వాగ్రంలో ఉంచుకునే అనేకపాఠకులే సాక్ష్యమిస్తారు. ఇంతమాత్రంచేత వీటిలో వస్తువుకు స్థానం లేదనుకోరాదు. మొదట శ్రవణసుఖంద్వారా వస్తువుకు ప్రాధాన్యమేకాని తద్వారా అవటానికి వీలులేదు. వాగర్థసంబంధం అవినాభావంకలదని వెనకనే తెలిపాను.

ఇక్కడ పరుసపరళాలనే వర్ణవిభాగంకూడా విమర్శనీయం.

'ఏలాలతాజాలజోలాకలితకీరబాలాస్ఫుటాలాపలాలితంబు
మందారమాకందబృందామితమరందసందోహానందితేందిందిరంబు
ఝల్లీఝంకారోల్లీప్రసద్గుచ్ఛవల్లీలవల్లీమతల్లీప్రవేల్లితంబు
పారావతకనటస్మయారావకకోరవారామితారవోద్గిరణంబు.'

పై పద్యంలో ఉండే శబ్దాలంకారం చక్కనినడకతో శ్రవణసుఖాన్నిస్తూ పద్యానికి ఒకవిధమైన సంగీతం కల్పించి, ఆపాతతః ఆనందింపచేస్తున్నది.

రాధాకృష్ణపండితు డిలాగంటున్నాడు.

'There is no doubt that rhythmical words exert an enchanting influence on the mind. We respond to music even when we fail to seize the sense."

శబ్దరహితమైన కేవలరాగాలాపనమే శ్రవణసుఖంద్వారా ఆనందం కల్పించగలిగినప్పుడు శబ్దసహితమైన యలయదాన్ని కల్పిస్తుందనడంలో ఆశ్చర్యమేమున్నది ?

లాక్షణికులు వృత్తులు, రీతులు, అనేవాటినిగూర్చి విపులంగా చర్చించారు. ఈ చర్చలో వీటికికూడా స్థానమున్నది. వృత్తులు 'సముచితార్థపదన్యాసపాష్ఠవములు,' సందర్భమాత్రసంగతములు రీతులు. వృత్తులలో అర్థం ప్రసక్తం; రీతులు రచనామాత్రసంబద్ధాలు. అర్థానుగుణమైనరచన వృత్తి. సందర్భానుగుణమైనరచన రీతి. రెండింటికీ రచనతో సంబంధం ఉన్నది. కాని వృత్తికి అర్థంతోకూడా సంబంధం ఉన్నది.

తరువాత వస్తువు. కవిచెప్పదలచినవిషయాన్ని రచిస్తాడు. ఆవిషయాన్నే వస్తువందాము. మనకవులలో చాలామంది యీవస్తువుకు ప్రాధాన్యమిచ్చినారు. మనగ్రంథాలలో కనబడేవర్ణనలన్నీ వస్తువు అనే చెప్పవచ్చు.

ఈవస్తువులకుకూడా మనసు రంజింపజేయగలశక్తి ఉన్నది. ముఖ్యంగా ఆవస్తువు మన అనుభవానికి ప్రతిబింబమైనపుడు మనకు ఆనందాన్నిస్తుంది. రెండుదాహరణా లిస్తాను.

శ్రేణిల్గట్టి నభోంతరాళమున పోలేక పక్షు లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె బృగళప్ణావార్థ బింబేక జపా
శోణం బయ్యె బతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెక గడున్.

దీనిలో సాయంకాలవర్ణన మున్నది. పక్షులు వరుసలుకట్టి సాయంకాలం ఆకాశంలో యెగిరిపోతూ ఉండడం, కాలినరాళ్లు మందోష్ణాలు కావటం, సూర్యబింబం యెర్రబడడం, కమలాలుముకుళించుకుపోవటం మొదలైనవిషయాలన్నీ తత్కాలచిహ్నాలు, వాటిని మన ముందు రెరుగుదుము. అందుచేత మన అనుభవాన్ని స్వభావోక్త్యలంకారంలో కవిపెట్టి ప్రతిబింబం కల్పించినాడు.

పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకు హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిం గ్రీడించుయోగీంద్రుమ
ర్యాదన్నక్రము విక్రమించె కరిపాదాక్రాంతినిర్వక్రమై.

దీనిలో నక్రము గజపాదము నెంతగట్టిగా పట్టుకున్నదో వర్ణింపబడినది. మొదటి మూడుపాదాలలో యోగికీ, నక్రానికీ కొన్నిసమానధర్మాలు చెప్పినాడు కవి. వీటితో యోగిస్థితిని మనం ఊహించుకొని ఆగుణాలను నక్రానికి అన్వయించుకోవలె. అప్పుడు నక్రముయొక్క చిత్తైకాగ్ర్యము, పట్టుదల, కార్యసాధనయత్నము, యావద్బలాన్ని కేంద్రీకరించటం మొదలైనలక్షణాలు మనకు ద్యోతకమౌతవి. ఈపద్యంలో ఉన్న 'క్ర' అనే అక్షరంయొక్క ఆవృత్తి పద్యానికి వన్నెతెస్తున్నది. "క్ర" అనే అక్షరం గజపాదం. క్రింది క్రావడి నక్రము ఖం. అక్షరాన్ని క్రావడి చుట్టినట్లు గజపాదాన్ని నక్రవక్త్రం చుట్టింది. "క్ర" కర్కశవర్ణం; పట్టుకూడా కర్కశమే. ఎంతరసవంతంగా చెప్పినాడు కవి. ఈవిషయం మనకు ఆనందం కల్గిస్తుందనటంలో అభ్యంతర మేమున్నది?

తరువాత భావాన్నిగూర్చి ముచ్చటిస్తాను. కవి స్వయంగా చిత్తం స్పందించగా కల్గినవికారంగాని, కావ్యంలో పాత్రలచిత్తస్పందసంపల్ల గల్గినట్లు చెప్పినవికారంగాని, భావం అనవచ్చును. కవి తాను చెప్పదలచినభావానికి పూర్వరంగంగా ఒకవాతావరణాన్ని కల్పిస్తాడు. ఆవాతావరణం మనను వశపరచుకుంటుంది. అప్పుడు కవికికల్గినభావవికారం మనకు గోచరమై కవికికల్గినదాని అనురూపభావవికారం మనచిత్తంలో కలుగుతుంది. అనగా సుహృదయుడు కవిహృదయప్రవేశం చేస్తాడన్నమాట. అనురూపభావసంస్కారం పొందక పోతే తద్భావం మనకు ద్యోతకంకాదు. అప్పుడు పాఠకుడు కవిభావాన్ని అందుకోలేక కవికి ఆదోషాన్ని ఆపాదిస్తాడు. న్యాయంగా ఆదోషం మనదేకాని కవిదికాదు. కాబట్టి కవి హృదయప్రవేశం అత్యవసరం. కాని యీభావం మనస్తత్వానికీ శాస్త్రదృష్టానికీ వ్యతి రేకంగా ఉండకూడదు. రెండుదాహరణా లిస్తాను.

"అరవిందంబులకంటె కోమలములై యందంబులై యొప్పు నీ
చరణంబుల్ కఠినంబులై మొనయుం మాచన్నుంగవల్ మోపగా
నెరియంబోలు నటంచు శోకోదము, నీ యాకర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీప్రియలకున్ ప్రాణవ్యథం జేయదే!"

ఈపద్యంలోఉన్న పదాలవల్ల యిది కేవల శృంగారరసప్రధానమని అనుకోకూడదు. గోపికలు భక్తలు. కృష్ణుడు పరమేశ్వరుడని వాళ్లు గుర్తించి కొలిచారు. ప్రేమించారు. మధురభావాన్ని పొందారు. మానవశరీరంలో పరమాత్మ వాసస్థానాలు మూడని ప్రసిద్ధం. మొదటిది బ్రహ్మరంధ్రం. రెండవది కనీనిక. మూడవది హృదయం. "తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః.' భక్తలైనగోపికలు పరమేశ్వరుడి పాదద్వయం గ్రహించి పరర

మేశ్వరపీతమైన హృదయానికి తగుల్చుకున్న స్ఫటికభావం యీపద్యంలో పోతన రసవంతంగా వర్ణించినది. ఆతరుణంలో తత్క్రియ భక్తి ప్రవణమే కాని శృంగార ప్రవణం కాదు.

ఈసందర్భంలో శంకరభగవత్పాదుల శ్లోకం అనువదిస్తాను.

"కదా వాత్వాం దృష్ట్వా గిరిశ తవభవ్యాంఘ్రియుగళం
గృహీత్వాహస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లిష్యాఘ్రాయస్ఫుట జలజగంధాన్ పరిమళాన్
అలభ్యాన్ బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామి హృదయే"

పైశ్లోకంలో శంకరులు చెప్పిన భగవత్పాదవక్షోవహనమే పోతనపద్యంలో ఉల్లేఖితమైనది.

పద్మం కోమలత్వానికీ సౌందర్యానికీ ఉపలక్షకం. అట్టిపద్మంకంటె కూడా కోమలాలు సుందరాలు శ్రీకృష్ణపాదాలు, స్త్రీశరీరమే కోమలం. దానిలో వక్షఃస్థలం కోమలతరం. అట్టి దానికంటె కోమలతమాలు కృష్ణపాదాలు. అందుచేత తత్స్పర్శచేత అవి కందునై ! ఇది కవికల్పించినవాతావరణం. ఆకందుటకే గోపికలు పొక్కుతారు. అట్టిస్థితిలో ఆపాదాలు కర్కశారణ్యభూస్పర్శచేత ఎంతబాధపడుతున్నవో అని గోపికలదుఃఖం! ఎంత మధుర భావం! వారి కది ప్రాణవ్యథకలగచేస్తుందట ! పరమేశ్వరుడికే మాత్రం బాధకల్గినా అది భక్తులకు ప్రాణవ్యథ! పరమేశ్వరుడికి బాధ యేమిటని భక్తులకు తోస్తే అది మధుర భావమే కాదు. దానిలో భక్తిలేదు. ఒక్కమారు వారిబాధను సహృదయులు భావించమని మనవి. వక్షఃస్పర్శకు దుఃఖించేభక్తులు కర్కశారణ్యభూస్పర్శకు భరింపగలరా? పరమేశ్వరునికి బాధేలేదు. బాధంతా భక్తులదే. పిల్లవాడికి దెబ్బతగిలితే పిల్లవాడిబాధకంటె తల్లి బాధ యెక్కువ. ఆప్రేమభావానికీ యీమధురభావానికీ సామ్యం ఆలోచించండి. అది ఎంత ఉదాత్తంగానూ పవిత్రంగానూ కనపడుతుందో.

మరి ఒకఉదాహరణం చెపుతాను.

పాటునకింతులోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోయ ని
చ్చోట భవన్నఖాంకురము సోకె కనుంగొనుమంచు చూపియ
పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చె కలస్వనంబుతో

ఇందులో చెప్పినభావానికి పూర్వరంగంగా వెనుకటిపద్యంలో వస్తువును కల్పించాడు కవి. ప్రవరుడు వరూథిని 'అంసద్వయం బంటి పొమ్మంచుం ద్రోచి'నాడు. వరూథిని కోపంతో కాటేయబోయే సర్పంవలె లేచింది. కాని యింకా అతనిమనసును లోబరుచుకునే ఆశ పూర్తిగా నశించలేదు. కాని గర్వభంగంతో సిగ్గుపడిపోతున్నది. అప్పుడు "కృపా

రహితాత్మక" అని ప్రవరుడిని దూషింపజేశాడు. మళ్లీ పశ్చాత్తాపపడ జేశాడు. ఒకప్పుడు స్త్రీ యువయావదర్శనంచేత పురుషునిమనసు కరిగిపోవచ్చును. "ఇచ్చో భవన్నఖాంకురము సోకె' నని ప్రవరుని అకార్యకరణంగా సోకినస్థలాన్ని పైటచెరగెత్తి 'చూపింది' ఇది సున్నితమైనబాణము. 'చూపి' లో కవి వరూధిని యావన్మనోబాధను విశదీకరింపచేశాడు. తనరహస్యస్థలాన్ని 'చూపినట్లు' చేసి యామె మనోభావాన్ని తుదిమాటు వెల్లడిచేశాడు. "వేదననెపం బిడి యేడ్చె కలస్వనంబుతో" నని ఆమెచేష్టను పరిణామంగా వర్ణించాడు కవి. రహస్యావయవదర్శనం, అశ్రుపాతం ఆమె ఉపయోగించిన తుది ఆయుధాలు. ఎంత స్వభావసిద్ధం! ఎంతరమణీయం! ఎంతభావపూర్ణం! ఈవిధంగా ఆమె మనోభావాలను చేష్టలద్వారా చిత్రించాడు పెద్దన.

నేను చెప్పినట్లు భావవస్తురచనలు కవితాసామగ్రిలో ప్రాముఖ్యం వహిస్తవి. ప్రత్యేకంగా ప్రతిదానికి. మనసు ఆనందింపచేసేశక్తి ఉన్నట్లు మనం చూశాం. సందర్భం ఒక్కొక్కదానికి విశిష్టత కల్పిస్తుంది. ఆసందర్భం బాగా తెలిసి ఉపయోగించేకవే నిజమైనకవి.

రాధాకృష్ణపండితు డిలాగంటున్నాడు.

It is often asked whether the power of poetry is due to the music of words, or the images they suggest, or the ideas they express. Each view counts powerful support.

ఇట్టి కావ్యామృతదోగ్ధ సహృదయుడు

(సాహితీసమితి గుంటూరు గోష్ఠిలో పఠించినది)

# అమలినశృంగారము

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు, ఎం. ఏ.,
శారదా పీఠము

కావ్యప్రపంచాన్ని ఒక్కసారి అవలోకిస్తే మనకంతటా ఒకేసూత్రం గోచరిస్తుంది. అదే శృంగారం! ఏభాషా సాహిత్యమైనాసరే! ఈశృంగారం ప్రధానంగానే భాసిస్తుంది.

కొన్నికొన్ని కావ్యాలలో ఉదాత్తంగాను, కొన్నిటిలో నీచాతినీచంగాను, ఈ శృంగారం వర్ణితమౌతూ ఉంటుంది. ఏది ఎల్లాగున్నా శృంగారం అంటూ లేనికావ్యం అరుదైపోయిందనే చెప్పాలి.

ప్రపంచవ్యవహారంలో జీవికీ శృంగారానికీ అవినాభావసంబంధం ఉంది. శృంగారాన్ని ఎంతగా పైకి ఏవగించుకున్నా ప్రతివ్యక్తినీ అంటిపెట్టుకొని ఇది ఉండనే ఉంటుంది.

ఇక శృంగారం అంటే ఏమిటో చూదాము. శృంగారం అనే శబ్దాని కిటీవలవచ్చిన అభిప్రాయం చాల ఏహ్యమైంది. ఉత్తశృంగారపురుషుడనీ - పచ్చిశృంగారం - అనీ ఇల్లా సంభావిస్తూ ఉంటాం. కేవలమూ 'కామం' కింద కట్టేసి శృంగారాన్ని భావిస్తూ ఉండడం జరుగుతున్నది. 'శృంగారం - కామం': ఈరెండుపదాలూ ప్రత్యేకార్థాలు కలిగినటువంటివే. కాని వీటినిరెంటినీ ఒకదాని కోటిగా వాడుతున్నారు.

శృంగారం అనేపదాన్నుంచే 'సింగారం' వచ్చింది. 'సింగారించుకోడం' అనేది అందరూ వాడుతున్నటువంటిదే. అలంకరించుకోడం - అనే అర్థం కల్గింది ఆపదం. కాగా అలంకారం అనే అర్థం శృంగారపదానికి ఉన్నట్లు తెలుస్తుంది.

'శృంగారం' అనేపదాన్ని ఆలంకారికులు విశిష్టమైన అర్థంలో వాడారు. రససంబంధమైనవిచారణలో శృంగారపదానికి ఉన్న ఈప్రత్యేకభావంపైనే ఆధారపడి వ్రాస్తున్నా.

శృంగారం ఒకరసం. దీనికి స్థాయీభావం రతి అన్నారు. 'రతి' అంటే కోరిక - ఇచ్ఛ - అభిలాష ఇలా చెప్పకోవచ్చు. రసస్థితి చాల ఉన్నతమైంది. అది ఆనందానికి స్థానం. రసస్థితి పొందేపూర్వం కలుషీభూతమైనభావా లెన్నైనా ఉండవచ్చునేమో కాని రసస్థితి పొందినతర్వాత కాలుష్యం చేరరాదు. ఆరసస్థితి అకలుషితమైంది. నిర్మలమైంది; స్వచ్ఛమైంది; స్నిగ్ధమైంది; సుందరమైంది; ఆనందప్రదమైంది. ఆనైర్మల్యం, స్వచ్ఛతా అబ్బితేనే ఆనందపర్యవసాయి అవుతుందిగాని లేకపోతే రసత్వం సిద్ధించదు. ఈరససిద్ధాంతాన్ని పవిత్రంగా భావించారు ఆలంకారికులు.

ఆంధ్రకవులు శృంగారాన్ని పోషించడంలో ఏభాషాకవులకూ తీసిపోరు. సంస్కృతంలో కాళిదాసకవినీ, తెలుగులో శ్రీనాథకవినీ శృంగారకవులుగా కీర్తించడం పరిపాటయిపోయింది. వారిజీవితాలలో కొన్నిసంఘటల్ని కూడా కల్పించుకొని మురిసిపోతూ

ఉంటుంది లోకం. శృంగారం అంటే వ్యభిచారం అనే దృష్టే ఎక్కువగా ప్రబలింది. అది సరికాదు. శృంగారం ఆచారమే. శ్రీకృష్ణలీలలో పోతనవర్ణించిన శృంగారం మృదువైంది. మనోహరమైంది. రసత్వసిద్ధి అల్లాంటిచోట్ల కల్గినట్లుగా ఇతరత్రా అంతగా కల్గలేదు. శృంగారం మధురమైనభావం. దీన్ని ఎంత సుకుమారంగా ఆర్ద్రహృదయంతో దర్శిస్తే అంత మనోజ్ఞంగా భాసిస్తుంది. శిరీషకుసుమపేశలంగా ఉండేది శృంగారభావం. దీన్ని కందిపోకుండా, నలిగిపోకుండా, వాడిపోకుండా భద్రంగా కాపాడాలి.

ప్రబంధకవులు వర్ణించినఘట్టాలను చూస్తే అద్భుతంగానే ఉంటాయి. కాని, రతివర్ణనలలో పర్యవసించడాలు కొంతవరకు ఏహ్యకారణాలే అవుతున్నాయి. అయినా ఆ వర్ణనల్ని అమితప్రౌఢంగా చిత్రించి ఔచితిని పాటిస్తూనే వచ్చారాకవులు. ఏమైతేనేమి ఈ మధ్యకాలపుకవులరచనలు ఈనాడు అంతగారుచించకపోవడానికి చాలమంది దీన్ని కారణంగా చెపుతున్నారు.

నవ్యకవులరచనల్ని పరికిస్తేకూడా శృంగారభావం అగుపించకపోదు. పైగా విరహం ఎక్కువ వీరిరచనల్లో. విప్రలంభశృంగారానికే ప్రాధాన్యమిచ్చినట్లు కన్పిస్తుంది నవ్యులు. అప్రాప్తమనోహరు లెక్కువైపోయారు వీరికావ్యాలలో. అసామర్థ్యం అన్నారు కొందరు. ఎల్లాగన్నా శృంగారం ఉపాదేయమే అయింది. ఆశృంగారం ఆత్మాశ్రయం కావడంవల్ల లోకానికి కోపం వచ్చిందేమో.

దరిమిలా వచ్చినరచనల్లో అసభ్యశృంగారం అంతులేకుండా అవతరించింది. భక్తిభావంలో ఉన్ననైర్మల్యం ఈశృంగారంలో లేకపోబట్టే ఇంతగా నిరాదరణపాలౌతున్నాయి ఈరచనలు అనవచ్చు. అసభ్యశృంగారం హెచ్చిపోవడం సంఘానికి శ్రేయస్సుకాదు. ఇలా పెచ్చుపెరిగిపోతున్నాయి కనుకనే నేటికాలపు హృదయాలకు రక్తినివ్వడం లేదు.

నాయికానాయకులమధ్యనున్న ప్రేమభావాన్ని ప్రబంధకవులు వర్ణించారు. ఆప్రేమ ఆంగికమైనపుడు మలినమౌతుందనేమాట సత్యమే, కాని మిథునానురాగం ప్రేమమయమై, ఉదాత్తమైనపుడు ప్రణయమై, అనుదాత్తం కావడానికి ప్రణవస్థితి నందడానికి ఉత్తమ సాధనం కావలెనని ఆర్షమతం. గార్హస్థ్యానికి క్షతిరాని ప్రణయం ఉపాదేయమే నన్నారు. బ్రహ్మచర్యాశ్రమంలో విద్యాదీక్షితుడైన విద్యార్థి గురుకులాన్ని వదలిపెట్టిపోయే సమయంలో 'ప్రజాతంతుమ్ మా వ్యవచ్ఛేత్సీః' అని గురువు ఉపదేశించడం సనాతనంగా వస్తున్నసంప్రదాయమే! అంటే గార్హస్థ్యాన్ని స్వీకరించకుండా అతడు ప్రజాతంతువును ఛేదించ పూనుకుంటాడేమో! అల్లాంటి పిచ్చిపనిచేయకుండా గార్హస్థ్యాన్ని స్వీకరించమనీ, సుప్రజాతంత్రసూత్రాన్ని నిర్వహించమనీ, అది ధార్మికమైనదేననీ బోధిస్తున్నాడు పై వాక్యంలో. దీన్ని 'దంపతీనిష్ఠ' అని రాయప్రోలువారు గ్రహించి గౌరవించారు.

విషయమయమైన సంభోగవిధిజగాన, క్షయమయయ్యు రూపాంతరసంగ్రహమున

గా.

సుప్రజాతంత్ర నిర్వాహసూత్ర మగుట, తలచెదరు దంపతీసిష్ట ధర్మముగనె !

అని అన్నాడు.

కావ్యలోకంలో నాయికానాయకులమధ్య వ్యావహారికలోకంలో భార్యాభర్తల మధ్య ఉన్నశృంగారం ఆంగిక ప్రసక్తికల్గినప్పటికీ అది అశ్లీలం కాదనీ, అందులో ఔచితీ భంగంలేదనీ అలాంటి శృంగారాన్ని ఏవగించుకోవడం లేదనీ వీరి ఊహ.

దంపతీసిష్టమైనశృంగారభావం ధార్మిక మెప్పుడైందో అమలిన మప్పుడే అయిందని గుర్తించాలి. ఇది పుత్రఫలంలో పర్యవసించి, ఆపుత్రావలోకం ఆనందాన్ని ప్రసాదిస్తుంది. ఈపుత్రావలోకం దంపతులహృత్కమలాల్ని వికసింపచేస్తుంది. ఆకమలాలపైన వీచినగాలి పిల్లలు, తెచ్చేపరిమళంలాంటి మృదుభావాన్ని అందిస్తుంది. ఇదిలేకపోతే దాంపత్యశృంగారం దూష్యమే అవుతుంది.

ఈనాడువస్తున్న రైల్వేవాఙ్మయంలో ఇల్లాంటి అశ్లీలమే, ఇల్లాంటి అనౌచిత్యమే, ఇల్లాంటి అధార్మికమైన అనభ్యుదయకరమైన అమంగళకరాలైన కేవల సురతక్రియాకలాపాలే వర్ణింపబడుతూవస్తున్నాయి.

ఆచారంకానిది వ్యభిచారం. ఉత్తమశృంగార సాహిత్యాచారానికి విరుద్ధంగా ఈరైల్వేవాఙ్మయం సృజింపబడుతున్నది. ఇది లోకానికి - సంఘానికి - ప్రాణికీ ప్రాణికీ- ప్రమాదకరం. ఇలాంటి అసభ్యశృంగారం నాశహేతు వౌతుందని వేరే చెప్పనక్కరలేదు.

ఈనాటి పాఠకుల్లోకూడా ఉన్నలోపాన్ని స్పృశిస్తే నన్ను మన్నిస్తారు. అసభ్య శృంగారరచనలపైన మోజు ఉన్నంతగా సభ్యశృంగారం పైనలేదు వాళ్లకు; పరస్త్రీ కన్పించినంతసుందరంగా స్వీయ కన్పించదు. ఇదిచాల విచిత్రమైంది. ఒకవ్యక్తియొక్క బాహ్యాంతర్భావాదుల్ని పరిశీలిస్తే భేదం ఎక్కడైతే కన్పిస్తుందో అక్కడ ఆవ్యక్తి మోసకారి అని గుర్తించాలి.

పశుత్వాన్ని ప్రకోపింపచేసుకోవడంకాదు మానవులలక్ష్యం. సాహిత్యలక్ష్యమూ అదికాదు. పవిత్రమైనటువంటి స్వచ్ఛనిర్మలమైన జీవితాన్ని నడుపుతూ సత్యశివ - సౌందర్యాలలో ఉన్నపవిత్రాన్నిగుర్తించి అందులోని సాత్వికత్వాన్ని పొందడానికి ప్రయత్నం చేయడమే ప్రతిమానవుడిధర్మం. కాబట్టి అసభ్యరచనల్ని ఆమోదించడం, గౌరవించడం, చాలపొరపాటు. చాలమంది అన్నట్లుగా ఆయాపాఠకులు తమలో ఉన్నకామనకు తృప్తి నిచ్చుకోడానికి ఈరచనలు చదువుకుంటూ ఉంటారనడం సత్యంలాగానే అగుపిస్తుంది. అల్లాంటి రచనలు చేసేరచయితలుకూడా ఆజాడ్యంతో బాధపడేవాళ్లని స్పష్టంగా తెలియవస్తుంది. ఇందులో సందేహించాల్సిన అవసరం ఏమాత్రం లేదు. ఆరచనలను ఆదరించే పాఠకలోకం, రచించేబృందమూ సిగ్గుపడాల్సి ఉందని హెచ్చరిస్తున్నాను.

ఇల్లాంటి అసభ్యశృంగారాన్ని చిత్రించేవాళ్లు ప్రబంధకవులరచనల్లోని శృంగారాన్ని ఏవగించుకోవడం పెద్దవింత. అక్కడ ఉన్నది నాయికానాయకులమధ్య శృంగారంకాని,

నియమరహితమైన విశృంఖలవిహారం కాదు. వీరి విశృంఖలత్వానికన్నా వారినియమం ఏవిధంగా నీచమైంది? కాబట్టి ఈనాటి విశృంఖలవిహారం ప్రతిపాదించేరచనల్నీ రచయితలనూ పాఠకలోకం మన్నించరాదని మనవి.

ఎవరన్నా ఆదరిస్తూఉంటే ఇలాంటి రచనల్ని వారిని దుర్బలహృదయులే అనాలి. దౌర్బల్యాన్ని వృద్ధిచేసుకోవడం సంస్కృతి అనిపించుకోదు. మానవుడు సంస్కారం పొందాలంటే అతనిలోఉన్న దౌర్బల్యాన్ని పోగొట్టుకోవాలి. అసభ్యశృంగారరచనాపారాయణంవల్ల ఇది సమకూడ దని ఘంటాపథంగా చెప్పవచ్చు.

ఇల్లా అసభ్యత హెచ్చిపోతూ ఉండడాన్నీ తద్వారా సంఘంలో అనర్థకాలు పెచ్చుపెరిగిపోతూ ఉండడాన్నీ దర్శించిననవ్యకవి శ్రీరాయప్రోలు సుబ్బరాయ భట్టాచార్యులు.

> కలుషభాంగి వయోధీరకుసుమమందు, మోహమధువె గవేషించె మున్ను సుకవి
> సాత్త్వికప్రేమకోశపేశలములయిన, వత్సలామృతరుచులపు వలచె నేడు.

ఆనేపథ్యంలో 'వాత్సల్యానికి' ఆయనఇచ్చిన ప్రాధాన్యాన్ని గుర్తించాలి. మోహానికీ - వాత్సల్యానికీ ఉన్న భేదాన్ని గమనించాలి. మోహం అరిషడ్వర్గంలో చేరినటువంటిది. దాన్ని నమ్మరాదు. అది కాలుష్యాన్ని తెచ్చిపెట్టుతుంది. వాత్సల్యం అంటే అది శత్రువు కాదు. అందులో కాలుష్యం లేదు. దానివల్ల అమరే సాన్నిహిత్యం అమరమైంది. శాశ్వతమైంది. అందుచేత వాత్సల్యాన్నే ఆరాధించాడు నవకవిబ్రహ్మ. మోహాన్ని మధువు అన్నాడు. వాత్సల్యాన్ని అమృత మన్నాడు. చూడండి ఈ రెండు రూపకాలంకారాలలో ఉన్న అంతర్భావం! మోహం మత్తెక్కిస్తుంది మధువులాగా. వాత్సల్యం చావులేనటువంటిది. అందుచేత అమృతంలాంటిది. ఇలా అమృతత్వాన్ని ప్రసాదించేవాత్సల్యమే పవిత్రమైంది అని దాన్ని వాంఛించాడు. ఇందులో సాత్త్వికభావాన్ని దర్శించాడు. సాత్త్వికానందమే ఉత్తమమైందని గ్రహించాడు. ఈవాత్సల్యం శృంగారంలో పర్యవసిస్తుందని సూత్రించాడు.

ప్రేయసీప్రియులమధ్య ఉన్నభావం అది ఆంగికమై కాలుష్యం పొందవచ్చు నంటాడు. కామన ఉండగానే కాలుష్యం వెన్వెంటనే అబ్బుతుందని ఆయన ఆశంక. స్వామిసేవకులమధ్యా, సోదరీసోదరులమధ్యా, తల్లిపిల్లలమధ్యా ఉండేభావం మలినరహితమైందనీ, అది కూడా ఆనందపర్యవసాయి అయి శృంగారరసంగా పరిణమించగలదనీ రాయప్రోలువారి బోధ. ఆంగిక ప్రసక్తికలిగిన శృంగారభావం ఆంగికసౌఖ్యాన్ని పొందగానే అంతరించవచ్చు; లేకపోతే ఆంగికసంబంధమైనభావం నిత్యమైందికాదనీ చెప్పవచ్చు. నిర్వాత దీపాంకురంలాగా నిశ్చలంగా ఉండకలిగేశృంగారభావం అనంగికమైనదనీ, అట్టిది వాత్సల్యంలో ఉన్నదికాని కామనలో లేదనీ వీరినిశ్చయం. రాయప్రోలువారికావ్యాలను పరిశీలిస్తే ఈసూత్రమే

సర్వత్ర మనకు కన్పిస్తుంది. వారు ప్రధానంగా ఈసూత్రాన్నే పాదిపిపెట్టారు తృణకంక ణంలో - స్నేహాలతా దేవిలో - కష్టకమలలోనూ.

'శీలమట్టుల నాచితిం జెదరనీక, అభివిధాన నక్షీలమనాదరించి'

సౌందర్యార్చనచేయడమే కర్తవ్యంగా భావిస్తాడు.

"సురతసంస్పర్శలేని శుచిమదమలజీవితానురాగాల్ని చిలకరించే"

అమలిన శృంగారం ఉపాదేయమంటాడు.

'పార్వతీపరమేశ్వరబాంధవమున, భారతీబ్రహ్మదేవదాంపత్యమందు
విషయసురతప్రసక్తి భావింపగలమె, రసమనౌచిత్యమునమలీ మసము యగుట !'
"యామినీచంద్రులకు మిధునానురక్తి, పద్మినీమిత్రునకు వధూవరులవలపు
గారవించిరి కవులు శృంగారకృతులు, రతి కలదె స్థాయినా ప్రకరణములందు ?"

అని అంటాడు కవి. రతిప్రసంగానికి అవకాశమే లేదంటాడు పైసందర్భాలలో. కావ్యాలలో దాంపత్యధర్మాన్ని ఆయావస్తువులకూ అలౌకికవ్యక్తులకూ ఆపాదించినా రతి స్థాయిగా కలిగి అనుభావవ్యభిచారీభావాదులు కలిగినటువంటి ప్రకరణాలు కావంటాడు. ఆదాంపత్యభావమే నిర్మలమనోజ్ఞమంటాడు.

ఈవిధమైనశృంగారాన్ని 'కానకానిశృంగార' మనీ 'అబోధశృంగారమ'నీ అంటూ డీయన. అలౌకికశృంగారం అనికూడా అంటా డొకచోట!

అతిబలాత్కారరక్తలై యదుకిశోరుపరమ సౌందర్యమహిమకు పట్టుపడినగొల్లభామల తలలలో- మధురశైశవలావణ్యమసృణమయిన బాలకృష్ణముఖోపాస్తి బరవశించురాధరక్త కంఠశ్రుతిలో - స్నానసుభగ సంస్కారవిహీనమయినసోదరుని కేశములు దువ్వుచూ, మృదూవిలాలవనమొనర్చు సోదరీలలితసరణిలో— సమమలంబయి స్వాదువైన సహజమైన మాతృశిశుబంధములో— ఈమధురధర్మమే, ఈ అమలీమసానురాగాతిశయమే, ఈ ఆప్త శృంగారభావమే జాలువారుతుందని కొన్నిసందర్భాలనుకూడా పొందించాడు.

అనాంగికమయి అమృతత్వాన్ని పొందేటటువంటి అతనుమధనముల తెలిలి అమృతము లయేటటువంటి, అమలినశృంగారాన్నే రాయప్రోలు ఉపాసించాడు. అట్లాంటి నిర్మలభావాన్నే తనకావ్యాలలో పాదిపిపెట్టినాడు. ఆమహాపవిత్రసూత్రాన్నే రమ్యా లోకములో ఆలోకించాడు. మాధురీదర్శనములో దర్శించాడు. ఇట్లా అమలినశృంగార ప్రబోధానికి గురువై నిల్చినాడు.

"అలినగ్నముగ్ధమై య, ప్రతిబంధక్రీడనాభరంబైన అసం
స్కృతశైశవకుశలదశా, రతి అవిషయకంబగు నిగరమగు"

నని విశ్వసించి యెలుగెత్తి చాటుతున్నా డీధార్మికకవి! అట్టి శృంగారచిత్రణమే అకిల్బిషమైనస్థాయి కలదై కల్యాణపరమపర్చస్కధురీణ మౌతుంది !

విశ్వశ్రేయస్సునుగూర్చవలసినకవి ప్రవచనాలు కల్యాణప్రదములుకాక, కాలుష్య ప్రసాధనములైతే చిక్కుకదా!

ఈనాడు వెలువడుతున్నరచనలలో ఈకాలుష్యమే హెచ్చుగా కన్పిస్తున్నది. కలుషభావాలను పొందించడానికి కవే అవసరం లేదు. ఇలాకలుషభావాలనుపొందిస్తే వాడు కవి అనిపించుకోడు. మానవసంఘాన్ని నాశంచేయడంకాదు కవికర్తవ్యం; దాన్ని ఉద్ధరించడం ధర్మం. కల్యాణధామంగా చేయడమే అతనిబాధ్యత. అసభ్యశృంగారానికి తావలాలైన ఈనాటిరచనావ్యాపారం అసంబద్ధమైంది. అధార్మికమైంది. దౌర్బల్యప్రేరకమైంది. అనభ్యుదయకరమైంది.

కొందరీపేరుపెట్టుకొని శృంగార కావ్యాలనూ, శృంగారరసాన్నే ఏవగించుకోవడం జరుగుతున్నది. శృంగారరసాన్ని పోషించేపద్ధతితో వివాదపడవచ్చునేమో కాని, శృంగారాన్ని ఒకరసంగా స్వీకరించడం పొరపాటనుకోడం అవివేకమే అవుతుంది. అన్నిరసాలూ ఉపాదేయాలే. ఏరసచిత్రణంద్వారానైనా ఉద్దిష్టఫలావాప్తి సిద్ధింపచేయవచ్చు. కాకపోతే ఆరసచిత్రణాసామర్థ్యంలో ఉంటుంది. అభాసకల్గించకుండా ప్రభాసింపచేయగల్గితే ప్రతి రసమూ ఆనందాన్ని ప్రసాదించితీరుతుంది మానవాభ్యుదయానికి శృంగారరస ప్రవణాలైన కావ్యాలు, తదితరరసపోషకాలైన కావ్యాలవలె తోడ్పడేవేనని గమనించాలి. కాకపోతే పైనచెప్పుకున్నట్లు అధికారాన్నిబట్టి రసపుష్టి కల్గుతుందనడం సత్యం.

ప్రతిరసాన్నీ పోషించడంలో సభ్యతాసభ్యతలంటూ లేకపోలేదు. ఉచితానుచితాలంటూ లేకపోలేదు.

కనుక ఔచితీజ్ఞానసంపన్నుడైనకవి మానవాభ్యుదయానికీ, సంఘశ్రేయస్సుకీ అనువైనరీతిగా ఆయారసాల్ని పోషించి కావ్యనిర్మాణం చేయాలి.

మహాకవి ఎప్పుడూ కుంటడు. కాలుజారనీయడు. ధర్మానికి ఆపత్తు రానీయడు, సభ్యత కొరవడనీయడు. ఆతడు పట్టినదాన్నంతా పసందుగా చిత్రించి, పతితావస్థలో ఉన్న ప్రజానీకాన్ని పైకిలేవనెత్తుతాడు. చివరి కొక్కమాట.

అకులినమైనరసచిత్రణమే అజాగరూకమైనజగత్తును అభ్యుద్ధరించేదని మనవిచేస్తూ సెలవుతీసుకుంటాను.

---

# చంపకమాలవృత్తము

శ్రీ కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ.

## దేశీయమా, సంస్కృతీయమా.

ఆంధ్రసాహిత్యములో నన్నయకుపూర్వమున రచింపబడిన తెనుగుశాసనములలోని పద్యములన్నియు దేశీయచ్ఛందోరీతి ననుసరించినవేగాని సంస్కృతవృత్తములలో రచింపబడినవి యింతవరకు లభించియుండలేదు. దీనినిబట్టి సంస్కృతవృత్తములలో తెలుగురచన నన్నయకుపూర్వకాలమందు వాడుకలోనికి రాలేదని మన మూహింపవలసి యున్నది. ఇంతేగాక ఈవృత్తములను తెలుగుకవితలో వాడుకలోనికి దెచ్చినవాడు నన్నపార్యుడే యనికూడా మనము తలంపవచ్చునేమో! తెలుగు కవితలో సంస్కృతవృత్తములవాడుక కనబడకపోయినా, సంస్కృతకవిత్వములో కొన్ని దేశీయచ్ఛందోరీతులవాడుక కనబడుచుండె ననుటకు రాజనరేంద్రుని కాలమునందలి కోరుమెల్లిశాసనములో చేతనభట్టు కావించిన "రగడ" రచనమే నిదర్శనము కాగలదు. క్రీ. శ॥ 9 వ శతాబ్దిప్రాంతమునందలిదగు 'యశస్తిలక' చంపువునందుకూడ నొకరగడ రచన యిటీవల కనిపెట్టబడినది. అది గద్యముగా దలంపబడి గద్యమువలెనే వ్రాతలోను అచ్చులోనుకూడ చూపబడియుండుటచే, నది ఛందోబద్ధమగుపద్యముగా గ్రహింపబడలేదు. కాని యది మాత్రాగణబద్ధమై ఆద్యంతప్రాసనియమము కలదగుటచేత కన్నడాంధ్రదేశీయచ్ఛందోభేదమగు 'రగడ' రచనగా నిటీవల గుర్తింపబడినది.

ఇట్లే దేశీయచ్ఛందోభేదము లింకనూ సంస్కృతభాషాకవితలో నాదరింపబడినవేమైనా యుండునా యనుసందేహము కలుగకమానదు. పరిశీలింపగా నుండినట్లే తోచుచున్నది. తెలుగుకవులు మాత్రాగణబద్ధములై పాదనియమము లేని ద్విపదాదులనుండి చతుష్పాదనియమము కలిగి సంస్కృతవృత్తములవంటివై ప్రాసబద్ధములుగూడనగు తరువోజాదులనుగల్పించి తెనుగుకవితలో వాడుకొనియుండుట మనము చూచియేయున్నాము. మధ్యాక్కర, సీసము కూడ మూడు, నాలుగుమాత్రాగణములతో గూడినపాదములుగల దేశీయచ్ఛందములను రెట్టించి యొకపాదముగాజేసి అట్టి నాలిగింటిని ప్రాసబద్ధముగా జేసియో చేయకయో ఒకచో గూర్చుటచే నేర్పడినవై యుండునని యిదివరకు సూచించియేయున్నాను. ఇట్లు దేశీయచ్ఛందోరీతులను సంస్కృతవృత్తములమాదిరిగా నడిపింపవలయునని తెలుగుకవులలో గలిగినయభిలాషయే సంస్కృతకవులలోగూడ కలిగియుండుననుటకు సందేహింపవలసినపని లేదు. దేశీయరచనలన్నియు జనసామాన్యము పాడుకొని యానందించుట కుద్దేశింపబడినవగుటచే నివి సామాన్యముగా తాళలయబద్ధములు, పాదసంఖ్యానియమము లేనివై యుండుట సంభావ్యము. సంస్కృతభాషారచనలు రాజాస్థానములందు పండితలోకరంజకములుగా నుండవలసియుండుటనుబట్టి పాదనియమముగలిగి శ్లోకరూపమును బొంది

యుండును. ఆదికవి యగు వాల్మీకినుండియు కాళిదాసాదులరచనలలోని శ్లోకము లట్టి నియమములు కలవే. కాని విక్రమోర్వశీయమున కాళిదాసే కొన్ని దేశీయములగు గేయ రూపరచనలను సందర్భానుసారముగా ననుసంధించినాడు. భరతునికాలమునుండియుకూడ సంస్కృతలాక్షణికులు దేశీయసాహిత్యరీతులను కేవలము ఒప్పరికించుచుండిన ట్లగపడదు. వీరైనంతవరకు నీదేశీయరచనలకు స్వీయసంప్రదాయానుకూలముగ లక్షణము గల్పించి గ్రహించుచునే యున్నట్లున్నారు. శీర్షకాదులకు భరతుడు తననాట్యశాస్త్రమున లక్షణము కల్పింపయత్నించుటయే యిందు కొకనిదర్శనముగా గ్రహింపవచ్చును. సంస్కృతశీర్షకము తెలుగుసీసమయినదనుటకంటె తెలుగుసీసమే సంస్కృతీకరింపబడి భరతునిచే లక్షణయుక్తముగా జేయబడిన దనుటయే సంభావ్యముగా దోచుచున్నది.

ఇట్లు మాత్రాగణబద్ధములైన దేశీయచ్ఛందోరచనలు, సంస్కృతలక్షణలక్షితములై లాక్షణికులచే గ్రహింపబడినవి. మరికొన్నికూడ కనబడుచున్నవి. క్రౌంచపదము 25-వ దగు అభికృతి—(అతికృతి ?) ఛందములోబుట్టినవృత్తముగా పింగళాదిలాక్షణికులచే బరిగణింపబడియున్నది. కన్నడమునకూడ నాగవర్మ తనఛందోంబుధిలో దీనిని 25-వ ఛందమునబుట్టి 25 అక్షరములు కలదానినిగనే గ్రహించి 5, 5, 8 దింట యతులను జెప్పినాడు.[1] కాని తెలుగులాక్షణికులు దీనిని 24-వది యగు సంకృతి-ఛందముననే పుట్టిన దానినిగా గ్రహించి 10, 8 తరువాత యతులుగలదానినిగా జెప్పినారు.[2]

ఇచ్చట నాగవర్మ పింగళునిలక్షణమునే యనుసరించినాడుకాని, వీరిలక్షణమునకును తెలుగునందలి దానికిని భేద మగపడుచున్నది. పైవారు దీనిని 25 అక్షరములుగల అతికృతి-ఛందములోనిదిగా గ్రహింపగా, తెలుగులాక్షణికులు దీనిని 24 అక్షరములుగల సంకృతి-ఛందములోని దానినిగా జెప్పినారు. ఈభేదము పాదాంతమున కన్నడకవులు నగణము గురువుగా గ్రహించిన దానిని తెనుగుకవులు ఒక 'య' గణముగా గ్రహించుటచే నేర్పడుచున్నది. కన్న.—భ, మ, స, భ, న, న, న, న—గురువు. తెను.—భ, మ, స, భ, న, న, న, య." ఇట్లు తుది నగణము గురువును, యగణముగా గ్రహించుటచేత అక్షర సంఖ్యలో నొకటి తగ్గుట తటస్థించినను, మాత్రలసంఖ్యలో మార్పేమియు కలుగదు. నగ=5 మాత్రలు, య = |∪∪ ఇది యు నైదుమాత్రలే. ఇట్లు సరిపోవుచున్నను, అక్షరగణముల దృష్టితో దీనికి లక్షణ మేర్పరుపదలచినప్పు డిది భిన్నచ్ఛందమునుండి పుట్టినదిగా కనబడుట తటస్థించినది. దీనినిబట్టి యిది వాస్తవముగా మాత్రాఛందమునకు లేదా మాత్రాగణఛందమునకు సంబంధించిన దేశీయపద్యమే యనియు, దీనిని అక్షరగణఛందములోనికి మార్చు

1 "కరోర్వీ - వాతశశాంకర్, యుంగమితసురపురని పమాదకడెయొల్,
భూతగణేశం - భూతశరాశా, గజదొశెయలిగీళ - మెసెదిరెపెసరిం."

2 "పంచశరాభా - సంచితపుణ్యా, భమసభననయపరిమితమైనన్
క్రౌంచపదాఖ్యం - బంచితమయ్యెన్, క్రమయతిదశవసు కలితముగాగన్."

కాని చతుష్పాదనియమమునుకల్పించి క్రౌంచపదవృత్తముగా లాక్షణికులు చేసియుందురనియు నూహించుట సాహసము కాబోదు. ఏమందురా పద్యము నడకనుబట్టి స్ఫురించే తాళమునుబట్టిచూడగా కన్నడఛందమున జెప్పబడినరీతిని 5, 5, 8 అక్షరములకే విరామము కలుగుచున్నది. అనగా రెండేసిగణములకు తరువాత యతి పడుచున్నది. ఈరెండేసి గణములన్నియుకూడా నాలుగేసిమాత్రలుకలగణములే. కాని వానియమరిక 1 గురువు 2 లఘువులు, రెండుగురువులు, మరల 1 గురువు 2 లఘువులు, రెండుగురువులు కలిగిన 4 గణములు మొదటిపళముగాను, రెండవపళములో 4 గేసి లఘువులుగల మూడుగణములు, రెండుగురువులుగల యొకగణము. మొత్తముమీద నాలుగేసిమాత్రలుగల నాలుగుగణములతోగూడిన యొకపాదమును రెట్టించినందువలన క్రౌంచపదవృత్తమున నొకపాదమైనట్లు స్పష్టమగుచున్నది. అయితే ఇట్లే "నాలుగుమాత్రల నాటిపగణముల" నాలిగింటిని చేర్చితే మధురగతిరగడ ఒకపాదము అవుతుందని అప్పకవి చెప్పియేయున్నాడు.

"అని గ గ న ల భ స లను నాల్గిటగ్కృతి, జను గజలఘువిశ్రమము మధురగతి" అని ఛందోదర్పణమున అనంతామాత్యుడు చెప్పినాడు. ఈమధురగతిరగడ ఒకపాదమును రెట్టించి యతిపాటించినట్లయితే హరిగతిరగడకు ఒకపాదమగునట.[1] అట్టిపాదములను నాల్గింటినిగూర్చి వానిని ప్రాసతో బంధించి దానిని కన్నడాంధ్రలాక్షణికులు క్రౌంచపదవృత్తమన్నారు. సంస్కృతమున ప్రాసనియమముగాని, అక్షరసామ్యరూపయతి నియమముగాని లేకుండుటచే వానిని తొలగించి వారు దీనికి క్రౌంచపదనామకరణముమాత్రముచేసి సంస్కృత ఛందమునుండి బుట్టినవృత్తముగామాత్రము గ్రహించియుందురు. వారి ననుసరించియే కన్నడాంధ్రలాక్షణికులును దానిసహజస్వరూపమును గుర్తింపలేక అక్షరగణబద్ధంబగు వృత్తముగనే దీనిని గ్రహించినారు. ఇంతేగాక నాలుగుపాదములలోను మొదటిపళములలో 1, 3.వ గణములందు బాటింపబడుచుండిన ప్రాసనియమమునుగూర్చి తెలుగులాక్షణికులుగూడ చెప్పియుండలేదు. ఈప్రాసనియమము అందును ఒకటి మూడుగణములలో పాటించుట—దేశీయచ్ఛందోరీతి ననుసరించినదేగాని సంస్కృతచ్ఛందస్సంప్రదాయపరిపాటికాదు. దీనినిబట్టిచూడగా దేశీయంబగు నాలుగుమాత్రలగణములతోగూడిన హరిగతిరగడయే, యీసంస్కృతక్రౌంచపదవృత్తమునకు మూలమని తోచుచున్నది. తుదిని నగణముగురువువచ్చిననే, ఆ 25 వ ఛ్ఛందములోనికి జేరునుగావున వారట్లే గ్రహించిరి. నాగవర్మయు పింగళు ననుసరించినవాడగుటచే నిరువదియై దక్షరములుగల దానినే గ్రహించినాడు. సహజముగ నాలుగేసిమాత్రలుగలగణములతో నేర్పడినదిగావున తుదిని 'న ల స భ గ గ' ములలోపల నేదైన "నొకటియగు "గగ" ముతో గూడిన దానినే తెలుగుకవులు గ్రహించినారు. పింగళనాగవర్మలకు తరువాతివాడేయగు కేదారభట్టు వృత్తరత్నాకరమునకూడ 25 వ ఛందములోసిదానిగనే గ్రహించినాడు. సంస్కృ

1. నలసభగగములలోపల నేదైన, నను నెనిమిది నాల్గి పై విరమము
గలసినహరిగతిచెలువగుకృతులన్, గవివరు లా పనిచెప్పిననియమము. (అప్పకవీయము.)

తమున కన్నడాంధ్రములందువలె ద్విప్రాసనియమమునుగాని, ఆంధ్రమునందువలె సవర్ణ యతినియమముగాని పాటింపబడలేదు. ఛందోవృత్తినుండి వ్యాఖ్యానకారుడిచ్చిన యుదాహరణపాదములను సంస్కృతచ్ఛందోరీతిని అక్షరగణములలోనికి విభజించిన నెంత చికమకగా నున్నదో, మాత్రాగణములుగా విభజించిన తాళబద్ధమై యెంత చక్కగా చదువుటకు వీలుగానున్నదో యీక్రిందిపాదములను గమనించిన వ్యక్తము కాగలదు. *మొదటి దళములందు రెండుప్రాసలను కన్నడమునందువలెనె, ప్రాచీనాంధ్రకవులు లాక్షణికులు గూడ పాటించినను, అర్వాచీనులగు అప్పకవ్యాదు లేకారణము చేతనో, పాటింపరైరి. నన్నయభట్టు క్రౌంచపదమును రచించిన ట్లగపడదు. కాని యాతనితరువాత నన్నిచోడుడు క్రౌంచపక్షులనడకలను వర్ణించుసందర్భమును పురస్కరించుకొని యీ వృత్తమును రచించినాడు. ఆతడు కన్నడమందువలెనె మొదటిదళమున రెండుప్రాసలును రచించినాడు కాని తరువాతి తెలుగులాక్షణికులు చెప్పినట్లు రెండుదళములయందు నొకేయతిని పాటించక, రెండవదళమునమాత్రమే ప్రత్యేకయతిని పాటించినాడు. కన్నడమున నాగవర్మ చెప్పిన రీతి 5, 5, 8 దింట యతిని (విచ్ఛేదమునైనను) పాటించుట నాలుగుమాత్రల గణరచనకును తాళమునకును గూడ సరిపడియుండును. కావున మొదటిదళములో ప్రాసయతిని కన్నడమందువలె పాటించి, రెండవదళమందు కేవలవిచ్ఛేదము నేగాక సరూప వర్ణయతిని అనగా వడిని నన్నిచోడుడు పాటించి యాంధ్రదేశీయ సంప్రదాయమును సూచించినాడనవలెను. ఈతనితరువాత పాల్కురికి సోమనాథుడు, (అనుభవసారములోను) తిక్కనార్యుడు (స్త్రీపర్వమునను) క్రౌంచపదవృత్తమును రచించినారుగాని వీరు మొదటిదళములోని ప్రాసయతియేగాక, పాదాదివర్ణముతో రెండవదళము తొలివర్ణమునకును - అనగా 10 వర్ణములతరువాతను, అనంతరము 8 వర్ణములతరువాతను వడి నిలిపినారు. ఇవియే కవిజనాశ్రయ, ఛందోదర్పణాదులకు లక్ష్యములై యుండును. తొలిదళమున ప్రాసలేకుండ యతిమాత్రమును పాటించులక్షణసంప్రదాయము అప్పకవి కెట్లు వచ్చినదో. సంస్కృత వృత్తమునం దీరెండుప్రాసలనియమ మెందుకని తరువాతివారు తొలగించియుందురు.

ఇట్టిదే మఱియొకటి - 19 వ దగు అతిధృతినుండి పుట్టిన దని చెప్పబడు 'తరల' వృత్తము. పింగళచ్ఛందములో నిది గ్రహింపబడలేదు. కాని కన్నడమున నాగవర్మ గ్రహించి యున్నాడు. "సురపశీతతరాగ్నిమారుతభానుయుగ్మ గణంగళిం, విశ్రమణందిశాకంగళొళ్ నిలె" ఇందు విశ్రమము 8 అక్షరములపైని అని చెప్పియున్నాడు. కాని పద్యమునడకను బట్టిచూడగా తెలుగుపద్యమునందువలె 11 వ అక్షరముతరువాతనే గణములనుబట్టి తాళమునుబట్టి యతిసరిపడుచున్నది. నడకనుబట్టి చూచినట్లయితే ఈతరళముకూడా వృషభగతి రగడభేదము కావచ్చునని తోచుచున్నది. మూడు+నాలుగు. (=7)మాత్రలతో గూడిన నాలుగుగణములతో గూడిన వృషభగతిరగడపాదమునందు తుదిరెండులఘువులను తొల

---

* యాకవి లాక్షిపి జ్ఞలకే శకలి రుచిర నుడిన మనున యకరి నా

దీర్ఘతరాభిః— స్థూలశిరాభిః— పరివృతవపురతి— శయకుటిలగతిః.

గించినచో సీతరలపాద మొకటి యేర్పడగలదు. వృషభగతిరగడపాదములోని తుది రెండు లఘువులను తొలగించి రచింపబడేపాటలు కలవు. అట్టివానిలోనిపాద మీయతిధృతిఛందము లోని పద్యమునకు అక్షరగణనియమమునుబట్టి సరిపోవుచుండుటచే, నాపాట నీవృత్తముగా గ్రహించియుందురేమో? కన్నడమున జెప్పబడిన 8 వ అక్షరముతరువాత యతి నడకకు సరిపోదు, కాని తెనుగునందువలె 11 వ అక్షరము తరువాత యతి పడినచో నాలుగు గణములపాదములో రెండుగణములతరువాత మూడవగణము మొదటియక్షరముపై యతి పడును. ఈయతినియమమే సహజమగుటచే నన్నయకాలమునుండియు పాటింపబడుచున్నది. ఈ 19 వ ఛందములో పింగళఛందములోగాని వృత్తరత్నాకరములోగాని యీవృత్తము లేదు. కావుననే ఇది దేశీయచ్ఛందమునుండి యిటీవల గ్రహింపబడినదేమో యని సందేహము. మూడేసిమాత్రలగణములతోగూడిన ఉత్సాహాదివృత్తములు గూడ దేశీయరచనామూలములే కావచ్చును.

కన్నడాంధ్రములందుమాత్రమే ప్రచురప్రచారముగల చంపకమాలావృత్తము కూడ నిట్టిదే కావచ్చునా యనున దొకప్రశ్న. ఏల యనగా ఈభాషలలోవలె సంస్కృత కావ్యములలో దీని కంతవిశేషప్రచారము లేదు. ప్రాచీనకవు లెవ్వరు దీనిని విశేషముగా ప్రయోగించలేదు. ప్రసిద్ధప్రాచీనకావ్యకర్తలలోని కెల్ల నొక్కమాఘుని [1] శిశుపాలవధలో మాత్ర మొక్కపద్యము కనబడుచున్నది. (III-82 శ్లో.) కాని దానివ్యాఖ్యానములో మల్లినాథుడు 'చంపకావళీ' వృత్త మని చెప్పుచు 'రచితేతికేచిత్' అని చెప్పినాడు. నిర్ణయసాగరముద్రణవ్యాఖ్యలో "పఞ్చకావళీవృత్తం" అని ధృతశ్రీవృత్తమితికశ్చిత్ అని యున్నది. పింగళఛందములో చంపకమాల లేదు. పింగళుడు చెప్పిన "రుక్మవతి" వృత్తము నాగవర్మ చెప్పిన 'కుందానిలము'తో సరిపోవుచున్నది. కేదారభట్టుకూడ రుక్మవతీవృత్తలక్షణముచెప్పి దీనినే కొందరు చంపకమాల అని అందు రని వ్రాసాడు. "భ్మౌసగయుక్తౌరుక్మవతీయం" భ-మ-సగణైర్గురుణాచ రుక్మవతీనామ. చంపకమాలేత్యన్యే. పాదాన్తే యతిః." (వృ. రత్నాకరం 66 పేజీ). పింగళఛందములోగాని వృత్తరత్నాకరములోగాని చంపకమాలావృత్తము ప్రత్యేకముగా జెప్పబడియుండలేదు, కాని దీనికి వ్యాఖ్యాకారుడగు నారాయణభట్టు "గ్రంథాంతమందు" అత్ర గ్రన్థే అనుక్తాని చ్ఛందాంసి సామాన్యసంజ్ఞయా గృహ్ణాతి" అని చెప్పి.

"యచ్ఛందోనోక్త మత్ర గాథేతి తత్సూరిభిః ప్రోక్తం—
శేషం గాథాస్త్రిభిః షడ్భిః చరణైశ్చోపలక్షితాః."

అత్ర యశ్ఛందోవిశేషతో నోక్తం తేషాంగాథాత్వం ప్రత్యేకచ్ఛందమునుండి పుట్టినట్లుగా (సరిపెట్టబడి) చెప్పబడకపోతే వానిని 'గాథ'లుగా గ్రహించవలసినదని తెల్పినాడు. దీనినే పింగళుడుకూడా "అత్రానుక్తంగాథా" అనుసూత్రము మూలముగా సూచించి

1. ఆం. సా. ప. ప. 28 సంపు. 2 సం. ఈ. వి. రాఘవాచార్యులవారి వ్యాసము.
"తురగశతాకులస్యపరితః పరమేకతురంగ జన్మనః."

నాడు. అనగా ఆయా అక్షరఛందమునకు సరిపుచ్చి లక్షణ మేర్పరచినవానికి వృత్తసంజ్ఞ యేర్పడినదనీ, తక్కినవానిని 'గాథ' లనియే వాడుకొనుచుండెడివారని తెలుచున్నది. ఇట్లు చెప్పి వ్యాఖ్యానకారుడు నారాయణభట్టు, కేదారభట్టు చెప్పకపోయినా ఆయాఛందములలో పుట్టినవే యని షట్కొన్ని వృత్తముల నుదాహరించినాడు. జలధరమాలా, అతిజగతినుండి కనకప్రభ, ధృతినుండి విబుధప్రియ, అట్లే ప్రకృతినుండి "నజభజజజరైర్ధృతశ్రీః" అనిచెప్పి మాఘమునుండి.

"తురగశతాకులస్య పరితః పరమేకతురంగజన్మనః"

ఇత్యాదిశ్లోకము నుదాహరించి.

"త్రిసప్తసుయతిః—ఏవమాదీని వృత్తాని ప్రస్తాగమహాకవిప్రయోగేషు దృశ్యమానాని గాథాఖ్యాని" ఏవ మన్యాన్యపిచ్ఛందాంసి కవిప్రయోగానురోధాత్ జ్ఞేయాని, సమార్థసమవిషమప్రస్తారేషు తేషా ముపలంభాత్ విశేషసంజ్ఞా౽జ్ఞానాత్తునో దాహృతాని.

అథ "శేషం గాథా" ఇతి సామాన్యతః ఉపక్షిప్తానివిస్తరభీతేర్వ్విశేషతో నోక్తాని ప్రాకృతాదిషుప్రాయః పరిదృష్టాని ఛందాంసి ప్రాకృతపింగళశంభుచ్ఛందశ్చూడామణ్యాది పర్యాలోచనయావ్యుత్పిత్సువ్యుత్పత్త్యర్థ మస్మాభిరుచ్యన్తే" అనిచెప్పి మాత్రాగణములను గూర్చి వివరించినాడు. 'తత్రమాత్రాచ్ఛందస్సూపయుక్తాః గణభేదాః. తత్ర-ద్వికలాద్యా......

ఏతేషాం వ్యవహారార్థం సంజ్ఞాస్తాస్తైస్తైః కృతాస్తాః అత్య
న్తోపయోగాభావాత్ గ్రంథవిస్తరభయాన్నోచ్యన్తే.

ఈవ్యాఖ్యానకారునివాక్యములనుబట్టి ఆయాకవులచే వాడబడినట్టియు సంస్కృతచ్ఛందములనుండి పుట్టినవిగా జూపుట కవకాశముగలిగినట్టియు దేశీయ "గాథ"లను సంస్కృతలాక్షణికులు సంస్కృతవృత్తములుగానే గ్రహించుటకు విశేషప్రయత్నముచేసిరని సువ్యక్తమగుచున్నదిగదా. దేశీయగాథలు చాలవరకు మాత్రాగణబద్ధము లగుటచే పాటకనుగుణముగా వానిలోనవేకవిధములగుమార్పులు కలుగుచుండుటచే అక్షరగణబద్ధములుగా జేయబడుటకు పెక్కుగాథలు లొంగియుండవు. అట్టివానిని వదలి-లొంగినవారి కేదో యొకపేరు పెట్టుచుండెడివారు. కావుననే 'న జ భ జ జ జ ర' అనుఅక్షరగణములకు లొంగిన దేశీయఛందమును శ్రీధరవృత్త మని కొందరు, చంపకమాల యని కొందరు, పంకజవృత్త మని కొందరు. ఇది (పొరపాటు గావచ్చును) నామకరణముచేసియున్నారు. చంపకమాల యనుపేరు దేశీయకవులు నాగవర్మవంటివారు పెట్టియుండవచ్చును. నాగవర్మ 'మందానిల'మును పింగళుడేగాక కేదారభట్టుకూడ 'రుక్మవతి'యనుపేరుతో గ్రహించినను, కేదారభట్టు దీనినే 'చంపకమాల' ఇతి కేచిత్ అని వ్రాయుటలో విశేష మేమైనగలదా అని సందేహము. మందానిలమునకు రుక్మవతికిగూడ లక్షణము భమస గురువు "శీతకరోర్వీ—మారుతచేతో" దీనిని 3 అక్షరగణములు ఒకగురువుగా విడదీయుటకంటె నడకనుబట్టి 4 గేసిమాత్రల నాలుగుగణములుగా విడదీయుటె సమంజసము.

చంపకమాలనుకూడ ఇట్లు సరిపుచ్చుట కవకాశ మే మైనగలదా విచారణీయము. పైనారాయణభట్టువలెనే లాక్షణికు లెక్కడివో కొన్నిసంస్కృతభాషలో రచింపబడిన చంపకమాలల నుదాహరించిరేగాని సుప్రసిద్ధసంస్కృతకావ్యములలో నీవృత్త మగపడదు. తెలుగుసాహిత్యమున నన్నయయే ప్రవేశ పెట్టియుండవచ్చునుగాని, అంతకుపూర్వము కన్నడసాహిత్యమునందును ప్రాచీనశాసనములందుచుగూడ నీచంపకమాల విశేషవ్యాప్తిలో నుండినది. విశేష మే మనగా కన్నడకవులు సంస్కృతమున నియమముగా ప్రచారమందు లేనట్టియు దక్షిణదేశభాషాసహజసంప్రదాయసిద్ధమైనట్టియు ప్రాసనుపాటించిరారు. వడి నియమ మాభాషలో సంప్రదాయముగాలేదు గనుక దానిని పాటించలేదు. తెలుగు భాషకు ప్రావళ్లి ప్రత్యేకసంప్రదాయములు గనుక నన్నయాదు లారెంటిని బాటించినారు.

ఈచంపకమాలవలెనే ఉత్పలమాల, మత్తేభముకూడ సంస్కృతమున విరళప్రచారముగలవే. ఇవియు దేశీయగాథలయందలి మాత్రాగణముల నక్షరగణములకు సరిపుచ్చుటచే నేర్పడినవేయగునా? వీనినిగూర్చి విజ్ఞులు పరిశీలింతురు గాక!

ఈ చంపకమాలయనునది "నాలుగుమాత్రల నాలుగుగణములు" గల రెండు పాదములను కొద్దిమార్పుతో నొకపాదముగా జేయుటచే నేర్పడిన దేమోయని పరిశీలింపవలయు నని నాతలంపు.

చ. "తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరుపాముల రోసిరోసినిష్ఠురతర"

ఈపాదము నించుకమార్చినచో రగడభేదము కావచ్చును.

"తిరుగుచు బుట్టల (ను)బొదల ద్రిమ్మరు-పాముల రోసి (యుం) రోసి(యుం) ని"

తుదిపాదమున నొకగురువుమాత్రమే యున్నది. ఇది పాట కనుకూలమే. ఇట్లు నాలుగుమాత్రల నాలుగుగణములను రెట్టించిన దేశీయచ్ఛందము, యక్షరగణచ్ఛందమునకు సరిపుచ్చబడినవృత్తముగా జేయబడియుండునేమో యని యూహింపదగును.

# ప్రాచీనులు - ప్రకృతివర్ణనము

శ్రీ ముట్నూరు సంగమేశంగారు

ఆలంకారికులు ప్రకృతివర్ణనాన్ని భావాన్ని ఉద్దీపింపజేసే 'ఉద్దీపనవిభావం' గా గ్రహించారు. అసలేదైనాభావంగానిరసంగాని, పరాకాష్ఠపొందాలంటే పరిపూర్ణమైన వస్తువర్ణనం అవసరం. ఏభావం అయినా సంచరింపబడాలంటే, ఆలంబనం ఆశ్రయం అనేవి రెండుండాలి. ఆలంబనం అనేది ప్రకృతిలో ఉన్న సమస్తవస్తుజాలంలోనూ ఏదైనా కావచ్చుగాని, ఆశ్రయం అనేదిమాత్రం హృదయమున్నమానవుడేకాని మరియొకరు కాదు. అట్టి అవస్థలో ప్రకృతిని 'ఆలంబనవిభావం' గాకూడా గ్రహించక 'ఉద్దీపనవిభావం' గా గ్రహించి, ఆలంకారికులు కొంతవరకు కావ్యసృష్టిలో హస్తాక్షేపం చేసేరని కూడా అనవచ్చును.

దృశ్యవర్ణనవల్ల మనహృదయంలో ఆదృశ్యం పరిపూర్ణంగా ప్రతిబింబితమవటం వాంఛనీయం. దీనికి అంటే దృశ్యాన్ని వ్యక్తీకరించటానికి మనవారు అభిధాసహాయాన్ని ఎక్కువగా అపేక్షించేరు. కాని అభిధావాచ్యమైనవిషయాన్ని మనం రెండువిధాల గ్రహిస్తాం. ఒకటి అర్థగ్రహణం. రెండోది బింబగ్రహణం. నిత్యవ్యవహారంలోనూ, శాస్త్రాల్లోనూ మనం మొదటిరకంగా విషయాన్ని గ్రహిస్తాం. కావ్యంలో రెండవరకంగా విషయం గ్రహింపబడుతుంది. అంటే అక్కడ బింబగ్రహణం హెచ్చు. మాట్లాడుకొనే సందర్భంలో మనం 'కమలం' అనేపదానికి తీసే అర్థం కంటె కావ్యపఠనసందర్భంలో గ్రహించేఅర్థం భిన్నమైనది. అక్కడ కమలంలోఉన్న సౌందర్యం, సౌకుమార్యం, శైత్యగుణం, మధురమకరంద పరిపూర్ణత్వం మొదలైనవన్నీ మన హృదయఫలకంలో చిత్రింపబడతాయి. కాబట్టి ఆలాటిచోట్లగల ప్రకృతివర్ణన 'విభావం' గా గ్రహించబడుతూంది. రసనిష్పత్తికి దోహదం అవుతూంది.

ఈవిధమైనబింబగ్రహణం చేయించాలనే ఉద్దేశ్యంతోటే కవి తనకావ్యంలో విభావాన్ని ఎక్కువగా సూక్ష్మాతిసూక్ష్మపరిశీలనతో వర్ణిస్తాడు. వాస్తవికానికితోడు కాల్పనిక సన్నివేశాలనో భావాలనోకూడా వ్యక్తంచేస్తూ ఉంటాడు. అలాటికల్పన మనకి అలంకారాలద్వారా అందిస్తాడు. అంటే బింబగ్రహణానికి యాథావతుగా వస్తువుని వర్ణించడం ఎంత ఉపయుక్తమో అలంకారయుతంగా వర్ణించడంకూడా అంత ఉపయోగమే అని చెప్పవచ్చు. కాని ఈ రెండు సరిపాళ్లలో కలిసిఉంటేనే తప్పగాని ఏది యెక్కువైనా చికాకే.

కాగా ఆలంకారికులమతమే సత్యమైతే, అంటే ప్రకృతి కేవలంగా 'ఉద్దీపనవిభావమే' అయితే మనప్రాచీనకవులు ప్రకృతిలో ఉన్న ఏ ఒకటి, రెండు, వస్తువులపేర్లో చెప్పి, కాలం వృథాపుచ్చకుండా కలాన్ని ముందుకు ఎందుకు పోనివ్వలేదో మనం గ్రహించాలంటే, వారిదృష్టిలో ప్రకృతివర్ణనం ఆలంకారికుల అభిప్రాయానికి భిన్నమయినదే అయి

ఉంటుందని ఊహించాలి. 'రాముడు సీతావియోగదుఃఖంతో పంపాసరోవరతీరాన్ని కూర్చున్నాడు' అని అనేసినప్పటికంటె 'రాముడు సీతావియోగానలదందహ్యమానహృదయుడై కమలకల్హారాదిపుష్పపరాగయుతమై, తరంగసంచాలితమై, వీచుచుండపవనాన్ని సేవిస్తూ పంపాతీరతరుచ్ఛాయలలో సలక్ష్మణుడై' అనే ఉదయాడనే వాక్యంలో మన హృదయాన్ని భావసంపన్నంచేసేశక్తి అధికంగా ఉంది. పంపాసరోవరం పేరువిన్నప్పటికంటె అక్కడఉన్న కమలకల్హారాదిపుష్పాలు, చిన్నచిన్న కెరటాలు, వాటిమీదనీచే పిల్లవాయువులు, ఒడ్డునఉన్న విశాలతరువులు, వాటినీడలు, మనహృదయంలో ఒకవిధమైన శీతలత్వాన్నే ఆపాదిస్తూన్నాయి. కాగా భావపుష్టికి యిట్టిసూక్ష్మతరవస్తువర్ణనం అత్యంతమూ అవసరమే అని తేలుతుంది. అయితే ఇట్టివర్ణనం మనభావాన్ని ఉద్దీపింపచేస్తూందా అంటే, అసలదే మనభావానికి ఆలంబనం అయిఉంటూంటనేజబాబు వస్తుందికాని' ఇతఃపూర్వం కలిగినభావాన్ని అది ఉద్దీపింపచేయడంలేదు అని చెప్పాలి. కాదు! పై వాక్యంలో 'రాముడాలంబనవిభావం' అని పంపాతీరం 'ఉద్దీపనవిభావం' అనీ అన్నాం అంటే, ఇంతగా సూక్ష్మతరవర్ణనం చెయ్యవలసిన ఆవశ్యకత ఏమిటి? మనహృదయఫలకంమీద ఆచిత్రాన్ని ప్రతిబింబింపజేయవలసిన అగత్యం ఏమిటి? కాళిదాసు కుమారసంభవంలో వర్ణించిన హిమవద్వర్ణనం దేనికి 'ఉద్దీపనం'? వాల్మీకి వర్షఋతువర్ణనం, వననదీవర్ణనం ఎందుకంత విస్తారంగా చేసేడు? అయోధ్యాపురవర్ణనం దేనికి ఉద్దీపనవిభావం? కాబట్టి కావ్యగత ప్రకృతివర్ణనలు ఉద్దీపనవిభావాలే కావు. వాటికి స్వతః కొంత అస్తిత్వం ఉంది. అవే ఆలంబనవిభావాలుకూడా అయినచోట్లుకూడా ఉన్నాయి. అయితే కొన్నిచోట్ల ఉద్దీపనవిభావాలుగాకూడా ఉంటాయనుకోండి. కాని సర్వే సర్వత్ర అదే సిద్ధాంతం వర్తించదు. కాగా అందుకోసమే ప్రకృతిని వర్ణిస్తారనిగాని, వర్ణించాలనిగాని అర్థంచేసుకోవటంకూడా అసందర్భప్రలాపమే.

అయితే ప్రకృతివర్ణనం అంగప్రత్యంగరూపంగానే మనభావాలకి ఆలంబనంకాదు. స్వతంత్రరూపంగాకూడా అది మనభావాన్ని రేకెత్తిస్తుంది. మానవుడు ప్రాచీనకాలంలో అంటే సుదూరభూతకాలంలో ప్రకృతిలో ఒకఅంగమై విచరించేడు. అప్పట్లో అతడు తన ఆయువంతా స్వచ్ఛందమైనప్రకృతిలోనే గడిపేడు. దాన్ని ప్రేమించేడు. దానిసౌందర్యం అహరహం అనుభవించేడు. ఆ ఆనందంలో లీనం అయేడు. ఇప్పటికీకూడా యింతగా నాగరికత పెచ్చుపెరిగినప్పటికీ అధికసంఖ్యాకులైన మానవులు ప్రకృతిలోనే అంటే కొండల్లోనో, వనాల్లోనో, గ్రామాల్లోనో నివసిస్తున్నారు. ప్రకృతిశూన్యంగాని కృతక ప్రకృతియుతంగాగాని ఉన్నచోట్లల్లో ఉన్నజనాభాకంటె స్వచ్ఛందప్రకృతిలో విహరించే వారిసంఖ్య హెచ్చు. అక్కడవున్న చెట్లు, సెలయేళ్లు, పక్షులు, జంతువులు మొదలైన వాటితో వారికి ఏవిధమైన రాగాత్మికసంబంధం ఉంది. ఆ అనుభూతి వారికి జన్మసిద్ధం. అదొకస్మృతివంటింది. లేదా ప్రాచీనసంస్కారం అనికూడా అనవచ్చు. కావ్యాల్లో అట్టి ప్రకృతిని వర్ణింపగా వినేసరికి మనహృదయంలో సంచరించేభావాలు ఆప్రాచీనసంస్కా-

రానికి చిహ్నప్రాయాలేగాని మరొకటికాదు. మేఘాలోకంతో ప్రసన్నహృదయం కలిగి నర్తించే నెమలినిచూచినప్పుడు సభ్యతావశంచేత గెంతకుంటే గెంతమేమోగాని హృదయం మాత్రం నర్తించి తీరుతుంది. అట్టిసన్నివేశాల్లో మనహృదయం హర్షప్లావితం అవుతుంది. హర్షం ఓసంచారీభావం అయితే దానిమూలంలో రతిభావం వర్తిస్తూందనిన్నీ, ఆరతిభావం ఆయాదృశ్యాలపట్లనే అనిన్నీ గ్రహించాలి. కాని ప్రకృతివర్ణనాన్ని మననాయకీనాయకులశృంగారోద్దీపనమాత్రంగానే గ్రహిస్తామనడంకంటె రుచిభ్రష్టత యింకొకటిలేదు.

మానవుడు శేషప్రకృతితో తనకు గల రాగాత్మికసంబంధాన్ని విచ్ఛేదపరుచుకోవటంతోపాటు తన ఆనందానుభూతినికూడా సీమాబద్ధం చేసుకున్నాడు. బుద్ధివ్యాప్తికని ఎంతవిశాలమైనక్షేత్రం మనకి ప్రసాదింపబడిందో భావవ్యాప్తికికూడా అంత విశాలమైన క్షేత్రమే అందించబడింది. కాని మనం మాంద్యవశులమై యీద్వితీయక్షేత్రాన్ని సంకుచితపరుచుకొన్నామంటే మన ఆనందానుభూతి పశువులప్రవృత్తికంటె ఏమాత్రమూ అధికమని చెప్పడానికి వీల్లేదు. కంటికి కనిపించే యీవనవనదీనిర్ఝరపర్వతంశుపక్ష్యాదులపట్ల మనకున్న ప్రేమ స్వాభావికమే! అది మన అంతఃకరణలో వాసనారూపంగానిహితమైఉంది. ప్రేమాంకురం రెండువిధాల వృద్ధిపొందుతుంది. ఒకటి సౌందర్యానుభూతివల్ల రెండవది సాహచర్యస్థితివల్ల. మొదటిచోట మనప్రేమ సంలక్ష్యహేతువుగా ఉంటే రెండవచోట అది నిర్హేతుకంగా ఉంటుంది. పల్లెటూరుపడుచు విలాసయుక్తమయి సుందరవస్తుసుసజ్జితమైన రాచనగరిలో భయపడుతుందేమోగాని ఆనందిస్తుందనిగాని ఆస్థలాన్ని ప్రేమిస్తుందనిగాని అనుకోలేము. ఆమె కామెవూళ్లో ఉన్న గుడిసెలు, ఏటిఒడ్డు, ఎండుచింత చెట్టు యిచ్చినఆనందం ఇచ్చటిరాచనగరుగాని పూలమొక్కలుగాని యీయలేవు. ఈకృతక ప్రకృతితో ఆమెహృదయం తాదాత్మ్యత పొందలేదు.

కాగా, కృతకప్రకృతిగాని, విచిత్రకల్పనాయుతమైన ప్రకృతివర్ణనంగాని మనకి సహజమైన ఆనందాన్ని యివ్వడానికి శక్తిగలవికావు అని చెప్పొచ్చు. అంటే అత్యద్భుతమైన కల్పనవల్ల మనం కావ్యగతప్రకృతివర్ణనని ఆనందించేం అని అనడంకంటె అందులో ఉన్న సూక్ష్మాతిసూక్ష్మవిషయవక్రీకరణంతో మనసానుభూతి ఉత్తేజింపబడి, ఆనందం కలుగుతూంది అని అనాల్సివస్తుంది. ఈనాడు పట్నాల్లో విశేషంగా వృద్ధిపొందుతూన్న 'పార్కులు' ఉద్యానవనాలు అనేది మనప్రాచీనసంస్కారానికి చిహ్నాలుగా మనప్రకృతిప్రేమకి ఉదాహరణాలుగా మన ఆనందానికి ఆధారాలుగా ఉన్నాయిగాని, వాటిలో ఉన్న క్రొత్తరకం నిర్మాణప్రతిభగాని, వాటి అత్యద్భుతరచనాకౌశలంగాని మన్ని ఆకర్షించలేదనే నా ఉద్దేశ్యం వాటిపట్ల మనకుగలప్రేమ సహజం. అవి సన్నిహితంగా ఉండాలనే వాంఛ మనకి నైసర్గికం. అందుకే మనం పక్షుల్ని పంజరంలో పెట్టి పెంచుతున్నాం వాటితో కాలక్షేపంచేసి ఆనందిస్తున్నాం. ఆ ఆనందానుభూతిలో మనం మనని మరచిపోతాం. మన అహంకారం దూరం అవుతుంది. నిర్మలమైన ఆనందం, 'ఆనందో బ్రహ్మ' అనేవాక్యాన్ని మనస్ఫురణకి తెచ్చే ఆనందం, కలుగుతుంది.

కావ్యంయొక్క చరమలక్ష్యంకూడా యిదే! సర్వభూతాల్నీ ఆత్మీయతతో చూడ వలసిందని బోధిస్తూ, ఆవిధానం చూపించేది కావ్యం. దర్శనం జ్ఞానబోధకే ఆధారం గాని, కావ్యం జ్ఞానంతోపాటు అనుభూతినికూడా అందిస్తుంది. అందుకే కవి సహజంగా ప్రకృతిని వర్ణిస్తాడు. ఆవర్ణనం చదివినప్పుడు కలిగే ఆనందం, అహంకారదూరం అయిఉంటుంది. అది సహజం. అందులో అద్భుతవస్తుదర్శనంచేతగాని, శ్రవణంచేతగాని కల్గిన ఆనందంలేదు. మనం ఎరిగినవస్తువు, మనకి సన్నిహితమైనవస్తువు, మనతో చిరకాలంనుండి సహచరించిన వస్తువు వర్ణింపబడి మనకానందాన్ని యిస్తూంది. భావోత్కర్షాన్ని వ్యక్తంచేయడానికి, కవి ఒక్కొక్కప్పుడు అసాధారణవస్తువర్ణనంగాని, అత్యద్భుతకల్పనావిశేషంగాని ప్రతిపాదించినా అది సాధారణవస్తువుని దిగమ్రింగినంతగాగాని, ఆచ్ఛాదించినంతగాగాని ఉండకూడదు. ఈసాధారణప్రకృతి మనభావాలకి ఎంతైనా ఆలంబనమే ! పరబ్రహ్మసత్తా భౌతికంగానూ, ఆధ్యాత్మికంగానూ కూడా అనుభవింపబడాలంటే అట్టివర్ణనం అవసరం. అట్టి ఆనందానుభూతి అత్యంతావసరం. తర్కబుద్ధితో తెల్సుకొన్న అద్వైతభావం, రాగాత్మికవృత్తితో అనుభవింపబడుతుంది. 'ఆత్మవత్ సర్వభూతాని' అన్నజ్ఞానం స్వానుభవంతో ఘనీభవిస్తుంది. ఇటువంటివ్యాపకదృష్టితోనే మనప్రాచీనకవులు వనన‌దీపర్వతాదులవర్ణనం చేశారుకాని కేవలం శృంగారరసోద్దీపకాలుగామాత్రం చేయలేదని నా అభిప్రాయం.

మహాకవి వాల్మీకికవితలో సూక్ష్మాతిసూక్ష్మపరిశీలన వ్యక్తమయ్యే ప్రకృతివర్ణన మనకు లభ్యమవుతుంది. అతడికి ఉన్నప్రకృతి నిరీక్షణాశక్తి అత్యద్భుతం. వస్తుచిత్రణంలో ప్రతి అల్పవిషయాన్ని విడిచిపెట్టకుండా చిత్రించడంలో ఉన్నఆసక్తి ఆయనకు ఉపమాది అలంకారసంయోజనంలో లేదనవచ్చు. అతడు చిత్రించినవస్తువు, ప్రకృతికి ప్రతికృతిగా నిలుస్తుంది. వాల్మీకి, కాళిదాసు, భవభూతి మొదలైనప్రాచీనులుచూపిన ప్రకృతివర్ణనా ప్రతిభ వెనుకటివారిలో మృగ్యం. రానురాను కవిత అలంకారభరితమయి, ప్రకృతి నిరీక్షణాసక్తి నశించి కాల్పనికశక్తికే మెప్పులందు స్థితివచ్చినది. మాఘునికవితలో నిట్టి వైపరీత్యము మన కచ్చుటచ్చుట గోచరించును. వాల్మీకినైతము అలంకారముల నుపయోగించెను. కాని అతని అలంకారములు వస్తువును దిగమ్రింగలేదు. ఉపమాలంకారమును గుత్తగొన్నకాళిదాసుకూడ ప్రకృతిని వర్ణించినపట్టులలో సూక్ష్మప్రకృతినిరీక్షణకే ప్రాధాన్యమిచ్చెను. ఉదాహరణముగా మనం వాల్మీకి గావించిన వర్షర్తువర్ణనము చూతము.

శ్లో. "వ్యామిశ్రితం సర్జకదంబపుష్పైః, నవం జలం పర్వతధాతుతామ్రం,
మయూరకేకాభిరనుప్రయాతం, శైలాపగాః శీఘ్రతరం ప్రయాంతి.
రసాకులం షట్పదసన్నికాశం, ప్రభుజ్యతే జంబుఫలం ప్రకామం,
అనేకవర్ణం పవనావధూతం,భూమౌ పతత్యామ్రఫలం విపక్వం.
ముక్తాసకాశం సలిలం పతద్వై, సునిర్మలం పత్రపుటేషు లగ్నం,
దృష్ట్వావివర్ణచ్ఛదనావిహంగాః, సురేంద్రదత్తం తృషితాః పిబంతి.

మహాకవి కాళిదాసుసైతము స్థలవర్ణనంచేసినపట్లలో తన ప్రకృతి నిరీక్షణా నైపుణ్యాన్ని ఇట్లే ప్రదర్శించేడు.

శ్లో. ఆమేఖలం సంచరతాం ఘనానాం, ఛాయామధః సానుగతాం నిషేవ్య,
ఉద్వేజితావృష్టిభిరాశ్రయంతే, శృంగాణి యస్యాతపవంతి సిద్ధాః.
కపోలకండూః కరిభిర్వినేతుం, విఘట్టితానాం సరళద్రుమాణాం,
యత్ర స్రుతక్షీరతయాప్రసూతః, సానూని గంధః సురభీకరోతి.

ఇట్టిపట్ల వీరు తమకవితానైపుణ్యంతోపాటు ప్రకృతిచిత్రాన్ని యథాతథంగా మన హృదయంలో అంకితం చేస్తున్నారు. మనం ఆయాచోట్ల విహరించినట్లు, ప్రత్యక్షంగా వాటిని చూచినట్లు, ఆనందాన్ని అనుభవిస్తున్నాం. అవి మనహృదయంలో భావాల్ని రేకెత్తిస్తూ, తాదాత్మ్యతకోసం మన్ని తహతహలాడిస్తున్నాయి. వనశ్రీనేగాదు పాడుపడిన ప్రదేశాన్నికూడా కాళిదాసు ఇంత చాకచక్యంతోనే వర్ణించాడు. కుశునికాలంలో హైన్యదశనందిన అయోధ్యని ఎట్లావర్ణించాడో చూడండి.

శ్లో. కాలాంతరశ్యామసుధేషు నక్తం, ఇతస్తతో రూఢతృణాంకురేషు,
త ఏవ ముక్తాగుణశుద్ధయోపి, హర్మ్యేషు మూర్ఛంతి న చంద్రపాదాః.
రాత్రావనావిష్కృతదీపభాసః, కాంతాముఖశ్రీవియుతా దివాపి,
తిరస్క్రియంతే కృమితంతుజాలైః, విచ్ఛిన్నధూమప్రసరా గవాక్షాః.

ఈవిధంగా ప్రకృతిచిత్రాన్ని యథాతథంగా చిత్రించడానికి బదులుగా వెనుకటి కవులు ఉపమా, ఉత్ప్రేక్షా, దృష్టాంతాదిఅలంకారాల్ని వెతుక్కుంటూపోవటం మనదురదృష్టం. మహాకవి మాఘుడు తన ప్రభాతవర్ణనంలో

శ్లో. అరుణజలజరాజీ ముగ్ధహస్తాగ్రపాదా, బహులమధుపమాలాకజ్జలేందీవరాక్షీ,
అనుపతతివిరావైః పత్రిణాం వ్యాహరంతీ, రజనిమచిరజాతా పూర్వసంధ్యా సుతేవ.
• వితతపృథువరత్రాతుల్యరూపైర్మయూఖైః, కలశఇవగరీయాన్ దిగ్భిరాకృష్యమాణః,
కృతచపలవిహంగాలాపకోలాహలాభిర్జలనిధిజలమధ్యాదేవఉత్తార్యతేర్కః.

అని వ్రాసేడు. ఈవ్రాతలో అతనికి అలంకారకల్పనలో ఉన్న ఆసక్తి ప్రకృతి చిత్రణంలో లేదన్నసంగతి సుస్పష్టం.

అయితే అలంకారాలవేవి సర్వథా ఉండకూడదని నా అభిప్రాయం కాదు. అవి అనివార్యాలుకూడాను. కాని వాటికికూడా ఓపరిమితస్థానం ఇవ్వాలి. "ఆవికసించినపద్మమెంతరమ్యమో!" అని అనడానికిబదులు "ఆవికసించినపద్మం, ప్రభాతసంధ్యారక్తిమనే ప్రతిఫలించిన" దని కూడా అనవచ్చును. మొదటిచోట సుస్పష్టముగా రమ్యమని చెప్పబడిన సౌందర్యము రెండవచోట అలంకారరూపగుణీభూతవ్యంగ్యముచే ప్రకటింపబడినది. భావోత్కర్షమున కిట్టివర్ణనావైచిత్ర్య మవసరమే. కాని అడుగడుగునా మనహృదయ ఫలకంలో ప్రకృతవస్తువును విడిచి మరియొకవస్తుచిత్రము చిత్రించుచుండుట ప్రాసంగికభావాన్ని

ఉద్దీపింపచేయడాని కాటంకమే కాకుండా కావ్యగౌరవాన్నికూడ నశింపజేస్తుంది. వాల్మీకి కూడా మధ్యమధ్యఅలంకారాల్ని వాడుతూనే పోయాడు కాని అతని ప్రకృతి అత్యంత సూక్ష్మతరముగా చిత్రింపబడినందున అక్కడి అలంకారాలు, వ్యాచిత్ర్యాలయినా, కావ్య గౌరవాన్ని పెంపొందింపజేసేవయాయి.

అంతేకాదు ఆలంబనోద్దీపనవిభావాలు రెండింటికి గలసంబంధాన్నికూడా అతడు వర్ణించేడు. శోకాకులుడైన రామునికి వర్షర్తువులో ప్రకృతి సీతామూర్తిగానే కాన్పించినది.

శ్లో. జ్యోత్స్నా తుషారమలినా పౌర్ణమాస్యాం న రాజతే, సీతే వ చాతపశ్యామా లక్ష్యతే న తు శోభతే.

కాళిదాసుకాలంలోనో, ఆతరవాతనో ఈ ప్రకృతివర్ణనంలో రెండుఫక్కీలు బయల్దేరి నట్టు కనిపిస్తుంది. ఒకటి యథావద్వస్తువర్ణనం, రెండోది ఋతువర్ణనం. స్థలవర్ణనంలో ప్రాచీన ఫక్కీ అనుసరింపబడినా, ఋతువర్ణనంలో అలంకారాలభారం లావైంది. కాదు, గతాను గతికంగా ఆయాఋతుధర్మాలనో, అప్పటిఫలపుష్పాదులపేర్లనో వర్ణించి కవి తనబాధ్యత తీరిందని చూపోవడంకూడా కద్దు. ఆలంకారికులగ్రంథాలు విభిషపెడితే దాన్నే పర మాన్నంగా గ్రహించడంకూడా కనిపిస్తుంది. వర్షర్తువువర్ణించాలంటే,

శ్లో. కదంబ నింబకుటజైః శాద్వలైః స్యేంద్రగోపకైః, మేఘైర్వాతైః సుఖస్పర్శైః ప్రావృట్కాలం ప్రదర్శయేత్.

అన్న భరతవాక్యం జ్ఞాపకానికి వస్తుంది. సరి! కవి ఆనాలుగుమాటలు ఉచ్చరించి ముందుకు సాగిపోతాడు. ఈవిధంగా గుడ్డిగా అనుకరింపబడుతూన్న ప్రకృతివర్ణనం, సమస్యాపూర్తులతో మరింత సంకుచితమైన పంథాలో పడింది. తరువాతికవులలో ఒకాయన సాయంకాలసూర్యుణ్ణివర్ణిస్తూ,

శ్లో. ఏతద్భృఘుశ్చికచానుకారికిరణం రాజద్రుహోమ్నః శిరశ్ఛేదాభం వియతః ప్రతీచి నిపతత్యర్ఘారవేర్మండలమ్.

అని వ్రాసేడు. వికల్పనావిశేషం అయితే పూర్వం, భావాల్ని, రసాన్ని పోషించ డానికి ఉపయోగించారో దాన్ని యీతడు చమత్కారానికి ఉపయోగించుకొంటున్నాడు.

మనోవిజ్ఞానశాస్త్రరీత్యా చూచినా దృశ్యవర్ణనం, ఎంతసూక్ష్మవిషయికంగా వర్ణిస్తే అంతగా శ్రోతలహృదయంలో నిలుస్తుంది, గాని అలంకారాల్లోని కల్పితభావాలు దృశ్యంతోపాటు శాశ్వతంగా నిలవవనేసంగతి స్పష్టమవుతుంది. అందుకే ప్రాచీనులు ప్రకృ తిని అంతసూక్ష్మంగా సిరీక్షించి, అంగప్రత్యంగపూర్ణంగా వర్ణించారు. బింబగ్రహణం కలి గించడానికి ఎంతైనా పాటుబడ్డారు. మనభావాలకి ఆలంబనంగాను ఉద్దీపనంగాను ప్రకృతిని ఉపయోగించుకొన్నారు. ఆనందాన్ని అనుభవించేరు. ఆ అనుభూతిని మనకి అందజేశారు.

(స్వర్గీయ శ్రీరామచంద్రశుక్లగారి "కావ్యంలో ప్రాకృతికవర్ణనం" అనేహిందీవ్యాసం, దీనికి కొంత ఆధారం.)

# "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి"

రచయిత: విద్వాన్, కవిరాజు, బాలసరస్వతి
**రావూరి దొరసామిశర్మ, చోళలింగపురము**

శ్రీకాళహస్తిమాహాత్మ్యకర్త ధూర్జటి; ఇతఁడు కృష్ణరాయలయాస్థానములోని యష్టదిగ్గజకవులలో నొక్కరుఁడుగాఁ బరిగణిత మైనవాఁడు. రాయలనాఁటి కవులకవితా ధోరణి పరిపక్వమై, యనర్గళశైలీయుతమై, మృదూక్తిమధురమై, శ్రవణసుభగమై యొసలారుచుండు ననుట యత్యుక్తి గానేరదు. ధూర్జటికవితంగూర్చి యిఁకఁ బ్రత్యేకముగాఁ జెప్ప నక్కఱలేదు. శ్రవణసుభగకవితావిరచన యందఱకు సుగమముగాదు. సోమన, పోతన, శ్రీనాథుఁడు, పెద్దన, తిమ్మన, రామభద్రుఁడు, ధూర్జటి మున్నగువారి కవితాపద్ధతి కర్ణరసాయనమై తనరారుచుండు. జిలిబిలిపలుకులయందు మాధుర్యముఁ జిలుకు లలితకవితారచన కం దెవేసినవారీ సోమనపోతనాదికవికుంజరులు. ధూర్జటి నవ్యభావాశతఘానిగుంభనరసస్థితి నొప్పుదలిర్పమాహాత్మ్యమును గావ్యసరణిని రచించి ధన్యుఁడై కవిజనమాన్యుఁ డైనవాఁడు.

ఇట్టి కవిధూర్జటి (కవీశ్వరుఁడు) ప్రశంస యొకనాఁడు తనదుభువనవిజయసంసద్భవనమున విద్వద్గోష్ఠియందుఁ బొడతేరఁగాఁ గవితాప్రావీణ్యఫణీశుండును గవితాస్త్రీలోలుండును నాంధ్రభోజక్ష్మాపాలుండు నగు కృష్ణరాయరసికశిఖామణి

"స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గెనో
యతులితమాధురీమహిమ ?"

అని ప్రశ్నరూపముగా నొండుసమస్య యచ్చటికవుల కొసఁగెనఁట. అందులకు సహజహాస్యవచోవిన్యాసకుశలుఁడును వికటకవి బిరుదాంకితుఁడు నగు తెనాలి రామకృష్ణుఁడు లేచి, తనకాసమస్యాపూరణకుఁ బక్షము విరామ మొసంగఁ గోరి, రాయ లంగీకరింపఁగా, నాఁటినుండి పదునైదుదివసము లింటఁ గాలక్షేపము సల్పి, యానాఁటిరాత్రి ధూర్జటికిఁ గనఁబడనియట్లు తద్గృహసమీపముననుండి, రెండవజామున ధూర్జటి వేశ్యాగృహమున కరుగుటంగాంచి యాతని వెంబడించి యాతనికిఁ గనఁబడక తత్సవిధప్రదేశమున నుండి, తరువాతఁ దెల్లవాఱకముందు వేశ్యామందిరమునుండి మగిడి వెలుపలికి రాఁగా నందే యాతని కెదురుపడి, తత్కాలోచితవాక్కులాడి యేమియు నెఱుఁగనివానివలెఁ బని విని రామకృష్ణుఁడు తనదుగృహంబున కరుదెంచి సంధ్యాదినిత్యవిధులఁ దీర్చుకొని యిప్పటి వేళకు రాయలకొల్వునకు వచ్చెనఁట. ధూర్జటికి మాత్రము ప్రాణము లాఁగుచుండెను, గుండె కొట్టుకొనుచుండెను.

రాయలు రామకృష్ణునిం జూచినదే "స్తుతమతియైన......మాధురీమహిమ" యను సమస్యను జదువుడు రామకృష్ణుఁ డీరీతిఁ బూరించెనఁట.

చ. స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలగల్గెనో
యతులితమాధురీమహిమ ?......
"హా ! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసుధారసధారలఁ గ్రోలుటం జుమీ."

ఈయైతిహ్యమువలన ధూర్జటికి రాయలసభలోఁ బెన్నపమానము తటస్థించియుండు ననియు, నతఁడు వేశ్యాజనలోలుఁడనియు విదితమగుచున్నది. తెనాలిరామకృష్ణుని కథలు పెక్కులు గలవు. అవి విశ్వసనీయములు గావని కొందఱిమతము. ఆవిషయ మెట్లున్నను నీకథ విశ్వసనీయమే యనుటకు మన ధూర్జటిమనుమఁడైన కుమారధూర్జటి బిరుదాభిరాముఁడు వేంకటార్యకవి రచించిన కృష్ణరాయవిజయకావ్యములోని యీ క్రిందిపద్యము ప్రబలాధారముగా నున్నది.

"స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గెనో
యతులితమాధురీమహిమ నాఁగను మీపెదతాత చాల స
న్నుతిఁ గనెఁ గృష్ణరాయలమనోజ్ఞసభ న్నిను మీవు నట్ల మ
త్కృత బహుమానవై ఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోపలన్."

(ఇది కృష్ణరాయవిజయకృతిపతి యార్వీటి చినవేంకటరాయలు కవిం జూచి చెప్పినమాట.)

"స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలకల్గెనో యతులిత మాధురీమహిమ" యనుప్రశస్తి కవిరాయలచే నందినమాట పరమార్థమని కుమారధూర్జటి కృతివలనఁ దెలియుచున్నదికదా? ఆపద్యములోని తక్కిన రెండున్నరపాద మేమై యుండును? అది ధూర్జటి వేశ్యాలోలత్వకథానిర్దేశకభాగమై యుండును. తెనాలికవి వికటకవిగాన నతఁడు గుణములను అవగుణంబులుగా గ్రహించి పరిహసించులక్షణముగలవాఁడు కావుటంజేసి, యాతనిపై యసభ్యపూరణ తనతాతకుఁ గళంకాపాదకము గాదని, రాయలవాక్యొక్కటే తనతాత కవితాకౌశలముం జాటుచున్న దని, యాయొకటిన్నరపాదము గ్రహించి కుమారధూర్జటి శేషమును స్వయముగాఁ గృతిపతినోటఁ బూరించినాఁడని తోఁచుచున్నది.

ఇప్పట్టున ధూర్జటి శీలముంగుఱించి పలువురు పలుతెఱంగులఁ బలుకుదురు. ధూర్జటి భక్తాగ్రగణ్యుండగుకవి. ధూర్జటి కిట్టి వేశ్యాలోలత్వగాథ నంటఁగట్టుట కల్పితమే యను వారును, 'కారణం వినా కార్యం న భవతి' యనున్యాయము ననుసరించి పలుకువారును గలరు. అందు నామత మేదియో సహేతుకముగాఁ బ్రదర్శించుటకే యీవ్యాసము వ్రాయ నుద్దేశించితి. గ్రంథము మాహాత్మ్యముగుటంజేసి భక్తిరసప్రధాన మని వేఱ యింకఁ జెప్ప నక్కఱలేదు. దీనిని గావ్యసరణిని రచియించిన వాఁడగుటచేఁ గవి తనయిచ్చను గథను మార్చి కూర్చి చేర్చివ్రాయుట సాజము. ఆమార్పుచేర్పులు సూక్ష్మదృష్టిం బరిశీలించితిమేని కవిమతము విదిత మగును.

ఈకవికి శృంగారవర్ణనయం దిష్ట మత్యంత మని మాహాత్మ్యములోని యీక్రింది ఘట్టములు, పద్యములు దెల్పుచున్నవి.

ప్రథమాశ్వాసము:—శ్రీకాళహస్తిపురవర్ణన - ఇట నటనటశృంగారవర్ణన గలదు.

మ. ఎలదోఁట ల్వనముల్, వ్యధూతచమల ద్రీంద్రంబు, లాకంటికి
స్థలముల్ పాతెఱ, లంగజాగమకళాబంధంబు లిచ్ఛాసనం
బులు, కోపంబునఁ బాయుటల్ తపము సంభోగంబు కైవల్య మం
దుల లీలారతినుండుమానవుల కెందుం గాన మీచిత్రముల్. (21 ప.)

చ. పరిచితబంధనైపుణి నపారకళానుభవప్రసక్తి సా
దరసువివేకసంపద సదాశుకవాక్యసుధానుభూతి మో
హరహితవృత్తిఁ బ్రస్ఫురదనంగరహస్యవిచారబుద్ధి న
వ్వరమునఁ గామినీజనులు పొల్తురు యోగిజనంబు పోలికన్. (24)

కాళహస్తీశ్వరుఁడు మాయాజంగమరూపము దాల్చి యాదవరాజుభక్తి గరిష్ఠతం బరికింప నారాయణవనముం జేరును. రాజవీధియందుఁ గపటజంగమరూపి యొయ్యారంబునఁ జనువాఁడు—

మ. తనసౌందర్యముఁ జూచి కామశరసంతానంబునుం బొందకుం
డిన కాంతామణిఁ దాల్మి దూలనివధూటిం గౌఁగిలింపం దలం
పని కంపాలలితాంగి బోటులకుఁ జెప్పంబోని పంకేరుహా
ననఁ గీర్తింపనిలేమ మందునకునైనం గాన మూహింపఁగన్. (32)

ఆకపటజంగమును నొకదాసి తనయింట యాతిథ్యమునకై పిల్చును. అందులకు సంతోషించి మహాత్మురాలిడి శివాచారైకసంశీల, దీనిభక్తికి మనఃకంజంబు రంజిల్లెడి,

క. అని కాంతా! నీయింటికిఁ, జనుదెంచెద నీదుగుబ్బచనుఁగొండల నం
దునఁ దెరువెఱుఁగక తిరి, గెడి మనసను తెరువరికి దప్పి మాన్పంగలవే?

అనవుడు నవ్వనజానన నీదుమనసువచ్చినరీతిం బనివినియెద నావుడు సంతసిల్లిన మనంబున జంగమలింగమూర్తి యమ్మెఱుఁగుఁబోఁడిని రతి కేలసంచెను.

క. అంతట ముసుపే పురవి, కుంతంబులఁ జిమ్ముకొద్ద కోమలి మిగులన్
సంతోషమంది యొకయే, కాంతగృహములోని కరిగి యలరులసెజ్జన్.

ఉ. తానుఁ గుమారజంగము సుధాకరమౌళి సుఁ గూడి మాడి యిం
పైనరతిప్రసంగముల నర్ధనిమీలితనేత్రపద్మముల్
మానవిచుంబనంబులును మాటలచొక్కులు వీడి వీడి పో
నీవి కవుంగిలింతలు ననేకవిలాసములుం జెలంగఁగన్.

ఉ. ఎక్కడఁ బట్టినం గళల యిక్కువ, లెక్కడ నోరు సోఁకినన్
జక్కెర లప్ప లేమనిన సారసుధారస, మెట్టు లుండినన్
జక్కఁదనంబు పెన్నిధులు సంభ్రమ మొప్పఁగ నేమి సేసినన్
మక్కువ చెయ్వులై మెఱయు మన్మథకేళి యొనర్ప సంకటన్. (33...43)

ద్వితీయాశ్వాసము:—ఘట్టము— బ్రహ్మకు సరస్వతివలనఁ గుమారు లుద్భవిల్లుట.
ఇందు వాణీబ్రహ్మలమనోజకేళీవర్ణనము మిన్నుముట్టినది.

భర్తృవాంఛచే వాణి నూఱురూపములు ధరించును. బ్రహ్మ యిట్లనుచున్నాఁడు—

శా. వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వం బసాధారణం
బాచోద్యం బఖిలోకమప్రతిమపర్యాయంబు వర్ణింపఁగా
నీచెల్వం బిది నిక్కమ ట్టయినఁగానీ నాకు నీవంక వాం
ఛాచాపల్యము దీరనేరదు మనోజక్రీడలం గోమలీ!

నాకోరిక లీడేరఁగ నాకృతులు నూటిఁ గైకొనవలె ననవుడు వాణి శతవాగ్వన జానన లయ్యెను.

ఉ. అందున కొంతయుం బ్రమద మందుచుఁ బుష్పితవల్లులందు నిం
దిందిరబాలకంబు పువుఁదేనియఁ గ్రోలెడురీతి నూర్వరం
బొంది సుధాధరగ్రహణభూరిసుఖంబుల నొందుచున్ శతా
నందుఁ డనంగ నొప్పెసఁగె నాఁడు మొదల్ కథల న్విధాతయున్.

(ఇందు సుధాధరపానమున కుపమానమునైతము గూర్పఁబడినది.)

శా. ఆరామంబులఁ గేలిశైలముల సౌధాగ్రంబులన్ స్వర్ణదీ
తీరోపాంతనికుంజపుంజములలో దేశంబుఁ గాలంబు సా
చారంబు న్వివరింపఁగా మఱచి హృజ్జాతాంధకారాంధుఁడై
నీరేజాసనుఁ డిచ్చనుండె శతవాణీభోగనిర్మగ్నతన్.

గీ. .......................వారిజాక్షులఁ దగినట్లు గారవించి,
రతిసుఖంబులఁ జొక్కి నోరంత ప్రౌఢ, నజుఁడు మన్మథరాజ్యసింహాసనమున.

క. తరుణీశతకము బింబాధరమాధుర్యంబు లానుతఱిఁ దమలోనన్
బరమేష్ఠి నాల్గుమోములు, పరుసలు పెట్టుకొనుఁ జెప్పవశమే కూర్మిన్.

(బింబాధరమాధుర్యములానుట - వనితాజనతా......మధురాధరోదితసుధారస ధారలఁ గ్రోలుటను స్మృతికిఁ దెచ్చుచున్నదిగదా!)

సీ. అధరపల్లవమాన సంగంబు మఱచు దంతక్షతంబునఁ గొంత తలఁపుగలుగుఁ
బరిరంభణంబునఁ బరవశుఁడగు నఖంబులు నాటఁ జెనకినఁ దెలివినొందు
బహుబంధరతికి లోపడి చొక్కి గళరవశ్రవణంబుచేత నెచ్చరికనొందు
సురతాంతసుఖమునసోలుఁ దాంబూలంబు సేవింప నించుక సేదదేఱు
జలకమాడును దివ్యవస్త్రములుగట్టు, దివ్యగంధంబు లలఁదును దివ్యపుష్ప
మాలికలు దాల్చు నమృతంబు గ్రోలు మగుడ, బాలి కాసంగ సౌఖ్యాబ్ధి నోలలాడు.

ఉ. తోరపుఁగోరిక, ల్నగవు తోడి మొగంబును, జిక్కువడ్డశృం
గారపుఁగొప్పు, క్రొంజెమట గాఱెడుగండము, సందడించు ని
ట్టూరుపుగాడ్పు, వేడుకల నుబ్బెడుదేహము, సోలఁజూపు, నొ
ప్పారుటగాని నల్వకొక యప్పుడు నూరట లేదు కూటమిన్.

క. ఈమాడ్కి నిదియపనిగాఁ, గామాంధుం డగుచు నన్నకార్యము లెల్లన్
బోమొత్తి పుణ్యపాపము, లేమియుఁ దలఁపక సుఖించు నెడ వారలకున్. (13...22 పద్యాలు)

ముప్పదివేలురక్కసులు పుట్టిరనికథ.

శృంగారరసభూయిష్ఠతకీవాణీహిరణ్యగర్భకేళీవర్ణన మొక్కటే తార్కాణముగాఁ జాలునుగదా? భక్తిరసప్రాధాన్యమే కాక యగస్త్యుఁ డొకయెత్తు కమండల మొకయెత్తగు నానుడికైవడి శృంగారరసమునకు నీమాహాత్మ్యము తానక మగుచున్నది. శతానందుఁ డను పేరు బ్రహ్మకీఘట్టమున శతవాణీభోగనిర్మగ్నతచే నన్వర్థమైనది.

తృతీయాశ్వాసము:— తిన్నని జన్మభూమివర్ణనము—పొత్తపినాటిలో విపినభూమి గిరాతుల కాటపట్టు లోకోత్తరవన్యవస్తు పుడుమూరను పక్కణ మొప్పునఁట. అందలి శబరకాంతలవర్ణనను జదువుఁడు—

ఉ. మంచెలమీఁద నెక్కి కటిమండలిఁ జుట్టినపాఱుటాకు లిం
చించుక చంచలించి మరునిల్లు బయల్పడఁ జేయఁ బిట్టలన్
జెంచెత లార్చి ప్రేయందురు చిత్రముగా నొడిసెళ్ల బాహుమూ
లాంచిత దీధితుల్చిఱుతయైన చనుంగవమీఁదఁ బర్వఁగన్.

క. గుబ్బచనుంగవ తేనియ, లుబ్బెడు మోవియుఁ మెఱుంగు లొలికెడు మేనుల్
నిబ్బరపుం గబరీభర, మబ్బురపు గొను చంచలాక్షుల కొప్పున్.

*క. తేనియలు గ్రోలి పిదపన్, మానవతుల యధరమావి మఱతురు శబరుల్
తేనియ తియ్యఁదనంబు సమానం బనఁదగునె యధరమధురిమ కెందున్. (10...14)

పరమశైవాచారసంపన్నుండును శివభక్తాగ్రగణ్యుండునైన తిన్ననిజన్మభూమివర్ణనయం దీశృంగారప్రసక్తియేల? ఇది లేకున్నచోఁ గలుగు లోటేమి? ఈవర్ణన యాశబరపురమున కేరీతిఁ బుష్టికారిణియో? ఇఁక ముందునకుఁ బోదము.

చ. ధరణికిఁ గంఠభూషణము తన్నగరంబు, తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము, ప్రాణము దానికి రాజనందనో
త్కరము తదాత్మకున్ మదనదాహరసప్రదవైశ్యవీథి, త
త్పరసిరిలోచనల్ గుఱుతు చక్కఁదనంబున వారిలోచలన్.

క. గాణిక్యకలశజలనిధి, మాణిక్యం బగుచు మదనమతముల కిరవై

---

* అధరమధురిమానుభవప్రశంస కవి యెట్లు గావించెనో రసికవిద్వత్తల్లజులు గ్రహింతురుగాత, మకరందమాధుర్యముసైతము వనితాజనతాధరరసమధురిమకు సాటి కాఁజాలదఁట.)

మాణిక్యవల్లి యనఁగా, నేణాక్షి యొకర్తు వన్నెకెక్కెను బురిలోన్.

(చతుర్థాశ్వాసము మాణిక్యవల్లీవృత్తాంతము. 4...17)

ఇందుఁ దన్నగరమన మధురాపురము. పురవర్ణనలో రాజనందనోత్కరాత్మకు వైశ్యవీధి ననుసంధించినాఁడు కవి. వైశ్యవీధి యన వేశ్యాజన వాసస్థానమగువీధి. కవి సారాలంకారమును శృంగారరసాలంకారముగా వినియోగించె. తరువాత నామాణిక్య వల్లి యంతర్వత్ని యయ్యెను. అమ్ముద్దియకు నిద్దరుసూఁతులు జనించిరి.

ఉ. కోకిలవాణి పాడుఁ దనకూరిమిబిడ్డలఁ దొట్లఁబెట్టి కో
కోక కళావిలాసములకుం గలయర్థము జోలపాటగా
నాకమనీయశైశవము నప్పటినుండియుఁ వారధర్మవి
ద్యాకుశలత్వ మాత్మజల కచ్చుపడ నవ్వెలె నంచు నిచ్చలున్.

క. వనిత చతుర్జాలివరో, వనజాక్షులబంధవైభవము భద్రునిద
త్తునిగూచిమారుఁ బాంచాలుని వ్రాయించెన్ గృహాంబులోపలిగోడన్.

సీ. కూచిమార మనోజ ఘోణికాపుత్త్రాదికానీతకామసిద్ధాంతములును......

గీ. సంతరించె గృహాంబులో జలజనేత్ర, రతులఁ జతురత గానధురంధరతలఁ
గంతరవనిపుణతల నాట్యకౌశలములఁ, జిన్నిపడుచులఁ బ్రౌఢలఁ జేయఁదలఁచి, (13...16)

కవి మాణిక్యవల్లీవృత్తాంతసందర్భమునం గల్పించుకొని కొక్కోకకళాశాస్త్రము యొక్కయు, కూచిమారఘోణికాపుత్త్రాదికామశాస్త్రకారులయొక్కయుఁ బ్రసక్తి తెచ్చి పెట్టినాఁడు.

ఇట్టి శృంగారరసభూయిష్ఠవర్ణనారచన కవికిఁ గల యేతద్రసపరత్వమును జాటుచు నాతని వేశ్యాలోలతను నైతము ధ్వనింపఁజేయుట లేదా? శ్రీనాథుఁడు శృంగార ప్రియుఁ డనుట యాతని గ్రంథసాకల్యము ప్రకటించుచున్నదిగదా!

ఇందుఁ గొందఱు కావ్యమునకు నష్టాదశవర్ణన లుంట యొకలక్షణము గాదా? అయ్యష్టాదశమున రతి యొకటి యగుచున్నదే, దానంజేసి ధూర్జటి తనకృతికిఁ గావ్యత్వ సిద్ధికై వర్ణించిన మనోజక్రీడాదులఁ బురస్కరించుకొని కవికి వేశ్యాలోలత్వాదిదోషము ధ్వనిత మని యుగ్గడించుట సమంజసము గాదందురు. అదియుం గాదనను. కథానుగుణ ముగాఁ గావ్యరచన జరుగవలయుఁగాకఁ గథానాయకాదిశీలమునకుఁ గవిశీలమును ముడి వెట్టుట సరి కా దనుతెగలో నేనును జేరినవాఁడనే. మనుచరిత్రనిర్మాత పెద్దనశీలముతోఁ బ్రవరునిశీలమునుగాని కుహనాప్రవరునిశీలమునుగాని జతపఱుపరాదు. అట్లు జతపఱి చిన బుద్ధిజాడ్యజనితోన్మాదుల్గదా శ్రోత్రియు లన్న ప్రవరునివాక్యము పెద్దనకే తగిలి యాతని నియోగితను వైదికతకు మార్చును. అట్లే పారిజాతాపహరణకర్త నందితిమ్మన ధూర్తగోపాలుఁడు గాఁడు. నన్నయతిక్కనలు కౌరవపాండవులలో నెవ్వరును గాఁజాలరు.



ఇంకా

ఇట్టి యాశయముతో నవలోకించినం గాళహస్తిమాహాత్మ్యము ధూర్జటికిని వేశ్యాలోలత్వమును నిర్దేశింపఁ జాల దని తోఁచును గాని యాతనిదేయగు కాళహస్తీశ్వరశతకములోని యీ క్రిందిపద్యములు, పద్యభాగములు కవిగారి వారవనితాజనతాభోగమును నొక్కి వక్కాణించుచున్నవని తేటతెల్లముగను జూడుఁడు. మచ్చునకు వ్యాసవిస్తరభయమునఁ గొన్నిమాత్రము చూపెదను.

కాయ ల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు, వక్షోజముల్
రాయ న్రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బోయెం బ్రాయము, బట్టఁగట్టెఁ దల చెప్పన్ రోఁత సంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁ గదవే శ్రీకాళహస్తీశ్వరా. (14)

రోసీ రోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
పాసీ పాయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీ కోయదు నామనం బకట నీకుం బ్రీతిగా సత్క్రియల్
చేసీ చేయదు దీనిత్రుళ్ళణఁపవే శ్రీకాళహస్తీశ్వరా. (32)

అమరస్త్రీల రమించినం జెడదు మోహం బింతయుం బ్రహ్మప
ట్టము సిద్ధించిన నాస దీఱదు నిరూఢక్రోధమున్ సర్వలో
కములన్ మ్రింగిన మాన దింకఁ గలసౌఖ్యం బొల్ల నీసేవఁ జే
సి మహాపాతకవారిరాశిఁ గడతున్ శ్రీకాళహస్తీశ్వరా. (42)

మలభూయిష్ఠమనోజధామము సుషుమ్నాద్వారమో? యూరుయుం
దలియో? పాదకరాక్షియుగ్మములు షట్కంజంబులో? మోముదా
జలజంబో? నిటలంబు చంద్రకళయో? సంగంబు యోగంబొ? గా
సిలి సేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీకాళహస్తీశ్వరా. (49)

సంతోషించితిఁ జాలుఁ జాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుఁడ నాదు నీకరుణచే శ్రీకాళహస్తీశ్వరా. (62)

తమకం బొప్పఁ బరాంగనాజనపరద్రవ్యంబుల న్మ్రుచ్చిలం
గ మహోద్యోగముసేయు నెమ్మనము దొంగం బట్టి వైరాగ్యపా
శములం జుట్టి బిగించి నీదుచరణస్తంభంబున న్గట్టి వై
చి ముదం బిప్పుడు గల్గఁ జేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా. (82)

నీపైఁ గావ్యము చెప్పుచున్నయతఁడు న్నీపద్యముల్ వ్రాసి యి
మ్మా పాఠం బొనరింతు నన్న యతఁడు న్మంజుప్రబంధంబు ని
ష్టాపూర్తిం బఠియించుచున్నయతఁడే సద్బాంధవుల్గాక, ఛీ
ఛీ! పృష్ఠాగతబాంధవంబు నిజమా శ్రీకాళహస్తీశ్వరా. (86)

తమనేత్రద్యుతి దామె చూడ సుఖమై తాదాత్మ్యముం గూర్పఁగా
విమలమ్ము ల్కమలాభముల్ శీతలసద్విద్యుల్లతాలాసముల్

సుమనోబాణజయప్రదమ్ము లనుచుం జూచు న్జనం బూని హా
రిమృగాక్షీ నివహమ్ముఁ గన్నుఁగవలన్ శ్రీకాళహస్తీశ్వరా. (106)

ఈపై పద్యములు సూటిగాఁ గవి పరాంగనాసక్తిని సువ్యక్తముసేయుచున్నదని వేఱ యొకరుఁ జెప్పవలయునా? కవియే 'సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్' అని చెప్పికొనుచున్నాఁడే! ఇఁక సందేహపడనేల? వాదోపవాదము లేల? యౌవన మొకయనర్థమే కదా? "యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా, ఏకైక మప్యనర్థాయ" అనియేకదా హితోపదేశము! తారుణ్యమునఁ బరాంగనాసక్తి వేశ్యాలోలత ధూర్జటి కుండియుండును. కాళహస్తిమాహాత్మ్యమున భక్తిరసముతో శృంగార రసము సమప్రాధాన్యమును వహించుచున్నది. కాళహస్తిశతకము రచించునాఁటికిఁ గవికి వైరాగ్యము పెల్లుబికెను. దానంజేసియే యందంగనాదిభోగము తుచ్ఛముగా దూషించినాఁడు. "వెనుకంజేసిన ఘోరదుర్దశలు భావింపంగ లోఁతయ్యెడున్" అన్నాఁడు కవి. కాళహస్తిమాహాత్మ్యరచన తరువాతనే శతకరచన నడచియుండు నని నే నిందు వలన నూహించెద. వీని నన్నింటిని బరికింపఁగా 'స్తుతమతియైనయాంధ్రకవిధూర్జటి' యనుపద్యసంబంధిగాథ యథార్థ మనుట కించుకయు సంశయింపఁబనిలే దని మత్సిద్ధాంతము.

# నైతికగ్రంథములు : కవిత్రయము

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

ఆంధ్రవాఙ్మయమున సామాన్యప్రజాబాహుళ్యమున కుపయుక్తములగు నైతిక ప్రబోధకగ్రంథము లత్యంతమృగ్యములు. ఉన్నవానిలో వేణుగోపాలరామలింగేశాదిక స్వతంత్రశతకము లేవో కొన్ని, పిష్టపేషణన్యాయముగ నొకదాని కొకటి యించుమించు ప్రతిబింబము లగుట వానికిఁ గల ప్రశస్తి తక్కువ. అట్టివి సర్వసామాన్యజనోపయుక్తము లగ నుండవలయు ననునుద్దేశముతోఁగాక, ప్రభుకృతబహిష్కారముననో, ప్రధానికృత తిరస్కారముననో మన్యుప్రేరితచిత్తులై యాశాభంగ మొందినకవు లన్యాపదేశములుగ రచించినబూతులనీతులపాతఱలై యున్న వగుట, రాచఱికమునఁ గలలోపములను మాత్రమే యెక్కుడుగ నుద్ఘాటించుట కుపయోగపడునవి; కాని ప్రజాసామాన్యమునకు నైతికపథముం జూపునవి కావు. ఆయాశతకకర్తలు పాండిత్యప్రకర్షకొఱకును, రాజసమ్మానములకొఱకును పండితసదస్సులు రాజాస్థానములు మున్నగుసంస్కృతజనాకీర్ణప్రదేశములవంకకే తమదృష్టులఁ గేంద్రీకరింపఁజేయుచుండిరి; కాని సామాన్యమానవసంఘము దిక్కునకైనఁ బోవకుండిరి.

అట్లుగాక పాటకజనము మొదలు, పార్థివలోకమువఱకు—పామరులు మొదలు పండితులవఱకు—జనసమూహమున మెలఁగుచు, వారిస్వభావములఁ జక్కఁగ గ్రహించుచు—నందలిలోపముల నెత్తిచూపి, యట్టివారిని నైతికమార్గమునకు నడుపఁ బూనిన శతకకవులు మువ్వురు. 1. బద్దిభూపాలుఁడు, 2. కవిచౌడప్ప, 3. వేమన.

ఈమువ్వురును మన తెలుఁగునాటఁగాక, యఱవసీమవంటి యింకే దేశముననేని జనించియుండిన, తద్దేశవాసులు వారికి బ్రహ్మరథముం బట్టియుందురు. వారికృతులు లఘుతరములైనను, విషయగౌరవముంబట్టి యత్యంతమాననీయములు. 'తిరువళ్లువరు' కవి రచించిన 'తిరుక్కురళ్' లోని నీతులకంటె వేమన యాటవెలఁదులలోని నీతు లెందును దీసిపోయినవి కావు. కాని తిరువళ్లువరు మహిమలం గూర్చి, యతనిగ్రంథప్రాశస్త్యముంగూర్చి యఱవలుచేయు ప్రచారముం గాంచిన, వేమనవిషయమున మనవారుచూపు నిరాదరణమునకుఁ దలవంచుకొనక తప్పదు. ఇంతెందులకు? బ్రదికియున్నప్పుడు 'భారతియారు' సుప్పుపత్తిరికిఁగూడఁ బాటింపనితమిళులు నేఁడాతనికిఁ జూపుగౌరవమును, సలుపు స్మారకచిహ్నస్థాపనములును గన్నచో-నట్టిదేశభక్త్యుద్దీపకగీతముల నాలపించిన శ్రీరాయప్రోలువారివంటి దేశాభిమానులవిషయమున మన మెట్లు ప్రవర్తింపవలయునో యించుక తెలియఁగలదు. అలనాఁడు (పంజాబుదురంతములప్పుడు) స్వాతంత్ర్యసమరమున కాంధ్రులలోఁ జాలమందిని ముందడుగువేయించినది శ్రీదామరాజు పుండరీకాక్షుఁడుగారు మున్నగువారి కృతులు గావా?—వానిని మనము విస్మరించితిమి. అఱవలు 'భారతి'కి శాశ్వతకీర్తి సలిపిరి. ఆంధ్ర

జాతికి "తనయూరితపసితనమును తనకొమరుని విద్యపెంపు తనసతిరూపున్" గిట్టనివిషయములు. వాఙ్మయరంగముననే కాక, రాజకీయాదివివిధరంగములందును మనవారిని నాఁటికి— నేఁటికిని మనము గౌరవింపఁజాలకున్నాము. ఇది జాతిపరంపరాచారము.

తక్కినవిషయము లెట్లున్నను, తెలుఁగువారికృతజ్ఞతకు నిరంతరము పాత్రులుగాఁ దగిన నీమువ్వురు ముమ్మూర్తులకుఁ దుల్యులు. రామరాజభూషణుఁడు "మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం, గుండలీంద్రుండు తన్మహనీయస్థితిమూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్... సొంపువాటించు నీబహుళాంధ్రోక్తిమయప్రపంచ మన్నది పండితపక్షముగ వాకొన్నవాక్యము; కాని సామాన్యప్రజానీతికి లోకము వీరినే (బద్దిభూపాలత్రయమునే) త్రిమూర్తులుగ భావింప ననుట అతిశయోక్తి కానేరదు. వీరికృతులలో నశ్లీలములు గల వనుకారణమునఁగాని, లక్షణవిరుద్ధప్రయోగము లున్నవనుహేతువునఁగాని పండితులు వాని నాదరింపకుండుటయు, విద్యాధికారులు వానికిఁ దగినస్థానము నొసంగకుండుటయు క్షమార్హములు గాఁజాలవు. మనకావ్యపురాణాదులలో నశ్లీలములు కాని వేవి? ఆ కారణముంబట్టి 'సహసానఖంప' చేత్యాదిపద్యములుగల 'మనుచరిత్ర'ను పంచకావ్యములలో మొదటిదిగాఁ బరిగణింపకున్నామా? అశ్లీలతనే ముఖ్యముగఁ బాటించుచోఁ దారాశశాంక, బిల్హణీయ, హంసవింశత్యాదులు వాఙ్మయమునుండి తుడిచిపెట్టికొనిపోవలసినవే కావా? ఇఁక లక్షణవిరుద్ధప్రయోగము లవిషయమా? లాక్షణికులదృష్టికి ఏకావ్యమునైనను, లక్షణవిరుద్ధప్రయోగము లగపడకపోవు. భాగవతమువంటిగ్రంథ మప్పకవిగారిదృష్టిలో లక్షణవిరుద్ధము గాలేదా? ఇఁక 'సుమతిశతకము' మున్నగువానింగూర్చి నుడువవలెనా? కవిజీవితకర్తలు, నిఘంటునిర్మాతలుగూడ నీమువ్వురింగూర్చి యించుకేని దడవకుండుటంబట్టి వారికి వీరిగ్రంథముల విషయమునఁగల యలసభావ మెట్టిదో తెలియఁగలదు. ఇఁక నీమువ్వురికృతులంగూర్చి యించుక పరిశీలింతము.

(1) 'బద్దిభూపాలుం' గూర్చి యెఱుంగనివారు పండితులందే కొందఱు గలరు; కాని 'సుమతిశతకముం' గూర్చి యెఱుంగనిపామరులే యరుదు. పూర్వ మీశతకపద్యము లన్నియు వీధిబడులలో విధిగా నేర్పఁబడెడివి. ప్రాథమికవిద్యార్థుల కాకాలమున 'సుమతిశతక' 'బాలరామాయణము'లు కంఠస్థములై యుండెడివి. పదిపండ్రెండేండ్లక్రిందటివఱకును ప్రతివాచకపుస్తకమునను సుమతిశతకపద్యము లగపడెడివి. నేటిపాఠ్యగ్రంథములలో బొబ్బిలికతలకు, తక్కినజంగముకతలకు గలస్థానముగూడ సుమతిశతకపద్యములకు లేకుండుట శోచనీయము. మఱి యాకతలు తెలుపుపరమార్థముకంటె సుమతిశతకపద్యములలోని నీతులు దీసిపోయినవా? సులభగ్రాహ్యములు కావా? చూడుఁడు:—

"మాటకుఁ బ్రాణము సత్యము, కోటకుఁ బ్రాణంబు సుభటకోటి, ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము, చీటికిఁ బ్రాణంబు వ్రాలు."—

వ్యాఖ్యాపూర్వకముగ నొజ్జ లుపదేశించుచో, బాలుఁడీపద్యమున నెతేని నీతి గ్రహించి, మననమున నుంచికొని, యేతన్మార్గమున జీవితము నడుపుకొనఁగలఁడు. విద్యార్థి భావిగృహస్థజీవితమున కీక్రిందిపద్య మెంత యుపకరించునో కనుఁడు:—

'నమ్మకు సుంకరి జూదరి, నమ్మకు మగసాలివాని నటు వెలయాలిన్
నమ్మకు మంగడివానిని, నమ్మకు మీ వామహస్తు'—

అన్వయించుకొన నత్యంతసులభములగు నిట్టి యనేకపద్యరత్నములకు 'సుమతిశతక' మొకగని. నేఁ డాగ్రంథము మనబాలవిద్యార్థిబృందమునకు దూరమగుట దురదృష్టముగాక మఱేమి?

(2) కవిచౌడప్పగారి నీతిబోధన మొకవిచిత్రమార్గమున నడచినది. అతఁడు బూతులనుగూడ మేళవించికాని నీతులను తెలుపఁడు. అతఁడే 'నీతులు బూతులు లోకఖ్యాతులురా' అని యుద్ఘాటించినాఁడు. అతనిపద్యములు చక్కెరపూఁతగలచేదుగుళికలు; బంగరుమలాముగల వాడికత్తులు. నీత్యవినీతులు రెంటిని జూపి, నీతిప్రాశస్త్యమును వక్కాణించును. ఉదాహరణములు విరివిగ నొసఁగును.

'లంజయును బీరకాయయు, మంజయు బాల్యమునఁ జాలమోహము గొలుపున్
రంజన సెడి ముదిరినవెనుకం జూడరు'—

ఇందు వ్యభిచారిణులకు నీతిబోధ ఎంతసులభగ్రాహ్యము!—గుల్లలో మేజువాణీలు వలదన్న మొదటియాంధ్రసంస్కర్త చౌడప్పయే.

"లంజలు రాకుండిన గుడి, రంజిల్లదు ప్రజలమనసు రాజిల్లదు గా
లంజల నేల సృజించెను, కంజజుఁ డిల"—

ఇతని ప్రపంచానుభవ మెంతటిదో, చలిబాధతొలఁగించుకొన, సామాన్యసంసారి కితఁడు చూపిన యీక్రిందియుపాయములచేఁ దెలిసికొననగును.

'గుడిసెయు మంచము గుంపటి, విడియమును బొగాకుఁ దన్ను విడనొల్లని మే
ల్పడతియుఁ గలిగినఁ జలి యెక్కడి దప్పా?'

ఇట్టి వెన్నేనిఁ జూపవచ్చును.

(3) తెలుఁగుదేశమునఁ బేరెన్నికఁగన్నమహాపురుషులలో వేమన యొకవిశిష్టస్థానమాక్రమింపఁదగిన వాఁడయ్యు, దురదృష్టవశమునఁ బండితలోకమునకు మిగులదూరగుఁడయ్యెను. కాని, యాతఁడు పామరుల నాశ్రయించికొని యింకను బ్రదికియున్నాఁడు. భాషాప్రపంచమునఁ గలుగునూత్నపరివర్తనములచేఁ బండితులకైనఁ గొన్నిశతాబ్దముల కూరుఁబేరు లేకుండఁబోవచ్చును. కాని, వేమనకుఁ బోవదు. పోఁజాలదు; అతఁడు మహాయోగి, త్యాగి, విరాగి, అవధూత, నవ్యాంధ్రజాతియ జీవనవిధాత. సంఘసంస్కరణవిషయమున నతనిపలుకులు వాడిచుఱకలు. తెలుఁగువారి నొకయుత్తమమార్గమున నడపుటకుఁ దీర్చి దిద్దఁగలిగిన చక్కట్లపసిఁడితునకలు. హైందవసంఘమున నతఁడు గౌరవింపని సదా

చారము లేదు. నిరసింపనిదురాచార మగపడదు. నిర్దాక్షిణ్యముగ నిష్పక్షపాతముగ నిర్నిగూఢముగఁ గుండబ్రద్దలుగొట్టినట్లు తనయభిప్రాయముల గీతములలో నిముడ్చుటయం దతఁ డందెవేసినచేయి. పండితుఁడు గాకపోవచ్చును; కాని పండితుల కాతని లోకానుభవము సర్వంకషప్రజ్ఞ! ప్రజాప్రబోధకశక్తి శూన్యము లనుట అతిశయోక్తిగాదు. కవిగాకపోవచ్చును; కవులకెల్లర కాతనియాఁటవెలఁదిచిందు లొజ్జబంతు లనుట దబ్బఱ కాదు. పలుకుల వెలఁది, యాఁటవెలఁదియై వేమన నాశ్రయించినది. ఆమె కతఁడే భరతాచార్యుఁడు. ఆమెను లోకోక్తులతో, దృష్టాంతరములతో, నుపమలతో, అర్థాంతరన్యాసములతో నాతఁడు గైసేసినవిధమున కొఁకటిరెం డుదాహరణములు:—

"పంది బురద మెచ్చుఁ బన్నీరు మెచ్చునా?"
"చెప్పుతినెడుకుక్క చెఱకు తీఁ పెఱుఁగునా ?"
"కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా ?"
"రాళ్లు దేవుళ్లైన రాసులు మ్రింగవా ?"
"పుట్టలోనఁ జెదలు పుట్టవా ? గిట్టవా ?"

ఇట్టివి వేనవేలు. ఆతనిలోకానుభవమున కీక్రిందిపద్య మొకటి.

"చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు ఇంతింతగాదయా"

ఇట్లు చూపుటకుఁ బూనుకొన్నచో, వేమనపద్యరత్నములన్నియు నుటంకించవలసి వచ్చును. ఆయమరజీవి యాంధ్రలోకమునకు ముఖ్యముగ సామాన్యప్రజకుఁ జేసినయుపకారము మఱువరానిది. వాఙ్మయ మెన్నిమార్పులైన నందవచ్చును. కావ్యనాటకాదికము లేవియైన నశింపవచ్చును. కాని వేమనపద్యము లాంధ్రభూమి నాకల్పాంతస్థాయులై నెగడఁగలవు.

ఇప్పటికైనఁ దెనుఁగువా రీమూర్తిత్రయము రచించినకృతులకు సారస్వతమున నీదగు స్థానము నిచ్చుటయే వారియెడల చూపఁదగుకృతజ్ఞతాపూర్వకమహాత్కార్యము.

ఈముువ్వురింగూర్చి చరిత్రకారు లిఁకనేని విపులవిమర్శా సహితములగు జీవితముల వ్రాయఁబూనుకొనిరేని ఆంధ్రప్రపంచమున కెంతయు శ్రేయముం గూర్చినవా రగుదురు.

---

# అనంతము

శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రి, బి. ఏ., యల్. టి.

శ్రీమద్భగవద్గీతలోని విశ్వరూపసందర్శనయోగమున కనంతయోగ మని నామాంతరము కలదు. కారణ మీక్రిందిశ్లోకము కావచ్చును.

రూపం పరం దర్శిత మాత్మయోగాత్ తేజోమయం విశ్వ మనన్త మాద్యం (గీ. 11—47)

అట్లైనయెడల పరరూపాత్మరూప తేజోరూపాద్యరూపాదిదర్శనము లని నామకరణము లెన్నియేనియుం జేయవచ్చును. లేక యనంతశబ్ద మీయధ్యాయమున నసకృదుపయుక్తమగుటవలన నటు లుండవచ్చును. (చూడుడు. శ్లో. 11, 16, 37, 38, 40, 47). ఎట్లైననేమి గీతాధ్యాయముల కన్నిటి కిట్టినామాంతరములు గ్రంథాంతరములందు లేకపోలేదు. ఈవ్యాసమునం దనంతత్వమునుగుఱించి యించుక విచారించుటయే ముఖ్యోద్దేశము.

అనంత మనఁగా నంతములేనిదికదా! లక్షణచేత నాదిమధ్యశూన్యమని యీక్రింది యుదాహరణములవలన నేర్పడుచున్నది.

నాంతం నమధ్యం నపున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప (భ. గీ. 11—16) అనాది మధ్యాన్తం (భ. గీ. 11—19)

ఏకదశశతసహస్రాద్యంకగణనమునం దీయనంతశబ్దమున కేమిస్థాన మని యోజింపఁదగు. (1) శబ్దరత్నాకరమునందుఁ జెప్పఁబడిన 26 అంకములవరకుఁ గలనామములలో గడపటిది మహాభూరి. ఇది యాంగ్లవిధానమున $(10)^{35}$ అగును. అనంతము $(10)^{29}$ గా వివరింపఁబడినది. అనఁగా దశకోటికోటికోటికోటులకు సమాన మగును. ఇందుఁ జెప్పఁబడిన పరార్థము, సాగరము, అవ్యయము, అచింత్యము, అమేయము మొదలగునవి సంఖ్యావాచకములైన నట్లు వాడుకలో లేకున్నవి.

(2) లీలావతీగణితమున శ్లోకము—

ఏకదశశతసహస్రాయుతనియుతప్రయుత కోటయః క్రమశః, అర్బుదబృందే ఖర్వనిఖర్వమహాపద్మశంకవస్తాపత్, జలధిశ్చాంత్యం మధ్యం పరార్ధ్యమితి దశగుణోత్తరం సంఖ్యాః, సంస్థాయా స్థానానాం వ్యవహారార్థం కృతాః పూర్వైః

నియుత = లక్ష, బృంద = అబ్జం, పరార్ధ్యం = పరార్ధ మని జ్యోతిశ్శాస్త్రగణనయం దొకింత పాఠభేదము.

బ్రహ్మాండపురమునందును కించిత్తుభేదముతో నీయష్టాదశాంకగణనమే యనుసరింపఁబడుచున్నది.

ఈపద్ధతియందలి ముఖ్యాంశము లేవనఁగా:—పరార్ధ్యము(పరార్ధము) = $(10)^{17}$ అంత్యము = $(10)^{15}$ కోటి = $(10)^7$

దీనితో నాంగ్లగణనమును పోల్చిచూచినయెడల

$10^3$ = సహస్రము (thousand) $10^6$ (1,000, 000) = ప్రయుతము, పదిలక్షలు (million) $10^9$ (1, 000, 000, 000) = అబ్జము, న్యర్బుదము, శతకోటి (billion) ఇత్యాదులు అగును.

(3) శ్రీమద్రామాయణమున కిష్కింధాకాండవ్యాఖ్యలో సంఖ్యాక్రమము జ్యోతి శ్శాస్త్రముచే ననుసరించినను యుద్ధకాండ 23 వ సర్గలో

శతం శతసహస్రాణాం కోటిమాహుర్మనీషిణః శతకోటిసహస్రాణాం శంఖ ఇత్యభిధీయతే
శతంసముద్రసాహస్రం ఓఘమిత్యభిధీయతే శత మోఘసహస్రాణాం మహౌఘ ఇతి విశ్రుతః.

ఈప్రకారమున కోటిః = $10^7$; శంఖః = $10^{12}$, బృందః = $10^{22}$, పద్మః = $10^{32}$, ఖర్వః = $10^{42}$, ఓఘః = $10^{52}$, మహౌఘః = $10^{62}$, ఇంతటితో నిలుపక శ్రీవాల్మీకిమహాముని

ఏవం కోటిసహస్రేణ శంఖానాంచ శతేనచ మహాశంఖసహస్రేణ తథాబృందశతేనచ
మహాబృందసహస్రేణ తథాపద్మశతేనచ మహాపద్మసహస్రేణ తథాఖర్వశతేనచ
మహాఖర్వసహస్రేణ తథాచౌఘశతేనచ ఏవంకోటిమహౌఘేన సముద్రసదృశేనచ.

అని వానినై నిక్యసంఖ్య నిర్ణించుటలో గణితశాస్త్రజ్ఞులవిజ్ఞానమును పరిశీలించు చున్నారు.

మఱియు శ్రీమద్రామాయణవ్యాఖ్యయందలి (రామకర్ణామృతమునందలి) యీ శ్లోకము గణితజ్ఞులశక్తిని మించుచున్నది.

నాగానామయుతం తురంగనియుతం సార్ధంరథానాంశతం, పాదాతం శతకోటికర్తనవిధా వేకః కబంధో రణే. ఏవం కోటికబంధకర్తనవిధా కించిద్ధ్వనిః కింకిణీ, ర్వ్యామార్థం పరమాత్మనో రఘుపతేః కోదండమంటారవః.

ఇవిరామాయణనైన్యగణన మూహించుట కుదాహరణము:— ఇట్టి సంఖ్యాక్రమముం జూచియే రామాయణోక్తసృష్టిప్రకారము—భూప్రమాణ మెంత యని కొందరు తర్కింతురుగాత!

(4) హిందువులు ప్రతిదినము సంకల్పించు "ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవ స్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే........." పరార్ధకల్పమన్వంతరయుగపాద సంఖ్యాగణనము పెక్కులు గుర్తించుటలేదు; గుర్తించినవారిలో పెక్కులు విశ్వసించుట లేదు.

సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః రాత్రిం యుగసహస్రాంతాం (భ. గీ. 8—17)

ఈప్రకారము బ్రహ్మకాయువు శతమాన మని గణించి దానికి పర మని నామధేయము కల్పించిరి. అందర్ధము (బ్రహ్మమానమున 50 సంవత్సరములు పరార్ధమని లెక్కింపఁగా సృష్ట్యాదిద్వితీయపరార్ధమగు నిప్పటి పద్మజబ్రహ్మయొక్క వయస్సు 51 వ సంవత్సరమందు ప్రథమమాస ప్రథమతిథియగు శ్వేతవరాహకల్పమున (కల్పమనఁగా బ్రహ్మదినము) 13 ఘటికలు 42 విఘటికలాదిగ గణింపఁగా మనుష్యాబ్దములగు 3110400,00,00,000 (ముప్పది యొకలక్షలపదివేలనన్నూరుకోట్లు) లో నిప్పటికి 195,58,85,048 సంవత్సరములు గడచినవని

ప్రతిసంవత్సరమును ప్రతిపంచాంగమును ప్రకటించుచున్న దానినిజూచి నవ్వువారలేకాని పరిగణించువా రరుదు. 1948 A.D. అనుటయే ప్రమాణవాక్యము!!

71 మహాయుగములు = 1 మన్వంతరము
14 మన్వంతరములు = 1 బ్రహ్మదినము (కల్పము)
14×71 = 994 మ. యు +6 మ. యు (యుగసంధులు)
= 1000 మ. యు = బ్రహ్మపగలు } కల్పము
1000 మ. యు = బ్రహ్మరాత్రి }

ఈక్రమమును ప్రతిదినము సంకల్పించుట వేదవిధిగా నేటికిని బ్రహ్మకును మనుష్యునకును గల కాలసంబంధమును స్మరింపఁజేయుచున్నది.

చతుర్యుగసహస్రాణి బ్రహ్మణోదినముచ్యతే పితామహసహస్రాణి విష్ణోరేకాఘటీమతా
విష్ణోర్ద్వాదశలక్షాణి నిమేషార్థంమహేశితుః ఏకకోట్యామహేశానాం శ్రీమాతుస్త్రుటిరూపికా.

అని శక్తిరహస్యమున లోకప్రసిద్ధులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులయొక్కయు వారికి మాతృభూతయైనపరాశక్తియొక్కయు కాలగణనాతారతమ్యములు రామానుజగణితమును మించుచున్నవి.

(6) ఇక శ్రుతిప్రమాణ మెత్తి[illegible]న యజుర్వేదసంఖ్యాపాఠక్రమమున (7-2 20) పరార్ధానంతరము

పరార్ధాయస్వాహా, ఉషసేస్వాహా, వ్యుష్ట్యైస్వాహా, ఉదేష్యతేస్వాహా, ఉద్యతేస్వాహా, ఉదితాయస్వాహా, సువర్గాయస్వాహా, లోకాయస్వాహా.

మఱికొన్ని గణనాంకములఁ జేర్కొనుటయే కాక, బ్రహ్మమానమునఁ బరమును, శక్తిమానమున శ్రీమాతయు ననంతాఖ్యనొందునట్లు వైదికదృష్టియందు లోకశబ్దము పరాకాష్ఠఁజెందినట్లు వర్ణింపఁబడియున్నది. భూమియందలిరేణువులును సముద్రమందలి జలబిందువులును నాకాశమందలినక్షత్రములును నసంఖ్యాకములగుట కాభూతములు ననంతాఖ్యనొందినట్లు "ఆత్మ" అనంత మని శ్రుతియే యుద్ఘోషించుచున్నది.

అథ బ్రహ్మవదంతి, పరిమితా వా ఋచః, పరిమితానిసామాని, పరిమితాని యజూంషి, అథ ఏతస్యైవాంతో నాస్తి యద్బ్రహ్మ, తత్ప్రతిగృణత ఆచక్షీత స ప్రతిగరః (కృష్ణయజు 7-3-1)

బ్రహ్మానందము (ఆత్మానందము) పరిమితి లేనిదనుటకు తైత్తిరీయోపనిషత్తునందలి మనుష్యానందాదిగణితము!! అట్టి బ్రహ్మజ్ఞానస్వరూపమును పరిగణించుశ్లోకము.

తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్యవిజానతః (గీతా 2-46)

ఇప్పటికాలమునందు దీని నధిక్షేపించువా రనేకు లుందురు. గణితమున కీపురాతన హైందవసంఖ్యాక్రమము లనుపయోగములనియు నవిశ్వసనీయము లనియు కేవలపౌరాణికము లనియు గనుక శాస్త్రసమ్మతములును సుజ్ఞేయములునుఁ గావనియు నందురు. ఇందు సుజ్ఞేయతనుగుఱించి యించుక విచారించినయెడల మిగత నింద లన్నియు నదృశ్యమగును. ముఖ్యకారణము కించిజ్జ్ఞతాజ్ఞతలకంటె నశ్రద్ధయే ప్రధానము. ఉదాహరణము. ఆంగ్లవిద్యా

ప్రాధాన్యతవలన Infinity అనుపదము జ్ఞేయమైనట్లు రేఖయందుబిందువులును చదరము నందు రేఖలును, వృత్తమునందు వ్యాసార్ధము లనంతములు

అనిన నర్థమగుటకు హైందవక్షేత్రగణిత మలవడుచున్నదా? మఱియు

$\infty$ + Any finite number = $\infty$

$\infty$ – Any finite number = $\infty$

అనుసిద్ధాంతమునకు సమ్మతింతురుగాని

పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే

అను శ్రుతిసూత్రము సుజ్ఞేయమా? నక్షత్ర జ్ఞానమున కిరణ మొకత్రుటిలో 186000 మైళ్ళవంతున నొకసంవత్సరములో ప్రయాణమగుదూరమునకు భవత్సరము (Star year) అను ప్రకృతిశాస్త్రజ్ఞునిమాట తెలిసినట్లు తెలుసుకొందురుగాని యెంతదూరమని యోజింతురా

18,000×60×60×24×36[illegible]×4 = 24,[illegible]13,616,000,000 మైళ్ళనియైన చదువగలరా? అదే విధమున

కల్పము బ్రహ్మదినము = 12000×1000×3[illegible]0×[illegible]

= 8,640,000,000 సంవత్సరములనిన "non-sense"అందురు.

మఱియు సృష్ట్యాదిపంచాంగమునందు 19[illegible],58,35,0[illegible] సంవత్సరము లని వ్రాయబడినం జూచినవ్వుదురు. దానినే Sir James Jones అనుశాస్త్రజ్ఞుడు తనయుద్గ్రంథమగు "Through Space and Time" లో Age of Earth is about 2000 million years అని వ్రాసినం జదివి నమ్ముదురు. అప్పుడు మనశాస్త్రమునకు ప్రామాణ్యత యేర్పడుచున్నది. !!!

అనంతుని శిరస్సుననున్న యనంతయగు క్షితియొక్క పరిమాణమునకు:—

యస్యేదం క్షితిమండలం భగవతోఽనంతమూర్తేః సహస్రశిరస ఏకస్మిన్నేవశీర్షణి ధ్రియమాణం సిద్ధార్థ ఇవలక్ష్యతే. (శ్రీభాగ. 5–25–2)

మన జ్యోతిస్సిద్ధాన్తములో నణుమాత్రమనియు ననంతునిలో "అణోరణు" వనియు చెప్పుట యత్యుక్తి యగునా? తద్వ్యాపదేశార్థ ముపదేశింపబడినగీతలోని యనంతరూప సంకీర్తనయోగమును సర్జునాపరాధ స్తవము స్మరించెద.

అనన్త దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్. (గీ. 11–37)

# జ్యోతిషము

ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యభూషణ, జ్యోతిషస్థాపక, విద్వాన్
శ్రీ తోగర్చేటి భాస్కరశాస్త్రి, ఆదవాని

"జ్యోతీంషి నక్షత్రాణి అధికృత్య కృతం శాస్త్రం జ్యౌతిషమ్" అను నిర్వచనముంబట్టి ఖగోళమునఁగల గ్రహనక్షత్రగోళములనుగూర్చిన అత్యద్భుతవిషయములఁ దెల్పునది యని యర్థము. ఇది మనకంటికిఁగాని; మన మనశ్శక్తి బుద్ధిశక్తులకుఁగాని, గోచరము గాని యొక యపూర్వమైన (సైన్సు) శాస్త్రము. దీనిం గనిపెట్టుటకై మనపూర్వులు (పండితులు - మహారాజులును,) అనేకనక్షత్రశాలల నిర్మించి నళికాయంత్ర సాధనములచేత గ్రహముల దృక్ప్రత్యక్షముగ నొనర్చి ఖగోళరహస్యములఁ దెలిసికొనుచుండిరి.

## జ్యౌతిష చరిత్రము

శ్రీమదఖండ బ్రహ్మాండ నిర్మాణ చాతురీధురీణుం డగు పరబ్రహ్మమూర్తియగు వాసుదేవుండు ప్రకృత్యంతర్గతుండై దేహధారిగ విలసిల్లు నట్టిభగవంతుఁడు ప్రథమమున నుదకములను సృజించి యందు తనవీర్యము నునిచె. అది స్వర్ణమయమైన యండముగ నేర్పడెను. ఆబ్రహ్మాండమధ్యమందు సవితృ ఆదిత్య సూర్యాది పరమపవిత్రనామంబులచేఁ బ్రసిద్ధినొంది జ్యోతిస్స్వరూపుఁడై అజ్ఞానాంధకారమునుఁ దొలఁగించి దేదీప్యమానసహస్రకిరణుండై దేవదేవుఁడు భాసిల్లుచుండుట సర్వలోకవిదితమై యున్నది. అట్టి యాదిదేవుఁడు ఆశ్రిత జనంబులకు సకలవరంబుల నిచ్చువాఁడని విని దానవాగ్రణియైన మయాసురుండు ఈమహాయుగంబున కృతయుగాంతంబునందు జ్యౌతిషసిద్ధాంతజ్ఞానము కొఱకై 800 సంవత్సరములు తపం బొనర్చిన నాతపంబునకు సంతుష్టుండై సూర్యభగవానుఁడు విదితగ్రహనక్షత్రాది చరిత్రమగు నాద్యశాస్త్రము జ్యౌతిషము నుపదేశించి యంతర్ధానమాయె ననియెడుపవిత్ర చరిత్రము సౌర, బ్రహ్మ, లోమశాదిసిద్ధాంతములయం దుపన్యసింపఁబడినది. ఆమయాసురుని మూలమున నీజ్యౌతిషసిద్ధాంతము బయలు వెడలినవి.

## జ్యౌతిష ప్రశంస

ఈజ్యౌతిషము వేదాంగములలో నొకటియగుటచేఁ బరమపవిత్రమైనది. సకల శ్రౌత స్మార్త కర్మోపయుక్తమగుటచే బహుజనోపయోగకరమైనది. ప్రత్యక్షసిద్ధమగుటచే విశ్వాసార్హమైనదియునై యున్నది. "వేదస్య చక్షుః కిలశాస్త్రమేతత్" అని యున్నట్లు వేదమునకు నేత్రము వంటి దని భావము. కావున పరమపూజ్యమైనది. "అప్రత్యక్షాణి శాస్త్రాణి వివాదస్తేషు కేవలమ్, ప్రత్యక్షం జ్యౌతిషం శాస్త్రం చంద్రార్కౌ యత్ర సాక్షిణౌ." అని యున్నట్లు ప్రత్యక్షసిద్ధమగుటచే సర్వోత్తమమైనశాస్త్రముగ పరిగణింపఁబడుచున్నది. చంద్రశృంగోన్నతులు, గ్రహయుతులు, సూర్యచంద్రగ్రహణములును, మున్నగున వన్నియును ప్రత్యక్షగోచరము లని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. కావుననే ఇతరశాస్త్రములకన్న నెక్కుడు ప్రతిపత్తి ఈశాస్త్రమునం దున్నదని ఈక్రిందిప్రమాణము చెప్పుచున్నది.

శ్లో. అన్యాని శాస్త్రాణి వినోదమాత్రం నకించిదేషాంతు విశిష్టమస్తి
చికిత్సిత జ్యోతిషమంత్ర వాదాః పదే పదే ప్రత్యయమావహంతి.
జ్యోతిర్జ్ఞానంచ యోవేద స యాతి పరమాం గతిమ్.

అను ప్రమాణములచే నీశాస్త్రాధ్యయనము మోక్షప్రాప్తికిఁగూడఁ గారణ మని ఘంటాఘోషముగఁ జెప్పుచున్నది. మఱియు సూర్యసిద్ధాంతమునందుఁగూడ

"విజ్ఞాయార్కాదిలోకేషు స్థానం ప్రాప్నోతి శాశ్వతం." "నహాంవత్సరపాఠీచ నరకే పరిపచ్యతే."

అనియు

"బ్రహ్మలోకప్రతిష్ఠాంచ లభతే దైవచింతకః"

"ఏతద్బుధ్వా సమ్యగాప్నోతి నూనం ధర్మం చార్థం మోక్షమగ్ర్యం యశశ్చ."

అనియు చెప్పఁబడియుండుటచే నీజ్యోతిశ్శాస్త్రజ్ఞానము బ్రహ్మలోకప్రాప్తికిఁగూడఁ గారణమని చెప్పఁబడినది. కావున జ్యోతిష్కునకు దైవజ్ఞుఁ డను పేరు సార్థకమైనది—

## పంచాంగములు

ఇట్టి జ్యోతిశ్శాస్త్రము సాధారముగఁ గైకొనియే ఆయాదేశములందు సిద్ధాంతులు పంచాంగముల గుణించుచున్నారు. దృగ్గణితము—సిద్ధాంతము - వాక్యము - ఆర్యభటము- అను నీనాల్గువిధముల ననుసరించి పంచాంగముల గుణించుచున్నారు. ఏలన:

"యాత్రా వివాహోత్సవజాతకాదౌ ఖేటైస్స్ఫుటైరేవ ఫలస్ఫుటత్వం
స్యాత్ప్రోచ్యతే తేన నభశ్చరాణాం స్ఫుటక్రియా దృగ్గణితైకకృద్యా."

అను భాస్కరాచార్యుని వాక్యమునుబట్టి యాత్రావివాహోత్సవ జాతకాదులకు దృగ్గణితసిద్ధగ్రహము లావశ్యకము లని తోఁచుచున్నది.

"ఇమేయాంతి దృక్తుల్యతాం సిద్ధైస్తైరిహ సర్వధర్మ నయ సత్కార్యాదికం త్వాదిశేత్."

అను గణేశదైవజ్ఞునివాక్యమునుబట్టి సిద్ధాంత గణితాగతగ్రహములే దృక్తుల్యత్వముఁ నొందఁగల వని చెప్పుచున్నది.

"దశమ్యాదిత్రయాణాంచ ఆర్యేణైవ వినిర్ణయః"

అనువాక్యముబట్టి ఆర్యభటము కావలసివచ్చినది. దాక్షిణాత్యులందరు వాక్య పంచాంగముల పరమప్రమాణముగ నెంచుచున్నారు. కాబట్టి ఇట్టినాల్గువిధములైన పంచాంగములు కావలసివచ్చినవి. "న గ్రాహ్యాః కర్మ సంస్కృతౌ" అను వచనమునుబట్టి దృగ్గణితసిద్ధ సూర్యచంద్రగ్రహములు గ్రాహ్యములు కా వని నిషేధవాక్యము గనుపించు చున్నది.

## దృగ్గణితవాదము

కేవల సూర్యసిద్ధాంతము అసంస్కృతిమగుటచే సరి కాదనియు దృగ్గణితమే గ్రాహ్య మనియుఁ గొందఱిమతము. కాబట్టియే మనపూర్వులయాచారమునుబట్టి చూచినను శిష్టాచార సంప్రదాయమునుబట్టి చూచినను దృగ్గణితమనునది ఆచారవ్యవహారములలో నుండి యుండ లేదు. దీనినిగూర్చి వాదోపవాదములు జరుగుచున్నవి.

## షష్టిపూర్తి సంపుటము

సిద్ధాంతరీతిగ తిథ్యాదులును దృగ్గణితరీతిగ కుజాదిగ్రహములును గ్రహణాదులును సందిగ్ధకాలములందు వాక్యఆర్యభటరీతిగ తిథినక్షత్రములును, గుణించవలసిన పరిస్థితి యేర్పడినది.

మరియొకయంశము:— గ్రహములకు బీజసంస్కారము శాస్త్రసిద్ధమైనను ఆచారమున దానిని సిద్ధాంతులు త్యజించుచున్నారు.

"గ్రహణే గ్రహయోగే చ కాలభాష్ణగ్నసాధనే। శృంగోన్నత్యుదయాస్తేషు గ్రహబీజం విధీయతే." అన్నట్లు బీజసంస్కారమునకు స్థలనిర్ణయమునుగూడ శాస్త్రకారుడు వచించియున్నాడు. బీజపదము అయనాంశవాచక మని కొందఱు, దృక్సంస్కారవాచక మని కొందఱు నుడువుచున్నారు.

ఇక దృక్సిద్ధము త్యాజ్యమనుటకుగూడ నీక్రింది ప్రమాణ మరయునది.

శ్లో. దృక్సిద్ధఖేటగ్రహసాధితాసు కుర్వంతి కేచిత్తిథిషు ప్రమాదాత్
శ్రాద్ధాదికం తత్పితృశాపతస్తే పుణ్యక్షయం దుర్గతి మాప్నువంతి." అని.

మరియు దశఘటీక్షయ, నవఘటీవృద్ధులు ధర్మశాస్త్రవిరుద్ధమని మరికొందఱిమతము. దృక్సిద్ధ మంగీకరించినచో శ్రాద్ధము తలక్రిందులగునని కర్మవాదులమతము.

వీనినన్నింటిని పరిశోధించి ఏకవాక్యతఁ గల్పించి, ఆంధ్రదేశకేంద్రపంచాంగ ప్రకటనమునకు మార్గదర్శకమగు నొకజ్యోతిర్విద్యాపండితమండలి సమావేశమై పరిశోధించవలసిన సమయము తటస్థించినది. అట్టి పర్వకాల మెప్పుడు తటస్థించునా యని సిద్ధాంతులు నిరీక్షించుచున్నారు.

శ్రీ పండిత వి. బి. కేతకర్, శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగార్లవంటి ఉత్తమ పండిత మహాశయులుగలిసి చర్చించినచో నిట్టివిషయములు నిర్ణీతము లగును.

### పంచాంగప్రకటనము - జీవనము

కొందఱుసిద్ధాంతులు పంచాంగప్రకటనమనునది యొకవ్యాపారమువలెఁ బెట్టుకొని జీవనాధారమును బొందుచున్నారు. పులినిఁ జూచి నక్క వాతపెట్టుకొన్నట్లు ఒకసిద్ధాంతినిఁ జూచి, యోగ్యతలేని యితరులుగూడ తమపేర ననుకరణపంచాంగములఁ బ్రకటింప మొదలిడుచున్నారు. మంచిముత్యము లేవో! మాయముత్యము లేవో! కనుఁగొనుటకు సాధ్యముగాకున్నది. అల్పులు పెద్దలపంచాంగముల దూషింప నారంభించిరి. చేతావని గ్రంథకర్త వ్రాసినది సరి యని భ్రమపడి కొందరు తమపంచాంగములలో (వృభాను - ఆషాఢమున) సూర్యగ్రహణ మని వ్రాసి తమయపరిణతబుద్ధిని వెల్లడించుకొనిరి. దృశ్యాదృశ్యగ్రహణమని వ్రాయఁగూడ దని నుడించిరి. ఇట్టి పంచాంగములు లోకవంచకము లగుటకు సందేహముండదు.

"జ్యోతిర్విద్వన్మండలి" యనునొక సంస్థయున్నచో నట్టివారిచే ననుమతిపత్రముల నందినవాఁడే పంచాంగప్రకటన కార్యమున కర్హుఁ డని నిర్ణయించినయెడల దేశమున ననుకరణ పంచాంగములు తగ్గిపోవును.

## జ్యోతిషికుఁడు

జ్యోతిశ్శాస్త్రవేత్త యగువాఁడు గణితశాస్త్రమును చక్కఁగ నెఱిఁగినవాఁడుగ నుండవలెను. తగినంత సంస్కృతభాషాజ్ఞానముకలవాఁడై యుండవలయును. ధర్మశాస్త్రముల దేశాచారసంప్రదాయముల, శిష్టాచారముల నెఱింగినవాఁడై యుండవలయును. సదాచార సంపత్తిగల్గి కర్మిష్ఠుఁడై యుండవలయును. వాక్సిద్ధిగల్గి, వేదాంతవిచారాసక్తమనస్కుఁడై యుండవలయును. గణితములచే గ్రహగతుల నెఱింగి, భవిష్యత్ఫలముల, తు - చ - తప్ప కుండఁ జెప్పుసామర్థ్య మలవడియుండవలయును. తదేకధ్యానము గల్గి తనమనోబుద్ధిశక్తులచే భవిష్యత్ఫలములఁ జెప్పువాఁడు ఎట్టి ఆధ్యాత్మికశక్తి గలవాఁడై యుండవలెనో యోచింపుఁడు. కాబట్టియే జ్యోతిష్కునకు దైవచింతకుఁడని - దైవజ్ఞుఁడని - అన్యార్థకములైన పేర్లు గలిగియున్నవి. ప్రపంచభవిష్యత్తును ముందుగనే వ్రాసి ప్రకటించువాఁడు ఎట్టి నియమ బద్ధుఁడై యుండవలయునో యోచించునది. అట్టికర్మయోగియే జ్యోతిషికుఁ డనఁదగి యుండును.

## భారతదేశౌన్నత్యము

విదేశచరిత్రలఁ జదువునపుడు నాకొక ఆశ్చర్యకరమైన విషయము గనుపడినది. ఒక దేశమునందు సంపూర్ణసూర్యగ్రహణము సంభవించినదఁట. ఆదేశస్థులకప్పటికి గ్రహణ మనునది తెలియదఁట. ఉన్నట్లుండి పగలు 12 గంటలకు సూర్యబింబ మాదేశమున నదృశ్య మగునప్పటికి జనులందరు చీకాకుఁజెంది, దిగ్భ్రాంతినొంది, అడవులకు వెళ్లినవారు అడవుల లోనే, వ్యవసాయమునకు వెళ్లినవారు పంటపొలములలోనే, కర్మాగారములలో పనిచేయు వారు కర్మాగారములలోనే కూలఁబడి, యేమో! ప్రపంచప్రళయము వచ్చినదని దుఃఖించుచు, సూర్యబింబము అదృశ్యమగుటకుఁ గారణమును గనుఁగొనలేక తబ్బిబ్బులైరట్లును, క్రమ క్రమముగా కొంతసేపటికి సూర్యబింబము దృశ్యమగునప్పటికి ఆశ్చర్యానందములనొంది, ఊరూర సభలంజేసి, యేల యిట్లయ్యె నని చర్చించుకొని ఊహింపలేకపోయిరట్లును, ఒక భారతీయుఁడువచ్చి ఇది గ్రహణ మనియు జ్యోతిశ్శాస్త్రముచే ముందుగనే యిట్టి ఖగోళవైచిత్ర్యముల గనుఁగొన నగుననియు, వచించినపిమ్మట భారతదేశమునకు వచ్చి జ్యోతిర్విద్య నభ్యసించి తెలిసికొనిపోయినట్లు చదివితిని. మనది పుణ్యకర్మభూమి. అట్టిగ్రహణమే వచ్చు నెడల ఒకసంవత్సరము ముందుగనే పంచాంగములలో ప్రకటింతురుగదా! అట్టి పర్వకాల మున నాచరింపఁదగిన కర్మానుష్ఠానముల నేఱుఁగనైన భారతీయులు విడనాడుదురా?

ఎన్నిశతాబ్దముల క్రిందటనో ఇట్టిజ్యోతిర్విద్యను (సైన్సును) గనిపెట్టి యుండిన మనదేశముయొక్క ఔన్నత్యము నేమని పొగడవలెను? జ్యోతిషగ్రంథకర్తలలో ప్రాచీనుఁడై వెలసిన పండితశిరోమణి భాస్కరాచార్యులవారు తమ లీలావతీ సిద్ధాంతశిరోమణు లలో గణితశాస్త్ర మను మహాసముద్రమును మథించి వదలినారు. ఆనాటికే మనవారు అఖండగణితశాస్త్రవేత్తలై యుండిరి. భాస్కరాచార్యుల వారి కాలమునుగూర్చి వారిసిద్ధాంత శిరోమణిలోని ఈ క్రిందిశ్లోకమువలనఁ దెలియుచున్నది.

శ్లో. రసగుణపూర్ణమహీ (1036) సమ శకనృపసమయేఽభవన్మమోత్పత్తిః
రసగుణ (36) వర్షేణమయా సిద్ధాంతశిరోమణీ రచితః.

దీనింబట్టి ఈభాస్కరాచార్యుఁడు 800 సంవత్సరములక్రిందటివాఁడు. ఆనాటికే మనవారు గణితగ్రంథకర్తలై భాసిల్లిరి. గణితశాస్త్రజ్ఞానము ఆంగ్లవిద్యామూలముననే మనకు లభించిన దని అనుకొనుట వారిశాస్త్రజ్ఞానము లేమిని దెలుపును.

భూగోళ (జాగ్రఫీ) శాస్త్రజ్ఞానము

సక్రమమైన సంపూర్ణ భూగోళశాస్త్ర జ్ఞానము గలుగవలయునన్న నీజ్యోతిషపరిజ్ఞానము గలుగవలయునన్న నీజ్యోతిషపరిచయము సమగ్రముగ నుండినఁగాని గలుగనేరదని చెప్పవలయును. ప్రకృతము పాఠశాలలలో బోధించు భూగోళము అశాస్త్రీయము ననుభవవిరుద్ధమునై యున్న దని చెప్పుటకు చింతిలవలసినదిగ నున్నది. భూమి తిరుగుచున్న దనియు సూర్యుఁడు తిరుగుట లే దనియు నొకదృఢమైన నమ్మకము బాలురమనస్సులో నాటుకొనుచున్నది.

మరియు సూర్యుఁ డశ్విన్యాది నక్షత్రములందు సంచరించుచున్నాఁడని నళికాది యంత్రసాహాయ్యమునఁ గనుఁగొనుచున్నట్లు వ్రాయుచున్నారు. ఇది పరస్పరవిరుద్ధముగాదా? సూర్యాదిగ్రహములకు నిత్యగతిప్రమాణ మున్నది. అట్లు భూగోళమున కున్నదా? పైగా ధూమశకటదృష్టాంతమును జూపెదరు - అది దేశమాత్రము సరిపోదు - ధూమశకటము పరుగిడునప్పుడు ప్రక్కనున్న వృక్షాదులుగూడ పరుగిడుచున్నట్లు కనఁబడునేగాని పరుగిడుచున్నవనే నిశ్చయజ్ఞాన మేరికైన నుండునా? ఇది అసంగతము.

సముద్రములో పశ్చిమదిక్కునకు నౌకాప్రయాణము చేయుచున్నప్పుడు పర్వతాదులు తూర్పుదిక్కునకుఁ బరుగిడుచున్నట్లు తోఁచును. అది భ్రమజ్ఞానమే కాని నిశ్చయజ్ఞానము కాదుకదా! ఇట్లే భూమి తిరుగుచున్న దనుటగూడ వట్టిభ్రమయే!

రెండు రైళ్లు రెండు లైనులమీఁదనుండి వానిలో నొకటి వెళ్లుచున్నచో రెండు రైళ్లలోనుండువారికిని ఏది గదలుచున్నదో భ్రాంతిగలుగును - కొంతకాలమునకు అది భ్రమ యని తోఁచునుగదా!

శ్లో. "యది భ్రమతి క్ష్మా తథా స్వకులాయాన్ కథమాప్నుయుః ఖగాః." (అని లల్ల సిద్ధాంతము)

భూభ్రమణమే నిజమైనచో పక్షులకు తమగూళ్లు దొరకక పోవలసివచ్చును. విమానములు స్వస్థానములనొందక పోవలసివచ్చును - కాబట్టియే శ్రీపతీయ సిద్ధాంతములో:—

"తస్మాత్ భ్రమత్యుడుగణస్త్వచలాచలేవ" - అని వ్రాయఁబడినది. దీనింబట్టి భూమి తిరుగుచున్న దనుట వట్టిభ్రాంతి. భూమియే తిరుగుచున్నచో నాకాశమునుగూర్చి విడిచిన బాణము వేసినచోటఁ బడకపోవలసివచ్చును. గురికూడ తప్పిపోవలసివచ్చును.

భూభ్రమణమే నిజమైనచో నక్షత్రములయాకారములు మారిపోవలసి వచ్చును. అట్లు అనుభవములో లేదు. ఇంతకు నచేతనమైన, భూగోళము తిరుగుచున్న దని చెప్పుటకు ఏమిప్రమాణము?

భూమి తిరుగుచున్నదన్నచో, గ్రహకక్ష్యలకు వ్యత్యాసములు గలుగును—గణితోపపత్తులును గుదురవు - భూమి చలింపనట్లును, సూర్యుడు చలించునట్లును అనేక వేద పురాణ ప్రమాణవచనము లున్నవి.

1. భూమి చలింప దనుటకు :

"మరుచ్చలో భూరచలా స్వభావతః" (సిద్ధాంతశిరోమణి)

2. సూర్యుడు చలించు ననుటకు;

"సూర్య ఏకాకీ చరతి చంద్రమా జాయతేపునః."

"హిరణ్యయేన సవితారథేన దేవోయాతి భువనా నిపశ్యన్." (ఇత్యాది)

## ప్రపంచజ్ఞానము

ఈ బ్రహ్మాండప్రపంచ మెట్లున్నదో బాగుగఁ దెలిసికొనవలయు నన్న నీ జ్యోతిశ్శాస్త్ర మత్యంతావశ్యకమై యున్నది. ఈ బ్రహ్మాండమున 14 లోకము లున్నవి. ఎవన :

అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళము లనియెడు ఏడు అధోలోకము లున్నవి.

భూలోక, భువర్లోకము లనియెడు రెండు మధ్యలోకము లున్నవి—

సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకము లనియెడు నఱు దూర్ధ్వ లోకములును గలవు.

భరతవర్షాది నవవర్షములును, సప్తకులపర్వతములును, సప్తద్వీపములును, సప్తమహాసముద్రములును గలవు. ఇవన్నియు నెచ్చట నేరీతి నున్నవో పరిలేఖనయంత్రములఁ జూచినచో బోధపడఁగలవు. ఇవిగాక కైలాసవైకుంఠాది లోకముల నెఱుంగవలెను. శాస్త్రజ్ఞానము లేమిచే నివన్నియుఁ గల్పితములే యని కొందఱు తలంతురు. కాని యది మిక్కిలి తప్పు.

ఇఁక రాహుకేతువులఁగూర్చి యొకవాదము. భూచ్ఛాయా చంద్రచ్ఛాయలే రాహుకేతువు లని శాస్త్రవ్యవహారము. కావుననే వానికి ఛాయాగ్రహము లని పేరు. చంద్రుఁడు సూర్యున కడ్డుపడుటచే సూర్యగ్రహణము సంభవించు ననియు, భూచ్ఛాయ చంద్రునకు అడ్డుపడుచుండుటచే చంద్రగ్రహణము సంభవించు ననియు, ఈభూచ్ఛాయా చంద్రచ్ఛాయలే, రాహుకేతువులై సూర్యచంద్రుల మ్రింగుచుందు రనియు జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. గ్రహణపరిలేఖన యంత్రములఁ జూచినచో నిది బోధపడఁగలదు.

## జ్యోతిశ్శాస్త్రగ్రంథకర్తలు

బ్రహ్మ, లోమశ, సూర్య, సోమాది ప్రాచీనసిద్ధాంతము లిరువది ఆయా మహర్షులు వ్రాసినవి. తర్వాత శా॥ శ॥ 423 నుండి 1580 వరకు ఆర్యభటుఁడు, వరాహమిహిరుఁడు,

బ్రహ్మగుప్తుఁడు, భాస్కరాచార్యుఁడు, కమలాకరభట్టు మున్నగువారు. ఆర్యభటీయము, పంచసిద్ధాంతికము, బ్రహ్మస్ఫుటము, సిద్ధాంతశిరోమణి, తత్త్వవివేకము మున్నగు గ్రంథరాజములు వ్రాసి జ్యోతిర్విద్యారహస్యముల వెల్లడించిరి.

## కాలమాననిర్ణయము

లంకలో సూర్యోదయమయినపుడు యమకోటిలో మధ్యాహ్నమగును. సిద్ధపురిలో నస్తమయమగును. రోమకములో నర్ధరాత్రమగును. ఇట్లే ప్రతిపట్టణమునకు నుదయాస్తమయములు భేదించుచుండును. ఇందునకు ప్రమాణము.

శ్లో. లంకాపురేర్కస్య యదోదయస్స్యాత్ తదా దినార్ధం యమకోటిపుర్యాం
అధస్తదా సిద్ధపురేస్తకాలః స్యాద్రోమకే రాత్రిదళం తదైవ. (సిద్ధాంతశిరోమణి)

ప్రకృతకాలమానములో గ్రీనిచ్ టయిము ననియు, స్టాండర్డు టయిము ననియు, లోకలు టయిము ననియుఁ జెప్పఁబడువానిని గమనించుచుండవలెను. ఆయా దేశముల రాశిమానములు భేదించుచుండును. ఆయా దేశములకు సరియగు రేఖా, యోజన, అక్షాంశ - లంబాంశ, విషువత్కర్ణ, విషువచ్ఛాయాదులను గమనించి గుణించిన పంచాంగములే ఆయా దేశవాసులకుఁ దగినవిగా గ్రహింపవలెను.

## జ్యోతిశ్శాస్త్రప్రయోజనము

“ప్రయోజనమనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే” అన్నట్లు జ్యోతిశ్శాస్త్రప్రయోజనమును వివరించి చెప్పినఁగాని ఆశాస్త్రాధ్యయనమునందు నాసక్తి కలుగదు.

లోకములో మానవులకు ముఖ్యమైన జీవనాధారములు 1. వ్యవసాయము, 2. వ్యాపారము, 3. ఉద్యోగము. వ్యవసాయమునకు ఈజ్యోతిషము ఎంత ప్రయోజనకారి యగునో చూడుఁడు. ఆయాసంవత్సరముల సస్య, ధాన్య, మేఘ, రస, నీరస, అధిపతులనుబట్టి ఏయేమాసములో నేయేకార్తెలయం దెంతవర్షము కురియునో ఎట్టి సస్యములు ఫలించునో, ఎట్టిధాన్యము పండునో, రసనీరసవస్తువు లెంత పంట యగునో, పశునాయకుని మూలమున పశువు లారోగ్యక్షేమము లెట్లుండునో కనుఁగొననగును.

ఇఁక వ్యాపారవిషయమున అర్ఘాధిపగ్రహచారసంక్రమణాదులనుబట్టి తేజీమందీ యోగములఁ దెలిసికొని ఎట్టి పదార్థముల నెట్టికాలమున క్రయవిక్రయములఁ జేసిన లాభమో కనుఁగొని ధనార్జన మొనర్పనగు.

ఉద్యోగవిషయమునందో, మానవుఁడు జన్మించినవేళ ననుసరించి, జాతకరీతిగ నేవిధముగ జీవించునో ఎట్టి ఉద్యోగముచేయునో కనుఁగొనవచ్చును. వాని ఆరోగ్యము, ధనము, భాగ్యము, సంతానము, భార్య, ఆయుర్దాయము, జీవనము, కుటుంబము, సుఖదుఃఖములు మున్నగున వన్నియు తెలిసికొనవచ్చును.

ఎట్టి ముహూర్తమున నే కార్యమారంభించిన దిగ్విజయముగ జరుగునో ఈజ్యోతిషము మూలమునఁ గనుఁగొనవచ్చును.

దంపతులు గాఁబోవు వారివిషయమున వారి సుఖదుఃఖము లెట్లుండునో తెల్ప వచ్చును. జగజ్జాతక గ్రహకూట కాలసర్పాదియోగములమూలమున ప్రపంచమునఁ గల్గు అరిష్టములు, యుద్ధములు, తుపానులు, భూకంపాదులు, రోగాద్యుపద్రవములు మున్నగు వానిని దెలిసికొనవచ్చును. జన్మకాల, మరణకాల, రజస్వలాకాల, ప్రయాణకాల, శుభాశుభశకునకాలములఁబట్టి గల్గు మంచిచెడ్డల గమనింపవచ్చును. గ్రహరాశిప్రవేశ, వక్రత్యాగ అస్తమయ గ్రహణ గ్రహయుద్ధ గ్రహసమాగమ చంద్రశృంగోన్నతి గ్రహచ్ఛాయా, నక్షత్రచ్ఛాయా, మహాపాతాలాఖ్యాది యోగములవలన ప్రపంచమునకుఁగల్గు సుఖదుఃఖాదులను ఎఱుంగవచ్చును. ఇంతటి మహాప్రయోజనముల నీజ్యోతిషముమూలమునఁ బొందవచ్చును.

శ్లో. జ్యోతిష్టోమముఖామఖావిరచితా ఏవోక్తకాలే భువి, స్వర్గోకైకనివాసభాగ్యసుఫలాస్సర్వే భవంత్యాహుతాః
కాలజ్ఞానము చేతి నైవహివినాయేన ప్రభూతే సకల్ ఆమ్నాయాంగముత్తమంవిజయతే శాస్త్రంపరంజ్యోతిషమ్.

# సామవేదము

## ఋగ్వేదఋగపేక్ష్యమా?

శ్రీ సామవేదుల రామమూర్తిశాస్త్రి
మహారాజావారి సంస్కృతకళాశాల, విజయనగరము.

శ్లో. సప్తస్వరైస్సమస్తం యో జగదేతత్ చరాచరమ్, సంజీవయతి విశ్వాత్మా స నో విష్ణుః ప్రసీదతు.

వేదములు ఈశ్వరనిశ్వసితరూపములగుటవలన నపౌరుషేయములనియు ఋషులకు సమాధియందు శ్రవణగోచరములగుటవలన శ్రుతులనియు ప్రసిద్ధిపొందిన వని తలంచు నపుడు మూడు వేదములకు పౌర్వాపర్యాదివివక్షతయే కలుగదు. అటులకాక వేదత్రయము పురుషవినిర్మితము లని పౌర్వాపర్యవిచారణచేయ ప్రథమతః ఋగ్వేద ముదయించెను; తదుపరి తదాధారముగ సామవేదము సముత్పన్నమాయె ననవలసి యుండును. ఇయ్యది సముచిత మగునా? కాదా? అనువిషయము తత్తద్వేదవర్ణితాంశములనుబట్టి ఋషిఛందోదైవతములనుబట్టి శ్రుతిస్మృత్యాదులనుబట్టి పౌర్వాపర్య ప్రాధాన్యాప్రధాన్యముల పరికింతమన్న నొక్కటికనవే మాటికిని గాన్పించుచుండుటయే గాక త్రయీవేదయాది సర్వత్ర అనాదిగ వినబడుటయు గలదు. "తస్య యజురేవశిరః. ఋగ్దక్షిణపక్షః. సామోత్తరపక్షః." అని ఋగ్వేదమందును "ఋచం సామయజామహే యాభ్యాం కర్మాణి కృణ్వతే. వితేసదసిరాజతో యజ్ఞం దేవేషు వక్ష్యతే" అని సామవేదమందును ఋగ్యజుస్సామములంగూర్చి చెప్పబడియున్నది. వీటిమూలమున నెట్లును నిర్ణయింప వలనుపడదుకదా?

ఋగ్వేదఋగాధారముకలది సామవేద మని యొప్పుకొందమన్నను ఋగ్వేదమునలేని ఋక్కులు సామసంహితయందు కాన్పించుచున్నవే? అట్లు కాన్పించుటకు కారణ మేమి? ఆగ్నేయైంద్రపవమానారుణములనెడి సార్థకసంజ్ఞాయుతమైన సామసంహితకు ప్రత్యేకభాష్యమేలకలుగవలెను? మఱియు యజ్ఞమున సామవేదఋక్కే చెప్పబడవలయు ననునిశేషవిధియేల? అట్లైన నంగీకరింతమన్నను ఋగ్వేదఋక్కులన్నియు సామవేదఋక్కులవలె గానముచేయనర్హములా? అట్లయిన సామసంహితయందు పేర్కొనబడని కేవలఋగ్వేదపు ఋక్కున కొక్కదానికైనను గాన మేల కానరాదు. పై విషయవిమర్శనమూలమున ఋగ్వేదఋగాధారత సామవేదమునకు లే దనుట తెల్లము.

వేదనిర్వచనాదులలోని సమన్వయవిధానము ననుసరించియు "సామ్నాంతు సర్వేషాం ఋగాశ్రితత్వమ్" అనెడి ఋగ్భాష్యపీఠికాదుల ననుసరించియు ఋగాధారత ఉన్నట్లు భావింపవచ్చును. "తత్ర పాదబద్ధగాయత్ర్యాదిఛందోవిశిష్టాఋచః. తా ఏవ గీతివిశిష్టాస్సామాని. తదుభయవిలక్షణాని యజూంషి" ఇత్యేతాదృగ్విధనిర్వచనమందు కొందరు "తా ఏవగీతి విశిష్టాస్సామాని" అనుదానికి ఋగ్వేదఋగర్థముచేసి తన్మూలముగా ఋగ్వేదఋగా

ధారత నాపాదించిరి. ఋక్సబద్ధముగల ప్రతిచోట నిట్లే యర్థము గావించి సామవేద ప్రత్యేక విశిష్టతల కొద్దిపరచిరి. పై నిర్వచనమున విశిష్టతయాగీతత్వముకలది సామవేద మని చెప్పబడి నదికాని సామవేదమునకు గీతముతప్ప ఋక్కు లేదు. ఋక్కు ఋగ్వేదీయము, గీతము మాత్రమె సామవేదీయ మనుట యసాలోచిత మనక తీరదు.

మఱియు కాళిదాసీయాభిజ్ఞానశాకుంతలచతుర్థాంకమందలి కణ్వుని "అమిరా వేదిం... ఇత్యాది ఋక్ఛందసాశీస్సు ఋక్త్వసామ్యమాత్రాన ఋగ్వేదీయ మనుట సముచితమా? కాని యొకటిమాత్ర మొప్పుకొనకతీరదు. సప్తస్వరయుత "సామ"కంటె త్రిస్వరయుత "ఋక్ప్రి"థమము. ఇయ్యది స్వరపరిణామమున సహజమునముచితమునై యున్నది. ఈవిష యము శంకరాచార్యవిరచితవ్యాఖ్యావిరాజితమైన సామవేదఛాందోగ్యోపనిషత్తున "అకార ఉకార మకార మనెడి త్రిమాత్రాత్మక ప్రణవమునుండి వాక్కును వాక్కునుండి ఉదాత్తానుదాత్తస్వరితము లనెడి త్రిస్వరయుతఋక్కును ఋక్కునుండి సప్తస్వరయుతసామ యుకలిగె" నని సుస్పష్టముగా వ్రాయబడెను. ఇంతియకాక పాణినీయశిక్ష క్రిందివిధముగా సామవేదస్వరపరిణామవిషయము చెప్పెను.

ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః హ్రస్వో దీర్ఘః ప్లుతఇతి కాలతో నియమా అచి,
ఉదాత్తే నిషాదగాంధారావనుదాత్తా ఋషభ ధైవతౌ,స్వరితః ప్రభవా హ్యేతే షడ్జమధ్యమపఞ్చమాః.

లోకమునందైన నొకగీతము రచింప సమకట్టినవారు ఏయేస్వరములతో నేతీరున రచించుటయో యోచించి దానిని వాక్యసహితముగ గావించుచున్నారేకాని వాక్యములు వేరుగ గీతము వేరుగచేసి "తీర్థప్రసాదములట్లు" మేళవించరుగదా? ఇటులనే ఋగ్విభిన్నత లేకయే గానము సప్తస్వరయుతమై బయలువెడలి యుచ్చారణాదిసౌకర్యార్థము త్రిస్వర ములతో సంక్షిప్తీకరించబడెను. రథంతర వామ్యాదిపేళ్లుగలసామములు యజ్ఞయాగాదులం దచ్చటిప్రయోజన ముద్దేశించి రథంతరమనుపేరుగలసామము వామదేవ్యమనుసామమే యేస్వరములతో చెప్పబడినదో అట్లే చెప్పవలయు నను విశేషవిధానమే సంక్షిప్తము గావించి రనుటకు ఋగ్వేదఋగాధారత లేదనుటకును ప్రబలప్రమాణముగుచున్నది.

మఱియు ఋగాధారములేని విశేషవిహితములైన స్తోభాదు(సంజ్ఞ)లతోగూడిన సామములుగలవు కాని గానములేక సామవేదసంహితలో ఋక్కొక్కటియు గానరాదు. ఈవిషయము "సా అమశ్చేతి విగ్రహాత్ సా ఋక్. అమోగీతిరూపస్వరః. తయోర్మిథునం సామ" అనిచెప్పిన "సామ" శబ్దనిర్వచనమువలనను రూఢియగుచున్నది. ఇంతియకాక గీతి కలదే సామవేదమైనచో "గానవేదము" అనియో లేక మఱేటులనో చెప్పవలయునుకాని "సామవేద" మనియే చెప్ప వీలులేదు.

ఇక వేదత్రయమున నొకేవిధమైనఋక్కులేల యున్న వనుశంక కలుగకపోదు. వేద త్రయము వ్యాసవిభాగాత్పూర్వము సంకీర్ణములై యుండిన వనుట యెల్లరకు తెలిసినవిష యమే. ఈదృగ్విధసంకీర్ణత కారణముగ శబ్దస్వరవిపర్యయములనొందిన సంక్షిప్తసామవేద

ఋక్కొక్కటి రెండుమూడు తెఱగుల నీషద్భేదముతో గానింపుటచే ఋక్త్వసామ్యము కారణముగ వ్యాసునిచే విభాగసమయమున ఋగ్వేదమున నీమంత్రములే చేర్చబడినవనుటకు సందేహము లేదు. సామము ఋక్కున ఋక్కు యజుస్సున యజుస్సు సామమున నేడును కాన్పించుచుండుటచే సంకీర్ణత యొప్పుకొనక తప్పదు. "య ఏతత్సామగాయన్నాస్తే..." ఇత్యాదిగా సామము ఋక్కున "దేవో వస్సవితోత్పునా..." ఇత్యాదిగ ఋక్కులు యజుస్సున "ఆక్షితమస్యచ్యుతమసి..." ఇత్యాదిగ యజుస్సుసామమున నున్నవని సాయనార్యకృత సామభాష్య పీఠికయందు విపులముగ జర్చింపబడినది. సంకీర్ణతలో శబ్దస్వర విపర్యయము కలుగుట కవకాశమున్నది. "మంత్రోహీనః స్వరతోవర్ణతోవా" ఇత్యాదిగ మంత్రస్వరవర్ణ స్ఖాలిత్యము ప్రద్రవకరమని మనుస్మృత్యాదులు శాసించుచు వచ్చినందువలన తర్వాత విశేషముగా మారలే దనవచ్చును.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృతవాఙ్మయ చరిత్రలో సామవేదము గూర్చి యిట్లు చెప్పిరి. "75 ఋక్కులు తప్ప తక్కిన ఋక్కులు ఋగ్వేదఋక్కులు. ఋషిచ్ఛందోదైవతములతో సరిగ అష్టమనవమండలములం దెక్కువగను తక్కినమండలము లందు తక్కువగ నున్నవి. సోమయాగమున బఠింపదగినక్రమము ననుసరించి వేరుగా కూర్పబడిన కొన్ని ఋక్సంహితామంత్రములు సామసంహిత యని చరిత్రకారుడు చెప్పక తప్పదు కాని ఋగ్వేదమంత్రములు సంహితారూపము తాల్చకముందే యందలి కొన్ని మంత్రములు గానరూపముదాల్చి సామసంహితలోని పూర్వార్చికయయ్యెనేమో యనవలసి యున్న"దని వ్రాసిరి. సూర్యనారాయణ శాస్త్రిగారును ఋగ్వేదఋగాధారత సామవేదమునకు కల దనిగాని లేదనిగాని సిద్ధాంతముగ చెప్పరైరి. కాని ఆమనవాక్యములు ఋగ్వేదఋగాధారత సామవేదమునకు లే దనుటకే యెక్కువగ నుపకరించుచున్నవి. ఋగ్వేదఋగాధారము సామవేద మనెడి యీవాదము తొలుత నెవ్వరు ప్రారంభించిరో కాని అసహజము అసమంజస మనక తీరదు. వేదవిషయము సమగ్రముగ తెలియని ఆంగ్ల పండితు లెవ్వరో బహుశః ప్రారంభించియుందురు. వేదవిషయము వేదము చెప్పినను నమ్మక వారివాక్కే వేదముగా తలచి స్వతఃవివేచనము చేయ జాలని పరప్రత్యయనేయబుద్ధులు ప్రచారము గావించి యుందురు. తత్ఫలితముగ నేడును కళాశాలలో సంస్కృతవాఙ్మయ చరిత్ర బోధనావసరమున పై విధముననే బోధనలు జరుగుటయు నట్లే పండితప్రచారమును కలదు. ఇయ్యది సామవేదసంబంధియగు నాకు తెలిసినవిషయమును నగుటచే తెలిసినది చెప్పుట సమంజస మని యెంచి శ్రీ క్రొవ్విడి రామంగారి ప్రేరకత్వమున నే నీవ్యాసము వ్రాసితిని. ఈవ్యాససారాంశము. ఋగ్వేదఋగపేక్ష్యములేక స్వతంత్రవిశిష్టతలు గలిగినదే సామవేద మని చెప్పుచు నింతటితో విరమించుచున్నాను.

---

# మనవైజ్ఞానికసంపత్తి

శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న, ఎం. ఏ., బి. ఎల్.

ప్రాచ్యవిజ్ఞానం వేదకాలంనాడే ఆరంభమయింది. నిసర్గరమణీయములైన దృశ్యాల వల్ల పులకితగాత్రులై ఆర్యులు రచించినకవనమే వేదసారం. ఉపనిషత్తులకాలంనాటికి జిజ్ఞాస ఎక్కువ అయింది. ప్రకృతిలోని మధురదృశ్యాలని చూచి ఆనందించిన ఆర్యులు, నానాటికి ఆసృష్టికర్తయొక్కస్వభావాన్ని తెలుసుకోయత్నించేరు. ఉపనిషత్ సారాన్ని వేదాంత, శాస్త్ర, కళాదృష్టులతో పరికించవచ్చును. వేదాంతదృష్టినిచూస్తే జీవాత్మ పరమాత్మయొక్క ప్రతిబింబమనీ, ఆత్మ వినశ్వరమనీ తెలుస్తుంది. అరిషడ్వర్గాలకీ లోనై జీవి బంధితుడగుచున్నాడు; సుజ్ఞానంవల్ల విమోచనం కలుగుతుంది. శాస్త్రరీత్యా ఉపనిషత్ సిద్ధాంతాలని తిలకిస్తే, యివి బ్రహ్మాండస్వరూపాన్ని అతిజాగ్రత్తగా పరీక్షించేయనీ, బ్రహ్మాండ - పిండాండసంబంధాన్ని వివరంగా శోధించేయనీ, అనంతసృష్టిలోగల జీవులకి పారస్పర్యం ఏర్పరిచేయనీ తేలుతుంది. మానవుడు ఈపారస్పర్యాన్ని పరిమిత అంతర్యంలోనే గ్రహించినప్పటికీ, గ్రహిస్తూన్నప్పటికీ దీన్ని కూలంకషంగా సంగ్రహింపగల శక్తిసామర్థ్యాలు వానికి నిసర్గంగా ఉన్నాయి. ఇంక, కళాదృష్టితో వీక్షించినట్లయితే,—చిత్రకారుడు కుంచెలూ రంగులతోనూ, రచయిత లేఖ్యపరికరాలతోనూ పాటుపడినప్పటికీ, వారివారిగరిమ సిద్ధికొఱకయి వారుచూపిన ధీతీక్ష్ణతపైని ఆధారపడివున్నట్లే అంతరాత్మని తెలుసుకోవలసినవానికిగూడా బుద్ధి అనేపరికరమున్నూ, కేంద్రీకరణం అనే సాధనమార్గమున్నూ ఆధారభూతము లవుతాయి; కాని ఆత్మవ్యక్తిలో అంతర్గతంగా ఉండడం మూలాన్ని సర్వశక్తులని నిశితంగా వినియోగించవలసి ఉంటుంది, ఆత్మ సాక్షాత్కారానికి. ఇట్లు ఆత్మసాక్షాత్కారాన్ని పొందినమానవుడు సంఘంలోనూ ప్రకృతిలోనూగూడా దివ్యత్వం చూడ గలుగుతున్నాడు.

వేదాలు అపౌరుషేయములు అన్నారు పూర్వులు. పాశ్చాత్యులపరిశోధనలవల్ల వేదకాలం 1500 B. C. అనీ, 2500 B. C. అనీ, 3000 B. C. అనీ, చివరని మొహెంజదారో హరప్పాప్రాంతపునాగరికతాచిహ్నములు పరిశీలించినపిమ్మట 8000 B. C. అనీ వెనకబడుతూ వచ్చి యీసరికి యిదమిత్థం అని తేల లేదు.

విజ్ఞానశబ్దంలో మతము, వేదాంతం, చరిత్ర, భాష, వాఙ్మయం మొదలయినవి. ఎన్నో విషయాలు ఇమిడివున్నాయి. హిందూదేశం ఆదినుంచీ వేదాంతచర్యలకి ఆటపట్టయింది. భారతీయవైజ్ఞానికప్రాశస్త్యానికి అచ్చెరువుపొంది షాజహాను కుమారుడు దారా, ఉపనిషత్తులనీ, యోగవాసిష్ఠాన్ని, గీతని, పారసీకభాషలోకి అనువదించేడు. తురుష్కులవల్లనూ, కొంతమంది పాదిరీలవల్లనూ హిందూమతము నిరసింపబడకపోలేదు. కాని, మనమతము నేటికిన్నీ చిరస్థాయిగా వుండనడంలోనే దానిగరిమా, పటిమా, సహృదయం గోచరిస్తాయి.

ఉపనిషత్తులలో ఆత్మ - అనాత్మచర్య, ఆత్మజ్ఞానము, ఆత్మపరివర్తనము మున్నగువిషయాలు చెప్పేరు. సమాహితచిత్తము, సమ్యగ్దృష్టి అనేసూత్రద్వయం మోక్షదాయకంగా వెలసింది. జీవిలో నుండే పరమాత్మాంశం గ్రహింపబడింది. "ఏకం సత్ విప్రాః బహుళం వదంతి" అని పరమేశ్వర ఏకత్వం చెప్పబడింది.

వేదాంతసారమే గీత; గీత ధర్మోపదేశకం. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్వాక్యం. ధర్మోపదేశకమయిన యీ వేదాంతరహస్యం సృష్ట్యాదిని సూర్యుడు తెలుసుకున్నాడు, సూర్యుడు వైవస్వతమనువుకి బోధించేడు; మనువు ఇక్ష్వాకు చక్రవర్తికి ఉపదేశించేడు. మొట్టమొదటి చక్రవర్తి ఇక్ష్వాకువు. కాని కార్తవీర్యార్జునుడు జమదగ్నిని చంపినకారణాన్ని పరశురాముడు ఇరవైయొక్కసారి క్షత్రియులని పరిమార్చేడు. దాంతో క్షాత్రధర్మం అడుగంటిపోయింది దాని పునఃస్థాపన మళ్లీకురుక్షేత్రంలో జరిగింది. అంచేత గీత ధర్మోపదేశమే గావించిందికాని కొంతమంది కువిమర్శకులు అనుకొన్నట్టు, విప్లవాంకురాలని నాటలేదు. "ధర్మ" శబ్దనిర్వచనం దేశకాలపరిస్థితులనిబట్టి మారుతూవుంటుంది. ఇప్పటి ఆదర్శాభిప్రాయాలకి అట్టివాటికి తేడా గమనించవలసివుంటుంది. లేకపోతే లోకకంటకుడయిన రావణాసురుడికి వరములు ఇచ్చినందుకు ఆపరమేశ్వరుడికే (క్రిమినలు ప్రొసీజరుకో. సెక్షను 302 ప్రకారం)శిక్ష విధించేస్తాం!!

కొంతమంది క్రైస్తవమతప్రచారకులు శ్రీకృష్ణుని ప్రవర్తన అశ్లీల మన్నారు. ఇది తొందరపాటుమాటే. వెనుక రామవతారంలో మహర్షులు పరమాత్ముని సన్నిహితసాంగత్యం అభిలషించేరు. అది కృష్ణావతారంలో లభిస్తుం దని భగవానుడు సెలవిచ్చేడు. ఆమహర్షులే గోపికలు; వారిభార్యలే గోబృందమూ అయి వెలసేరు. ఇది పురాణాల్లో చెప్పినమాట. విమర్శనకి పూనుకున్నప్పుడు బహిరంతస్సాక్ష్యములు రెండు విచారించాలి. (ఇంతకూ చెప్పిన అంతస్సాక్ష్యాన్ని పుక్కిటిపురాణంగా కొట్టిపారేస్తారు!) నూతనదృక్పథంతో విచారించినా, కృష్ణుడు పదియేండ్లలోపుబాలుడు అని వ్యవహరింపబడ్డాడు. "ఓచెంప పాలు, ఓచెంప నీళ్లు" గా వుండే ఆలేబ్రాయపు అమాయికత్వానికి అశ్లీలత ఆరోపించడం శాస్త్రసమ్మతంకాదని వేరే చెప్పనవసరం వుండదు.

కురుక్షేత్రయుద్ధం 3142 B. C. లో జరిగింది. కాని బ్రహ్మవిద్య అనాదిది. నోబెలు బహుమతినిపొందిన మోరిస్ మేటర్లింకు Morris Materlink ప్రపంచంలోవున్న పురాణాలు భారతం మిన్న అన్నాడు. ఆగ్రంథంలోని ఉత్కృష్ట భావనబట్టీ, మధురకవనాన్ని దృష్టిలో వుంచుకునీ భారతం పంచమవేదం అన్నారు. శాస్త్ర-కళాపరిధులు వేరు. అపరిమిత మయిన శిక్షణ, చక్కనివైదుష్యం, నిర్దుష్టమయిన పాండిత్యంవుంటేనేగాని శాస్త్రం (వేదాంతం) అనగా కానకాదు. కాని కళ (కవిత్వం) అందరికీ అందుబాటులోవుంటుంది; సూటిగా హృదయానికి హత్తుకుపోతుంది. కష్టసాధ్యమయిన వేదాంతభాగాన్ని నిసర్గమధుర మయినకవనంతో జత చేసిన మహనీయుడు వ్యాసమహర్షి.

బ్రహ్మర్షులు యాగాలుచెయ్యడముచేతను, స్థలం యమునా సరస్వతీ పుణ్యస్రవంతులమధ్య ఉన్నదగుటచేతను, దేవతలు కావించిన జన్నములవల్లను, పరశురాముడు పితృదేవతలకు తర్పణములు అర్పించినస్థలం అవడంచేతను, భవిష్యద్ధర్మములను తెలిపిన దగుటవల్లను కృష్ణుడు అర్జునునికి ధర్మోపదేశం (గీతారహస్యబోధ) కావించుటచేతను కురుక్షేత్రం ధర్మక్షేత్రం అన్నారు—

సర్వోపనిషదోగావో దోగ్ధా గోపాలనందనః । పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

అర్జునుడు రణవిముఖుడు కావడంలో స్వార్థం ఇమిడివున్నది. తనవారితో యుద్ధం చెయ్యడం అతనికి కష్టంగా తోచింది. మమకారంవల్ల అతడు ధర్మవిదూరుడయినాడు. విచారం మోహంవల్ల జనిస్తుంది. మోహం ఉండగా ఆత్మజ్ఞానం కుదరదు. అర్జునుడు యుద్ధం చెయ్యడంకంటె సన్యసిస్తానన్నాడు. కాని హృదయపరిపక్వం కుదిరినవారికేగాని తురీయాశ్రమం చెల్లదు. కాబట్టి అర్జునుణ్ణి ధర్మసాధనచెయ్యమన్నాడు భగవానుడు. భక్తిమార్గంలోని తత్పరత ఆత్మసంకుచితపరిమితిని దాటి అనంతవిశ్వాన్ని ఆవరించివుండే పరమాత్మని తెలుసుకోవడమే. ఉత్తమభక్తులు ఇటీవలికాలంలోకూడా లేకపోలేదు. చైతన్యుడు, రామకృష్ణుడు, మీరాబాయి మున్నగువారు ఉత్తమభక్తులు. వైష్ణవ సాంప్రదాయంలోగల ఆళ్వారులు ఈశ్రేణికి చెందినవారే. భక్తులు నాలుగుతరగతులుగా గోచరిస్తారు:— (1) ధ్రువునివంటి అర్థార్థులు; (2) ద్రౌపది గజేంద్రులవంటి ఆర్తత్రులు; (3) జిజ్ఞాసువులు; (4) ప్రహ్లాదునివలె జ్ఞానసందీపితులయినభక్తులు. ఈచివరితరగతివారిదే అత్యుత్తమయిన భక్తిమార్గము.

భగవద్గీత 2-వ అధ్యాయం 11-వ శ్లోకంలో జ్ఞానమార్గం సూక్ష్మంగా చెప్పేరు. ఆత్మ - అనాత్మ, క్షేత - క్షేత్రజ్ఞతలు ఇందువివరించబడ్డాయి. ఉపనిషత్సారం ఇందులో నిమిడివుంది. ఈవేదాంతం బహుప్రాచీనమయింది. యముడు నచికేతునికి ఈజ్ఞానోపదేశం చేసేడని కఠోపనిషత్తులో వ్రాసివుంది; ఉద్దాలకుడు శ్వేతకేతువునకు చెప్పేడని ఛాందోగ్యోపనిషత్తు బృహదారణ్యకోపనిషత్తులలో యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి యీతత్త్వబోధచేసేడు. యోగవాసిష్ఠంలో వసిష్ఠులవారు శ్రీరామునికిన్నీ, సీతారామాంజనేయంలో రాముడు హనుమంతునికిన్నీ; మిళిందపన్హా (పాళీ) మిళిందుడు నాగసేనుడికిని ఈబృహద్వేతాంత సూత్రాలను చెప్పేరు. ఇంద్రుడు ప్రజాపతికి ఉపదేశించిందికూడా యీమహద్విషయమే. ఇదే గీతలో కృష్ణుడు అర్జునునికి చెప్పేడు. జ్ఞానమార్గంలో అత్యుత్తమమయిన విషయం ఆత్మనిగ్రహం, ప్రజ్ఞానమున్ను. సరియయిన ఆత్మజ్ఞానం కుదిరినవారికి శంక, విచారం, భయం కలగవు. యోగారూఢం అన్నా బ్రాహ్మీస్థితి అన్నా ఒక్కటే. అది సాధించినవారికి నిశ్చలత్వం కుదురుతుంది.

కర్మయోగంలో నిష్కామకర్మకి ప్రాధాన్యం యిచ్చేరు. జనకుడు ఆదర్శప్రాయుడైన కర్మయోగి. అతులయశోవిలసితుడయిన జర్మను వేదాంతి "గేటే" (Goethe) కూడా యీకర్మయోగానికి ముగ్ధుడై బద్ధాంజలిని ఒసగేడు.

"సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః। తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః."

సమాహితచిత్తము, సమ్యగ్దృష్టి కర్మయోగానికి గీటురాళ్లు.

కురుక్షేత్రం ధర్మక్షేత్రమే కాదు, కర్మక్షేత్రంకూడాను. ఆపదం యమునాసరస్వతుల మధ్యనున్న ఒక్క భూభాగానికే వర్తించదు. వ్యక్తిసంచరించే ప్రతిచోటుకీ వర్తిస్తుంది. కఠోపనిషత్తులో దేహాన్ని రథంతో పోల్చేరు. పంచకర్మేంద్రియాలను పంచజ్ఞానేంద్రియాలను అశ్వాలు అన్నారు; మనస్సుని కళ్లెంతో పోల్చి ఆకళ్లెం బుద్ధిచేతుల్లో పెట్టేరు. కాబట్టి గీతాసారం సత్కర్మని పురస్కరించుకుని ఆద్యంతరహితమయి వర్తిస్తుంది.

ఇంక పార్సీమతం, బౌద్ధమతం, కిరస్తానీమతం, తురకమతంకూడా కొంత తడిమిచూస్తేనే గాని ప్రాచ్యవిజ్ఞానచర్చ పూర్తిగాదు.

పార్సీలకు ఆర్యులకు సంబంధం వుంది. ఆదిమపార్సీలు ఆర్యసంతతివారే. ఆర్యుల పుట్టుపూర్వోత్తరాలగురించి భిన్నాభిప్రాయాలు వున్నాయి. మధ్య ఆసియానివాసులు ఆర్యులని ఒకరిమతము. ఆర్యులు ఉత్తరధ్రువంనుంచి వొచ్చేరని తిలకుగారన్నారు. హిందూదేశమే ఆర్యులకి ఆవాసమనిన్నీ, హిమప్రళయసందర్భంలో ఉత్తరాభిముఖులుగా వారు వలసపోయినారనీ వివేకానందులు సెలవిచ్చేరు. విషయం అందుకుందాం.

పార్సీమతానికి మూలవిరాట్టు జొరాస్టరు. 6000 B.C. నాటివాడు. ఋగ్వేదప్రాబల్యం యీయనమతంలో కనిపిస్తుంది. పార్సీమతగ్రంథాలు భగవంతుణ్ణి "అహురమజ్దా" అని వాకొంటాయి. ఈ అహురమజ్దా ఉపదేశించినదే "జెండ్ అవెస్టా" దీని ప్రకారం శాశ్వత స్వర్గం శాశ్వతనరకం వున్నాయి. పుణ్యుల ఆత్మలు, దేహవిముక్తి పొందినతరవాత, ఒకరాత్రి సద్భావస్వర్గంలోను, రెండవరాత్రి సద్వాక్యస్వర్గంలోనూ, మూడవరాత్రి సత్కార్య స్వర్గంలోను వుంటాయి. పిమ్మట భగవత్సాన్నిధ్యాన్ని నిత్యస్వర్గసౌలభ్యాన్ని పొందుతాయి. పాపజీవులు ఈమాదిరిగానే ఒకరాత్రి దుర్భావనరకంలోను, రెండవరాత్రి దుర్వాక్య నరకంలోను, మూడవరాత్రి దుష్కార్యనరకంలోను వుంటాయి. తదుపరి Judgment day వరకూ ఒకానొకస్థలంలో బంధితులయిపోతా యట. ఆపైన పశ్చాత్తాపం కుదిరితే క్షమింపబడతాయనీ, లేకపోతే నిత్యనరకం అనుభవిస్తాయనీ అంటుంది యీమతం.

మిగతామతాల్లోని స్వర్గ-నరకభావాలకి మూలం పార్సీమతమే. యూదులకి 436-333 B.C.వరకూ స్వర్గ- నరకములంటే ఏమిటో తెలియదు. తురకమతంగూడా ఆయాభావాలని క్రిశ్చియనుమతంనుంచే తెచ్చుకుంది. ఇస్లాముమతంలోని స్వర్గంలో ఐహికచ్ఛాయలు గోచరిస్తాయి. రసభరితములయిన పండ్లతోటి, నిస్తులచ్ఛాయల నిచ్చే వృక్షరాజములతోటి, మధు, క్షీర, మద్య, స్వచ్ఛాంభః ప్రవాహములతోటి, లేబ్రాయపు జవ్వనులతోటి కూడుకున్న రమణీయప్రదేశం వారిస్వర్గం. ఎడారిప్రదేశంలో మంచినీటికి, చెట్లనీడకు మొహం వాచివున్న వారి యీభావన దురూహ్యం గాదు.

హిందూమతంలోకూడా స్వర్గ- నరకాలు లేకపోలేదు. పితృలోక, దేవలోక, బ్రహ్మ లోకాలు అనేకం చెప్పేరు. ఆర్జించిన పుణ్యప్రాబల్యమున జీవి ఆలోకాలలో నివసిస్తుంది; ఆపుణ్యం కాస్తా క్షయం అవడంతోటే ఆలోకాలని వర్జిస్తుంది. కాని హిందూమతం ప్రకారం నాకలోకవాసమే లక్ష్యంకాదు జీవికి. మానవునికి వుండవలసిన అంతిమదృష్టి విశిష్టంగా చెప్పబడింది. దాన్నే మోక్షం అనీ, కైవల్యం అనీ, నిర్వాణం అనీ అంటారు. జీవాత్మ పరమాత్మలకు ఐక్యత కుదరడమే కైవల్యం. పిండాండం బ్రహ్మాండంలో లీనమవడమే నిర్వాణం, మోక్షం. ఇది స్వార్థరహితమయినప్రేమవలన లభ్యమవుతుంది.

కర్మవిషయాన్ని, ఆత్మవినశ్వరత్వాన్ని ప్రపంచానికి తొలుత తెలియజెప్పింది మన హిందూమతమే. క్రీస్తుకి కర్మమార్గంలో నమ్మకం వుండినట్లు సర్: సర్వేపల్లి రాధాకృష్ణయ్య గారు "Heart of Hindusthan" అనేగ్రంథంలో వ్రాసేరు.

దేశచరిత్ర తిలకించినట్లయితే అపార్థంచేసుకోబడ్డవ్యక్తులలో క్రీస్తు ఒకడు అని తెలుస్తుంది. ప్రాచ్యవిజ్ఞానప్రాబల్యం అతనిలోమిక్కుటంగా అవుపిస్తుంది. క్రీస్తుతక్షశిలలో కాశ్మీరమో వచ్చేడని అంటారు. ఆమాట యెలాగవున్నా, బౌద్ధమతం ఆసియామైనరు (Asia Minor)కి వ్యాపించింది అవడంచేత బౌద్ధమతసిద్ధాంతాలు అతనిలో కొంత పనిచేసేయి. క్షంతవ్యతా సూత్రాన్ని (Principle of Forgiveness) అతివేలంగా నమ్మినవాడాయన; స్థితప్రజ్ఞుడు. "Sermon on the Mount" ప్రశస్తమని చులకనగా త్రోసివేయ వీలులేదు. యూదులలో ఒక తేజోమూర్తి రావలసియుండెను. తీరా, ఆ అప్రతిమ ప్రతిభావంతుడు ఉదయించేసరికి, సంఘం అతనిని గుర్తించలేకపోయింది. క్రీస్తుదూషణలపాలైనాడు. ఆయనను న్యాయస్థానానికి యీడ్చేరు. పాపం, పాంటియసు పైలేటు (Pontius Pilate) కి క్రీస్తు నిర్దోషిఅని తెలుసును. కాని, పైలేటుజీవితంలో కొన్ని లొసుగు లున్నాయి. అవి బయటపెడతామని సంఘం బెదరించింది. అంచేత పైలేటు సంఘానికి లొంగిపోయేడు. క్రీస్తుని "సిలువ" వేసేరు. కాని యెంతబాధపెట్టినా, యెంత అల్లరిచేసినా తనవారిని, (సంఘాన్ని) క్షమించమనే అన్నాడు క్రీస్తు. "Father Forgive them for they know not what they do." అలాగ యెకసక్కెములపాలయిన క్రీస్తు కాలం గతించినకొద్దీ భగవత్పుత్రుడయి వెలిసేడు! ఈవిషయాన్ని దృక్పథంలో వుంచుకునే కాబోలు, నిందాభూయిష్ఠమయిన యీ పంకిలమే భవిష్యత్కాలంలో స్వర్ణమయ యశఃపుంజంగా మారుతుందని రవీంద్రుడు వ్రాక్రుచ్చేడు (The dust of ignominy becomes the gold of glory in due course.) జోస్ట్రను బ్రాహ్మడు అని వ్యవహరింపబడే ఎమర్సన్ కూడా ఉత్కృష్టజీవికి లక్షణం అపార్థం చేసుకోబడడమే నన్నాడు (To be great is to be misunderstood.)!! క్షంతవ్యతగురించి మాట్లాడుచు, కొంచెం ప్రక్కదారిబట్టేం. క్షమార్హత పశ్చాత్తాపంవల్లగాని కుదరదు. పశ్చాత్తాపంవల్ల ఆత్మ ఉత్తేజిత మవుతుంది. బైబిల్లో పశ్చాత్తాపానికీ, పరివర్తనానికీ యెంతైనా తావు లభ్యం అయింది. అట్టి పరితప్తజీవికి శాశ్వతనరకం అవడం అభాసు. 14-వ శతా

బ్దిలో ప్రతిష్ఠంచేసిన (Purgatory) గాథ యీ అభాసుని కప్పిపుచ్చడానికి వేసినమూసిక.

బౌద్ధమతానికీ హిందూవేదాంతమే ప్రధానం. సిద్ధార్థుడు లుమ్బినీవనంలో పుట్టేడు. వనప్రశాంతవాతావరణ ప్రాబల్యం అతనికి కలిగింది. ఆత్మవిశుద్ధమయింది; హృదయం పంకిల రహితం అయింది. మహాయానమార్గంలో భక్తిమార్గం మిళితమయిపోయింది. ఆంధ్రనాగార్జునుడు బౌద్ధమతానికి అమితమయిన సేవచేసేడు. కనిష్కుడు శ్రీహర్షుడు యీమతాన్ని పెంపొందించిన రాజవరేణ్యులు. కనిష్కుని ఆస్థానంలోవుండే అశ్వఘోషుడు బౌద్ధమతానికి అమృతత్వం ప్రతిపాదించేడు. ఆంధ్రరాజ్యంలో 500 ఏండ్లు బౌద్ధమతం అవిచ్ఛిన్నంగా సాగింది. అజాంతగుహాలలో వున్నచిత్రాలు 2000 ఏళ్లక్రితము ఆంధ్రశిల్పచాతుర్యాన్ని వేనోళ్ళ చాటుతాయి. అహంకారవిసర్జనమే బౌద్ధమతపు ముఖ్యసూత్రం. రణరంగంలో విజయంకంటే అహమునుజయించడమే గొప్పదని దమ్మపథంలో చెప్పేరు. బుద్ధుడు నాస్తికుడు కాడు; దేవుడు లేడని అతను చెప్పలేదు. ముఖ్యఅంశాల్లో ఇట్టిసమిష్టిభావం కలిగివుండడంచేతనే బౌద్ధమతం యిన్నాళ్లుగా భారతభూమిని నిలిచింది. క్రీస్తుకన్నా బుద్ధుడే ఉత్కృష్ట జీవి అని వెల్సు (Wells) అన్నాడంటే ఆశ్చర్యంలేదు!

ప్రాగల్భ్యాధికులయిన వ్యక్తులకు, అంటే బ్రాహ్మణులకు, ఆదినుంచీ భారతదేశంలో ఉన్నతస్థానం లభించిందీ అంటే అది వారి అధికారఆధిక్యతవల్లగాని, ధనాధిక్యతవల్లగాని లభించలేదు. మరేమిటీఅంటే, వారు తరతరాలుగా నిసర్గతేజోవంతులయిన, ధీమంతులయిన కారణంవల్లనూ, వారిసంఘసేవాపరాయణైకత్వమూ ఆత్మత్యాగమూ అపరిమితములు అవడంవల్లనే. మనదేశం వ్యక్తులకి అంజలి ఒపగలేదు; వారిలోని ఉత్కృష్టగుణాలకి నీరాజనం సమర్పించింది. ఆదినుంచీకూడా గుణగ్రహణపారీణత్వానికి వన్నెకెక్కింది యీప్రాచీనభూమి. కాబట్టే వైశ్యకులస్థుడయిన గాంధీమహాత్మునికి యావద్భారతం సాష్టాంగం చేస్తుంది.

ఉపనిషత్తులగురించి విపులంగా చెప్పేను. (పత్రికలో సావకాశం లభించినంతవరకున్నూ) కింకర్తవ్యతామూఢసందర్భం సంఘటిల్లినప్పుడు చిత్తము ఆందోళనాడోలాయమానమయినప్పుడు వ్యక్తిగీతాపారాయణం మొదలుపెడతాడు. ఎంచేత? ఆగ్రంథభాగం క్లిష్టపరిస్థితులని పురస్కరించుకుని చెప్పబడిందికాబట్టి. రాజకీయ, సాంఘికపరిస్థితులు తల్లక్రిందులయిపోయేసమయంలో, మానవునిలోని ఆత్మ వికసించడానికి బదులు ముకుళితమయిపోయే పరిస్థితిలో తరణోపాయం గోచరింపజేసింది భగవద్గీత. కాబట్టే, తెలిసినంతవరకూ అన్నిభాషల్లోకీ, సరియయినవేదాంతమార్గాన్ని బోధించిందిన్నీ, అతిమనోజ్ఞమయినటువంటిదిన్నీ గీత అన్నాడు వాన్‌హంబోల్టు. The Gita is the most beautiful, perhaps the only true philosophical song in any known language (von Humboldt)

ప్రాచ్యవిజ్ఞానంలోని మహాదాదర్శం, ఉత్తమసంకల్పం ఉదారాశయం అయిన సమాహితచిత్తము, సమ్యగ్దృష్టి, సర్వశ్రేయోభిలాష అనే సూత్రత్రయంవల్లనే హిందూదేశం

ప్రపంచకానికి అంతటికీ కొండొకనాడు జ్ఞానభిక్ష పెట్టగలిగింది. ఉపనిషత్తులు, యోగవాసిష్ఠం భగవద్గీతలను షాజహానుకుమారుడు దారా పర్షియన్ భాషలోకి అనువదించేడని మనవి చేసేను. యవనులకికూడా జ్ఞానోపదేశం భారతీయులవల్లనే జరిగింది. అనక్సాగరసుకి వేదాంతబోధ చేసినది ఒకబ్రాహ్మణుడు; (Anaxagoras) అనక్సాగరసు సోక్రటీసుకి చెప్పేడు; ప్లేటో సోక్రటీసువద్ద నేర్చుకుని ఎరిస్టాటిలుకి ఉపదేశించేడు. ఎరిస్టాటిలు అలెగ్జాండరుకి యీవేదాంతాన్ని బోధించేడు. ప్లేటోని గెటే జర్మనీలోకి అనువదించేడు. కార్లయిలు, ఎమర్సన్, మేక్సుముల్లరు, షిల్లరుప్రభృతులు ప్రాచ్యవిజ్ఞానానికి కేలుమోడ్చేరు.

కాలం చక్రనేమిక్రమేణ పరభ్రమిస్తూ భవిష్యత్ ప్రపంచాన్ని కడచినకాలానికి సన్నిహితంగా తీసుకువస్తూవుంటుంది. ఉత్తరనాగరికతాసూచకమయిన విజ్ఞానసంపత్తిని గడించిపెట్టే మహనీయజీవులు, కర్మసిద్ధాంతాలకి లోబడి, ఉద్భవించి పదేపదే జ్ఞానబోధ చేస్తూవుంటారు. పరిస్థితులమార్పుతప్ప వీరి అందరిలక్ష్యమూ ఒక్కటే నని మనం గుర్తించాలి. కాబట్టే యుగపురుషుల భౌతిక దేహాలు, జీవితపరిస్థితులు వేరయినప్పటికీ, వారి ఉద్బోధనములు పైకి భిన్నంగా కనపడినప్పటికీ ఆశయఐక్యతను కలిగివుంటాయి. మతాల్లోని భేదం మార్గాల్లోనే కాని లక్ష్యంలో అవుపించదు. హిందూవేదాంతానికి పట్టుకొమ్మ అయినసూత్రం సర్వజీవులయందలి శివస్వరూపం; దానితోడిదే సర్వమానవసౌభ్రాత్రం; దీనికి సాధనమార్గము నిస్స్వార్థమయిన, అనిర్వ్యాజమయిన ప్రేమ. క్రీస్తుకూడా Love of God and Love of one's neighbour అనే ముఖ్యసూత్రాలని ప్రతిపాదించేడు; కాని తరవాత వచ్చిన కించిజ్జ్ఞులు వీటిలోని అంతరార్థం గ్రహించలేక, తములోని దివ్యత్వాన్ని సిలువవేసి, అగమ్యగోచరమయిన దైవప్రపత్తిని నెలకొల్పేరు. వెనువెంటనే దివ్యత్వమునకు దూరమయిన అసత్యప్రపత్తికలిగి, ఐహికలోలత్వానికి తావుకలగజేసింది. జీవితాశయపథకం హృదయకుహరంలోంచి తొలిగిపోయి మెదడును చేరుకుంది; ఆశ్రయించింది. అక్కడే పాతుకుపోయింది. స్తనశల్యపరీక్ష మితిమీరింది. శాస్త్రజ్ఞానం ఆత్మవికసనానికి తోడ్పడలేదు. శాస్త్రం మతాన్ని తోసిరాజనలేదు. మానసికపరిణతిని ఆత్మపరిణతితో మేళగించి సచ్చింతనమును కలగజేసేశక్తి బుద్ధికిగాని మనస్సుకి లేదు. హృదయస్పందనంవల్లగాని, తార్కికప్రచండతచేత నాసిద్ధి కలగనేరదు. పరిశోధనతర్కములపై ఆధారపడిన శాస్త్రమువల్ల జనించేది మనశ్శక్తి ప్రాధాన్యంమాత్రమే అవుతుంది. అంచేతనే, శాస్త్రము వివిధగతుల్లో ముందంజవేసి మహద్విషయాలని సేకరిస్తున్నప్పటికీ జాత్యుద్ధరణకీ, తదున్నతికీ బృహన్మేధాశక్తియుతులు కాక, నిరుపమానబుద్ధిసంపన్నులే అవసర మవుతున్నారు.

పాశ్చాత్యప్రపంచాన్ని నేడు ఆవరించివున్న నాగరికత మేధాశక్తిపై ఆధారపడివుంది. దేశదేశములు ఇంతవరకూ చూపుతూవచ్చిన ప్రత్యేకతాభేదబుద్ధులింక పదునే

అర్థ

పోవాలి. సర్వమానవులకూ పారస్పర్యం ఏర్పడాలి. సద్జ్ఞానాంకురాలు ప్రపంచంలో సుస్థిరంగా నాటుకుపోవాలి. మనవేదాంతం, ఉపనిషత్సారం యీనాటి అశాంతిని బాపుతుంది. మనది శాస్త్రయుగం అవడంచేత, మతంకూడా సుగ్రాహ్యంగాను సుబోధకంగాను వుండాలి. మనవేదాంతం శాస్త్రసమ్మతంగా వుండడమే కాకుండా, మతమునకు ముఖ్యలక్షణమయిన దుర్జ్ఞేయతను (Mysticism) జారవిడువలేదు. ఐక్యతాభావం సమబుద్ధి నెలకొల్పడంలో కూడా భారతదేశమే అగ్రతాంబూలం పుచ్చుకుంది. జీవులభిన్నత్వం తాత్కాలికస్థితి అనీ, అసలు జీవాత్మలన్నీ పరమాత్మాంశములేననీ, ఆయాభేదం మానవునిగ్రహణశక్తినిబట్టీ కనిపిస్తూంటుంది, అని చెబుతుంది ప్రాచ్యవిజ్ఞానం. ఈసూక్ష్మాన్ని గుర్తెరిగితే వాటంతట అవే జనిస్తాయి పవిత్రప్రేమ, సర్వమానవశ్రేయస్సు సౌభ్రాత్రమును. తిరిగి భారతదేశమే ప్రపంచానికి విజ్ఞానకవాటంతెరిచేరోజులు వచ్చేయి. మధుర "గీతా"రవం దశదిశలా సువ్యాప్తమయి ఆత్మకి మేలుకొలుపు పాడుతుంది.

---

# "నేటి ఆంధ్ర సాహిత్యస్థితిగతులు"

శ్రీ వెల్దండ ప్రభాకరరావు
సాధనసమితి.

ఆంధ్రసాహితీలోకమున నేడు సాహిత్యము - సారస్వతము - వాఙ్మయము లనబడు నీమూడుశబ్దములు సమానార్థకములుగానే వ్యవహరింపబడుచున్నవి. కాని వానిలో నర్థభిన్నత కలదు. ఈమూడింటికిని శబ్దార్థసమ్మేళనములే కేంద్రస్థానము. కాని వానిపరిమితి మాత్రముకూడ మారుచు తగ్గుచు నుండును. ఒక కేంద్రమునుండియే మూడుభిన్నపరిమితి గలవృత్తములను గీచినచో యామూడువలయములు సాహిత్యముసారస్వతము వాఙ్మయములను నీమూడింటిని ప్రదర్శించును. వాగ్వ్యవహారమునకు సంబంధించినదంతయు వాఙ్మయ మనబడును. మాట్లాడినదంతయును వాఙ్మయమే యగును. వాఙ్మయమంతయు సాహిత్యము కానేరదు. ఏ వాఙ్మయము నిశితములగు కాలపరీక్షల కాగి దానియందు సార్వకాలీనతాసార్వజనీనతలు కలిగివుండునో యదియే సాహిత్య మగుచున్నది. ఇంక సారస్వతము సరస్వతికి సంబంధించినది. సారస్వత మక్షరరూపమగు సకలవిద్యాశాస్త్రకళాదులకు విస్తరించును. సారస్వతమంతయుకూడ సాహిత్యము కాకపోవచ్చును. దీనిలోకూడ దేనియందు సార్వకాలీన సార్వజనీనతలు ఉన్నవో యదియే సాహిత్య మగుచున్నయది. ఇంక సాహిత్యపదార్థము వాదవివాదములకును గహనమగు సిద్ధాంతరాద్ధాంతములకును తర్జనభర్జనలకు గురియై యున్నది. విశ్వమానవకల్యాణసౌభ్రాతృత్వమున కుపకారమగుట యనుమహత్తరమహోన్నతమహోత్కృష్టలక్ష్యములుకలిగివున్నదే ఉదాత్తసాహిత్యము. ఒకకాలమునందు రచింపబడువాఙ్మయసారస్వతములు సాహిత్యము కాకపోవచ్చును. "సహితానాం భావః సాహిత్యమ్" యని సాహిత్యతత్త్వవేత్తలు సిద్ధాంతీకరించిరి. అనగా సహితత్వమే సాహిత్యపదార్థము. సామాన్యముగా సాహిత్య మొకజాతియొక్కగాని సంఘముయొక్కగాని సంస్కృతిని ప్రతిబింబించుట కుపకరించుసాధన మగుచున్నది. అప్పుడే సంస్కృతి సాహిత్యదర్పణములందు ప్రతిఫలించుచుండును. సాహిత్య మొకసౌందర్యమూర్తి. అప్పుడే సౌందర్యోపాసనము సాహిత్యోపాసన మగుచున్నది. ఈసాహిత్యముకూడ ప్రభుసుహృత్కాంతాసమ్మితోపదేశకములలో నొకటిగా నుండవలయును. సాహిత్యమునకు రసమునకు శబ్దమున కవినాభావసంబంధము. కావ్యమే సాహిత్యముల పరిగణింపబడుచున్నది కాని కథానికాఖ్యాయికాదులసాహిత్యవిభాగ మగుచున్నారు. అందును కావ్యములు కాంతాసమ్మితములు. సాహిత్యము పరమార్థసాధన మగుచున్నది. సాహిత్యనిర్వచన మిప్పటి కెవ్వరు చేయలేదు. అట్లొనర్చుట కడుంగడు సాహసకార్యమే యగును. మెకాలె వ్రాసిన పాశ్చాత్యదేశచరిత్ర సాహిత్యముక్రిందికే విభజించియున్నారు. ఏలయన దానిలో చరిత్రాంశములు చాల తక్కువగా నున్నవి. దానిలోనున్న భాషావిశేషములు దాని కుదాత్తసాహిత్యాపాదనచేయుచున్నవి.

సాహిత్యమునకు ప్రధానములగునవి రెండుప్రయోజనములు. మొదటిది పఠిత నానందాంబుధిలో ముంచుట, రెండవది ప్రభుసుహృత్కాంతాసమ్మితోపదేశకముగ నుండుట. ఇంతేకాక యెప్పుడు సాహిత్యము పఠిత నానందాంబుధిలో ముంచునో యప్పుడే సాహిత్యమం దుద్బోధ యుండును. సాహిత్యపఠనమందు కలుగునది యానందము. ఈ యానందమును తన్మయత్వ మనికూడ వ్యవహరింతురు. దీనినే పండితులు రసాస్వాదన మందురు. భిన్నతంగతులచే భిన్నముగ వ్యవహరింపబడినది యది యొకటే—రసము. రసప్రధానము కలదే సాహిత్యము. ఇది పఠితకు పఠనమువల్లసాక్షాత్కృతి కావలెను. రససాక్షాత్కారము కల్గనిది సాహిత్యము కానేరదు. కాని యీనాడు మనుచరిత్ర శృంగార రసప్రధానముగ నున్నది. దాన సంఘమున కేమి యుపకార మని వాదములు చెలరేగుచున్నవి. కాని మనుచరిత్రపఠనానంతర మానందము తప్పక గల్గుచున్నది. దానివెంటనే గృహస్థాశ్రమధర్మ మవలంబనీయ మని వెంటనే స్ఫురించును. శృంగార మేల యని యందురేమో? కవిత్వమునకు శృంగారాత్మకముగ నుండక నసహ్యముగ నుండవలెనేమో? రసాత్మకముగువాక్యమే కావ్యమయినప్పుడు కవిత్వ మెట్లుండవలయును? శృంగారనైషధగ్రంథకర్తకూడ యేకపత్నీవ్రతసిద్ధాంతమును ప్రతిపాదించుటకు ప్రణయతత్త్వము నుద్బోధించుటకు తద్గ్రంథరాజమును రచించినాడు. సాహిత్యపఠనమం దానంద మెవ్వరికి కల్గుచున్నదనిన యది సహృదయునికే కల్గుచున్నది. ప్రతిపాఠకుడు సాహిత్యతత్త్వ మర్థముచేసుకొనుటలేదు. చేసుకోజాలడు. ఇది రూఢి. సాహిత్యరసాస్వాదనకు సహృదయు డొక్కడే సమర్థుడు. పామరులకు సాహిత్యచమత్కృతి యర్థము కానేరదు. రసికులుమాత్రమే యీ సాహిత్యచమత్కృతిని అర్థ మవగాహన చేసుకొనుచున్నారు. ఈపరసులే—రసికులు—సహృదయులు. ఈసాహిత్యరసాస్వాదనకు వలయుప్రజ్ఞానుభవసంపత్తి నిరంతరముగ నిశితకావ్యపరిశీలనమున కలుగును. ఈసామర్థ్యము లేనిది సాహిత్యతత్త్వ మర్థమగుట కల్ల. నిరంతరనికృష్టనిశితప్రౌఢగ్రంథపరిశీలనవలన వ్యక్తమగు సమగ్రసాహిత్యస్వరూపసాక్షాత్కారమప్రయత్నముగ సునాయాసముగ నెట్లు వ్యక్తము కాగలదు? పరీక్షకు చదువకపోయిన నుత్తీర్ణ డెట్లగును? తపములుచేయనిదే దేవుడు వరము నెట్లు ప్రసాదించును?

నేడు మనపై పాశ్చాత్యసాహిత్యవాతపరంపర నొకటి వీచి యావాసనలు గ్రమ్మి మనల సమ్మోహితులచేసినది. దానికి చేయునదిలేక యాసువాసనకు మనము దాసోఽహమ్మన్నారు. దీనితో పాత యొకరోత క్రొత్తయొకవింత యనినట్లు పూర్వసాహిత్యముపై నిరసన గలిగి వచ్చినకొంగ్రొత్త పదునేనిమిదవ శతాబ్దపాశ్చాత్యసాహిత్యముపై నాదరాభిమానములు హెచ్చినవి—పూర్వకాలమందు కవిత్వరచన కనుగుణములగు నిరుపమాతిస్థలములు రమణీప్రియ తెచ్చియిచ్చు కప్పురపువిడెము లుయ్యెలమంచములు రాజులు కస్తూరితో తాంబూలముల నిచ్చుట యివన్నియు కాలక్రమమున నశించినవి. కాని నేడు కవి తన కనుగుణమగుప్రచలనావరణమును కల్పించుకొని తానే సృష్టికర్త యగుటకు

ప్రసవవేదన పడవలసినయవసర మరుదెంచినది. ఎక్కువ శ్రద్ధాభక్తు లాంగ్లసాహిత్య
రసాస్వాదనకై వినియోగించుటవలన తనసర్వశక్తులను నాంధ్రసాహిత్యరసాస్వాదనకై
కేంద్రీకరింపలేకపోవుచున్నాడు. కాని స్వమాతను వదలి సవతితల్లిని ప్రేమించుటచే
మాతృద్రోహము చాల గలుగుచున్నది. ఈపాశ్చాత్య సాహిత్య ప్రభావము బలీయమైన
కొలది మనయాంధ్రసాహిత్యమును పూర్తిగ మరచిపోతి మనిన యసత్యమేమియు లేదు.
నిరంతరసాధనాఫలితముగ నితర యథమప్రసంగములుచేయక కావ్యములు వ్రాసినకవులే
సర్వజ్ఞులు కాలేనియవసరమున నేదో విలాసార్థము సాహిత్యమును చదివిచూచుచు
దానిలో సర్వజ్ఞత్వము కల్గలేదని విలపించుట శుద్ధవెఱ్ఱితన మనిపించుకొనక తప్పదు.
దీనితో నాంగ్లగ్రంథముల ననువదించుట కలిగినది. ఈయనువాదములు స్వతంత్రకావ్య
రచనాపాటవలోపమని వేలుగనొక్కి వక్కాణింపపనిలేదు. ఈయనుకరణములలోకూడ మన
సాంప్రదాయములు వీడి మనకు విరుద్ధముగు పరసంప్రదాయములు తమభాషలోనికి
గైకొనుటలో కొన్నియవస్థలు, యమంగళకరముగు విషయములు కలుగకపోలేదు. గతాను
గతికో లోకో యనినట్లు ప్రతివా డాంగ్లగ్రంథ మేదో యొకటి యనువదించనిది తన
లోపంబుగ పరిగణించుచున్నాడు. లేకున్న గౌరవమునకు నాగరకతకు లోపము. ఈ
గాలిలోపల కొన్నియుత్తమగ్రంథములు 'సాక్షి' యిత్యాదులు వెలువడినవి. ఆంగ్లసాహిత్య
మందలి హాస్యరచన, యాక్షేపసాహిత్యము Satire భమిడిపాటి, మొక్కపాటి, ముని
మాణిక్యము వారిలో మూర్తీభవించియున్నవి. ఇది యిట్లున్నను

"ఆంధ్రీభాషానురాగంబు నంతరించె, ఆంగ్లభాషపై వ్యామోహ మతిశయించె
ఐన నేమాయె నాస్వభాషాంధ్రి మంత్రు,శారదాంబామణీ నమస్కార మమ్మ."

అనియెడు సాహిత్యోపాసకు లింకను లేకపోలేదు. ఇప్పటికి నిరంతరసాధనాఫలిత
మున వారు తమపరిశ్రమ నాంధ్రసాహిత్యప్రపంచమునకు వెల్లడిచేయుచునే యున్నారు.
పాశ్చాత్యసాహిత్యమునుండి కథానిక—కావ్యానిక—ఏకాంకిక—హాస్యము ఇత్యా
దులు మన కంటుకొన్నవి. మనసాహిత్యమున కాధ్యాత్మికదృక్పథము ప్రాతిపదిక. వారి
సాహిత్యమునకు ప్రాతిపదిక భోగలాలసత్వము. దీనివలన వారిదిమనసంప్రదాయవిరుద్ధమని
వెంటనే స్ఫురించును. నేటి యనుకరణములవలన మనసాంప్రదాయమును పాటించుటలేదు.
ఈయనుకరణములు పెచ్చుపెరిగిపోవుచున్నవి. ఇదియే యంటుజాడ్యముగా మారినది. ఈ
ఎరువుసొమ్ములన్నియు మనకు బరువుచేటు లగుచున్నవి. కాని యీయనుకరణములును మన
సాంప్రదాయానుకూలముగ చేసికొన్న మార్పుకొనిన రమ్యముగ నుండును. ఎంతచేసి
నను ప్రాచ్యపాశ్చాత్యసంప్రదాయముల సమన్వయ మసంభవము. ఈయనుకరణము లపరి
మితము లగుటచే స్వతంత్రగ్రంథరచనాపాటవము లోపించినది. ఇట్లు భాషాస్థితి హీనదశ
దాల్చినది. కాని సాహిత్యపిపాసువు లామాత్రమైన గ్రంథముల నాంధ్రమున వ్రాయు
చున్నారనిమాత్ర మాంధ్రభారతి సంతుష్టహృదయ యగుచున్నది, ఈస్థితికి మరల తిరుగు
బాటు రాగలదు. ఆతిరుగుబాటు తిరుపతివేంకటేశ్వరకవిద్వయులచే రానేవచ్చినది. వారు

దేశముకైతను గ్రుచ్చియెత్తి భాషాసేవచేసి రనుటలో సందియ మేమియును లేదు. ఇతి వృత్త మెట్లున్నను వారు గుంటూరుసీమ-గీరతములను వ్రాసి మన కాక్షేపసాహిత్యము లేని కొఱత దీర్చిరి. పైనచెప్పిన యనుకరణములు వచ్చినకొలది ప్రబంధవాఙ్మయముపై సంపూర్ణ నిరసన కలిగినది. పూర్వకవులందు విహార మొనరింపచేసిన శృంగారనాయకులు విద్యుల్లతా విగ్రహాలు, లలితోద్యానవనములు, రాకేందుబింబాననలు వచ్చుట యేల యని వాటి నేల వర్ణింపవలెనను వాదవివాదములు చెలరేగుచున్నవి. కాని ప్రబంధనాయికానాయకుల నెట్లు వర్ణింపవలెనో వారే సమాధాన మొసంగిన బాగుండునేమో యనిపించుచున్నయది. నఖశిఖపర్యంతవర్ణన మేల డాక్టర్లుచేసిన శరీరపరీక్షవలె యని నిరసించుచున్నారు. ప్రబంధ నాయికానాయకులు పడినవలవంతలు వారు లలితోద్యానములలో గడిపినవెన్నెల రాత్రులు, శృంగారవిలాసములు వర్ణింప నవసరమేమి? నిజముగవారు గొప్పవారా యని కూడ పలువు రభిభాషించుచున్నారు. రమణీయార్థకమై రసాత్మక మగువాక్యమే కావ్య మయినప్పు డసహ్యముగ నసభ్యముగ వర్ణించినకావ్యము నీరస మగునుకాని సరసము కానేరదు, ప్రబంధమం దడుగడుగునకు రస మభివ్యక్త మగుచున్నది. ఇంత రసప్రధాన ములగు ప్రబంధముల నిరసించి వారింతకన్న మంచికావ్యములు వ్రాసి మార్గదర్శకు లగుదురేమో యనిపించుచున్నయది. ఈ ప్రబంధసాహిత్యముపయి నింత నిరసనముగలిగినను మనకంటుకొన్నజాడ్య మెట్లుపోవును? కాని యీప్రబంధములో నవ్యత్వ ముండునట్లు వ్రాయుట మంచిది. పింగళిసూరన కళాపూర్ణోదయమువంటి ప్రబంధరాజములను నవ్య వాసనతవిల్చి వ్రాయవలెను. ప్రబంధసాహిత్యము ప్రజలవిషయ మేమిచెప్పలేదని పలువురు వాదించుచున్నారు కాని ప్రబంధకవులును ప్రజలనుగూర్చి వ్రాయకపోలేదు. వారాధ్యాత్మికసిద్ధాంత ప్రతిపాదన చేయుటకు వ్రాసిరి కాని ప్రజలు నాటకములాడుట యూరేగుట బూతులు తిట్టుకొనుట, ఇత్యాది సన్నివేశములతో వ్రాయలేదు. ప్రబంధముల నే యుద్దేశము పెట్టుకొని వ్రాసిరో, యేమహత్తరమగువిషయములను పాఠకలోకమునకు తెలుపవలె నని వ్రాసిరో, సాహిత్యస్వరూప మెఱుంగనిసాహిత్యాభిమానుల కెట్లు తెలియు గలదు. ఇట్లు ప్రబంధసాహిత్యముపై వివిధదురుద్దేశము లున్నను నిప్పటికి శృంగార కాదంబరి, రాణాప్రతాపసింహచరిత్ర, శివాజిభారతము, శృంగారవీథి, శ్రవణానందము, భోజరాజు (గాదిరాజు వెంకటరమణయ్యగారిది) ఇత్యాదియుత్తమగ్రంథములు వెలువడుచునే వున్నవి. పాఠకలోక మాప్రబంధములను సాహిత్యాభిమానములతో పఠించుచునే యున్నారు.

నేడు దేశకాలపాత్రములు మారినవి. ఆర్థికస్థితులుకూడ విషమావస్థ నొందినవి. ఇట్టికాలములోకూడ 'హాలికులైననేమి గహనాంతరసీమలనుండిననేమి' యనునియమమును పాటించుచు భారతీకటాక్షమునె సంపూర్ణముగా నమ్మి సాహితీసేవచేయు సాహిత్యోపాసకులు లేకపోలేదు. ఈపరిస్థితులలో చాలామంది ఆర్థికార్జనమునకు గడంగి చాలకాల ముదరపోషణాదివృత్తిలో దవిలియుండి విరామముకల్గియుండినపుడు సవిలాసముగ కైత

"నేటి ఆంధ్రసాహిత్యస్థితిగతులు"

వ్రాయుచు మహాసర్వజ్ఞధౌరేయుల మని తలచి పైకి రావలెననుకోరిక మిక్కుటమై యపరిపక్వభావములతో నేదోయొక గ్రంథకర్తలై మెలగుట మన మెఱుగనివిషయముకాదు. నిరంతరము గ్రంథపఠనచేయుచు వాగుపాసనాబలమున సర్వజ్ఞులము కాలేదేయని పూర్వగీర్వాణీశ్వరులు పరితపించినతరుణమున నేటినాఁటిరుగుపండితవర్యులందఱు గొప్పవారలమని వారే నొక్కి వక్కాణించుకొనుచున్నప్పుడు వారిసామర్థ్యముల ధిక్కరించుట కెవ్వరికి ధైర్యము గలదు. ఒకరిసామర్థ్యము లింకేమి తెలియును.

అదియునుగాక ఆంగ్లసాహిత్యవ్యామోహితులమైన నవ్యాంధ్రసాహితీలోకము గభీరతరంగభంగడోలికలకాకరమగు నాంగ్లసాహిత్యమునందు మునిగి మురియుచు మన కట్టిసాహిత్య మున్నదా యనికూడ పలుమార్లు నిట్టూర్పులు విడుచుచుండును. వారు తమభాషావధూటివంక నొకమారయిన నపాంగవీక్షణము పరపుటకయినను విరామము లేనివా రనుట నిర్వివాదాంశమే. ఇది శారదాంబగ్రహచారముదప్ప వేఱొకటి గానేరదు. ఆంధ్రులై యాంధ్రేతరభాషమాట్లాడుచు నల్లాడుచున్నప్డు మన మేమిచేయఁగలము? దేవభాష యనబరగిన గీర్వాణసాహిత్యమువంక నెవ్వరయిన చూచుచున్నారా? ఇంతకన్న మాతృభాషానిరాదరణ యెట్లు జరుగవలెను?

కావ్యవాఙ్మయముపై సంపూర్ణనిరసన కలిగినది. బరువగుపద్యకావ్యములు వ్రాయుట మోటుతన మని భావించుచున్నారు. పద్యములు సామాన్యముగ నర్థముకాని కఠినభాషలో నుండును. దానిలోని యర్థభావగభీరతలు సామాన్యముగ తెలియవు. బరువగుపద్యకావ్యముల పాండితి తెలియుట కష్టము. అసలు పద్యసాహిత్యము కవులు తమశక్తిసామర్థ్యముల ప్రకటించుట కుపయోగించినగీటు రాళ్లు. వాటిని చదువుట యెట్లు? వాటిని వేలవముగ ప్రేతకళ యుట్టిపడునట్లు రచించిన బాగుండును. పద్యములు వ్రాయుట దుస్తరము. ఛందోబద్ధము లవసరములేదు. నిజమగుకవిత్వమున కసలు ఛందోనియమము లేవీ యవసరములేదు, యతిప్రాస లవసరములేదు. నిర్దుష్టమగుభాషకూడ అవసరములేదు. కాకపోతే భావమును వ్యక్తముచేయుటకు భాషయే ప్రధానము కావున నాభాషయు కూడ సులభముగ నుండవలెను. ఇప్పటికి రచింపబడినపద్యగ్రంథము లన్నియు ప్రజోపయోగార్థము కావు. వాటితో మాకక్కరలే దేదో మాయిచ్ఛవచ్చినట్లు వ్రాసికొందు మని యితరులసమాధానపెట్టుచు వారుకూడ సమాధానపడుచున్నారు. అంతకన్న నింకేమియందురు? ఈసిద్ధాంతముల వీరు ప్రతిపాదించుచున్నారు. కాని యెంతవఱకు సమంజసమో విచారింపవలయును. భావోద్వేగమును వెలిబుచ్చుటకు పద్య ముపయోగము కావలదు. ఎప్పుడైనను హృదయము భావపూరితమయినప్పు డిది సామాన్యముగా నేసంగీతముద్వారానో యేవిలాపముద్వారానో పద్యముద్వారానో వెలువడును. ఇదియే వాల్మీకిహృదయమునుండి శోకము శ్లోకరూపమున బయల్వెడలి గొప్పరామాయణకావ్యమైనది. కాని గద్యరూపమున సామాన్యముగ రాదు. ఏలరా దనిన నది వారు

చర్చింపవలసినవిషయము, కావ్యవాఙ్మయము సామాన్యముగ నానందమునకై రచింప బడినది. అనగా కవిత్వకళ యానందముకొఱకే వ్రాయబడినది. అనగా కళకు పరమావధి కళయే. కవిత్వకళకు పరమావధి ఆనందము. ఈయానందమునే పాఠకులు తన్మయత్వ మని సాహిత్యవేత్తలు రస మని వ్యవహరింతురు. ఇంత రసవిస్ఫూర్తి గద్యమున రాదా, యట్లు వ్రాయుట సాధ్యమా యనిన యేల వ్రాయకూడదు? తప్పక బాణుడు కాదంబరిలో నీరసవిస్ఫూర్తిని చక్కగా పూర్తిగా నిబిడీకృతముచేసినాడు. కాదంబరిలో రసవత్తర ఘట్టము లెన్నియో గలవు. కాని రసవత్తరముగ వచనరచన ప్రశంసనీయమె కాని రసప్రాధాన్యము అత్యావశ్యకము. అదియునుగాక పద్యములను జాతిపై తాత్కాలిక ముగా వ్రాయవలెనన్న యది యసంభవము. ఆకలి, ఆకలి యని కేకలుపెట్టిన దానిలో యేమిరస మున్నదో యెవరోపరిశోధనచేసిరి కాబోలు?

ఈరోజులలో పద్యవాఙ్మయముపై నెంతనిరసన గలిగినదో యంత గద్యవాఙ్మ యముపై నభిమానము కుదిరినది. శ్రీవీరేశలింగము మొదలుగా గద్యవాఙ్మయమే వాడబడుచున్నది. దీనివల్ల శైలీసౌలభ్యత యందఱి కవశ్యకమయినది. కాని యేది సులభశైలియనుటయే యిపుడు చర్చనీయాంశము. పూర్వకాలమున వ్యవహారభాష సంస్కృ తాంధ్రసమ్మిళితమగు భాషయే. అప్పుడు వారి కదే రమణీయమయినది. అదియునుగాక మనము మాట్లాడుభాషలో మూడువంతులు సంస్కృతభాషయే యున్నది. అది మనలో బాగుగ జీర్ణించుకపోయినది. దానిని తీసివేయలేము; తప్పించుకొనలేము. జనపదములలో వ్రాసెద నన్న పాల్కురికిసోమనాథుడుకూడ సర్వజనసామాన్యాకర్షణీయమగుశైలిలో వ్రాయు ప్రయత్నమున నాతడు సంపూర్ణవిజయ మొందలేకపోయినాడు. ఇప్పుడు పూర్తిగ సంస్కృతపదసమాసభూయిష్ఠముగ నున్న నదియుకష్టమే. పూర్తిగ తెలుగుగా నున్నను నది పేలవముగనే యుండును. అదియునుగాక అర్థము కాదు. దానికి ప్రత్యక్ష ప్రబలప్రమాణము నీలాసుందరీపరిణయమె. కావున సంస్కృతాంధ్రభాషాసమ్మేళనముల వేఱుపఱచు టసంభవము. ఈసందర్భమున రెండువాదములు బయలుదేరినవి. మొదటిది జయంతి రామయ్యపంతులుగారివాదము; రెండవది గిడుగు వేంకటరామమూర్తిగారి వాదము. ఈరెండు నొకదానికంటె మరొకటి బలీయములుగా నున్నవి. వాటిని ముందు విపులముగ పరిశీలింతము.

జయంతి రామయ్యపంతులుగారివాదము గ్రాంథికభాషావాదము. వారు వచనము ఘాటగుసంస్కృతాంధ్రభాషాసమ్మితమయి నుదాత్తమయి యర్థస్ఫూర్తి కనుగుణమయి నుండ వలె నని ప్రతిపాదించిరి. తత్కార్యార్థ మొకపత్రిక స్థాపించి యందు గ్రాంథికాంధ్ర భాషాపటుత్వము కల్గిన సాహిత్యవ్యాసములగాని పద్యములగాని ప్రకటించుచుండిరి ప్రకటించుచున్నారు. దానికి పిఠాపురము రాజుగా రధ్యక్షులు. ఉదాత్తభావ ప్రదర్శనమునకు నుదాత్తభాషయే కావలెను; పేలవముగనున్న నది రాణింపదు, రసాభాసగ నుండునని వారు వక్కాణించిరి. తదనుకూలముగ వా రుపన్యాసము లిచ్చుట వ్యాసములు

వ్రాయుట జరిగినది. ఈవాదము బలీయమగుచున్నకొలది భాషాప్రపంచములో నింకొక సంచలనము కలిగినది. ఈసంచలనము వ్యావహారికభాషావాదము. దానికి సూత్రధారుడు గిడుగు పిడుగు. ఆతడు సామాన్యముగ భాష సంస్కృతశృంఖలములనుండి విడివడి పోవలయునని సర్వజనసామాన్యమున కందుబాటులో నుండుభాష కావలె నని తన సిద్ధాంతమును ప్రతిపాదించెను. అప్పు డీరెండు వాదములకు ఘర్షణమర్షణ బాగుగనే జరిగినది. ఇప్పటికి వాదప్రతివాదములు చాల చెలరేగుచున్నది. భాష సంస్కృతశృంఖలములనుండి బయలువెడలినపుడే సర్వజనసామాన్యసేవ్యమగును. అదియునుగాక సులభముగా నుండవలెను. అది నిర్దుష్టము కానిండు కాకపోనిండు. ఇప్పుడుకూడ రెండువాదములకు సంబంధించినవార లున్నారు. నేడుకూడ ఈవాదము హోరాహోరిగ జరుగుచునే వున్నది. కాని పెద్దతుఫానుముందు మందానిలము లెట్లు నిలువజాలును? కాల మేయే వాదము బలీయమో నిర్ణయించును. మంచియలంకారయుక్తమగు భాషాసౌష్ఠవముతో రచించిన సాహిత్యము చాలకాలము విద్వాదరణీయమై యుండును. దానికి ప్రత్యక్ష ప్రబలప్రమాణము పూర్వసాహిత్యమె. జగన్నాథపండితరాయలు సభలో మాట్లాడినప్పు డాతని నెదిరించుపండితు డొక్కడైన గనపడలేదు. వారుకూడ పండితసభలలో వారి వాదముల నెగ్గించుకొను టసంభవము. కాని నేడు ప్రజాభిరుచి వ్యావహారికభాషపై నున్నది. సామాన్యముగ నేడు పండితులుకూడ యేదో దాని నెదిర్చినట్లు కాకుండ మూకీ భావములతో ప్రజాహృదయమును బాధపెట్టకుండ కాలము గడుపుచున్నారు. అదియును గాక పూర్వసాహిత్య మర్థమగుటలేదని దానిని చదువకూడదని కొందఱు సిద్ధాంతీకరించి కొనుచున్నారు. కాని నేటిసాహిత్యములో భాషాజ్ఞానము కావలసినయవసరమువచ్చి నప్పుడు యేమి పఠింపవలెనో తెలియరాకున్నది. గొప్పవారుమాత్రము రసమయమగు వాగ్ధాటితోనే వ్రాయుచున్నారు. వా రెవ్వరిని లక్ష్యపెట్టుటలేదు. వారే యుగపురుషులు తిరుపతివేంకటేశ్వరులు. వారు ప్రజాభిరుచినిబట్టి వ్రాసినగ్రంథములన్నియు భాషాకాఠిన్యము లేకపోలేదు, బాణకృతమగు శ్రీహర్షచరిత్ర మాంధ్రీకరించియున్నారు. అది బాణునిశైలి యనియే చెప్పకతప్పదు. కాని దీనివల్ల నుదాత్తసాహిత్యము వ్రాయవలె నన్న మంచిభాషాపటుత్వముతోనే వ్రాయవలయును. శృంగారవీథి ప్రౌఢముగా నున్న దానిలో నున్నగభీరతనుబట్టి యందులో నితివృత్తము రాధామాధవులదైనను యతి పురాతనమైనను దానిని పఠింపక నిరాదరణచూపించుటలేదు. చూపించిన నాలాటిగ్రంథ మును వ్రాయుసామర్థ్య మెవ్వరికి గలదు? వానికి నొకశేప్రశ్న యటువంటిగ్రంథము లెందు కని ప్రశ్నింతురు. దీనిని చక్కగా శ్రీరాజశేఖరశతావధానిగారు విశదీకరించిరి.

సాహిత్య మర్థమగుట యన నేమి యని విచారింపవలయును. సాహిత్యస్వరూపము నిరంతర నిశితగ్రంథపఠనమువల్ల వ్యక్తమగునుకాని, ఊరక గాలికబురులు చెప్పినట్లర్థముకావలెనన్న నెట్లు కాగలదు? అట్లగుటకవసరమేమి గలదు? కవికాదలచినప్రతివాడు

మనుచరిత్రపారాయణమే చేయును. విద్వదౌషధమును బాగుగ రుద్దుకొనునేకాని యీ
నాటిగ్రంథముల వేటిని పారాయణముచేయుచున్నాడో తెలియదు. గంభీరముగ
ప్రౌఢతరముగు కవితాధాటితో నుత్తాలతలూగుకవిత్వ ముయ్యాలలనూచుచు పఠితసానందాం
బుధిలోన ముంచుచుండును. సాహిత్యము సహృదయత్వ మున్న కాని యర్థము కానేరదు.
ఈసహృదయత్వము నిరంతరగ్రంథపఠనవల్ల సమకూరును. ఈనాటిజనపదవాఙ్మయమును
పఠింపవలెనన్న పూర్వసాహిత్యము చదివి సహృదయత్వసముపార్జనము చేసుకొనవలయును.
కాని పూర్వసాహిత్యముపై నిరసనగల్గినప్పుడు వారల కిష్టములేనికార్య మేలచేయ
వలెను. ఎట్టైనను మనసుకు విరుద్ధముగుకార్యమును చేయకూడదు.

సాహిత్యము పాఠకుని విసిగించుటకు వ్రాయబడలేదు. సాహిత్యమును చూపుటకు
వలసినగీటురాళ్లుగా వారు తలంచలేదు. కాని సాహిత్యమర్థస్ఫురణకై వ్రాయబడినది. ఆ
సాహిత్యమర్థమగుటకు వలసినసాధనసంపత్తి రసాస్వాదపటిమ లత్యవసరములు. అవి మనకు
నున్న, ఏదో యొకఘోరారణ్యము వర్ణింపవలసిన యవసర మరుదెంచినప్పుడు దానిలోని
చెట్లను శిలలను సెలయేళ్లను యెట్లు అక్షరసముదాయమునగాక సాక్షాత్కరింపచేయ
వలెను. దానిలోనిరాళ్లను గుళ్లను చక్కగా రావములు చేసి ఘోరారావము లెట్లు వర్ణించ
వలెను? వాటిని అక్షరసముదాయసహాయముననే స్ఫురింపచేయవలెను. అప్పుడు
సమాసపద భూయిష్ఠము వ్రాయక తప్పదు. దానిలోనే కవిత్వ మున్నదనికూడ చెప్పుటకు
సాహసించుచున్నాను. అర్థస్ఫురణకై కవి వ్రాయును. దాని కుదాహరణములు చాలా
కలవు. ఈ క్రిందిపద్యముల తిలకింపుడు.

శా. కాంచెన్ గాంచనగర్భసంభవుఁ డుదగ్రగ్రావకోటిస్థల
చ్చంచన్నిర్ఝరవేణికాసలిలసంజాతాబ్జసౌగంధ్యమున్
బంచాస్యస్ఫుటకంఠనాదహతకుంభత్కుంభిగర్వాంధ్యమున్
న్యంచద్ధాటకభూవిభృచ్ఛిఖరగర్వాంధ్యమున్వింధ్యమున్.

ఈపద్యము కాశీఖండములోనిది. నారదుడు వింధ్యమును చూడబోయినప్పటి
వింధ్యపర్వతము. ఇది కఠినసంస్కృతప్రౌఢదీర్ఘసమాసభూయిష్ఠముగ నున్నది. పర్వత
మున నిజముగ హోరుమని ధ్వనిపెట్టుచు నాధారపైనుండి క్రిందికిపడుచున్నప్పుడు
గలుగురావములు వెంటనే స్ఫురించుచున్నవి. అదియును ఘోరక్షోణీధ్రమునందు వివిధ
వృక్షద్వ్యములు సరళతలేనికంటకభరితనికుంజములు ఇత్యాదులు స్ఫురించును. ఇటువంటి
యర్థస్ఫురణ కీపద్యము వ్రాయబడినది. సామాన్యముగ పద్యములన్ని యర్థస్ఫురణకై
రచింపబడినవి. ఈవిధముదే యింకొకపద్యమును తిలకింపుడు.

అలఘుస్యందనకోటి వీటిమణి రథ్యావాటికాహాటకా
కలితక్షోణుల జేగుచోఁ జటులచక్రక్షుణ్ణతల్ క్షోదముల్
గలయం బర్వి సుపర్వలోకనదిలో గాంగేయంపంకంబు జా
బ్బిలఁ జేయం దటిపై జనించి యచటన్ బెంపొందుఁ బొందామరల్.

# "నేటి ఆంధ్ర సాహిత్యస్థితిగతులు"

౩౦ దధిస్థానపురమున బంగారువీథులందు రథ మరుగుట వర్ణించబడినది. దాని చక్రములరాపిడివలన రాలినపుష్పాడి వాతాహతి నెగసి స్వర్లోకనదిలోపడుటంజేసి బంగారు కమలములు జనించి పెంపొందినవి. ఇందు రథములస్ఫురణకై "ఘుర్ఘుంద"నయని వ్రాయ బడినది. గులకరాళ్ల బండి నడచినప్పుడు చెవులకు కటువనిపించినట్లు యా "ఘుర్ఘుంద"న స్ఫురింపచేయును. తరువాత "చక్రక్షుణ్ణాశత్ క్షోదముల్" ఆచక్రములు తిరుగుటచే గలిగినరాపిడిని స్ఫురింపజేయును. ఇట్లు శబ్దము లర్థస్ఫూర్తికై రచింపబడినవి. ఇటువంటిపద్యమే పోతనామాత్యునిది—అంభోజాకరమనుపద్యము. దీనిలో చక్రప్రయోగ మది నీటిలో గుభిల్ గుంభధ్వానముతో ననుపదము వెంటనే నీటిలోబడినపుడు సామాన్యముగ గుభిల్ శబ్దము గలుగును. దీనివల్ల సాహిత్య మర్థస్ఫురణకై రచింపబడె ననుట తెల్లము. ఇటువంటి యర్థస్ఫురణకై రచింపబడినసాహిత్య మప్రయత్నముగ ననాయాసముగ నర్థము కావలెనన్న నెట్లగును? ఇక్కాలమున నర్థము కావడములేదనియు పెద్దన మనుచరిత్రమునే పారాయణముచేయుచున్నారు. కాని మనుచరిత్రటీక లేనిది యెవ్వరి కర్థమగుచున్నదో తెలియరాకున్నది. ఇప్పటికే యర్థము కాలేదని శైలీసౌలభ్యము కావలె ననుటవలన భాషాపటుత్వము చాలావరకు తగ్గినది. ఇంకను పోనుపోను పేలవమైపోయి విప్రనారాయణునిప్రేమ కరగిపోయినట్లింకను 'పూవై తన్మకరందమై కరగి పోపో నీళ్లకుం బల్చనై'యన్నట్లు పూర్తిగ నీనాటిసాహిత్యము ముందువచ్చువారల కర్థముకాని యవస్థవచ్చునదనువిషయము సర్వజనవిదితమే.

ఈస్థితిగతు లిట్లుండ నేడొకవిపరీతవాదము బయలుదేరినది. అదియే ప్రజాసాహిత్యవాదన. ప్రజల నాసాహిత్య మనగా నేమి దానినిర్వచన మేమని పృచ్ఛసేయగా వారిట్లు ప్రతిపాదించుచున్నారు. వ్రాయబడునదంతయు సర్వజనుల కర్థము కావలెను. కళ కళ కొరకే యని ముక్కుమూసుకొనిమడిగట్టుకొని సాహిత్యసేవచేసెడిరోజులు పోయినవి. ప్రతివాని కర్థము కావలెను. ప్రజాదర్శములను పొందనిది సాహిత్యము కానేరదని. అదియునుగా కరటిపండొలిచి చేతిలోపెట్టినంత సులభముగ నర్థము కావలెననియు, ప్రజాసంబంధము లేనిదియును, నిజమునకుకవిత్వము నాదరించువారు లేరని వక్కాణింతురు. కాని యీప్రజలన నెవరు? అక్షరజ్ఞానములేనివారు, జాబులుమాత్రము వ్రాయనేర్చినవారా, ఆంగ్లేయపదసమ్మిళిత సంకరభాషను భాషించువారా, పండితులైనవారా, పండితులుకాక పామరులూగాక మధ్యస్థులా యని మొదటవిచారింపవలసియున్నది. పండితులకు ప్రౌఢవాక్పాటవమున వ్రాసిననేగాని రుచింపదు. మధ్యస్థులకు పాండిత్యపటిమ లేకయు, నీరసముగుమధ్యస్థభాష యనగా సంస్కృతపదప్రౌఢదీర్ఘసమాసరహితమగు భాష వ్రాయవలెను. అంతకన్న పామరులకు నిరక్షరాస్యులకు శుద్ధగ్రామ్యములో వ్రాయవలసినయవసరము గల్గుచున్నది. కాని యవి యేవిధముగ వ్రాయవలెను. విద్వాదరణీయంబగు గ్రంథమే ఆచంద్రతారార్కతను గ్రంథకర్త కొనగూర్చును. ఇటువంటిగ్రంథజాలము వ్రాయుటే కష్టము. అందులో నిది లేదది లేదని ప్రజల కాకర్షణీయముగ లేదని పలుకు

చున్నారు. చేతకానివానికి శాస్త్రాలు మెండని యన్నట్లు వీరికి పాండిత్యము లేకపోయినను సిద్ధాంతములు మిక్కుటము. వారు నికృష్టమగు నాంధ్రసాహిత్యమునకు ప్రాతిపదిక యగు సంస్కృతభాషవంక నొకమారైన క్రీగంటిచూపున చూడలేదు. రసకావ్యధ్వని స్వరూపాదులను సాంగముగా తెలిసికొనలేదు. అటువంటిసమయమున పండితులు వ్రాసినవానిని తిరస్కారముగానించి వారే పరాభవనామసంవత్సరముచే స్వాగతమీయబడుచున్న విషయము మనకు విదితమే. ప్రజాభిరుచినిబట్టి కవి మెలగవలెననుట యథార్థమే కాని ఉదాత్తభావమున కుదాత్తభాష వాడవలెననుటలోనే వాదము వచ్చుచున్నయది. ప్రజాభిరుచిని బట్టి కవి కేకలు వేయరాదు. కేకలువేసిన పాండిత్యజ్ఞానశూన్యు లున్నంతవఱకే యతని సాహిత్యముండును గానవిద్వల్లోకములో నతనికి సమర్థత లేదు. ఉత్తమకవి తనసామర్థ్యమువలన ప్రజలనే తనవంకకు లాగుకొనవలయును. అతడే వారిభావముల కనుగుణముగు శైలిలో వ్రాయుచు తదిచ్ఛానుసారంబుగ గంతులువేయక యితరులకు మార్గదర్శకుడు కావలెను. పండితులవద్ద కవి వ్రాసినగ్రంథమును పండితులకు చూపిన వారు చప్పగా షడ్రసోపేతముగు భోజనమువలె లేదని యాక్షేపము చేసినవారు మౌనవ్రతమూనవలసినదే కాని మాఱాడుటకు నోరాడదు. ఇట్లు పండితబృందము నిరక్షరాస్యులగు పామరులు— రెండు భిన్నప్రకృతులను రంజింపజేయుటకు కవి యిరువురయభిప్రాయానుకూలముగ వ్రాయవలెనన్న నది యసంభవము. అందఱు పోతన భాగవత మర్థమగుచున్నదని యందురే కాని భాగవత మర్థమయినవారు మహానుభావులే. ఏవో రెండుపద్యములు తెలిసినంత మాత్రమున పోతనామాత్యునిభాగవతము పూర్తిగ నర్థమగునా? పోతన యేయాదర్శముల ముందిడుకొని వ్రాసెనో యాతనిభక్తి భావగభీరత లేమి ఈప్రజలు తెలిసికొనిరా ? తెలిసికొనినవా రొక్కరు లేరు. అందఱు "అలవైకుంఠపురంబులో" యనుపద్యమును చదువుచుందురే కాని దానిలో యేభక్తిభావగభీరత వ్యక్తము చేయబడెనో యెవ్వడెఱుగును? చులకని శైలిలో వ్రాయబడిన పద్యము లర్థమయిననుటతప్ప "పూరించెన్ హరి పాంచజన్యము కృపాంభోరాశిసౌజన్యమున్" అనుపద్యము వారి కర్థమయినదేమో తెలియకున్నది. పోతనామాత్యునిభాగవతము ప్రజాసాహిత్యము కాబోలును. నేడుకూడ నర్థస్ఫురణకై రచింపబడియెడుసాహిత్య మెంతో గలదు కాని దానినర్థము చేసుకొనువారెవ్వరు? "శిలవోలెం గదలంగలేక" యనుపద్యము నిజముగ శిలాస్ఫురణము కల్గచేయుచున్నది. నేటిసాహిత్యముకూడ యెంతమట్టు కర్థమగుచున్నదా యనునది విచారణీయాంశము. వాదపద్యములు వారికర్థము కాలేవు. అందులో పద్యము యొక్క ప్రతిపదార్థ మర్థమయినను దానిలో నర్థభావగంభీరతలు వారికి తెలియవు. పోయి యాకవులనే యర్థ మడిగిన వారు "మేమే" యవస్థలో వ్రాసితిమో మాకే తెలియ దందురు. అప్పుడు నేటి సాహిత్యము ప్రజాసాహిత్య మెట్లగుచున్నది? పూర్వుల ప్రౌఢభావపటుత్వప్రధానగ్రంథములు ప్రజాసాహిత్య మెట్లగుటలేదు? సాహిత్యమునకు ప్రధానము రసము. సాహిత్యము ప్రచారమునకై యుపయోగింపవలెనన్న నది యసంభవము. సాహిత్యపరమావధి

సద్యఃపరనిర్వృతి—కాంతాసమ్మితోపదేశమే కాని ప్రచారము కానేరదు. నేడు వ్రాయ
బడునదంతయు సాహిత్యము కానేరదు. కాని వారు దానిని సాహిత్యముగ పరిగణించి
వారాత్మను సంతృప్తిపొందుచున్న మన మేమి చేయగలము? ఇంతకు వారు సాహిత్య
పదార్థసమన్వయమును చక్కగ వాకొనిన జాలు తదితరము లవసరములు లేవు.

అదియునుగాక నేడు కావ్యవస్తువు ప్రజాసంబంధమైనదిగా నుండవలెను. రాజకీయ
సంబంధముగా నుండవలె ననువాద మొకటి చెలరేగినది. అందులో శృంగారమే రస
ముగా నుండకూడదు. సర్వరసములకు ప్రాతిపదిక యగు శృంగారరసము లేనిదే కావ్యము
వ్రాసి సాహితీలోకమును మెప్పించిన నతడు మహనీయుడే! కవిత్వ మననేమి? ఏవిషయము
నైనను శృంగారముగా చక్కగా రమణీయార్థక ప్రతిపాదకమయిన రసాత్మకవాక్యములో
చెప్పవలయును. అలంకారము, శృంగారముగా లేనికవిత్వము నక్షత్రక్షపాకరులు లేని
వైహాయసమువలె శోభావిహీనముగ నుండును. కాన కవిత్వమున నింటిముందు దిబ్బలు
వర్ణించవలెనేమో తెలియరాకున్నది. శృంగార మిష్టములేకపోయిన షోకుషోకగువిన్యాసము
లేలనో తెలియరాకున్నవి. అది యెందు కింక పోనిండు. ఈ ప్రజాసాహిత్యయాథార్థ్యము
సాహిత్యాభిమానులగుపాఠకులే నిర్ణయింతురుగాక! కావ్యవస్తువు ఉదాత్తముగ నుండ
వలెను కాని హీనముగ నైచ్యస్ఫురణముగ నుండకూడదు.

తరువాత నేటి ఆంధ్రసాహిత్యయుగ మొకవిమర్శనయుగము. విమర్శనశబ్దనిర్వచన
మును మొదట తెలుసుకొనవలయును. విమర్శన మనగా నొకగ్రంథంబును సాకల్యముగ
స్తనశల్యపరీక్ష గావించి యందులో నిభృతమైయున్న గుణాగుణముల చర్చింపవలయును.
దీనిలో నభిమానోద్రేకము లుండరాదు. అతడు కేవలము కవిపై విమర్శన మని పేరుపెట్టు
కొని దోషనిరూపణచేయుచున్నారు. విమర్శనాసాంప్రదాయముల నతిక్రమించరాదు.
ఈవిమర్శనశబ్దము కేవలము సంకుచితార్థమున నేడు వాడబడుచున్నది. కేవల దోషనిరూ
పణ యనియే విమర్శన మని వ్యవహరించుచున్నారు. విమర్శనము మనకు క్రొత్తది నాంగ్ల
సాహిత్యమునుండి సంగ్రహింపబడినవి. ఆంగ్లభాషావిమర్శకాకాశప్రభాతనక్షత్రమగు
కార్లైలుమహనీయుడు కవియొక్క ప్రతిభావిశేషములను వాక్ప్రపంచమునకు తెలుపువాడు
విమర్శకుడే యనియు, విమర్శకున కొకాంతరంగికదృక్పథ ముండవలయు ననియు, నతడు
సహృదయుడై కవిహృదయప్రవేశము చేయవలెనని నొక్కివక్కాణించెను. ఈయుద్బోధ
జరిగినతర్వాత నాంగ్లసాహిత్యమున నసంఖ్యాకములగు విమర్శనాగ్రంథములు వెలువడినవి.

ఇందు విమర్శనకు మార్గదర్శి శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు. వీరి కవిత్వతత్త్వ
విచారమే యీవిమర్శనమున కంతటికిని పునాదియై నిలచినది. అతనితర్వాతనే నేడు
విమర్శకవ్యాసములు సాహిత్యసంబంధవ్యాసములు సారస్వతోపన్యాసములుకూడ (రాళ్ల
పల్లివంటివారివి) జరుగుచువచ్చినవి. కాని మనయాంధ్రసాహితీలోకము కార్లైలు మహ
నీయునివాక్యము సంపూర్ణముగ నర్థముచేసుకొని తదావశ్యకతకవశ్యమని గుర్తించినట్లు
లేదు. ఇట్టి విమర్శన నే డత్యవసరము. ఏలన పూర్వసాహిత్య మర్థముకా దని

యందులో యేదో బండ్లు గుండ్లు పిశాచము లున్నవని నొకదురభిప్రాయము ప్రాకిపోయి నది. అటువంటిదురభిప్రాయము రూపుమాపుటకు చక్కనివిమర్శనగ్రంథము లత్యావశ్య కములు. పూర్వసాహిత్యము మంచిది దానిలో పిశాచములు లేవనియు వారిని మరల సాహిత్యపఠనోన్ముఖులచేయవలెను. దానికి విమర్శనాగ్రంథము లవశ్యమావశ్యకము లయినవి. అదియును షేక్సుపియరుపై నెన్నియో విమర్శనాగ్రంథములున్నవి. అనగా నాతనిని భిన్నవ్యక్తులు భిన్నముగ నర్థముచేసికొనిరనుటయే కాని నేడు కాళిదాసు శాకుంతలముపై నొక్కగ్రంథమైనను లేదు. (శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి "కాళిదాసుని కళాప్రతిభలు"తప్ప). పైగా కాళిదాసు నర్థముచేసుకోగలవాడు లేడు; చేసుకొన నవ సరముకూడ లేదు.

నేటి ఆంధ్రసాహిత్యస్థితిగతులు గోల్డుస్మిత్తునాటి యాంగ్లభాషాస్థితిగతులవలెనే ఉన్నవి. అంతట నసూయరాజ్యమేలుచున్నది. రచయితలకు ప్రోత్సాహోత్సాహములు లేవు. అందును ప్రతికాధిపతు లెఱ్ఱసిరాతో గుర్తుపెట్టి వారి నభిరుచి కనుకూలముగ లేవని నిర సించుచు వారిని పరాభవించుట జరుగుచునే వున్నది. ఇవన్ని యిట్లుండగా నేడు నవ్య సాహిత్యములలో మంచిసుమములు లేకపోలేదు. కాని వీనిలో కథానికా—ఏకాంకిక— కావ్యానికలే యుత్తమములు. మొదటిరెంటిలో సామాన్యవ్యవహారభాష వ్రాయ వచ్చును. దానివల్ల ప్రజలకు సామాన్యముగ నీనవ్యసాహిత్య మందుబాటులో నున్నది. కాని యీసామాన్యభాష కావ్యానికవిమర్శనలకు వాడవలయు ననుట అసంబద్ధవాదన.

ఉదాత్తసాహిత్యము శాత్తముగనుండవలయును. సద్ధ్వనియోగపరచుటచే సాహి త్యము విశ్వమానవకల్యాణసౌభ్రాతృత్వమున కుపకరించును. సద్యఃపరనిర్వృతిని కాంతా సమ్మితోపదేశము ఇత్యాది కావ్యపరమావధులపరమాదర్శముగ నిడుకొని సాహిత్యమున ఇచ్చవచ్చినట్లు ప్రయోగింపరాదు. ఏదే నొకవిమర్శనగ్రంథమును సుమారు వేయిపుటలది ఉదాత్తవస్తువుగలిగియుండవలయును. కావ్యము వ్రాసినచో కళాపూర్ణోదయమువలె నవ్యత్వమాపాదించుచు సుమారు వేయిపద్యములకు తక్కువగాకుండ మనోహరదివ్య ఇతివృత్తముతో సహృదయ హృదయంగమముగ వ్రాయుట మంచిది. గ్రంథకర్తయొక్క సాహిత్యప్రజ్ఞానుభవసంపత్తులు గ్రంథకర్తవ్రాసినగ్రంథములో వ్యక్తము కావలెను. మంచిగ్రంథములు వ్రాయక మంచియభిప్రాయము లొసంగనిపత్రికలను తిట్టుటకూడ బుద్ధి తక్కువయే.

సాహిత్యమందున్న నేర్పంతయు శిథిలపరబంధగ్రథనమందు కలదు. సాహిత్య మొక శిల్పము. కావున నీవిషయమును బాగుగ గుర్తించి సాహిత్యోపాసకు లట్లాచరించుటలేరు. పండితు లెప్పుడును సాహిత్యాభిమానుల కెప్పుడు ప్రోత్సాహమిచ్చుచు దోషముల దిద్దు కోవలయునని చెప్పుదురుగాని పండితమన్యులవలె "ఏమిశావులే గ్రంథకర్తవైనావా" యని యీర్ష్యావ్యాళసందష్టహృదయముతో చెప్పరు.

## “నేటి ఆంధ్రసాహిత్యస్థితిగతులు”

ఈనాటియాంధ్రసాహిత్యస్థితిగతు లీవిధముగ నున్నవి. మరల ప్రబంధయుగ మరుదెంచు నని మరల సాంధ్రభారతికి జోహారు లర్పించుదినములు అరుదెంచునని యెంచి మంచిప్రబంధరాజములవ్రాసి కాలనిరీక్షణముకై వేచియున్నారు. ఎన్నియో గ్రంథములు వ్రాయుటకన్న నేదో మహత్తరేతివృత్తము గలిగినగ్రంథ మొక్కటి వ్రాయుట మేలు. దానివలన పాఠకునికి మంచిప్రయోజనము కలుగును. అది విశ్వమానవ కల్యాణసౌభ్రాతృత్వాని కుపకరించవలెను. సర్వాభరణభూషితయై సకలసుగుణభూషితయై, శృంగారాంగనయై, చూపరులదృష్టి కానందమును సంభ్రమమునుగూర్చిన యాంధ్ర భాషావధూటి నేడు బ్రహ్మరక్కసియై రాజమార్గంబుల సర్వాభరణముల తీసివైచిన యోగినివలె తిరుగుచున్నదన్న పండితవాక్యము ప్రాతినిధ్యమువహించినది. ఆంధ్రభారతి మరల శృంగారాంగనయయి మరల వరలవలయును. సువర్ణము మేలిమిదైన నాభరణ మెప్పటికి మెరయుచుండునట్లు సాహిత్య ముదాత్తమయిన నాచంద్రతారార్కముగ చిర స్థాయిగ నుండును.

ఇప్పటికైనను ఆంధ్రసాహితీలోక ముదాత్తసాహిత్యసేచనము నభిలషించుననియాశించుచున్నాను. సాహిత్య పిపాసువు లిందలి గుణములనే పాటించి దోషములను మన్నింతురని సాదరాభిమానముగ నభ్యర్థించుచున్నాను.

ఇంతటితో, సెలవు.

భా షో ద్ధా ర క

# శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిషష్టిపూర్తిప్రసక్తి

శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు, బి. ఏ., బి. ఎల్.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయశాలివాహనశకగతవర్షంబులు 1808 సంలకు సరియగు శ్రీ సర్వజిన్నామసంవత్సర చైత్ర శుద్ధ త్రయోదశి గురువారమునకు సరియగు క్రీస్తుశకమున తే 3-4-87 దిన శ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రులవారికి మద్రాసు తండయార్పేటలో పుత్రోత్సవముకలిగినది. ఈపుత్రులే ఈనాటి మనషష్టిపూర్త్యుత్సవస్థానీయులగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు.

ఈయుత్సవము శ్రీవేంకటేశ్వరులుశాస్త్రులవారిషష్టిపూర్తిప్రసక్తమయినను మఱి యొకదృష్టిచే శ్రీవావిళ్లవారిముద్రాంకనశాలాస్థాపకశతవార్షికోత్సవముగను గనుపడునటు లున్నది. 1941 సంవత్సరమునజరిగిన త్రిలిఙ్గరజతోత్సవనివేదికాదులవలన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు ముద్రాక్షరప్రచారమును 1852 సం॥ ప్రాంతముల ప్రారంభించి నటుల తెలియుచున్నది. అట్లగునెడల నాటినుండియు నేటికి తొంబదియారుసంవత్సరములే యగుచున్నదిగాని నూరేండ్లు నిండలేదందురు కాబోలును, స్థూలముగ నట్లగుపడినను యథార్థమున మనఆంధ్రగణితసిద్ధాంతములప్రకార మధికమాసాదులకాలముగూడ చేర్చుకొనిజూచిన నూరేండ్లు పూర్తియగునటులున్నది. 1852 సం॥నుండి యిప్పటివరకు గడచిన దీర్ఘకాలమున కలిగినయధికమాసాదులసంఖ్య చాల వచ్చును. అధికమాసముల నిటుల జేర్చికొనుటకు ప్రమాణముగలదా యని విచారించిన మహాభారతమునందలి విరాటపర్వములోని యుత్తరగోగ్రహణపర్వ మాధారమగుచున్నది. ఉత్తరసారథియై అర్జునుడు యుద్ధరంగమునకు వెడలుట గని దుష్టచతుష్టయము యజ్ఞాతవాసకాలప్రతిజ్ఞాభంగమయి నటుల సంతోషమున గుసగుస లాడుచుండగ భీష్ముడడ్డుకొని "రెండవయేట నొక్కం డధికమాస మిట్లెక్కిన యన్నెలలెల్లఁ గూర్చికొనఁ బదమూఁడుహాయనములు తప్పక నిన్నటితోడనిండె" నని దెలిపి వారల సంశయమునివారణచేసియున్నాడు గాన నీనాటి ప్రమోద మిటు షష్టిపూర్తిప్రసక్తముగను నటు శతశారదోత్సవముగను విలసిల్లదగి యున్నది.

షష్టిపూర్తి యనగ నొకపురుషుని కరువదియేండ్లు నిండి అరువదియొకటవది ప్రారంభ మయినపిదప జరుగుప్రక్రియగ నున్నది. షష్టిపూర్తి యనునది యొక వైదికక్రియగ పరి

(1) పంచ మేపంచ మేవర్షే ద్వౌమాసావుపజాయతః. ఏషామభ్యధికామాసాః పంచచద్వాదశక్షపాః త్రయోదశానాంవర్షాణామితి మేవర్తతే మతిః. విరాటపర్వ అ. 52. కలకత్తాప్రతి.

గణింపబడినటు లగపడదు. పెండ్లిఅయిన పదియారవనాఁ డాంధ్రులు పదియారుదినముల పండుగ జేసికొనునట్లిదియు "మనవానికి అరువదియేండ్లునిండి ఒకషష్టిచక్రముమారినదను" సంతోషభరమున జేయబడుకౌతుకోత్సవముగ నున్నది. దీని నాచరించు ఆచారముమాత్రము దేశవ్యాప్తిగలిగియున్నది. షష్టి యను నొకదేవత నధిష్ఠింపజేసి శ్రీ ఉమామహేశ్వర లక్ష్మీనారాయణాదిపురాణదంపతుల సపర్యయు జరిపెదరు. ఇక చిరజీవిత్వజ్ఞాపకముగ అశ్వత్థామ బలి వ్యాస కృప పరశురామాంజనేయ విభీషణ మార్కండేయాదులస్మరణయు ఆవాహనాదిపూజలును జరుగును. ముఖ్యముగ వైదికప్రచారముగ నాయుష్యహోమాదుల నిర్వహింతురు. కర్త అనగ షష్టిపూర్ణుఁడయినపురుషుడు సద్వితీయుడుగ నుండ నీ సందర్భమున నాజాయాపతులకు తిరుగనప్పుడు వివాహసంకేతము జరుపుట గలదు. ఈ ప్రకరణ మిందొకచిత్ర మన దగును. ఈవివాహలాంఛనమునకు సంకల్ప మెట్టిదో? ఇది మన్వాదులు కథించియుండు వివాహభేదములలో దేనిక్రింద జేరెనో? రజస్వలావివాహములను సర్దశాసనముల నాక్షేపించుసనాతనపరాయణులు దీనికవ్యాఖ్యదానముగ గ్రహించెదరా? ఇది యొకకౌతుకోత్సవ మనుటయు శతదోషములును శతాపరాధములును సమసిపోయి వేడుకలలో నొకవేడుకగ జరిగిపోవును.

వైదికమతానుయాతలుగ నుండువారికి పురుషాయుఃప్రమాణము నూరేండ్లుగ నగపడుచున్నది. శ్రీకృష్ణాదులు నూటఇరువదియేండ్లు ప్రాణధారణజేసినటుల గ్రంథప్రమాణము లున్నవి. సనకసనందనాదు లెప్పటికిని బాలురు—మార్కండేయు డెప్పటికిని పదియారేండ్లవాడు అగుటయం దేమితాత్పర్యములో? ఇక "షష్టిర్వర్షసహస్రాణి షష్టిర్వర్షశతానిచ" యనుకొనిన వారియాయుఃపరిగణన మెట్లు? బైబిలుగ్రంథమున మోసెస్సు ప్రవక్త పురుషాయుఃప్రమాణము డెబ్బది యనినట్లున్నది (three score and ten) ఆబైబిలులోని వంశావళులలోననే ఎనిమిదినూర్లు తొమ్మిదినూర్లుఏండ్లు బ్రతికినమహాపురుషులచరిత్రాంశము లగపడుచున్నవి. పరిగణనములిట్లుండ షష్టిపూర్తియను నొకవ్యవస్థ అరువదేండ్లకని ఎటులుకలిగినదో? ఆయుర్వేదరీత్యాగాని జ్యోతిషికరీత్యాగాని పౌరాణికరీత్యాగాని దీనికాధారముండునా? ఇండియన్ లిమిటేషన్ ఆక్టును శాసించినస్మర్తలుమాత్ర మేయుపజ్ఞచేతనో ఆధమన (ఆరుమాసు) ప్రకరణములం దరువదియేండ్లనె స్మరించియున్నారు. వైద్యగ్రంథములందు బాలారిష్టము లనియు కైశోరగండము లనియు ఆయాయివయోఽవస్థల నాశ్రయించినవి కొన్నికొన్ని చెప్పబడియున్నవి. శ్రీకృష్ణునిజీవితమునికొన్నిటి కుదాహరణములును జూపబడుచున్నవి. ఏండ్లు సందుకట్లు అని మనవారిలో ముఖ్యముగ శిశువుల ఆరోగ్యవిషయమున జెప్పుకొనుట గలదు. అట్టిఘట్టముల ఇంగిలీషున క్లైమాకరిక్ (climacteric) అందురు. ముప్పదిరెండు ముప్పదిమూడవవయస్సును అరువదిరెండు అరువదిమూడుప్రాంతములును ఈగణమున చేర్చెదరు. యేసుక్రీస్తుప్రభువుయొక్కయు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారియొక్కయు మహాఘనుడు అలెగ్జాండరు ది గ్రేట్ యొక్కయు వయఃకాలపరిణామము వీక్షక్లైమాక్టరిక్కు దశావిశేషమున సమన్వయింపబడుచున్నది. ఈ

ముగ్గురికిని పరమావధి ముప్పదిమూడు సరికట్లుగ నగపడుచున్నది—మనషష్టిపూర్త్యుపక్రమము పై వానియందెందును జేరుసటుల లేదు. ఇది స్వతస్సిద్ధమైన యొకపరిగణనముగ నున్నది (suijuris).

దేశకాలపరిమాణములందు కొన్నియెడల షట్సంఖ్యావిభాజ్యములును కొన్నియెడల దశకసంఖ్యావిభాజ్యములును ప్రయోగింపబడుచున్నవి. వీనినింగిలీషున సెక్సజసిమల్ (sexagesimal) అనియు డెసిమల్ (decimal) అనియు చెప్పుటకలదు. ఒకసంవత్సరము నొకమాత్ర (unit)గా జూచినయెడల దానియందలి ఋతువు లారు నెలలు పండ్రెండుదినములు మున్నూటయరువది. ఇట్లు ఆరింటినంటిన సంఖ్య లగపడుచున్నవి. ఘటికాపరిమాణమునను ఈసంఖ్యయె యగపడుచున్నది. దినమునకు ఘటిక లరువది ఘటికయందు నిమేషము లరువది. ఘంటలక్రింద జూచినను దినమునకు ఘంటలు ఇరువదినాలుగు (రెండుపండ్రెండ్లు). ఈయారు యొక్క ప్రాభవముననె అరువదియేండ్లొకమాత్రగ (unit) గణించి అరువది సంవత్సరములచక్ర మేర్పరుపబడినటులున్నది. వేదపాఠకులకు తల్లింగమంత్రములున్నట్లు అరువదింటికిని అరువదిపుంలింగనామములు పెట్టబడినవి. ఇవి దక్షపుత్రనామములని యొకరనిరి—దక్షపుత్రనామములో లేక యే యితరమహావీరపురుషనామములోగాని ప్రస్తుతస్థితిలో అన్వర్థములుగాక లింగమాత్రములుగ నున్నవి. గంధద్వారాందు రాధర్స్వామిత్యాది మంత్రమునకును దేవతార్చనకాలమున సాలగ్రామాదులకు గంధము సమర్పించుటకును గంధశబ్దసంబంధముదప్ప మరేమియు నగపడుటలేదు. అట్లుగాక వీనియందు జ్యోతిషరహస్యము లెవ్వియైన సంపుటీకృతము లయియున్నయెడల తజ్ఞులు వానిం దెల్పదగుదురు.

ఈవిచారము లెట్లున్నను మనదేశమున "షష్టిపూర్తి" యొక గొప్పపండుగగను శాంతికపౌష్టికవైదికక్రియల కాస్పదముగను బంధుమిత్రపరివారాదులకెల్ల నత్యంత సమ్మోదోత్సాహదాయకముగను అనుష్ఠింపబడుచున్నది. విత్తముకొలది విభవమునినటుల ధనాఢ్యు లీసందర్భమున తమయెత్తుద్రవ్యమును (నాణెములను రత్నాదికములను) అసంకుచితముగ భూరివిశ్రాణనములజేయుటయు గలదు. బహుశః తులాభారోత్సవమును షష్టిపూర్తితో కూడ జరుపబడునటులున్నది. (ప్రాయశ్చిత్తకాండలో నొకతులాభారమున్నది గాని అది దోషపరిహారార్థమై యున్నది. షష్టిపూర్తి తులాభారమువలె కేవల దానగుణప్రధానమైనదిగాదు).

ఈషష్టిపూర్తిసందర్భమున శ్రీమంతులు, చిరంజీవులు, ఆయుష్మంతులు, శ్రీవావిళ్ల వేంకటేశ్వరులుశాస్త్రులవారు మహాజనౌఘములచే సుశ్లోకప్రగీయమానులై వారియాశీరభినందనములబలమున చిరతరాయుష్మంతులై యారోగ్యవంతులై సంపన్నులై ఇతోధికములగు కీర్తివ్యాపకప్రతిష్ఠలతో వెలయుదురుగాత!

వావిళ్లవారనగ గ్రంథముద్రణప్రకటనలకు పర్యాయపద మనవచ్చును. ప్రథమదశలో శ్రీరామస్వామిశాస్త్రులవారు శ్రీమాన్ సరస్వతీ తిరువేంకటాచార్యులవారితో కలసి సరస్వతీనిలయముద్రాక్షరశాలను కొలదికాలము సాగించినటు లున్నను వీరిసొంతఅచ్చుకూటము

నకే ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల యనుపేరు ప్రతిష్ఠలు నిలిచినవి. ఆపేర ప్రచురింపచుండిన కాలమున నచ్చుపడిన పుస్తకములు సకృత్ప్రాయముగ నందందు గలవు. 1834సం॥లో నందు ముద్రింపబడిన నరకాసురవ్యాయోగమనునాటకగ్రంథ మీప్రాయసకానియొద్ద నున్నది. శ్రీరామస్వామిశాస్త్రులవారినిర్యాణకాలమున మనవేంకటేశ్వరులుగారు పసివారుగ నుండిరందున ఆయచ్చుకూటము రామస్వామిశాస్త్రులవారియనంతరము కొలదికాలము విశేష వ్యాపకము లేకయుండినది. అయినను శ్రీవేంకటేశ్వరులుగారు చిన్నతనముననె విద్యార్థి దశలోనుండిన కాలముననే దీనినిర్వహణమునుబూని ఆకాలముననె యచ్చుకూటము యొక్క ప్రాతపేరునుమార్చి వావిళ్లప్రెస్సు చేసిరి. ఈనామపరివర్తనము జరిగియు దాదాపు నలువదేండ్లుదాటినటులున్నది. ఈనూతనాభిధానమున నీముద్రాంకనశాల దినదిన ప్రవర్ధమానమై నేటి గొప్పయాకృతియు విస్తారవ్యాప్తివ్యాపృతులును బడసి తెలుగు అరవము నాగరము ఇంగ్లీషు లోనగుభాషాగ్రంథముల నచ్చొత్తింపగల సాధనసామగ్రులుగలిగి వెలయుచున్నది. శ్రీరామస్వామిశాస్త్రులవారికాలముననె వారు ముద్రాక్షరముల నచ్చుపోయించుకొనుటయు సాగించుచుండినటుల తెలియుచున్నది. తెనుగు అచ్చు అక్షరములలో ఇంగ్లీషుబాడి అనబడుప్రమాణముగలనక్షరముల వీరే ప్రథమమున శ్రమపడి వేయించినటులను తెలియుచున్నది. పుత్రాదిచ్ఛేత్పరాజయమనినటుల శ్రీవేంకటేశ్వరులుగారు తండ్రిగారిని మించి నానారకములగు అచ్చుఅక్షరముల పోతపోయించుటయేగాక అచ్చువేయుయంత్రమునుకూడ నిర్మింపదగు సాధనసంపత్తి కలిగియున్నారు. వీరిపుస్తకములఅంగడి మద్రాసున ఎస్ప్లనేడ్ అను గొప్పరాజవీధియందు ప్రసిద్ధమగు పచ్చైయప్పకాలేజికిసమీపముననున్నను కాపురమును అచ్చుకూటమును మద్రాసు తండయార్పేటలో తిరువత్తియూరుహైరోడ్డులో నున్నది. అంగడియుండువీధి నడిపట్టణమున వ్యాపారమతిశయముగ జరుగునట్టియు పెద్దపెద్దపాఠశాలలుండునట్టియు ప్రదేశముననున్నది. కాపురముండునదన్ననో శ్రీరామస్వామిశాస్త్రులవారు లోనగువారు చెన్నపట్టణము ప్రవేశించిన యాప్రాతకాలమున తండయార్పేట ప్రాంతములె పేరుగలిగియుండినవి. ఆకాలపు గొప్పగొప్ప ఉద్యోగులును వ్యాపారస్థులును ఇతరఆఢ్యులును ఆపేటలలోనె పెద్దపెద్దభవనములు బంగాళాలు కట్టించుకొని కాపురములుండిరి. ఆదినములలో మైలాపూరు ప్రసిద్ధముగాదు. 1830 సం॥ ప్రాంతములో మద్రాసు సుప్రీముకోర్టుప్రధానద్విభాషి (Chief Interpreter) శ్రీఏనుగుల వీరాస్వామయ్యపంతులుగారును, ఆకాలములో అన్నదానములకు ప్రఖ్యాతిజెందిన శ్రీతంజావూరిరామానాయుడుగారిసత్రములు సాహుకారులలో గొప్పవారుగనుండిన శ్రీబాలముకుందదాసుగారిబంగాళాలు, చర్మముల వ్యాపారములో ప్రసిద్ధులుగనుండిన శ్రీపిట్టి మునుస్వామి శెట్టిగారిభవనములు (వీరు మనకాలములో మహాకీర్తిమంతులై వెలసియుండిన శ్రీపిట్టి త్యాగరాయశెట్టిగారి అన్నగారు) ఆప్రాంతకాలమున అనేకభాషలునేర్చి సంస్కృతమున ఇంగిలిషున గొప్పపండితులని పేరువడసి మద్రాసుస్మాలుకాజుకోర్టు ప్రధానన్యాయమూర్తిగనుండిన (Chief Judge) శ్రీరంగనాథశాస్త్రులవారు (మనకాలములో

హైకోర్టున్యాయమూర్తిపదవిని చాలకాల మలంకరించిన శ్రీన్యాయమూర్తి సర్: సి. వీ. కుమారస్వామిశాస్త్రిగారి పితామహులు, శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రి, దివాన్‌బహదర్ ముట్లూరు ఆదినారాయణయ్య, శ్రీ గాజుల లక్ష్మీనరసింహశెట్టి, సర్: పీ. త్యాగరాయశెట్టి, ఆవరబిలు పీ. అనంతాచార్యులు, శ్రీకొల్లా వేంకటకన్నయ్యశెట్టి ఇత్యాదిమహామహులు ఆకాలమున ఆప్రాంతములనివసించుచుండిరి. ఆనాటిబంగాళాలయొక్కయు తోటలయొక్కయు హతశేషము లిప్పటికిని తిరువత్తియూరుహైరోడ్డుప్రాంతముల జూడనగును. ఇంత యేల? ఎచట నున్ననేమి? యథావృక్షస్యసంపుష్పితస్య దూరాతిగంధోవాతి యనువైదికన్యాయము ననుసరించి వారధి వసించినస్థలముననే వారు ప్రఖ్యాతులై అచటికె యాకర్షించుచుండిరి. వీరు ప్రకటించిన పుస్తకములపట్టిని (కేటలాగు) చూచిన వానిసంఖ్య ఆశ్చర్యముగొలుపును. వేదములు మొదలు స్థలపురాణములు పుక్కిటిపురాణములు లోనగునవి యచ్చుననున్నవి. తండ్రిగారివలెనె వేంకటేశ్వరశాస్త్రులవారును తామచ్చువేయనుండు గ్రంథముల పండితులచే పరిశోధింపజేసి అచ్చునకుబూనుదురు. ఇప్పటిదినములలో శ్రీకంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రిగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు, శతావధాని శ్రీ పురాణము సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులు, కళాప్రపూర్ణమహోపాధ్యాయ కావ్యతీర్థ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిసమానస్కంధులు వీరిపరిశోధకగణముననుండిరి. ఆధునికకవులగ్రంథము లనేకములు వీరివలననె వెలువడి కీర్తిగాంచుచున్నవి. వీరు విద్వజ్జనాదరణమునకు కవిజనాదరణమునకు ఆకరమై వెలయుచున్నారు.

గ్రంథముద్రణప్రకటనవ్యాపారములయందె సక్తులయియుండక మన వేంకటేశ్వరులుగారు లోకసంగ్రహప్రయుక్తములగు నితరవ్యాపారములందును పాలుగొనుచుండిరి. కొంతకాలము మద్రాసు మునిసిపల్ కార్పొరేషన్‌లో సినిమాబోర్డుకో ఆపరేటివ్ సెక్ట్రలుబ్యాంకీ పోర్టుట్రస్టు సభ్యులుగ నుండిరి. పచ్చయ్యప్పకాలేజి ట్రస్టుబోర్డులో నుండిరి. భారతస్వారాజ్యపక్షవాదులు, కాంగ్రెసునందభిమానముగలవారు. ఇటుల వీరిప్రాభవము పలుముఖములవ్యాపించి దేశోద్ధరణమునకు భాషోద్ధరణమునకు విద్యావ్యాపనమునకు అత్యంతసహకారమై విరాజిల్లుచున్నది. వీరు చిరాయువులై ఆరోగ్యవంతులై ఇతోధికములగు దేశభాషావిద్యాభ్యుదయకవ్యాపారములవిజయములనొంది వర్ధిల్లుదురుగాత! అచ్చొత్తించుట ప్రకటించుటయెగాక "ఈవిషయముల వావిళ్లవారిగ్రంథములు పరమప్రమాణములు" అనుప్రథకలుగునటుల గొప్ప ప్రమాణగ్రంథముల నిర్దుష్టముగ నచ్చువేయించి ప్రకటించి అనితరమగుకీర్తినిగూడ వీరు పొందదగుదురు. శ్రీ వావిళ్లముద్రాశాలయు శ్రీశాస్త్రులవారియాజమాన్యమున దినదినాభివృద్ధికలిగి అద్వితీయమై ప్రకాశించునటులను లోకోపకృతిచేయునటులను శ్రీశాస్త్రులవారికి సకలవిధములగు సహకారసంపత్తికలిగియుండునటుల అశేషాంధ్రజనమును సహాయపడవలయును.

---

భాషోద్ధారక

# శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి ఆధ్యాత్మికభాషాసేవ

శ్రీ సురభి తులసీదాసుగారు, బి. ఏ., బి. ఎల్.

శ్రీ భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వర్లుశాస్త్రులుగారి భాషాసేవ సర్వతోముఖమైనది. గత అర్ధశతాబ్దముగా శ్రీ వేంకటేశ్వర్లుశాస్త్రులుగారు ఆంధ్రగీర్వాణద్రవిడభాషల నుద్ధరించుటకు గావించినకృషి అపారమైనది. "భాషోద్ధారక" అనుబిరుదము కొంత సమంజసముగా కన్పట్టుచున్నను శ్రీ శాస్త్రులుగారిభాషాసేవకు అది తగినబిరుదము కాజాలదు. శ్రీ శాస్త్రులుగారు మహామేధావులు. గొప్పపండితులు. విమర్శకాగ్రేసరులు. విజ్ఞానసంపన్నులు. సుప్రసిద్ధపత్రికారచయితలు. భాషాభిమానులు, భాషాపోషకులు. అట్టి ఆంధ్రభాషోద్ధారకుని ఉచితరీతిని గౌరవించి "కళాప్రపూర్ణ" అను బిరుదప్రదానమును శ్రీ శాస్త్రులవారికి షష్టిపూర్తిఉత్సవసందర్భమున గావించి ఆంధ్రవిశ్వకళాశాలవారు తమ ఆంధ్రభాషామ తల్లిని గౌరవింతురని భావింపఁబడినది. అట్టి ప్రఖ్యాతభాషాసేవకుని ఉచితరీతిని సన్మానించు భాగ్యము ఆంధ్రవిశ్వకళాశాలకు నింకను అబ్బలేదు కాబోలు!

ఈసమయమున శ్రీ శాస్త్రులుగారి ఆధ్యాత్మికభాషాసేవనుగుఱించి కొంచెము ముచ్చటించి వారు మునుముందు లోకమునకు కావించిన మహోపకారమునకు కృతజ్ఞతను తెలుపవలసియున్నది. శ్రీ శాస్త్రులుగారు మతాభిమానము, ఆధ్యాత్మికవైదుష్యమును సత్సాంప్రదాయముగలనైష్ఠికహిందూకుటుంబములో జన్మించియుండుటచే సన్మతపక్షపాతము బాల్యమునుండియు కలిగినది. ఆదర్శపురుషు లని చెప్పదగు జనకులగు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారును బావగారగు శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులుగారును శ్రీ వేంకటేశ్వర్లుగారికి మార్గదర్శకులు అయిరి. శ్రీ రామస్వామిశాస్త్రులుగారు ధర్మనైష్ఠిక జీవులని వారిముఖారవిందమే చెప్పకచెప్పుచున్నది. పురాణములలో నుత్తమోత్తమ ఆదర్శగ్రంథమనదగు శ్రీమద్రామాయణమును సంస్కృతమునుండి తెలుగుటీకతో ప్రచురించు మహోఘనకార్యమును శ్రీ రామస్వామిశాస్త్రులుగారు పూనుకొనిరి. శ్రీ సుందరరామ శాస్త్రిగారు దీనిని పూర్తి గావించిరి.

శ్రీ వేంకటేశ్వర్లుశాస్త్రులుగారు బాల్యదశలో నుండుటచే వారి బావగారగు శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రులుగారు శ్రీమద్రామాయణము మిగతసంపుటములను ప్రచురించి తమమామగారు పూనిన మహాత్కార్యమును కొనసాగించిరి. శ్రీ రామస్వామి శాస్త్రులుగారు శ్రీశృంగేరిమతముతరపున మద్రాసులో ప్రతినిధిగానుండి అద్వైతమతసిద్ధాంత చర్చలుచేసి మతవ్యాప్తికిచాలాకృషిచేసిన ప్రతిభాశాలురు. శ్రీ చదలువాడ సుందరరామ శాస్త్రులుగారన్ననో శ్రీమద్భగవద్గీతకు విపులవ్యాఖ్యానమును ఆంధ్రమున 7 సంపుటములుగ

రచించిన మహావ్యాఖ్యాత—గీతాభాష్యము దీనిని మించినది ఆంధ్రమున మఱియొకటి లేదు. శ్రీ సుందరరామశాస్త్రులుగారు అధ్యాత్మ రామాయణమునకు ప్రఖ్యాత ఆంధ్ర వ్యాఖ్యానమువిరచించిన సుప్రసిద్ధపండితులు. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు సహజముగ హిందూమతాభిమానము కలిగి ఆధ్యాత్మికజ్ఞానమును ప్రబోధించుగ్రంథప్రచురణమును జేసిన మహనీయులసంపర్కమువలన ఆధ్యాత్మికగ్రంథప్రకటనమునందు విశేషకుతూహలము కలిగి ఉండేవారు. ఇప్పటికిని ఆధ్యాత్మికజ్ఞానప్రకటనమునందు వారికి ఉత్సాహము క్షీణింపలేదు.

శ్రీ వేంకటేశ్వర్లశాస్త్రులుగారు మతగ్రంథములను విరివిగ ప్రకటించి మతసిద్ధాంతములను ప్రజలలో వ్యాపింపజేయుటకు కారణభూతులైరి. కొన్ని మతగ్రంథములు అచ్చులో అప్పటికే నుండినను అవి తప్పులతడకలై, ఆకర్షణహీనములై, పఠనయోగ్యముగానిస్థితిలో నుండినవి. అట్టిస్థితిలో శ్రీమద్రామాయణభారతభాగవతాదిపురాణగ్రంథములను ముద్దులొలుకుఅక్షరములతో అత్యంతాకర్షణీయముగ ప్రకటించి భారతీయమహోజ్జ్వలసంస్కృతిని ఆంధ్రమహాప్రజలలో విశేషవ్యాప్తిపొందుసదవకాశముకల్పించిరి. ఎందరెందరు ఈమహాగ్రంథములనుపఠించి ధన్యులైరో ఎవరికి చెప్పతరము? ఎందరెందరు ఈసద్గ్రంథపఠనశ్రవణములవలన తరించుమార్గముల నన్వేషింపగలిగిరో ఎవరికి చెప్పతరము? ఎందరెందరు యీసద్గ్రంథావలోకనముచే పూతచారిత్రులై తమహృదయకుహరములందు గ్రంథప్రకటనకర్తలైన శ్రీ శాస్త్రులుగారికి కృతజ్ఞతను వెలిబుచ్చిరో యెవరికి చెప్పతరము?

శ్రీ వేంకటేశ్వర్లశాస్త్రులుగారు పురాణేతిహాసములు ఆంధ్రమునమాత్రము ప్రకటించుటతో తృప్తినొందియుండలేదు. ఎంతయో వ్యయప్రయాసలకులోనై The Mahabharata - Southern Recension అను మహాభారతమును అత్యుత్తమప్రతిని సంస్కృతలిపిలో ప్రకటించి పండితలోకమునకు మహోపకారముచేసినపుణ్యమూర్తి - శ్రీ శాస్త్రులవారిఅపారసేవ, మహాభారతము హిందువులఅభిమానగ్రంథమై ఉండునంతవరకును మఱువదగినదికాదు.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు వేదాంతవాఙ్మయమునకు గావించినకృషియును అపారము. వేదాంతశాస్త్రకథనమునకు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు అనుప్రస్థానత్రయము ప్రధానములు. ఉపనిషత్తులకు కొన్ని ముఖ్యమైనవానిని కీర్తిశేషులగు మన్నవ బుచ్చయ్యపంతులుగారు తెనుఁగువ్యాఖ్యానములతో ప్రకటించి కొంతకీర్తిని గడించినారు. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు అనేకఉపనిషత్తులకు తెలుగువ్యాఖ్యానములు వ్రాయించి ప్రకటించిరి. వేదాంతసారమంతయు ఉపనిషత్తులలోనిండి నిబిడీకృతమైయున్నది. శ్రీమద్భగవద్గీత ఉపనిషత్తులసారమని వేదాంతకోవిదులు చెప్పుదురు. ఉపనిషత్తుల నన్నిటిని సేకరించి ఆంధ్రవ్యాఖ్యానసహితముగ రెండుమూఁడుసంపుటములలో ప్రచురించి ఆంధ్రపాఠకలోకమునకు శ్రీ శాస్త్రులుగారు తమషష్ట్యబ్దిపూర్త్యుత్సవకానుకగ ప్రసాదించి యింకను వారికృతజ్ఞతకు పాత్రులగుదురుగాక!

బ్రహ్మసూత్రార్థచంద్రికయను గ్రంథమును బ్రహ్మసూత్రములకు సమగ్రవ్యాఖ్యానముతో పండితపామరజనంబులకు సుబోధకముగానుండునట్లు వ్రాయించి ప్రకటించిరి. బ్రహ్మసూత్రములనుగుఱించి దీనికి మించినగ్రంథము ఆంధ్రమున నింకొకటి లేదని చెప్పవచ్చును.

శ్రీమద్భగవద్గీతను ఆచార్యత్రయమువారివ్యాఖ్యానములతో సర్వజనోపయోగకరముగా నుండునట్లు శ్రీశాస్త్రులుగారు అచ్చువేయించిరి. జిజ్ఞాసువుల కందజేయుచున్నారు. శ్రీమద్భగవద్గీతను ప్రజాసామాన్యమున కందజేయుటకు వివిధరూపములలో ప్రకటించిరి. గోరఖ్‌పూరునందలి గీతాప్రెస్ వారు హిందీభాషలో గీతావ్యాప్తికిచేయుచున్నకృషి శ్రీశాస్త్రులువారు కొద్దిగనో గొప్పగనో చేయుచున్నారు. గీతాసందేశము ప్రజలలో వ్యాప్తిగాంచినకొలది ప్రజలలో ఆదర్శజీవితసిద్ధాంతము లలవడుచుకొని ధన్యజీవులగుటకు మార్గమేర్పడును. దేశభక్తాగ్రేసరుఁడగు లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయుని గీతారహస్యమును సక్రమాంధ్రానువాదము చేయించి ఆంధ్రముముక్షుప్రపంచమునకు శ్రీశాస్త్రులుగారు లభింపజేసిన మహోపకారమును ఆంధ్రమహాజనులు మఱచుట దుర్లభము. అట్టి ఉత్కృష్టగ్రంథము ఆంధ్రమున ప్రకటించుటచే శ్రీశాస్త్రులవారు ధన్యజీవులైరి అనిచెప్పుటలో అతిశయోక్తి యేమాత్రములేదు. లోకమాన్య శ్రీతిలకుమహాశయునిచే ప్రబోధింపబడిన గీతాసిద్ధాంతములు నవభారతదేశమున అనుసరణీయములు. భగవద్గీతలకు శ్రీశంకరులు వ్రాసినవ్యాఖ్యను శ్రీఅల్లాడి మహాదేవశాస్త్రిగారిచే చక్కగ ఇంగ్లీషున తర్జుమాచేయించి ప్రచురించిరి.

ప్రస్థానత్రయగ్రంథములేకాక తదితరవేదాంత, మతగ్రంథములను బహుళముగా ప్రచురించి ఆధ్యాత్మికజీవితము ప్రజలలో పెంపొందింపజేసి శ్రీశాస్త్రులవారు కృతార్థులైరి. పూజ్యపాదులగు శ్రీశంకరభగవానునిచేరచింపఁబడిన ఉత్తమవేదాంతగ్రంథములగు వివేకచూడామణి, సౌందర్యలహరి, శివానందలహరి మొదలుగాగలగ్రంథములును శ్రీవిద్యారణ్యస్వాములవారిచే రచింపఁబడిన వేదాంతపంచదశి మొదలగుగ్రంథములును, నైష్కర్మ్యసిద్ధి, ఉపదేశసాహస్రి, జ్ఞానవాసిష్ఠము విష్ణుసహస్రనామములకు తెనుగువ్యాఖ్య లలితాసహస్రనామములకు తెనుగు టీకలు, అత్యంతముఖ్యములైన వేదాంతగ్రంథములు. వేలకువేలమందికి తమవేదాంతగ్రంథములరూపమున జ్ఞానభిక్ష పెట్టిరనియే చెప్పవలెను. అనేకగ్రంథపీఠికలలో నింకను నెన్నియోవేదాంతగ్రంథములను ప్రకటింపవలెనను అభిలాషను వెలిబుచ్చియున్నారు. శ్రీశాస్త్రిలుగారిఆరోగ్యము సరిగా నుండినయెడల ఎన్నియో వేదాంతగ్రంథములను అచ్చువేయించియుందురు. జిజ్ఞాసువులదురదృష్టవశమున శ్రీశాస్త్రులుగారి అనారోగ్యము, కాగితములవిపరీతాధికధరలు కార్మికులచిక్కులు మొదలగుక్లిష్టపరిస్థితులవలన ఉత్తమవేదాంతగ్రంథములు కొన్నిటిని శ్రీశాస్త్రులుగారు ఆంధ్రలోకమునకు అందజేయుటకు వీలుపడలేదు.

## షష్టిపూర్తి సంపుటము

మొత్తముమీద శ్రీ శాస్త్రులుగారు చేసిన ఆధ్యాత్మికభాషాసేవ యింతింతని చెప్పనలవికాదు. శ్రీ శాస్త్రులుగారు అద్వైతమతాభిమానియైనను అన్యమతములందు ద్వేషభావముగాని నిర్లక్ష్యభావముగాని పూనలేదు. వారు ప్రకటించినమతగ్రంథములు అన్నిమతములవారికి నుపకరించును. అద్వైతులు, ద్వైతులు, విశిష్టాద్వైతులు, మీమాంసకులు, తార్కికులు, శైవులు, శాక్తేయులు, వైష్ణవులు తదితరసమస్తమానవులును తమతమ మతాభిప్రాయముల ననుసరించి మతగ్రంథములను వావిళ్లవారివద్దనుండి పడయవచ్చును.

గురువులు, సాధువులు, స్వాములు, మతప్రచారకులకంటె మతగ్రంథములును వేదాంతగ్రంథములును ఎక్కువప్రచారములో నున్నవి. ఈగ్రంథములవిలువ యింతింతని చెప్పవీలులేదు. ఆంధ్రజాతీయజీవనమందే దృక్పథమును మార్పజాలియుండును. వక్రమార్గమున నడుచుచున్నజీవితములను సక్రమమార్గమునకు మరలించియుండును. ఎందరినో నాస్తికులను ఆస్తికులనుగ మార్చివేసియుండును. సంశయావస్థచే మార్గముగమనించలేని వారిని దృఢచిత్తులనుగా చేసియుండును. దుర్మార్గులను సన్మార్గులను చేయుశక్తి సద్గ్రంథపఠనమువలన కలుగును. దారితెన్నుగానక అజ్ఞానాంధకారములో మునిగియున్నవారికి జ్ఞానజ్యోతి నొసంగును. ఇవి యని యననేల? తరుణోపాయమునకు మార్గములుచూపును. వేదాంతగ్రంథములు భారతదేశమునకు చేయుచున్నమేలు మహోత్కృష్టమైనది. దానిని కొలుచుమార్గములేదు. అట్టిగ్రంథములపుట్టినిల్లగుటచేతనే భారతావని కర్మభూమి అయినది. పాశ్చాత్యవేదాంతశిరోమణియగు మాక్సుముల్లరుదొరగారికి ఈకర్మభూమిలో యేగోదావరీనదీతీరముననో మరుజన్మములో పుట్టవలెనని తీవ్రవాంఛ జనించినది. అట్టి వేదాంతగ్రంథములను సుమారు అర్ధశతాబ్దముగా ఆంధ్రావనియందు వెదజల్లి లక్షలాదిగా ప్రజలజీవితములను తరింపజేయుశక్తికలవి ప్రకటించి తమజన్మముసార్థకముగావించుకొన్న శ్రీ శాస్త్రులుగారి దివ్యసేవ నెవరు మఱువగలరు? శ్రీ శాస్త్రులుగారి సర్వతోముఖ భాషాసేవను ఆంధ్రదేశము సజీవమై ఉన్నంతవరకు మఱువజాలదు. జిజ్ఞాసువులోకము శ్రీ శాస్త్రులుగారు ఆత్మసామ్రాజ్యాపేక్షకులగు తమకు గావించిన జ్ఞానప్రసాదమునకు నిహపరములందు కృతజ్ఞతతో నుండగలరు. పరమేశ్వరుడు శ్రీ శాస్త్రులుగారికి ఆరోగ్యమును ప్రసాదించి తమవేదాంతభాషాసేవ శతవృద్ధులగువరకుచేయునట్లు అనుగ్రహించుగావుత!

ఓం శాంతిః! శాంతిః!! శాంతిః!!!

# తెన్కపలుకులు—వడపలుకులు వీనిలో ఏవి ముందువి ?

శ్రీ కూరేపల్లి రామచంద్రశాస్త్రికవిగారు,
ఎలమంచిలి.

[సంస్కృతము, ప్రాకృతములు మొ. పై పలుకులనుడులు చేరని ద్రావిడభాషలు తెన్కపలుకులు; ఇవి హెచ్చుగా మాటలాడువారు దక్షిణదేశమున ఉండుటచే వీనికి ఈ పేరు వాడితిని. ఉత్తరదేశమునుండివచ్చిన ఆర్యుల పలుకులై, ఉత్తరదేశమున హెచ్చుగా వాడుకలో ఉండినవగుటచే సంస్కృత ప్రాకృతములకు వడపలుకు లను పేరు వాడితిని.]

## పలుకుల మనుగడ

పలుకుల మనుగడ సరియగునదగుటకు అది వ్రాయువారు అవి ఎవరు—ఎక్కడ—ఎప్పుడు వాడునవియు సరిగా ఆరసి, తెలుపవలె. అటు తెలుపని మనుగడ పలుకు నెఱవాదులకు పాటికానేరదు. ఏపలుకు వాడువారు మొదటివారో వారిపలుకే ముందటి పలుకగును. తొంటివ్రాగమి—వాఙ్మయము—నిలిచియుండుటచే ఏపలుకుగాని మొదటిది అని తేల్చుటకు తగినకతము ఎన్నటికిని కానేరదు. వ్రాగమిలేమిచే నీగ్రొటోలపలుకు తొంటి వ్రాగమికల సంస్కృతమునకు తరువాతి పలుకగునా ?

**పలుకుల తొంటిమనుగడ సరిగా తెలుపగలుగుట ఎట్టి నెఱవాదులకుఁగాని అంత సులువగు పనికాదు.**

## తెన్వంగడము—వడవంగడము

తెన్వంగడము ద్రావిడభాషా కుటుంబము; వడవంగడము ఆర్యభాషా కుటుంబము. ఇండియాలో హెచ్చుమంది మాటలాడు పలుకులు ఈ రెండు వంగడములకు చెందినవే. ఈ పలుకులనుగూర్చి మునుపటివారు కొందఱును, ఇప్పటివారు కొందఱును, నుడిదండలు (నిఘంటువులు) ను, నుడితీర్పులు (వ్యాకరణములు) ను, మనుగడలు (చరిత్రలు) ను వ్రాసినారు. మునుపటికంటె ఆరయికకు ఇప్పుడు సులువులు హెచ్చగుటచే ఇప్పటి వ్రాతలలో తెలలు—విషయములు—హెచ్చినవి. అంతేకాదు; తెన్కపలుకులన్నియు తోబుట్టువులనియు, అవి తెన్వంగడ మను విడివంగడమునకు చెందిన వనియు, ఆ వడవంగడమునకు చెందవనియు ఒక క్రొత్త తెల బయలుపడినది; ఇది బిషప్ కాల్డువెల్ నెఱవాది గుర్తించె. ఈ తేల్పు—సిద్ధాంతము—సరిఅయినదే అని డాక్టరు స్టెన్‌కోనో, సర్ జార్జ్ గ్రీర్‌సన్, మొ. తెల్లనెఱవాదులును, శ్రీ సునీతికుమార్ చటర్జీ, ఎమ్. ఎ., (కలకత్తా) డి. లిట్., (లండను), ఎఫ్. ఆర్. ఏ. ఎస్. బి. పండితుఁడును, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, శ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిగారు, శ్రీ గంటి సోమయాజిగారు, శ్రీ పరవస్తు వేంకట **రామానుజస్వామిగారు మొ. మన పండితులును ఒప్పుకొనినారు. కాని, ఇప్పటి వ్రాత**

కారులలో డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు తెనుఁగు సంస్కృత ప్రాకృతముల వికృతి అని తేల్చుటకు ఎంతో పాటుపడి, "ఆంధ్రభాషా చరిత్రము" వ్రాసినారు. అంతటితో తనియక, తుదకు ౧౯౪౨ నవంబరు భారతిలో 'ద్రవిడము—ద్రావిడ సిద్ధాంతము—' అను వ్రాయిక వ్యాసములో "ద్రావిడులార్యులు; ద్రావిడభాష లార్యభాషలు. జాతిభాషాచార సంప్రదాయములలో ద్రవిడు లార్యుల కెంతమాత్రమును భిన్నులుకారు."—అని తేల్చినారు. ఇట్టి నిబ్బరము రావుగారి కెట్లు లబ్బినదో! ఒక్కకలము పోటుతో ఇది సరి కాదని తెలుపు వ్రాగము అంతయు కొట్టివేసినారు.

ఇఁక శ్రీ సోమయాజిగారు శ్రీ రావుగారు "ఆంధ్రభాషాచరిత్రమున" వ్రాసిన దెల్ల సరిఅగునది కాదనియే తెలిపినారు.

రావు సోమయాజిగార్లిరువురును నాకు నెయ్యురే; వీరిలో మొదటివారే మొదటి నెయ్యురు. వీరిరువురును వ్రాసిన పొత్తములు మన ఇండియా పలుకులనుగూర్చి తెలుపు కొన్ని పొత్తములతోపాటు చదివితిని. మఱొకమాట. ద్రావిడులనుగూర్చి ఏమో తేల్చుకొని, బ్లావట్‌స్కీ - అమ్మవారినిగూర్చి ఏమి వ్రాసెనో తెలిసికొనఁదగు నను తలంపు పుట్టి ఆమె వ్రాసిన గుప్తవిద్య Secret Doctrine అను మేటి పొత్తమును, మేలెఱుకవారు - దివ్యజ్ఞాన సామాజికులు—వ్రాసిన మఱికొన్ని పొత్తములుకూడ చదివితిని.

ఇఁక, పలుకు మనుగడలో మొదట తెలిపిన కట్టడలనుబట్టి, టూకీగా నా తెగలనుగూర్చి తెలుపుటకు కడఁగెద.

## భరతఖండము

ఇది తెన్నాడు (దక్షిణదేశము), వడనాడు (ఉత్తరదేశము)—అని రెండు వాటాలుగా ఉన్నది.

## తెన్నాడు

వింధ్యమునుండి తెంకాకడలివఱకును ఉన్నది తెన్నాడు. వింధ్యమునకు మేరువుతోడిపోరు చలికొండ లేనినాఁటిది. తెన్నాడు లెమూరియా—శాల్మలిద్వీపము—లోనిది, అది సుమారు ౨౦౦ లక్షలయేండ్ల క్రిందట నేలలోపుట్టి-రేఁగిన నిప్పు వసచే ముక్కలుముక్కలుగా విడిపోయె; పెక్కుముక్కలు మున్నీటిలో మునిఁగిపోఁగా మిగిలిన ముక్కలలో ఒక ముక్క మన తెన్నాడు.

## వడనాడు

వింజమునకును చలికొండకును నడుమను ఉన్నది వడనాడు. చలికొండపట్టును, తరువాతి 'ఆర్యావర్తము'లోని క్రింది వాటాయును తొలుత కడలియే. సుమారు ౨ లక్షల యేఁడ్ల క్రిందట చలికొండ పైకివచ్చినపుడు దానితోకూడ ఈ వాటాయును పైకి రాఁదొడఁగి, సుమారు ౧ లక్ష యేండ్ల క్రిందట మంది ఉండుటకు తగిన—ఉనికికి వచ్చినది.

కాన, తెన్నాడే వడనాటికంటె ఎంతో ముందుది.

## మంది

మంది ౭ తెగలుగా ఉందురు; ఒక్కొక్క తెగలో ౭ చిఱుతెగలుకూడ ఉండును. తొలి ౨ తెగలవారి మనుగడ సరిగా తెలియదు. 3 వ తెగవారు లెమూరియా (శాల్మలి ద్వీపము) లో ఉండెడివారు; వీరిలో హెచ్చుమంది నల్లనివారు; కొందఱు ఇండియాలో ఉండెడివారు; వీరే ఇండియాలోని తొలిమంది అనియు, 'నీగ్రిటోలు'— అనియు డాక్టరు గుహ మొ. ఆరయికకారులు తెలుపుచున్నారు. ఇది నిజమే—అని మేలెఱుకవారి వ్రాతలును తెలుపుచున్నవి. మఱొకమాట; మందిపుట్టుపట్టు లెమూరియాయే!

లెమూరియనులు దానవులు; మిక్కిలి బలియురు; ౨౮-౨౭ అడుగులయెత్తును—దానికి తగిన ఒడ్డును కలిగిన మేనులు కలవారు. కాన, పెద్ద పెద్ద కట్టడములతోడి ప్రోళ్లు పెక్కులు కట్టినారు. ఇందువలన ప్రోలితనము—నాగరకత—వారినాఁటనే సుమారు ౧,౫౦,౦౦,౦౦౦ ఏండ్ల క్రిందటనే వెలయ మొదలిడెనని గుర్తింపనగు. పలుపలుకులేల? లెమూరియాయే ప్రోలితనమునకు తల్లి! ముక్కంటి కొలువునకును అదే తల్లి!!

## తెన్తెగవారు

దానవులలో పెక్కురు నల్లనివారే అయినను, ౬ వ చిఱుతెగవారు నీలిరంగువారుగాను, ౭ వ చిఱుతెగవారు నీలి-తెలుపురంగువారుగాను ఉండెడివారు. ఇందు తుది చిఱుతెగలోని కొందఱు ఆరవతెగవారికి పెద్దలయిరి; పడమటి వైపున ఉండిన అట్లాంటిస్సు—కుశద్వీపము—చేరిరి. మఱికొందఱు లెమూరియా విడిపోయినపుడు తెన్నాటి క్రింది వాటిలో కాపుర ముండిరి; అపుడు దానిలో సింహళమును, తమిళ మలయాళ నాడులును చేరియుండెను. కాని, తరువాత సింహళము తెన్నాటినుండి విడిపోయినది. అప్పటికి అట్లాంటిస్సు కొన్ని లక్షలయేండ్లు గొప్ప ప్రోలితనముతో వెలసి, ఒకసారి నీటిముంపునకు లోనయి, కొంతపఱకు విడిపోయెను. పిదప సుమారు ౨ లక్షలయేండ్ల క్రిందట ౪ వ తెగలోని ౨ వ చిఱుతెగవారగు త్లవత్లీలు కొందఱు కడలిమీఁదుగా ఓడలలో వచ్చి, తెన్నాడు చేరి, అచ్చట ఉండిన ౭ వ లెమూరియన్ చిఱుతెగవారితో పొత్తు కలపికొని, ప్రొద్దులు పుచ్చుచుండిరి; నానాటికి ఈ రెండు చిఱుతెగలవారికి కలిగినవారే తెన్తెగవారు (ద్రావిడులు). ద్రావిడపదము వాడుకలోనికి వచ్చినను, ఈ తెగవారిని తెలుపుటకు అది సరిఅగు నుడికాదు.

తెన్తెగవారు తెలివిగలవారు; తెగువగలవారు. కాన, తాము పెంపొందిన కొలఁదిని వడకడకు పోవఁదొడగి—ఆయాపట్ల నిలుచుచు, పెరుఁగుచు, మరల బయలుదేఱుచు, తుదకు వడనాడుచేరిరి. అప్పటికి అక్కడ తూర్పున నడితెగవారు కొందఱు వలస లేర్పఱుచుకొనియుండిరి; వీరే నిషాదులు; వీరిని కొలారియనులు, ముండాలు, ఆస్ట్రిక్కులు—అను పేర్లతో పిలుచుచున్నారు. పంజాబుపట్టున తోత్రెక్కులు మొ. దైత్యులలోని చిఱుతెగలవారు వలస లేర్పఱుచుకొనియుండిరి; వీరు యూరపులోని క్రిందినాడులమీఁదు

గాను, ఆసియాలోని పడమటి నాడులమీఁదుగాను వచ్చి, వడయిండియాలో చొచ్చిరి. నిజమిట్లుండ, సరిగా ఆరయక ఇండియా మనుగడ వ్రాసినవారు, తొల్తెక్కులు మొ. వారినే ద్రావిడు లని తలంచి, పొరపడిరి. ఇట్లు పొరపడుటకు కతము మేలెఱుకవారి పొత్తములు చదువమియే అనవగు.

తాము చేరునప్పటికి వడనాటితో ఉన్నవారిని అందఱను ఎట్లో తెఱతెగవారు లోఁబఱచుకొని, నానాఁటికి * ఇండియా అంతటిని అలముకొనిరి; పలుతావులకు తేండ్లయిరి! అంతే కాదు; తెఱతెగవారే ఇండియాలో తొలితేండ్లు!! వారినాఁటిదే త్రవ్వకములవలన పంజాబులోని హారప్ప (హారియూపీయ) యందును, సింధుదేశములోని మొహెంజో-దరోలోను బయల్పడిన మేలి ప్రోలితనము!!!

వడకడకు పోవునపుడు తెఱతెగవారు తొలుత నిలిచిననాఁడే తెనుఁగునాడయ్యె. తెనుఁగువారు నానాఁటికి తెనుఁగుమీఱి, తమ తెలివినిబట్టి తెలుఁగువారైరి. తెలుఁగువారే తెగువరులై-పిదప పలునాడులకుపోయి, తమ బలిమిచే తేఁడులై పేరుపొందిరి. కాన, వడనాడంతయు అలముకొనుటకు కడంగినవారుకూడ తెలుగువారే అని తలంచుటకు వీలు లేక పోలేదు. ఏమందురా? 'తెలుఁగు'నుడి వడనాటను అంతటను వాడుకలో ఉన్నది. 'కోట'నుడి వడనాటి కొన్ని ఊళ్లపేర్ల చివరను కానవచ్చుచున్నది. ఇట్టివే మఱికొన్ని తెనుగునాటినుడులు వడనాటి పలుకులలో కలవు. అయినను, ఈ తెల పెంచి-తెలుపుటకు ఇది తావుకాదు.

సింధుప్రోలితనముతో అచ్చట అప్పుడు ఉండినవారు ముక్కంటి కొలువరులనికూడ తెలియవచ్చినది. † దీనినిబట్టి అయినను ఆ ప్రోలితనము సమకూర్చినవారు తెఱతెగవారే

* "......before anything whatever had been discovered of the Indus civilization, Dr. H. R. Hall proposed to locate the lower land of the Sumerians somewhere to the east of Mesopotomia, and suggested that they might belong to the same ethnic type as the *Dravidians* of India, who, though now restricted to the south of India, are believed on linguistic and ethnological grounds to have once populated virtually, the whole of the Peninsula, including the Punjab, Sind, and Baluchistan, where, as is well khown, the Dravidian speech is still preserved in the language of the Brahmins." P. 109, Mohenjo-Daro and The Indus Civilization.

† "......their religion is so characteristically Indian as hardly to be distinguishable from still living Hinduism or at least from the aspect of it which is bound with animism and to cult of Siva and the Mother Goddess—......Among the revelations that Mohenjo-Daro and Harappa had in store for us, none perhaps is more remarkable than this discovery that Saivism has a history going back to the Chalcolithic Age or perhaps even further still and that it thus takes its place as the most ancient living faith in the world." Mohenjo-Daro and Indus Civilization.

అని తేటపడవలసినది. ఇది తట్టుమిచేతనే కాంబోలు సర్ జాన్ మార్షల్ పండితుఁడు నిబ్బరముగా తెన్ ప్రోలితనము ద్రావిడులదే అని నొక్కివక్కాణించుటకు జంకె. నిజమునకు ముక్కంటి కొలువరులు తెన్నాటినుండి కాక మఱి యెక్కడనుండి అక్కడకు వచ్చియుండగలరు? కాన, సింధులోయలోని పై రెండు ప్రోళ్ళలోని ప్రోలరి ప్రోడలు పెక్కుడు తెన్ తెగవారే ఆ అని జంకక కొంకక చెప్ప నగును.

## వ డ తె గ వా రు

వడతెగవారు ఆర్యులు; వీరు ౫ వ తెగలోని మిన్నలు; గోబీకడలి వడగట్టున సుమారు ౬౦ వేల యేండ్ల క్రిందట ఏర్పడినవారు. పిదప నానాటికి పెంపొంది, అందు సుమారు ౪౦ వేల యేండ్లు వెలసి తుది ౨౦ వేల యేండ్లు తేండ్లుగాను—తేతేండ్లుగాను ఏలిన దిట్టలు. ఆపిదప తమవారు కొందఱు పై నాడులకు చేరఁగా, తాముసు జట్టుజట్టులుగా బయలుదేఱి, ఇండియాకు వలసలువచ్చి, వడనాట అప్పు డుండిన తెన్నాటి పోటరులతో †పోరిపోరి, క్రిందుమీఁదగుచు, తుదకు వారిని గెలిచి, కొందఱను పాఱఁదోలి, కొందఱను లోఁబఱుచుకొని, వడనాడు కొంత ఏలినారు; నానాఁటికి తెన్నాటిలోనికని చొచ్చుకొని వచ్చి—కొంత పెద్దఱికము చేసినారు. సరిగా అరయుచో ఇండియాలోని వీరి దొరతనము మంగోలియాలోని దానికి ఎంతో తీసికట్టే.

లెన్ తెగవారు తమ్మెదిరించి—తమతో పోరినపుడు వారు పెట్టుపాట్లు పడఁజాలక, వారిని 'కృష్ణత్వచులు', 'అనాసులు'—అని తెగడుటయేకాక, వారు ముక్కంటి కొలువరని తెలుపుటకుమాఱు ఎంతో మోటుగా"—దేవులు" అని తమ కడుపుమంటకొలఁదిని వారిని వెక్కిరించిన వీరు—ఆర్యులు—పిదప తాముకూడ అట్టివారే అగుట ఎంతయు వింత! ఇదికూడ సింధులోయ ప్రోళ్లలోని మిన్నలు తెన్ తెగవారే అనుమాట నిజమనుటకు మిక్కిలి తోడ్పడుచున్నది.

కాన, తెన్ తెగవారే వడతెగవారికంటె ఎంతో ముందటివారు. *

---

S " Moreover the skeletal remains discovered at Mohanjo-Daro prove that the bulk of its inhabitants were of true Dravidian race,.........
" Dr. Gilbert Slater·

† " As the comparatively fair Brahmins—who invading India with its dark-coloured Dravidians—have come from the North, so the Aryan 5th race must claim its origin from northern regions. P. 82. ' Secret Doctrine. '

* ".......Dravidic—speaking people were the precursors of the Aryans over most of Northern India and were the only people likely to have been in possession of a culture as advanced as the Indus culture " P. 42. Mohenjo-Daro and Indus Civilization.

## తేఁపలుకులు

తేఁతెగవారి పలుకు తేఁపలుకు (ద్రావిడభాష); ఇది తేఁతెగవారు పలునాడులలో చేరినపుడు కొంత కొంత మారి, తెనుఁగు కన్నడము మొ. తేఁపలుకులుగా వెలయుచున్నది. వీరు భరతఖండమంతయు అలముకొనుటచే తేఁపలుకే భరతఖండపు తొలిపలుకుగా వెలసినది.

తేఁపలుకులు తమ తల్లినుండివచ్చిన పుట్టుకట్టువలను వదలమిచే ఒండొంటికి తోఁబుట్టువునై, తెవ్వంగడమును విడివంగడమునకు చెంది, పెంపొందించుచున్నవి. (౧)

ఇప్పటి మన పలుకుల-అరయిక కారుల లోకమునకు శ్రీ సునీతి కుమారచట్టర్జి పండితుఁడు ద్రావిడభాష మాటలాడువారు క్రీ. ము. ౩౫౦౦ ఏండ్లక్రిందట వచ్చినారు." అని తెలిపినారు. (౨)

## వడపలుకులు

సంస్కృతమును, ప్రాకృతములును వడపలుకులు.

### సంస్కృతము

ఇది ఆర్యావర్తములోని మధ్యదేశమందలి ప్రాకృతము సంస్కరింపఁగా ఏర్పడినది. ఇందు మంచి ప్రాగమి ఎంతో బయలుదేఱినది. కాని, ఇది ఎప్పటిది? క్రీ. ము. ౫౦౦ ఏండ్ల నాఁటిది. (౩)

### ప్రాకృతములు

వడనాటి శౌరసేనము, మగధ, మొ. చిఱునాడులలో మంది వాడిన పలుకులే ప్రాకృతములు. కాని, వీనిలో తొలి ప్రాకృతము—ఏది? ఇండియా తొలిపలుకు తేఁపలుకే అగుటచే దానిలో వడనాట మొదట ముండా పలుకునుడులును, పిదప అచటికి చేరిన తక్కిన పలుకుల నుడులును చేరఁగా అదే తొలి ప్రాకృతమయ్యె; ఈ తేఁ ప్రాకృతము

---

* "We must still consider them (the Dravidian languages) as an isolated family." P. 282. Dravidian family, Munda and Dravidian Languages, IV Vol. Linguistic Survey of India.

2. "We have Dravidian speakers coming to India, before 3,500 B.C." P.7. Languages and the Linguistic Problem.

3. "A younger form of the old Aryan speech (the language of the Rig-Veda) in India became established as Sanskrit, the great religious and culture language of Hindu India, by 500 B.C." P. 10. Languages and the Linguistic Problem.

ద్రావిడ ప్రాకృతము—వడనాట అంతటను మాఅుమూలలోఁకూడ తెలియవచ్చుచున్నది. నేఁటి దద్దిక్కు పలుకుఁలో దీనినుడి తీర్పుజాడలు కానవచ్చుటయే దీనికి తార్కాణ. అయి నను, పలుకుల—అరయిక కారులు కొందఱు దీనిని గుర్తించినట్లు కానరాదు. నిజమునకు సంస్కృతపు పొత్తు నానాఁటికి హెచ్చుటచే పైకి సంస్కృత ప్రాకృతములుగానే ఇపుడు కనబడుచున్న వెల్ల తొలుత తెన్ ప్రాకృతములే. నేఁటి వడనాటి పలుకులు పెక్కులుకూడ మొదట మెఱనుడులతోఁడి తెన్పలుకులే. కావుననే వానిలో తెన్పలుకుల జాడలు కనఁబడుచున్నవి.

పాలితోఁకూడ పలు ప్రాకృతములును, అపభ్రంశములును క్రీ. ము॥ ౬౦౦ నుండి క్రీ. వె॥ ౧౦౦౦ ఏండ్ల వఱకు ఉండినట్లును, పిదప ఇప్పటి వడనాటి పలుకు లేర్పడినట్లును చట్టర్జి పండితుఁడు తెలుపుచున్నాఁడు. *

కాన, ఇప్పటికి సుమారు ౩౫౫౮ ఏండ్ల క్రిందట ఏర్పడిన సంస్కృతముకంటెను,

ఇప్పటికి సుమారు ౨౫౫౮-౯౫౮ ఏండ్ల నడుమ ఏర్పడిన ప్రాకృతముకంటెను,

—అనఁగా వడపలుకులకంటె—

ఇప్పటికి సుమారు ౧౫౫౮ ఏండ్ల క్రిందటనే ఉండిన తెన్పలుకు బిడ్డలగు తెన్పలుకులె ఎంతో ముందువి.

అందుచే, సంస్కృత ప్రాకృతములు తెన్పలుకులకు తల్లులనుట కల్ల.

ఇండియాలోని పలుకులవలె తెన్పలుకులకు కొన్నింటికి పెద్దతోడుగా సంస్కృతము పనికివచ్చుట నిజము.

ఇఁక, ద్రావిడు లార్యులగుదురో! కారో! ద్రావిడభాష లార్యభాషలగునో! కావో! చదువరులే సరిగా అరసి, తేల్చుకొందురుగాక!

మారేపల్లి రామచంద్రశాస్త్రి.

* "The later spoken forms of the Aryan speech, in the stage known as Middle Indo-Aryan, are represented by the various Prakrits (including Pali) and the Apabhramsas of the period 600 B.C. to A.D. 1,000, after which these develop into the New or Modern Indo-Aryan languages of the Present day." P. 10. Languages and the Linguistic Problem.

# దక్షిణదేశము—
# ఆంధ్ర వాఙ్మయము

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు, ఎమ్.ఏ.

## తంజాపురాంధ్రనాయకరాజులపరిపాలనము

### రఘునాథనాయకుఁడు (1614-1633)

దక్షిణదేశాంధ్రవాఙ్మయమనఁగా, మైసూరు, పుదుక్కోట, తుఱైయూరు దక్షిణ హిందూదేశమున చివరభాగమున నుండు తంజావూరు, తిరునల్వేలి, మధుర, మొదలగు ప్రదేశములయందు వర్ధిల్లిన తెనుఁగువాఙ్మయము. ఈ ప్రదేశములు బహుప్రాచీనకాలమునుండియు ద్రావిడ నాగరకతకు స్థానములై పాండ్యచోళరాజ్యము లనుపేర ప్రసిద్ధికెక్కినవి. ఇచ్చటి భాష ద్రావిడభాష—ఈ ప్రదేశములు తెనుఁగుదేశమునకు సుదూరమున నున్నను క్రీ. శ॥ 11-వ శతాబ్ది ప్రారంభమునుండియు ననఁగా తూర్పు చాళుక్యవంశీయుఁడగు శ్రీ రాజరాజ నరేంద్రుఁడు(1019-1061) తంజావూరు రాజధానిగాగల చోళసామ్రాజ్యచక్రవర్తి రాజేంద్ర చోడమహారాజు కూఁతు రగు అమ్మంగదేవిని వివాహమాడిననాఁటనుండియు, రాజకీయముగ సంబంధములును రాకపోకలును తొలుత నేర్పడినవి. ఈకాలముననే పెరిఆర్ రు, కావేరీ తీరప్రాంతములనుండి ఆరవలు రాజుయొక్క ఆహ్వానము ననుసరించివచ్చి, గోదావరీ తీరప్రాంతముల నివాసము గావించుకొనిరి.—శ్రీ రాజనరేంద్రుని వెనుక చోళరాజ్య ప్రతినిధులే నీ దేశమునుపాలించుచుండిరి. కాని యావెనుక, తెనుఁగునాటి నేలిన వెలనాటి చోళులయు, కాకతీయులయు కాలమున (1132-1336) నీ సంబంధము చాలవఱకు సడలినది. ఆంధ్రభాషాపోషణము, ఆంధ్రసంస్కృతి దేశమున విస్తరిల్లినది. క్రీ. శ॥ 1336 లో విజయనగర సామ్రాజ్య మేర్పడినను క్రీ. శ. 1370 ప్రాంతములో మహమ్మదీయులు, దక్షిణదేశముపై దండెత్తి శ్రీ రంగనాథస్వామి దేవాలయమును కొల్లగొట్టినపుడు గోపన యను ప్రసిద్ధ దండనాయకుఁడు, శ్రీ వేదాంతదేశికుల నియోగమున వారిని తరిమి, వేఱొకచోటికి తరలింపఁబడిన శ్రీ రంగనాథుని విగ్రహము తిరిగి యథాస్థానమున ప్రతిష్ఠఁగావించెను. ఇది తాత్కాలికమే. ఆంధ్ర నాయకత్వ మాప్రదేశమున ప్రవర్తిల్లనే లేదు. సంగమ సాళువ వంశీయుల కాలమువఱకు పరిస్థితులిట్లే యుండినవి.

విజయనగరసామ్రాజ్యాధీశుఁడగు కృష్ణదేవరాయలు క్రీ. శ॥ 1509 రాజ్య మధిరోహించిన వెనుక దక్షిణదేశమును జయించి ఆప్రదేశములలో తెనుఁగు నాయకులను పరిపాలకులుగా నియమించుటయే తెనుఁగు వాఙ్మయమానాట ప్రవర్తిల్లుటకు హేతువైనది-కాబట్టి దక్షిణదేశాంధ్రవాఙ్మయ మేర్పడుట రాజకీయపరిస్థితుల మూలముగనే అని గ్రహింపనగును. మధుర తంజావూరులలో నియమితులైన తెనుఁగు నాయకులు తమతోపాటు, తమ

* వీరు, ఆరామములు లేక తోఁటలను నిలయమైన, కోనసీమ ప్రాంతమునే నివాసముగ జేసికొనుటచే, వారిని ఆరామ ద్రావిడు లని మనము వ్యవహరింతుము.

భాషను, తమ సంస్కృతిని, తమ పరివారము నచ్చటకు తీసికొనిపోయి, తెనుగు యశస్సును స్థిరముకావించిరి. పూర్వ మేనాఁడో తెనుగువారైన ఆంధ్రులు మగధదేశమును పాలించిన విషయము మన కంతగా తెలియలేదుగాని, దక్షిణదేశమును పాలించిన ఆంధ్ర నాయకులకు మాత్రము, ఆంధ్రత్వము - ఆంధ్ర సంస్కృతి, ఆంధ్రసాహిత్యమును నాంధ్రేతర రాష్ట్రములయందు శాశ్వతముగ నిల్పినకీర్తిదక్కినది.

శ్రీకృష్ణదేవరాయనియుగము తెనుగుభాష యుచ్ఛస్థితిని బొందించిన యుగము— తెనుగు రాష్ట్రభాషగా నేర్పడుటయు 'దేశభాషలందు తెలుగు లెస్స' యని రాయలయాస్థానమున మెలఁగిన నాయకులు, ఆ భాషాభిమానమే యాలంబనముకాగా తాము పాలించిన ప్రదేశములలో కవుల పోషించి, గ్రంథములు వ్రాయించి, తాము స్వయముగ కృతికర్తలై కృతిభర్తలై, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నొకప్రత్యేకయుగము నేర్పఱచుటకు కారణభూతులైరి.

దక్షిణదేశాంధ్రవాఙ్మయము, విజయనగరసామ్రాజ్యానంతరము వెలసినదైనను, కొన్ని ప్రత్యేక విశిష్ట లక్షణములను గలిగియున్నది.

1. రాజకవులును, బ్రాహ్మణేతర కవులును విలసిల్లుట
2. కవయిత్రులకు సాహిత్యరంగమున ప్రత్యేక స్థానార్హత గలుగుట
3. యక్షగాన నాటకశాఖ వర్ధిల్లుట
4. వచన వాఙ్మయము, సక్రమ పరిణామము నందుట
5. సంగీత సాహిత్యముల సమన్వయము - గేయరచనలు వ్యాప్తములగుట
6. ప్రౌఢప్రబంధరచనము. శృంగారరసప్రాధాన్యము-సాంత్వనరచనలు - ప్రవర్తిల్లుట.

ఇవి యేయేరీతులుగా నాయా ప్రదేశములందు క్రమపరిణామము నందినవో చారిత్రకముగ నిరూపించుచున్నాఁడను

పదునాఱవశతాబ్దమధ్యమున విజయనగరసామ్రాజ్య విచ్ఛిత్త్యనంతరమునఁ జిరకాలమునుండి దాక్షిణాత్యరాజ్యములని పేరెన్నికగన్న పాండ్య చోళరాజ్యము లాంధ్రవాఙ్మయమునకుఁ బట్టుఁగొమ్మ లయినవి. ఆంధ్రసాహిత్యాభివృద్ధి కనుకూలము లగుపరిస్థితు లేర్పడినకతన - తంజావూరు - మధుర - పుదుక్కోట - సేలము - మైసూరు మున్నగు రాజాస్థానములు ఆంధ్రవాఙ్మయరంగము లైనవి. అందు తొలిరంగ మగుతంజావూరిని క్రీ. శ. 1535 మొదలు క్రీ. శ. 1673 వఱకుఁ బరిపాలించిన నాయకరాజులకాలమున ఆంధ్రవాఙ్మయ మెంతయేని యభివృద్ధినందినది.

తంజావూరిని నాయకరాజ్యసంస్థాపకుఁడగు చినచెవ్వప్ప నాయకుఁడును, ఆవెనుక నాతని కొమరుఁడు అచ్యుతప్ప నాయకుఁడును క్రీ. శ॥ 1614 వఱకుఁ బరిపాలించిరి. అచ్యుతప్ప నాయకుని వెనుక రాజ్యమునకు వచ్చినవాఁడు తంజాపురాంధ్ర నాయకరాజశిరోమణి రఘునాథుఁడు.

## రఘునాథనాయకుఁడు (1614-1633)

దక్షిణహిందూదేశ సారస్వతచరిత్రమున కృష్ణదేవరాయల వెనుక రఘునాథుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. కృష్ణదేవరాయలవలెఁ బరాక్రమశాలియై సంగీతసాహిత్యవిద్యావిశారదుఁడై కవిపండితపోషకుఁడై, కృతికర్తయై యాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడైన నాయకరాజు - రాయలకు నల్లసాని పెద్దన మనుచరిత్రము, రఘునాథనాయకుని వేంకటకవి విజయవిలాసము [1], రాయలకు భువనవిజయసభారంగము, రఘునాథనాయకునికి విజయభవన సభారంగము-రాయలకు తిమ్మరసుమంత్రి, రఘునాథనాయకునికి శ్రీగోవిందదీక్షితుఁడు. ఇరువురు వైష్ణవమతప్రవిష్టులు - ఇరువురు సర్వకళారేవంతులు ఇరువురు సంగీతవిద్యారసికులు, చూపినకొలఁది నిట్లెన్నియేని పోలికలు గలవు - ఒక్కొక్కపుడు కృష్ణదేవరాయలే రఘునాథ నాయకుఁడై జన్మించెనా యను సందియము పొడముచుండును. విజయనగరమున కృష్ణరాయలనాఁటి వైభవము తంజాపురమున రఘునాథనాయకుని కాలమునఁ గొంత పునరుద్ధరణముఁ జెందినది.

కృష్ణదేవరాయలకాలముకన్న రఘునాథనాయకుని కాలమునఁ గవయిత్రులు పెంపు చెందుట విశేషము - తంజాపురాంధ్రవాఙ్మయ చరిత్రమునఁ గవయిత్రులకు నున్నతస్థానము గలదు. రఘునాథరాయని కాలమున రామభద్రాంబయు, మధురవాణియు నను ఇరువురు కవయిత్రులే గాక సాహిత్యవిద్యావిశారదలు పెక్కురాస్థానమున నున్నట్లు తెలియుచున్నది. రఘునాథనాయకుఁడు సంస్కృతమునఁ గేవలకవియేగాక శాస్త్రజ్ఞుఁడగు పండితుఁడు. రామభద్రాంబ సంస్కృతమున రఘునాథాభ్యుదయ మను పండ్రెండుసర్గల మహాకావ్యమును రచియించెను. మధురవాణి యనుకవయిత్రి రఘునాథనాయకుఁడు తెనుఁగున రచియించిన రామాయణమును సంస్కృతీకరించెను. ఈమె తొలిపేరు శుకవాణి యనియు, నీమెకు మధురకవిత్వమువలన మధురవాణి యనుపేరు వచ్చెననియు నామె రామాయణమునఁ జెప్పుకొన్నది. వీరలను, వీరి విద్యాగోష్ఠినిఁగూర్చి యీ క్రింద తెలుపుచున్నాను.

---

1. విజయవిలాసమను నీ సభాభవనము పేరును బట్టియుం, రఘునాథరాయలు నేపాళచోళగుల యుద్ధమున విజయములఁ గాంచుటచేతను 'చేమకూర వేంకటకవి భావస్ఫోరకముగఁ దనకావ్యమునకు విజయవిలాసమని పేరును బెట్టియుండును. ఈభవనము రఘునాథనాయకునిచే విజయచిహ్నముగఁ గట్టింపఁబడినది. దీనిఁగూర్చి ముందు వివరింతును.

2 కృష్ణదేవరాయలు సాహిత్యవిద్యా విశారదుఁ డగుటయే గాక సంగీతవిద్యాప్రియుఁడు. అభినవభరతాచార్యుఁడగు బండారులక్ష్మీనారాయణ రాయలకుఁ గృతిగా "సంగీతసూర్యోదయము" అను నైదధ్యాయముల సంగీత శాస్త్రగ్రంథము రచియించినాఁడు - అందు రాయలకాలమున సంగీతశాస్త్రజ్ఞులు పెక్కురు పేర్కొనఁబడిరి. మధ్వయతి శ్రీకృష్ణాచార్యునియొద్ద రాయలు వీణావాదనము నేర్చెను రఘునాథనాయకుఁడు ప్రవీణుఁ డగుట సార్థకమే!

# రామభద్రాంబ

సాహితీ భోజుఁడు తంజావూరి రఘునాథరాయని కాలములో (క్రీ. శ. 1614-1633) విలసిల్లిన ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ. ఈమె రచించిన గ్రంథములలో సంస్కృతమున "రఘునాథాభ్యుదయము" అనునదిమాత్రము లభ్యమై ప్రకటితమైనది. (మదరాసు విశ్వవిద్యాలయము - ప్రాచ్య పరిశోధనాలయము - సంస్కృతశాఖా ప్రచురణములు - సంఖ్య 2) తెలుఁగు గ్రంథము లేవియు లభింపలేదు. అయిన నీమె తెలుఁగు కవయిత్రి యని విజయరాఘవనాయకుని కాలమున నున్న చెంగల్వ కాళకవిరచితమైన రాజగోపాలవిలాసమునందలి యీ క్రింది పద్యమువలన తెలియుచున్నది. విజయరాఘవరాయకుఁడు కాళకవి కవిత్వమును ప్రశంసించుచు చెప్పిన పద్యము:—

సీ. ఘటికాశతగ్రంథ ఘటనోత్కట నవీన పాండిత్యగరిమలు భళి యనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామ రసగర్భ సందర్భ మౌ నని సన్నుతింప
మాకందమంజరీ మధురధురీ మాధుర్యరచనావిశేష మౌరా యనంగ
పరిహాసకేళికరయుక్తి భాగ నూతనకథాచాతుర్య ధుర్యత సన్నుతింప

గీ. అయ్య దినమున "రామభద్రాంబ" వారు, నేను "కృష్ణాజి" కవితచే నేర్పుమెఱసి
కవితసేయుట లెల్ల మీఘనత గాదె, కవివినుతచర్య చెంగల్వ కాళసార్య!

(రాజగోపాల విలాసావతారిక. ముద్రితము. తంజావూరి పుస్తకభాండాగారము. సంఖ్య 222)

పై పద్యము వలన చెంగల్వ కాళకవి రామభద్రాంబ గురు వనియు, ఆమె తెలుఁగు కవిత్వ మాతని యనుగ్రహమువలననే చెప్ప నేర్చిన దనియు మనము గ్రహింపవలయును. తెలుఁగున నీమెకవిత్వము గానరాకపోయినను, సంస్కృతకవిత్వమం దీమె యతిప్రాసలు మొదలగు ప్రత్యేక తెలుఁగుభాషా కవిత్వలక్షణములు పాటించుటచే నీమె తెలుఁగు కవయిత్రియే యని చెప్పనగును. మచ్చునకు

కటాక్షశాతా - కరుణా రసోన్మయే నకేవలం తే - నతతాపహారిణః,
ప్రవర్ధయంతే - ఫలభార నంగతః సమస్త సంపత్ - సవలీశ్చ సంతతమ్.
దళత్ప్రసూనాంకిత - దామసౌరభీర్మిళన్మిళిందారవ - మేదురోదరామ్,
సలీలలాస్యా క్రమ - చంక్రమోచిత.........పరాగ భాసురామ్. ద్వాదశస్సర్గము

ఈ రఘునాథాభ్యుదయ కావ్యమున సుగృహీత నాముఁడగు తంజావూరి రఘునాథనాయకుని చరిత్ర వర్ణితమైనది. రాజాస్థానమున రాజసన్నిధానమున మెలఁగిన విద్వత్కవయిత్రి రచనమగుటచేత కేవల సాహిత్య విషయముననేగాక చారిత్రకముగ నీగ్రంథ ముపాదేయమైనది. కావుననే విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు, తమ చారిత్రకసాధనములలో నీగ్రంథము నొకముఖ్యసాధనముగ క్రీ. శ. 1917 లో గుర్తించిరి.

(Sources of Vijianagar History. S. K. Iyengar. 1917).

షష్టిపూర్తి సంపుటము

ఈసంస్కృతకావ్యమున 12 సర్గలు గలవు. ప్రతిసర్గాంతమున గద్యగలదు. ఇందులో 900 శ్లోకములు గలవు. తృతీయ, దశమైకాదశ సర్గాంతములలో శార్దూల వృత్తములు మాలిని, ద్వాదశమున స్రగ్ధరయు గలవు. తక్కిన భాగముల యందెల్ల రఘువంశమువలె నొకే వృత్తము వాడఁబడినది. ఇదియు రఘునాథుని చరిత్రగావున రఘువంశమును రామభద్రాంబ యాదర్శముగ గొనియుండును.

రఘునాథాభ్యుదయము. సర్గలవిషయములు:— ప్రథమసర్గ - చోళదేశవర్ణనము, 2. తంజాపుర వర్ణనము, 3. రఘునాథనాయక వర్ణనము, 4. రఘునాథుని దినచర్య - కమలావిలాసము, 5 సభావర్ణనము, 6. రఘునాథుని వంశావళి, 7. రఘునాథుడు, యువరాజు, వివాహము, తుండీరదేశజయము, 8. చోళగుని జయము 9. నేపాళ (జాఫ్నా)జయము, 10. పాండ్యరాజుల జయములు 11, 12. రఘునాథరాయని కాలమున స్త్రీవిద్య-స్త్రీల సంస్కారము సంగీతవిద్య, రావణ హస్తము, నాటకరచన, రాగములు, నృత్యములు, వాని విశేషములు చెప్పఁబడినవి. ఈసర్గయంతయు జదువఁదగినది.

ఇందలిగద్య:—

ఇతి శ్రీరామభద్ర కరుణాకటాక్ష లబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖనీ సముసమయ లేఖనీ యాష్టభాషాకల్పిత చతుర్విధ కవితానుప్రాణిత సాహిత్య సామ్రాజ్య భద్రపీఠారూఢ రామభద్రాంబా విరచితే రఘునాథాభ్యుదయే ప్రథమస్సర్గః

ఇట్లేయన్ని సర్గలయంతమందు గద్యల నూహించుకొనునది.

ఈ క్రింది సమస్యను రామభద్రాంబ అత్యాశువుగా పూరించినది.

"కింతే సంతాన పాదపాయంతే" కతికతినః క్షితిపకయః కింతే రఘునాథ నాయకాయంతే,

భువి బహవః కిల తరవః కింతే సంతాన పాదపాయంతే.

రసవత్కవితాసామ్రాజ్య భద్రపీఠాధిరూఢ యగు రామభద్రాంబకావ్యము తెలుఁగు భాషలోనికి ననువదించిన నామె వైదుషీ విశేషమింకను ప్రస్ఫుటము కాగలదు.

## మధురవాణి

రఘునాథనాయకుని కాలమున విలసిల్లిన కవయిత్రులలో మధురవాణి ముకుటమని చెప్పనొప్పును. ఈమె సంస్కృతమున రచించిన రామాయణకావ్యము సుందరకాండము వఱకు 14 సర్గలుగల భాగము లభించినది. తెలుగున నీమెరచించిన కృతులు లభింపలేదు. కాని యీమె సంస్కృత ప్రాకృతాంధ్ర భాషలలో ప్రఖ్యాత కవయిత్రియై రఘునాథ భూపాలునిచే స్వర్ణాభిషేక మహాగౌరవమునొందిన దని యీమె గద్యములవలన తెలియుచున్నది.

తత్తాదృక్ ఘటికార్ధ నిర్మిత శతశ్లోకీ ఫణీ గ్రామణీః, వాణీ ప్రాకృత శాస్త్రనైపుణ సముస్మీల ద్యశః శ్రీజుషా, దీవ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యం బాఖ్యయా నిర్మితే శ్రీరామాయణసారకావ్యతిలకే సర్గస్తృతీయోథ వేత్,

ప్రస్తారాభినవాత్తవృత్త కవితాధాటీ కథాశుక్రియా,షడ్భాషారచనా విశేష బహుధా విఖ్యాత కీర్తి శ్రియా,
దివ్యోద్యన్మతి ... ... ... ... ... ... ... సర్గస్తురీయోఽగమత్.
వీణా వాదకళా వినోద సమయే ధృత్వా సమస్యాః శతం,సద్యస్సంసది సాధుపూర యతియా దత్తా కవీంద్రైస్తయా,
దివ్యోద్యన్మతి ... ... ... ... ... ... ... సర్గోఽభవత్పంచమః. [యా,
ప్రఖ్యాతార్జవ యా పదార్థ గమక వ్యాఖ్యాన పక్షాన్వయప్రాగల్భ్యేస్పద నైషధ ప్రతివిధాసానంద సూరీంద్ర
దివ్యోద్యన్మతి ... ... ... ... ... ... ... సర్గోఽత్ర షష్ఠోఽభవత్.
సద్యోవిస్మయకృన్నిరోష్ఠ్య కవితా సందర్భ ధారాసుధా,సారోర్మి పరిపూరిత శ్రుతి సుధీ సంభావితాభిఖ్యయా,
దివ్యోద్యన్మతి ... ... ... ... ... ... ... సర్గోఽజనిష్టాష్టమః.
మాధుర్యైకధురంధరాంధ్రకవితానిర్మాణసమ్మాన్యయా,దివ్యోద్యన్మతి సఖ్యయా మధుర వాణ్యాంబాఖ్యయా నిర్మితే,
శ్రీరామాయణసారనామని మహాకావ్యేతి భవ్యేసుధీ, వర్గోల్లాస విశేషధామ్ని నవమస్సర్గో మనోజ్ఞోఽభవత్.
సూరిస్తవ్య కుమారసంభవ మహాకావ్య ప్రతిగ్రన్థన, ప్రాగల్భ్య ప్రకటశ్రియా పదనదః ప్రఖ్యాతవైదుష్యయా,
దివ్యోద్యన్మతి ... ... ... ... ... ... దశమస్సర్గోఽత్ర కావ్యేఽభవత్.
ప్రౌఢ శ్రీరఘునాథ నాయకకృత స్వర్గాభిషేకక్రియా, దివ్యోద్యన్మతిసఖ్యయా ... ... సర్గస్తథైకాదశః.

రఘునాథుడు రచియించిన తెలుగు రామాయణము నా స్థానములో విదుషీమణులు పఠించుచుండగా నొకనాడాతడు తన యాంధ్ర రామాయణమును సంస్కృతీకరింపగల కవయిత్రు లెవ్వరైన గలరా యని ప్రశ్నించెనట. ఆ ప్రశ్నకు జవాబుగా శ్రీరామచంద్రమూర్తియే రఘునాథునికి స్వప్నములో దర్శనమిచ్చి, యిట్లు చెప్పెనట.

> చతుర మధురవాణీం సఖ్యగాకర్ణయస్యాః, సరసి మధురవాణీ నామదత్తం త్వయైవ,
> సరస కృతివిధాయాం సాధుమేధా విశేషా,స్వధిక పటురశేషా స్వంబుజాక్షీషు నైషా."

"నీచే మధురవాణి యను బిరుదముపొందిన మేధావతి, సరసకృతి నిర్మాణ నైపుణిగల కవయిత్రి గలదు." ఆమెచే నీగ్రంథము రచితమైన దివ్యముగ నుండు నని చెప్పి యంతర్హితు డయ్యెను. రఘునాథుడును నామెను బిలిపించి రామాయణమును సంస్కృతీకరించుట కాజ్ఞయొసగెను.

రఘునాథుని రామాయణముకూడ మనకు పూర్తిగ లభ్యము కాలేదు. నాలుగాశ్వాసముల గ్రంథము గ్రంథాదినుండి దొరకుచున్నది. (రఘునాథ రామాయణము అను పేర ప్రకటితమైనది. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము, కాకినాడ.) దొరకినంతవఱకు సంస్కృతాంధ్ర రామాయణములను బట్టిచూడగా తెలుగుకన్న సంస్కృతమున కొంత విస్తృతి కల దని చెప్పనొప్పును. మధురవాణి తెలుగు కవయిత్రి గావున నచ్చటచ్చట యతిమైత్రి పాటించినది. మంగళ శ్లోకములో

> లక్ష్మీం దిశేల్లక్ష్మణ పూర్వజన్మా వీరో రఘూణాం విజయం ప్రయచ్ఛేత్,
> ఆరోగ్యమర్కాభి జనశ్చదద్యాత్ రతీశమూర్తే రఘునాథ నేతుః.

ప్రకృతి మధురకావ్యప్రౌఢ సందర్భ విద్భిర్యువతి జనమణిభిర్యుక్త పార్శ్వద్వయోఽసౌ,
అథసవిధ ముపేతాం సౌహృదాద్వాయ మస్మాకువని పరిదృఢానా మగ్రణీ రిత్యభాణీత్.
అజహా దలంకృతిక్రమ మనేకరసోల్లసితం సరసపదార్థ సంగతి సమగ్రగుణానుగుణమ్,
రఘురమణ ప్రబంధతిలకం రసికాభిమతం సుదతి విధీయతామితి సుధీరగదీన్నృపతిః.

ఇట్లే యతులు పాటింపబడినవి. పైయుద్ధృతాంశములబట్టి యీమె యాంధ్రభాషా కవితా పాండిత్యము నూహింపనగును.

(భారతి ధాతమార్గశీర్షమున ప్రకటితమైన శ్రీరామకృష్ణ కవిగారి మధురవాణి అను మధురవ్యాస మిందు కుపజీవ్యము.)

ఆరఘునాథభూపాలచంద్రుండు విద్వత్కవీంద్రులంజూచి యేమనుచున్నాఁడు.

రఘునాథరాయనివారిమాట:—వింటిరా! కవులార! ఈపడుచు లాంధ్రగీర్వాణ ప్రాకృతసమస్యలు పూరింపఁగోరుచున్నారు. వీరినిఁ బరీక్షింపరయ్యా!

వా: అన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు.

అయ్యయ్యా! స్వామినగరలక్ష్మీసరస్వతులు సాక్షాత్కరించి యుండఁగఁ బరీక్ష యేలయ్యా? అయినను మీ రానతిచ్చిన మీఱరాదుగద. ఈకమలాస్యలకు సమస్య లిచ్చెమయ్యా! అని సమస్యలు యిచ్చిరట యెటువలెను.

సమస్య: రారాజనియచ్యుతేంద్రరఘునాథనృపా!

వా: ఔరా! రామభద్రమ్మవారు ఆసమస్య పూరించి చదివిరట యెటువలెను.

క. ఏరీ నీసరిరాజులు, భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని శేరాజని, రారాజని యచ్యుతేంద్రరఘునాథనృపా!

వా: ఔరా! ఈపద్యంబు విని యాంధ్రకవితానిర్వాహణంబునకు మెచ్చి గీర్వాణ భాషను సమస్య నిచ్చిరట యెటువలెను.

సమస్య: కింతే సంతానపాదపాయంతే

వా: అవురా! ఆశుకవితావాణి యగునాశుకవాణి యీసమస్య పూరించి చదివెనట యెటువలెను.

శ్లో. కతికతిన క్షితిపతయః, కింతే రఘునాథనాయకాయంతే,
భువి బహవః కిలతరవః, కింతే సంతానపాదపాయంతే.

వా: అవురా! యీరీతి సంస్కృతసమస్యపూరించి చదివిన విని మెచ్చి ఆరామభద్రమ్మకు మధురవాణమ్మకు వేర్వేరప్రాకృతసమస్య లిచ్చిరట యెటువలెను.

౧ సమస్య: రహుణాహక్కతి చందిరోవిహాణ్ణి

౨ సమస్య: వడ్డఇ రహుణాహరాయసాహాహి

వా: అవురా! ఈరెండుసమస్యలు వారు పూరించి చదివిరట యెటువలెను.

# రామభద్రాంబ

శ్లో. పరిపుణ్ణకళాహిసోహమాణో, అహోయంసత్కళణిచ్చసెవ్వమాణో
సహిఎ (స?) చందిఆఓ, రహుణాహక్ఖితిచందిరోవిహాఇ.
ఛాయ: పరిపూర్ణకళాభిశోభమానః, అభితస్సత్కులనిత్యసేవ్యమానః
సఖియ(శః?)చంద్రికాఢ్యో, రఘునాథక్షితిచంద్రోవిభాతి.

# మధురవాణి

వా: అవురా! ఆరెండవసమస్య పూరించి చదివెనట యెటువలెను

తెల్లొక్కెక్కసుహావహాసుహయర వియయరాహవంసఇణం
దట్ఠూణణియతణూయం వడ్డఇరహుణాహరాయపాహోహి.

వా: భళి! భళి! మేలు! మేలు! సాహిత్యసామ్రాజ్యపట్టభద్ర ఈమహామహిమంబు స్వామినగరిగాక తక్కినరాణుల కెక్కడిదయ్యా?

ఛాయ: త్రైలోక్యైకసుఖావహా, శుభకరవిజయరాఘవంశశినం
దృష్ట్వానిజతనూజం, వర్ధతేరఘునాథరాజపాథోధిః. (రఘునాథాభ్యుదయమునుండి)

# రఘునాథనాయకునిరచనలు

## పారిజాతాపహరణము

ఈ ప్రబంధమును, రెండుజాములలో నత్యాశువుగ రఘునాథుఁడు రచించెనని యజ్ఞనారాయణదీక్షితుఁడును రాజచూడామణిదీక్షితుఁడును, చెప్పియున్నారు. ఈరచనకు మెచ్చి తండ్రి యచ్యుతప్పనాయకుఁ డీతనికి కనకాభిషేకము గావించినాఁడు. వీనిని యాస్థానములో చదివినట్లు రఘునాథనాయకాభ్యుదయములోని యీక్రిందిపంక్తులవలనఁ దెలియుచున్నది. "విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు, హరువైన పారిజాతాహరణంబు" ఇదియు నేడు లభ్యముకాలేదు.

గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణవివాహము, జానకీపరిణయము.

ఈమూఁడును యక్షగానకృతులు. వీనిలో గజేంద్రమోక్ష, రుక్మిణీకృష్ణవివాహరచనలు, సాహిత్యసుధలో యక్షగానములుగా పేర్కొనఁబడినవి. జానకీపరిణయము రఘునాథనాయకాభ్యుదయమున 'చాటుకావ్యము' అనగా యక్షగానమని చెప్పఁబడినది. ఇవియును లభ్యములుకాలేదు. ఇవియును నాస్థానములో చదివినట్లు పైగ్రంథమునుండి తెలియుచున్నది.

"జానకీకల్యాణచాటుకావ్యంబు, తానిర్వహించినతక్కినకృతులు; కొందఱు వినిపింప"

## అచ్యుతాభ్యుదయ - నాయకాభ్యుదయ రచనలు

రఘునాథుఁడు తనతండ్రియగు నచ్యుతప్పనాయకుని జీవితచరిత్రను రచియించి నాయకాభ్యుదయరచనలకు మార్గదర్శకుఁడయ్యెను. రఘునాథుఁడు తనతండ్రిచరిత్ర రచియించినట్లే, యాతనికొమారుఁడు విజయరాఘవనాయకుఁడు తన తండ్రియగు రఘునాథుని జీవితచరిత్రను రఘునాథనాయకాభ్యుదయ మనుపేర రచియించినాడు—విజయరాఘవనాయకునికొమారుఁడు మన్నారుదేవుఁడు తనతండ్రిజీవితచరిత్రమును 'విజయరాఘవనాయకాభ్యుదయము' అనుపేర రచియించియున్నాడు. వీనికి నాయకాభ్యుదయరచనలని పేరు.

రఘునాథుఁ డీగ్రంథమును ద్విపదగా రచించినట్లు నలచరిత్రయందలి యీక్రింది పంక్తులు తెలుపుచున్నవి.

> "భూషించి యచ్యుతాభ్యుదయప్రబంధ, నిర్మాణమున మాకు నిఖిలదేశముల
> నిర్మలసత్కీర్తి నెగడుగావునను యటువలె ద్విపదకావ్యము వేఱె యొకటి
> ఘటియించి సత్కీర్తిఁ గైకొందు ననుచు మది నెంచి"

అచ్యుతాభ్యుదయరచనమును గోవిందదీక్షితులవారు సాహిత్యసుధలో నుట్టంకించియున్నారు. రఘునాథుని రామాయణమున నిది పేర్కొనఁబడినది. ఈద్విపదకృతిని రఘునాథనాయకుని యాస్థానమున విద్యావతులైనవెలఁదులు చదివి వినిపించినట్లు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీక్రిందిద్విపదలవలన తెలియుచున్నది.

> "విరిబోండ్లు కొందఱు వినిపించిరపుడు, భువి మెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు"

ఈకావ్యమును మన్నారుదేవుని విజయరాఘవనాయకాభ్యుదయమును నేడు లభ్యము కాకయున్నవి.

## నలచరిత్ర

అచ్యుతాభ్యుదయరచనానంతరము రఘునాథుఁడు నలచరిత్రమును ద్విపదకృతిగా రచియించెను. ఇందెనిమిదియాశ్వాసములు గలవు. మహాభారతారణ్యపర్వమునందలి కథను, శృంగారనైషధకథను జోడించి రఘునాథుఁ డీనలోపాఖ్యానమును రసోల్లసితముగా సంతరించినాఁడు. రఘునాథుని తక్కినగ్రంథములతోపాటు దీనిని యాస్థానమున సాహిత్యవిద్యాచతురలగు సారసాక్షులు చదివి వినిపించినట్లు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీక్రిందిపంక్తులనుబట్టి తెలియుచున్నది.

> "విరిబోండ్లు కొందఱు వినిపించి రపుడు, నవరసచిత్రంబు నలచరిత్రంబు
> పారువైనపారిజాతాపహరణంబు, మెఱపడిఁ జూపు వాల్మీకిచరిత్ర
> జానకీకల్యాణచాటుకావ్యంబు, తా నిర్వహించినకృతులు

గోవిందదీక్షితులవారు "సాహిత్యసుధ"లో నీగ్రంథరచనమును ప్రశంసించిరి.

> శ్రీపారిజాతాహరణప్రబంధ, చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యమ్
> తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షం చరిత్రం చ, నలస్య చిత్రమ్. నిర్మాయవాగ్మీ"

తెనుగుభాషలోని ప్రశస్తద్విపదకృతులలో నీ నలచరిత్రము పరిగణింపఁదగినది. ఇది శ్రీరామునికంకితము. గ్రంథావతారికలో నలమహారాజుకథ తనకు ముందురచించిన నన్నయ శ్రీనాథులను నిట్లు పొగడియున్నాఁడు.

వెట్టచే నదికూఁను వేవేగఁ గరఁగె, పుట్టవే పులుగులు భూమిలోపలను
కాంచనపక్షముల్ గలవంచు నెంచి, యంచలదినువార లవనిలోఁ గలరె!
పొమ్మని విడువుమో పుణ్యచారిత్ర, నమ్మి నిద్రించితి నాచెక్కుతుదల
బంగారమున కాసపడితివో రాజు, సింగారముమేకాని చేతికి రాదు."

శ్రీనాథుని "తల్లి మదేకపుత్రక" యన్నపద్యము ననుసరించి వ్రాసిన యాక్రిందిద్విపదలు హృద్యములై యున్నవి.

ఒంటిగాడనె నాకు నూరంతబలగ, మింటికెల్లను గర్తనే నొక్కరుండ
నాతల్లి యెంతయైనను గలనయ్య, నాతల్లి కూటికి నవయ దెన్నడును
నూతేండ్లపండు కన్నులుగాన దిపుడు, గారాబుకట్టి నొక్కరుఁడ నే నరయ
యిల్లాలు కడుగోల యొండ కన్నెఱుఁగ, దల్లడిల్లఁగ నుండునట్టిది యేను
కొడుకలు గడ్డలో కూనలు నన్నుఁ, బెడఁబాయ రెన్నఁడు పెంచిన మమత
బిసఖండములు తెచ్చి పెట్టునందాక, దెసలుఁజూచుచు నోరు తెఱచియుండుదురు
కన్నవారికిఁబోలె కాన్పించునయ్య, విన్నవారల కట్టి వేదనలెల్ల
దయఁ జూడుమయ్య సంతపనీయచరిత! నయ మెంచవయ్య యోనవనీతభావ!
నిగ్రహింపకుమయ్య నిషధేశ నన్ను, నుగ్రహింపుము చాల నుతులు గాంచెదవు."

ఇందలిశైలి జాతీయమైనది. పసిబిసికినయట్లు. ఇనుపదబ్బనముల జుంజురులు, చక్కిలమువలె చిక్కుట మొదలగుపలుకుబళ్లు నల్లకుంది-ఏచుకు కంబానకెలయించినట్లు-ఆనాలు చవిచూచుట- మొదలగు జాతివార్తాచమత్కారములు నిండు నిండుకొనియున్నవి. అచ్చట శ్రీనాథుని నైషధ పద్యములకు ద్విపదానువాదములు. గలవు. ఈగ్రంథాశ్వాసాంత గద్య యిది.

శిలలలోపల కన్న జిలికినకరణి, యలఘుసంస్కృతములయర్థంబులెల్ల
తెలుఁగుమాటల లేటతెల్లంబుఁగాఁగ, చెలువొందఁ బల్కనేర్చిన నన్నపార్య
తిక్కయజ్వను శిల్పధీమణిఁ దలఁచి, యక్కజంబుగ నిటు లొ ననుపుభయ
భాషల నానార్థభంగులింపార నైషధాదికప్రబంధంబు లెన్నెని
భువి నిల్పి సత్కీర్తిఁ బొదివినయట్టి నవరసనాథు శ్రీనాథునిఁ బొగడి

రఘునాథుఁడు పూర్వోత్తరకథాసందర్భములను గమనించి కొన్నిసముచితవర్ణనలు కావించినాఁడు. ప్రథమాశ్వాసమున నలునియశ్వకళానైపుణ్యము, చతుర్థాశ్వాసమున సంగీతశాస్త్రవివరణము, షష్ఠాశ్వాసమున నలదమయంతులకష్టదశ, కలివర్ణనము రఘునాథుని కవితాచాతుర్యమును, శాస్త్రవైదుష్యమును ప్రస్ఫుటీకరించుచు నీగ్రంథరచనను ప్రత్యే

కించుచున్నవి. ఇందలిరచన కొకమచ్చుతునక: హంసను నలుఁడు పట్టుకొనినప్పుడు చెప్పిన మాటలు.

> మొదల నొండొకనిఁ బట్ట మేకొనీశ్వరుఁడు, నదిగని విడువఁడే యవనీశుఁ డనుచు
> నలువంకలనుఁ జూచి నలువంకఁ జూచి, తలఁపున కడునద్భుతము పిక్కటిల్ల
> మనుజభాషల నంచ మనుజేశుఁ బలికె, వినవయ్య! యోరాజవీరశేఖరుఁడ
> ధరణి నాజాడ మేఁతకుఁ గాఁగఁ దిరిగి, తిరిగి బడలిక లెల్లఁ దీర నీయూర
> వంచన నయమార్గవర్తన నుంచి, పొంచిపట్టితి వేమి పుణ్యంబు గలిగె?
> రాజహంసుఁడవయ్యుఁ బ్రౌఢి నెంచకయు, రాజహంసము ముట్టరాదయ్య నీకు
> ద్విజరక్షణంబు సంధిలఁ జేయుం చేత, ద్విజశిక్షణంబు సంధిలఁ జేయఁదగునె
> పక్షినిగాని యేప్రతిపక్షిగాను, భక్షింపఁ దలఁచి నన్ బట్టితే నీవు
> పట్టెఁడైనను లేదు పలలంబు నీవు, పట్టినకతమున పాణియంగంబు
> ఇది రామచంద్రమహితదయాసాంద్ర, విదితసాహిత్య నవీనసాహిత్య
> చిన చెవ్వయాచ్యుత క్షితిపాలతనయ, వినయాదిశుభగుణవిభవసనాథ
> రఘునాథభూపాల రచ్యవాగ్జాల, సుఘటితనవరసస్ఫుటశబ్దమహిమఁ
> దనరెడు నలచరిత్ర మను ప్రబంధ, మన ప్రథమాశ్వాసమును దగు శ్రీల.

నలోపాఖ్యానము ప్రత్యేకప్రబంధరూపమున వెలువడుట కిది మొదలు. దీనివెనుక చక్రపురి రాఘవాచార్యుడు ద్విపదగను, సిరిప్రగడ ధర్మనామాత్యుడు బెహరారామకృష్ణ కవిపద్యకావ్యములుగా రచించిరి. ధర్మవరము కృష్ణమాచార్యులవారి చిత్రనలీయము చాల వ్యాప్తమైనగ్రంథము. పై రఘునాథుని నలచరిత్ర తక్షణమే పునర్ముద్రితము కాదగినది. దీని వ్రాతప్రతి తంజాపూరిలో లేకపోవుట విశేషమే: ద్విపదకృతులు పెక్కులు ముద్రితము లగుచున్నకాలమున నిదియును సుముద్రితమై వ్యాప్తిచెందఁదగినది.

### రఘునాథ రామాయణము

శ్రీరామచంద్రభక్తుఁడగు రఘునాథుఁడు వాల్మీకిచరిత్రమును రచియించుటయేగాక, వాల్మీకిమహర్షి ప్రణీత శ్రీమద్రామాయణమును చంపూకావ్యముగా రచియించెను. ఈ గ్రంథమంతయు నాతఁడు పూర్తిచేసెనో లేదో కాని నేఁడు లభ్యమగుచున్నభాగమున బాలకాండమున మూడాశ్వాసములు సంపూర్ణముగను, నాల్గవయాశ్వాసము 26 పద్యములు మాత్రమే గలవు. ఇది ముద్రితమైనది. లభ్యమైనభాగము రఘునాథరాయని రసవత్కవితకు చక్కని యుదాహరణమై యొప్పుచున్నది. ప్రథమాశ్వాసమున అవతారిక, సంగ్రహరామాయణము, వాల్మీకి శోకము శ్లోకమగుట; రెండవయాశ్వాసమున కోసలదేశ వర్ణన, అయోధ్యాపురవర్ణన, దశరథమహారాజువర్ణన, పుత్రునికొఱకుచింత, పుత్రకామేష్టి చేయుప్రయత్నము, ఋష్యశృంగచరిత్ర; మూడవయాశ్వాసమున ఋష్యశృంగుఁ డయోధ్యకువచ్చుట, దశరథు డశ్వమేధయాగము చేయుట, దశరథునకు పుత్రప్రసాదములభించుట యనువృత్తాంతములు కలవు. నాల్గవయాశ్వాసము శ్వేతద్వీపవర్ణనతో ప్రారంభమైనది.

ఇందలికవిత జాతివార్తాచమత్కారములుగలిగి రసభావగర్భితమై యలరారుచున్నవి. రసస్ఫోరకముగ వ్యావహారికపదము లుపయోగించి రఘునాథుడు క్రొత్తవన్నె కవితకు గూర్చినాడు. ఋష్యశృంగునిఁజూడగానే అప్సరస లనుకొనుమాటలు.

సీ. కొమ్మరో నడుమెత్తి కొమ్మేంది యీచుట్టు, జడలు చెంపల వ్రేలఁబడుట యేది
మెడచుట్టుఁజల్లుల చిడిపిరాల్గూర్చిన, తీరునఁ బూసలపేరు లేంచి
బుసి గప్పుకొన్నచొప్పున మేన నిండంగ, మేసించినట్టి యీబూది యేది
కనవు ముప్పిరి త్రాటఁ బొసగంగఁ గట్టిన, పాదచింకతోలు కచ్ఛశమ దేంది
గీ. నొసల మసిబొట్టిదేంది యొద్దెసలనిట్ల్, జూచి గతుగొను మచ్చుకై జూచినపుడె
వెఱపడరెయంచుఁ జేఁబొమ్ముసఱచికొనుచుఁ, గడఁగి దగ్గఱఁ జేరక కడన యుండి.

దశరథుఁడు పుత్రులు లేరని చింతించుసమయమున పలికినపలుకులు బాల్యచేష్టలును చక్కగ నిరూపించుచున్నవి.

చ. కలుగునొకో చకోరహితు గన్గొని తెమ్మని పోరువెట్ట దా
దులు గికురించి యద్ధమునఁ దోచిన చందురుఁ జూప రెండుచే
తుల గొని పట్టి సంభ్రమముతోఁ దనచేతికి చిక్కె నంచు న
గ్గలికఁ జెలంగుబాలుని కన్నులఁ జూడఁగఁ గల్గుభాగ్యముల్.

విజయనగరసామ్రాజ్యకాలమున పుట్టినప్రబంధములవలె నిందును సమకాలికజాతీయ జీవితము ప్రతిబింబించియున్నది. కోసలదేశవర్ణనయందలి ప్రాసంగులు, సన్నవంకలు, బంగారు తీగెలు మున్నగుధాన్యములను చెప్పుట, పొలములకు నీటిపాఱుదల జలసమృద్ధి ప్రత్యేకించి వర్ణించుట యానాడు తంజాపూరిరాజ్యమండల మెంత సుక్షేత్రఖండముగా నుండెనో తెలియఁగలదు. మఱియు దశరథుని కొల్వుకూటములోని వేత్రధరుల యీక్రిందివర్ణనము

సీ. వెన్నముద్దలవోలె సన్నసుగ్గడితంపుఁ, జలిచప్పుబటువుపాగలు పొసంగ
నునుపారె యుఱచట్టలును వాని కొనరిన, వలిపెపచ్చడములు జెలువ మెసగ
నొండొంటనరవచ్చు చున్నచెంపలగొప్పు, నీలాలపోగుల నిగ్గుకొలఁక
నృపముద్రల జెలంగు నపరంజి ముద్దుటుం; గరములు కరములఁ గరము మెఱయ
గీ. శుద్ధవేషంబుతోడఁ బ్రసిద్ధులైన, సచివు లధిపుహజారంబు సరణి దఱిసి
క్రమ మెఱరికొన్నికక్ష్యాంతరములు గడచి, యంత హెగ్గడెవచ్చి రమ్మనుచుఁ బిలువ.

రఘునాథనాయకుని కొలువులోని హెగ్గళ్లేగదా !

ఇందలి శ్వేతద్వీపవర్ణనలోనికొన్నిభావములు ప్రవరసేనుని సేతుబంధమహాకావ్యమునుండి గ్రహింపబడినవి. ఇది రఘునాథుని వస్తుకవితాసామర్థ్యము (అనగా వర్ణితవిషయము నొక్కదానినే బహురీతులు, బహుభంగిమములు నొప్పునట్లుగా రచించుట) నిరూపించుచున్నది. కొన్నిస్వతంత్రభావములును గలవు. రెండింటినిమాత్ర ముదాహరింతును.

---

* ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము సంఖ్య 40.

సీ. రమ పెండ్లిరాఁటిముత్తెములప్రాల్ నిండిర, విధుకాంతమణికాంతవేది యనఁగ
జలవారణములపోరులు సూచు సలిలభ, ర్తకు నొనర్చిన పెండితమక మనఁగ
జలశాయి హరినాభిచతురాస్య గొలువ వ, చ్చినవాహనమరాళసేన యనఁగ
మున్నీటిరాయని ముంజేతివజ్రపు యాపు హంపీరుజాయత యనంగఁ
గీ. బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ, దోరహత్తుగఁ దీనరసపూర మిత్తు
ననుచు నెత్తినధవళపట్టాంబరాఢ్య, జం బనఁగ పాండురాంతరీపంబు వెలయుం.
గీ. నీరుపాపలు గుమిగూడి నింగి కెగయ, వీచికారజ్జువుల గట్టి విడిచినట్టి
కాగితపు గాలిపటము విన్ప్వాంపలీల, నున్నదో యన తెలిదీవి చెన్నమీఱు.

ఇట్లు తెలిదీవిని నలుపదివిధములుగా వర్ణించిన రఘునాథునికవితావైశద్య మెట్టిదో పాఠకు లూహింపగలరు. ఇందులో 467 గద్యపద్యములు గలవు. (1-138-2-192, 3.111-4-26) ఆశ్వాసాంతగద్య వాల్మీకిచరిత్రగద్యవలెనే యుండును.

## శృంగారసావిత్రి*

ఇది రఘునాథభూపాలునికృతిగాఁ బ్రకటితమైనది. ఇందలి కవితాసౌకుమార్యమును, రాజాస్థానసంప్రదాయములును రచనారీతులును రఘునాథనాయకునికృతిగా పట్టియిచ్చు చున్నది కాని యాశ్వాసాద్యంతపద్యములుగాని గద్యగాని కన్పట్టుట లేదు - రఘునాథుని కృతులలో నెవరును నీగ్రంథము తడవియుండలేదు - భావిపరిశోధనమున నింతకన్న వివరము లిచ్చుటకు వీలుగలుగునేమో గమనింపవలసియున్నది.

## వాల్మీకిచరిత్ర

ఆంధ్రవాఙ్మయమునఁ గవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడును, సాహితీసమరాంగణ సార్వభౌముఁడు శ్రీకృష్ణదేవరాయలును, సంగీతసాహిత్య విద్యారసజ్ఞుఁడు రఘునాథనాయకుఁడును రాజకవిత్రయముగాఁ గీర్తింపదగినవారు. ఆంధ్రవాఙ్మయచరిత్రమున ప్రత్యేకవిశిష్టత గలిగిన తంజాపురాంధ్రవాఙ్మయమునకు మూలపురుషుఁ డీ రఘునాథనాయకుడే.

ఈప్రబంధమున కథావస్తువు కవితావతార ప్రథమతీర్థం బగు వాల్మీకి చరిత్రము. పరమపవిత్రమగు నారఘునాథుని చరిత్రము జగదాదిమకావ్యముగ సంస్కృతభారతిని వాల్మీకిరచియించి కవియై కీర్తినందగ, నావాల్మీకిచరిత్రమును నీరఘునాథుఁడు సహజమాధురీధురీణమగు నాంధ్రభాషలో ప్రబంధరూపమున రచియించి, రఘునాథునికే యంకితమొసంగి, కవిరాజై కవితాచరితార్థత గాంచినాఁడు. రఘునాథనాయకుఁ డీ ప్రబంధము రచియించి నట్లు గోవిందదీక్షితులవారు తమసాహిత్యసుధయం దిట్లు చెప్పియున్నారు.

శ్రీపారిజాతాహరణ ప్రబంధ, చిత్రంచ వాల్మీకి చరిత్రకావ్యం
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షంచరిత్రంచ నలస్య చిత్రమ్
శ్రీరుక్మిణీ కృష్ణవివాహయక్ష, గానం ప్రబంధానటనైకభేదాన్
నిర్మాయవాగ్భిర్నిపుణార్థభాగ్భి, ర్విద్వత్కవీనాంవిదధాసిహర్షమ్.

---

* శృంగారగ్రంథమాల 1928 (మద్రాసు).

గ్రంథమున నాశ్వాసాంతగద్యలో రఘునాథునిపేరే యుండుటచేత నిది రఘునాథ కృత మనియే నిస్సంశయముగఁ జెప్పనొప్పును.

వాల్మీకిచరిత్రమూలము సంస్కృతమున ధర్మఖండమున నున్నది. మరియు వాసిష్ఠ రామాయణము, భక్తవిజయము మున్నగు గ్రంథములలో నీకథ యున్నట్లు తెలియుచున్నది. ఈ రెండింటియందును కథలుకొంచెము భిన్నముగ నున్నవి. ధర్మఖండమున వాల్మీకి కిరాత కులుఁడనియు, దోపిడివృత్తిచే జీవించుచుండె ననియు, సప్తర్షిదర్శనముచే రామమంత్రోప దేశమును బొంది మహర్షియై విలసిల్లె ననియు కలదు. వాసిష్ఠరామాయణభక్తవిజయము లలో నీతఁడు తొలుత నుత్తమబ్రాహ్మణుఁడై, యౌవనమునఁ గిరాతవనితాలోలుఁడై సాధు పురుషసందర్శనసాంగత్యములచే మహాపురుషుఁ డయ్యెననియుఁ జెప్పఁబడియున్నది. పై రెం డింటిలో *ధర్మఖండములోనికథనే వాల్మీకి చరిత్రమునఁ బ్రపంచితమై యున్నది. రమారమి మూఁడుపంక్తులలోఁ జెప్పఁదగిన యీకథను మూఁడాశ్వాసముల మహాప్రబంధముగా రచియించుటయే రఘునాథరాయని కవితాప్రతిభను చాటుచున్నది. వాల్మీకి చరిత్రకథా సూత్రము గమనించిన నీవిషయము మఱియు స్పష్టమగును.

ముక్తిసుందరీ యౌవనమగు బదరీవనమున శౌనకాదిమహర్షులు హరిస్మరణచిత్తులై యుండ నారదుఁ డచటికి వచ్చెను. మునులు నారదుని విష్ణుకథలనుఁ దెలుపఁ గోరిరి. నార దుఁడు వైకుంఠమునకుఁ బోఁదలంచి తనసఖుఁడగు పర్వతమునిని వారికిఁ జూపి యాతనివలన విష్ణుకథలెఱుంగుఁ డని చెప్పి వెడలిపోయెను. పర్వతుఁడు వారల కిట్లు చెప్పెను.

తెల్లదీవియందు శ్రీమహావిష్ణువును సేవించి సప్తర్షులు తిరిగి వచ్చుచు సప్తద్వీపములు సప్తకుల పర్వతములు గడచి తామ్రపర్ణిఁ జేరిరి. ఆతామ్రపర్ణి చెంగటఁగల †గజతీర్థము వీక్షించి, తన్మాహాత్మ్యమెఱింగి సేతువునుఁ జూచుటకుఁ బయలువెడలిరి. సేతువునొద్ద ధను ష్కోటియందుఁ గ్రుంగి, రామలింగేశ్వరు దర్శించి మధుర కేతెంచిరి. అచ్చట సోమసుందరు సేవించి యాపై శ్రీరంగపతికిఁ గైంకర్యముగావించి, తంజావూరు చేరి, దక్షిణద్వారక యగు మన్నారుగుడి వీక్షించి, కుంభకోణము, శ్రీముష్ణము, చిదంబరము దర్శించి, శ్రీతిరుపతి క్షేత్రమున శ్రీవేంకటేశునికి సపర్యలొనర్చి శ్రీశైలముఁ జేరిరి. అచ్చట మల్లికార్జును సేవించి, వింధ్యదాటి శ్రీవారాణసీక్షేత్రమున విశ్వనాథు సంభావించునంతలో గ్రీష్మము వచ్చెను. ఆగ్రీష్మబాధ కోర్చి వారు తమసానిమ్నగఁ జేరఁగనే యొక కిరాతుఁ డడ్డపడి వారిని హింసించెను. వారును వానికి తత్త్వబోధ చేసి రామమంత్ర ముపదేశించిరి. కిరా తుఁడు బహుదీక్షతో తపముసల్ప, నా తపోభంగముసేయ నింద్రుఁడు రంభోర్వసులఁ

---

* ధర్మఖండము క్రీ. శ. 1700 సంవత్సర ప్రాంతమున గోదావరీమండల ప్రాంతవాస్తవ్యుఁ డీదురు పల్లి భవానీశంకరకవి ఆంధ్రమునఁ బదియాశ్వాసముల మహాప్రబంధముగా రచియించి యున్నాఁడు. ఈ గ్రంథమును అభినవాంధ్రభోజులు శ్రీపీఠికాపురాధీశ్వరులు క్రీ. శ॥ 1931 లో నచ్చువేయించిరి.

†. గజతీర్థ మనఁగా గజేంద్రమోక్షస్థలము. భాగవతగజేంద్రమోక్షణకథ సంగ్రహింపఁబడినది.

బంపిన వారు విఫలమనోరథులై తిరిగిపోయిరి. అప్పుడు మహర్షు లరుదెంచి యాతని తపోనిష్ఠ కాశ్చర్యమనస్కులైరి. ఆతఁడు వల్మీకమువోలెనై యందుండి వెడలుటచే వాల్మీకి యయ్యెను. అప్పుడు శ్రీరాముఁడు ప్రత్యక్షమై తనకథను కావ్యముగాఁ జేయు మని యానతిచ్చెను. వాల్మీకి యట్లే రామాయణము రచించి యశశ్శరీరుఁ డయ్యెను.

ఇందు మొదటి రెండాశ్వాసములలో క్షేత్రవర్ణనము, తృతీయాశ్వాసమున రంభోర్వశీ వివాదఘట్టమున నాట్యవర్ణనము కవికల్పితములు. ఈ క్షేత్రములన్నింటిని రఘునాథరాయలు దర్శించినవాఁడు. రామసేతు శ్రీరంగకుంభఘోణాది దివ్యక్షేత్రముల శ్రీరామభద్రుని ప్రతిష్ఠించినవాఁడు. తంజావూరు తనరాజధాని. దానిని వర్ణించి తన స్వదేశాభిమానము కనపరచియున్నాఁడు. ఇట్టినాట్యకళ రఘునాథరాయనికాలమున సమున్నతస్థితిలో నుండెడిది. కావున కథాభాగమున వీనికిఁ బ్రసక్తిగల్పించి రఘునాథుఁడు తన కవితాచాతుర్యముఁ జూపినాఁడు. కథయందిట్టిఘట్టములు మొత్తముమీఁద మనోహరములై యున్నవి.

ఈరాజకవి కవిత్వము మృదుమధురపదఘటితమై, ధారాశుద్ధిగలిగి ప్రసన్నగంభీరమై యొప్పుచున్నది. కావ్యమంతయు స్వతంత్రముగ రచియింపఁబడినదయ్యు నచ్చటచ్చట కొన్నిప్రాచీనశ్లోకముల కనువాదములును, ప్రాచీనకవికృత పద్యముల కనుస్మృతులును లేక పోలేదు. మచ్చునకు:

హనుమంతుని వర్ణనకృత్యాది.

ఉ. ఎక్కడ రామకీర్తన మెుకించుకయేవినసైన వేడ్కడా
నక్కడ వచ్చి రంజిలి కృతాంజలి యై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁఖులకబృందము జాదుకొనంగఁ బాడుచుజ్
జొక్కుచు నాడు నయ్యనిలసూను ప్రభానతభానుగొల్చెదన్.
ఇది "యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్."
అనుశ్లోకమునకుఁ దెలుఁగుచేఁత.

సీ. పంకజబిందు బింబస్థాయి త్రైలోక్య మంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానందసంధాయి గరుడతురంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలశులాయి ప్రపంచ రక్షణోపాయి శ్రీరంగశాయి
అఖిలదైవతసంసదలిశాయి యగణిత బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి
నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి, అచ్చలకునెల్ల మొదల నచ్చెచనప్రాయి
గొలుచువారలపాలిటి తలఁపురాయి, రావణానుజదాయి శ్రీరంగశాయి. ద్వి. ఆ.

పైపద్యమును ప్రాసఘటితమైయున్నను నిది చదివినతోడనే సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనమున నీక్రింది పద్యము స్మరణకు రాకమానదు.

సీ. అపవర్గకాంక్షచే నాకొన్నవారికి దంగేటిజున్ను శ్రీరంగశాయి
నిర్వాణదారిద్ర్య నిర్విణ్ణుఁడగువాని ముంగిటి శేవధి రంగశాయి

సంసారమలవిమోచనము సాకాంక్షించు వారికి వైగంగ రంగశాయి
పరమార్థలాభతత్పరుఁ డైనవానికి ముంగొంగు పసిఁడి శ్రీరంగశాయి
బెదరకాకఁటి యమృతంబుఁ బిదికికొనఁగ, శృంగములు లేని మొదవు శ్రీరంగశాయి
కోరువారలకోర్కె లీఁగోరివచ్చు, జంగమామర తరువు శ్రీరంగశాయి.

అచ్చటచ్చట శబ్దాలంకారములు హృదయంగమమై కవితకుఁ గణన కూర్చుచున్నవి.

క. లోపలఁ జని చని హరిసీ, లోపలకురువిందకందళోజ్జ్వల కనకా
లోపల సద్రచనాజా, లోపలలితమైన యొక్క యున్నతవేదిన్.

మ. తమసానిమ్నగ దాఁటి తజ్జలసముద్యద్బాల శైవాలజా
తమసారద్యుతి తీరభూరుహ విభాఘట్టంబుతోఁ గూడి సం
తమసానీకముఁబోలె నద్దెసలు నిండం జూచి యాహా మహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతంజాల బల్కెంపుచున్. ద్వి. ఆ.

వాల్మీకిచరిత్రము స్వతంత్రప్రబంధముగా నెన్నఁదగినది. కవితాప్రౌఢియందేమి, కావ్యనిర్మాణమునందేమి, కళాప్రదర్శనమునందేమి, ఆంధ్రప్రబంధములో నున్నతస్థాన మాక్రమించుచున్నది. రసౌచిత్యవిషయమున దక్షిణాంధ్రవాఙ్మయమున నీకావ్యమునకుఁ బ్రత్యేకవిశిష్టత కలదు. రఘునాథభూపాలుఁ డుపయోగించిన శబ్దజాలమాతనికి నన్నిచోడని కుమారసంభవముతోడను శ్రీకృష్ణదేవరాయలవారి యాముక్తముతోడను పరిచయమున్నట్లు తెలుపుచున్నది. తృణజ్యోతి ఓహరిసాహరియున్నగు పదము లిందులకుఁ బ్రమాణము. 'ఉగము' మున్నగు నపూర్వపద ప్రయోగము లిందు కానఁబడుచున్నవి. రఘునాథభూపాలుఁడు వైష్ణవుఁడగు శ్రీరామభక్తుఁడయ్యును, పరమతసహిష్ణుతకలవాఁడు. వాల్మీకిచరిత్రమున క్షేత్రవర్ణనమున శైవక్షేత్రములఁగూర్చి చేసిన ప్రశంస లాతనికిఁ బ్రాచీన శైవవాఙ్మయమునఁగల పాండితిని సూచించుచున్నవి. చూడుఁడు. మధురయందలి సోమసుందరుని వర్ణనము.

సీ. మునులకందగరాని మోక్షంబు పక్షికి దయచేసె నెవ్వాఁడు నయమొనర్ప
వివిధార్థములఁగ ద్రావిడసూత్రములు సలక్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబులు తురంగంబులుగాఁ జేసి యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతినిందలకుఁ దామసుల శూలవిద్ధుఁ గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ
దట్టఁదలఁబెట్టపట్టెఁడు పిట్టొసంగు, ముసలియవ్వకునై మన్ను మోసె నెవ్వఁ
డట్టి లింగస్వరూపున కఖిలపతికి, సోమసుందరునకు నీకు జోడు గలదె. ద్వి. ఆ.

జంబుకంబులు తురంగములుగా చేయుట, పిట్టవ్వకుఁ దట్టలుమోయుట మున్నగు కథలు దాక్షిణాత్యశైవవాఙ్మయముతోఁ బరిచయమున్నఁగాని సాధారణముగఁ దెలయనట్టివి. ఇట్లే తంజావూరు, అరుణాచలము, శ్రీశైలవర్ణనము రఘునాథుని పరమతసహనముఁ దెలుపుచున్నవి. మాధ్వయతియగు సుధీంద్రుఁ డీతనిచే కనకాభిషేకసత్కారముఁ గాంచినవాఁడు. ఇట్లు పరమతసహనముగలిగినవాఁడయ్యు, తన రామభక్తిని గ్రంథమునందుఁ బ్రస్ఫుటముఁ గావించినాఁడు. గజతీర్థమును వర్ణించుపట్టున భాగవతగజేంద్రమోక్షణకథను

సంక్షేపముగఁ భావగర్భితముగ జెప్పియున్నాఁడు. కథయందు ప్రసక్తిలేకపోయినను, తన కాలమున తానత్యున్నత స్థితికిఁదెచ్చిన నాట్యకళా, సంగీతకళా విశేషముల నీగ్రంథమునఁ దృతీయాశ్వాసమున వివరించినాఁడు. పుట్టతేనియ పోలిక నిట్టలంపు: దీయఁదనముఁగలిగిన తెలుఁగు బాసయందు బుట్టఁబుట్టువు మనుగడను నీరాచకయింపరి వ్రాసి, తనుగొల్చువేల్పు నకు నీకబ్బపుఁగన్నె నిచ్చి యెల్లకడల నెల్లవేళలఁ దెలుఁగువారిలో నెలకొనిన పేరుగడించి నాఁడు. మహాదాతయై, శత్రుజేతయై, కృతిప్రణేతయై, శరణాగతత్రాతయై, గాంధర్వ విద్యాధిష్ఠాతయై కవిపండిత హృదయసంస్థాతయగు నీరఘునాథభూనేతచరిత్రము బంగారు నీట లిఖింపఁదగినది. రాజకవీంద్రకృతమై కవిరాజసమ్మానితమగు నీకృతుల యాంధ్రమహా జను లాదరింతురుగాత!

ఈతనియాస్థానమునందలి కవులు:—

## చేమకూర వేంకటరాజు

ప్రబంధవాఙ్మయమున బహుళప్రచారములోనుండి తెలుగువారికి తొలినుండి తెలిసిన దాక్షిణాత్యకృతి విజయవిలాసము. ఈరసోత్తర ప్రబంధము రచియించినకవి చేమకూర వేంకటరాజు. కృతిభర్త అభినవభోజరాజబిరుదాంకుఁడు రఘునాథరాయలు. రఘునాథనాయకుడు పాండ్య, తుండీర, [1]నేపాళ [2]చోళగులను జయించినవెనుక, క్రీ. శ. 1516 ప్రాంతమున విజయభవన మనుసౌధమున నీకృతి నంకితముగొనియుండును. ఈవిజయభవనరాజము రఘునాథనాయకునిచే తానుపొందిన విజయములకు చిహ్నము (పుట 18-41-424-25 నకు గట్టింపబడినట్లు, రఘునాథనాయకాభ్యుదయమున నిట్లు చెప్పబడినది.

"విజయచిహ్నములచే వెలయుచు నున్న, విజయభవనరాజ వేదికాస్థలిని"

విజయవిలాసమునగూడ నీభవనము పేర్కొనబడియున్నది.

"క. చెలులు ప్రసంగవశంబున, నలరెంగడువిజయభవన మనినన్" (3-26)

ఇచ్చట కథాభాగమున విజయుఁడు (అర్జునుడు) న్నభవన మని రఘునాథరాయలు కట్టించిన విజయభవన మని శ్లేష. వేంకటకవి స్పష్టముగ చెప్పకపోయినను రఘునాథరాయలు పైవిజయములను పొందినవెనుక, నీభవనమున కృతి నిచ్చుటచేతనే, భావస్ఫోరకముగ నీగ్రంథమునకు, విజయవిలాస మని పేరు పెట్టియుండుట గ్రంథపరిపాటి చెప్పక చెప్పుచున్నది. దీనికి సుభద్రాపరిణయమని నామాంతరము. ఇదియును పైవిషయమును స్పష్టపఱచుచున్నది.

క్రీ. శ. 1655 లో ప్రసిద్ధలాక్షణికుడగు నప్పకవి తనగ్రంథమున విజయవిలాసము నుండి పద్యము లుదాహరించుటనుబట్టి చూచినచో నీకృతిరచితమైన ముప్పదినలువ దేండ్లలో నెంత ప్రఖ్యాతిగన్నదో తెలియగలదు.

---

1. నేపాళమనునది - నేటి జాఫ్నా (Jaffna) అనుపదము సంస్కృతీకరణము - అరవమున దీనిని 'యాప్పాణము' అని యందురు.

2. 'చోళగ' అనునది, దేవికోట ద్వీపమును పాలించు నొకనాయకుని పేరు.

మఱియు పల్నాటిలోని తంగెడసీమకాపురముగాగల యప్పకవి దక్షిణదేశమున సుదూరమున నున్న తంజావూరిలో రచితమగు కృతి నుదాహరించుట చూడగా నప్పటికి రెండింటికి, నడుమ రాకపోకలవ్యవహారము లెంతనిరంతరాయముగా సాగుచుండినవో తెలియగలదు.

కులభేదముచేత లోకోత్తరమగు వసుచరిత్రనుండి పద్యము లుదాహరింపని యప్పకవి, విజయవిలాసరచయిత వేంకటరాజుకులము తెలియకపోవుటచే 5 పద్యము లుదాహరించినాడు. చేమకూర వేంకటరాజు కులమున కళంకముగలవాడే యనుటకు శ్రీవాసిరెడ్డి వేంకటాద్రినాథునివారికాలమున నడచిన యీప్రసంగమువలన దెలియవచ్చుచున్నది.[1]

కులమున కళంకముగల బుచ్చి వెంకు అను నొకకవిగూర్చి వేణ్ణాకవి ప్రభువు యొక్క యభిప్రాయముగా

"కులమునఁ గళంకు కలదనుకొంచుఁ గొంకు, బుధజనాటవ్యవన్యాంకు బుచ్చివెంకు."

అనెనట, అంతట వేణ్ణాకకవి లేచి

కొంకక తమరాడిన యది, బొంకేలగు వేంకటాద్రిభూపాలక యీ
న్యంకేల వానికిం గల, రంకే యిచ్చోట నిలుప రసవంతమగున్.

అని చమత్కరించె నట. అందుల కాబుచ్చివెంకు

ఉ. పన్నినసత్ప్రబంధమున బాగును నోగును జూడ కీసుచే
మన్ననమాలి మాకులముమాటఁ దలంతురె ? చేమకూర వెం
కన్నకు లోవ మేమి ? కులమా కవనాదకు ? వెంకటాద్రిరా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచిన మాకుఁ జాలదే ?"

ఉత్తమసాహితీపథకమున జాతిమతభేదములు లేవుగదా ! అప్పకవి యిందలి రచనానైపుణికి ముగ్ధుడై పద్యము లుదాహరించియుండును. అప్పకవియే యననేల, అఖండ కవితా సాహితీసంపన్నుండును, అనుపమానవైదుషీ భూషణుండును, అభినవభోజరాజ బిరుద విరాజమానుండును నగు రఘునాథరాయలే వేంకటకవినిగూర్చి వాఙ్మయమరూఢి నీయంతవాడికేడి (1-43) అనియు, ప్రతిపద్యమునందు చమత్కృతి గలుగంజెప్ప నేర్తువనియు, క్షితిలో నీమార్గ మెవరికినిన్ రాదుసుమీ (1-50) అనియు, ప్రశంసింపగా నిక తక్కినవారిప్రస్తావనయే యనావశ్యకము. నాటినుండియు దక్షిణాంధ్రవాఙ్మయముననేగాక నాయుగమున ప్రభవించినప్రబంధము లన్నింటికి నిది తలమానికమై వెలయుచున్నది.

విజయవిలాసమున మూడాశ్వాసములు గలవు. ప్రథమ ద్వితీయ తృతీయాశ్వాసములలో క్రమముగా, 228, 206, 238 మొత్తము 672 పద్యములు గలవు. ఇందు వచనము లెనిమిదిమాత్రమే యుండుటచేత నిది కేవల పద్యకృతియనియే చెప్పనగును. ఇందు ప్రతిపద్యచమత్కృతి యిట్లు సాధింపబడినది.

1. చాటుపద్యరత్నాకరము శ్రీ దీపాల. పిచ్చయ్యశాస్త్రిగారిచే సంపాదితము, పుట 162.

షష్టిపూర్తి సంపుటము

1. జాతీయములకూర్పు, 2. యమకము (గమకము)లపేర్పు, 3. శ్లేషల నేర్పు సామెతలు.

1. ఆనతియిచ్చిరాయేది 'శిలాక్షరము', దానమిచ్చెరా 'ఏనుగుపాడి', కంకణముగట్టు, పంచబంగాళ మైపాటు, పెట్టసికోట దెబ్బదీయుట, చిదిమిపెట్టినబంటులు, ఉక్కుతునకలు, కొంగుఁబసిండి, నడుమంత్రపు గల్మిజాదులు ప్రసాదములు, కాలుద్రొక్కు, పెట్టనిసొమ్ములు మొదలగు జాతీయము లిందు చక్కగ ప్రయుక్తములైనవి. వీనిసార్థక్యము నెఱుకపఱచుట కొకపద్య ముదాహరించుచున్నాను.

చ. జలరుహగంధిపీనులపసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్
చెలియ నఖాంకురాళి నెలచేడియసైకము దాను చుక్కనున్
బాలఁతుక గబ్బిచన్నుగవపువ్వులచెండ్లను లేదు బంతనున్
కలికిముఖారవింద మల కల్వలరాయని త్రోసిరాజనున్.

2. సామెత లచ్చటచ్చట ముచ్చట గూర్చుచుండును.

వంటయింటికుందే లిది యెందుఁబోఁగలదు. 1-71. ఏటికివచ్చెరమ్మ తాఁబిలువని పేరంటమునకు. 1-78. ఈఁతకుమిక్కిలి లోఁతుగల్గునే. 1-167. మోక్షమునకుఁబోవ మొసలెత్తుకొనిపోయె. 2-43. పెద్దలున్నారు వారెర్గి పెండ్లిసేయగలరు. 2-187. విండ్లమ్ములుంగలవారికి తోడుచల్లకదవల వారే. 3-44. శోభనముమీద శోభనము. 3-185.

3. యమకము లప్రయత్నముగనే యర్థస్ఫురణను గలిగించును.

ఆపుర మేలు మేలు భళియంచు. 1-84. యమునాతరంగిణీతో యమునా 1-121. తియ్యనివాటివాని వెనుదియ్యక 1-143. గోష్ఠినుండెడు పద్మరాగోష్ఠి 2-100. చొక్కమగు దీనిఁజూచిన చొక్కమనం. 2-103. కలశస్తనిమణికంకణకల శస్తనిసాదము 3-79.

కొన్ని పద్యములలో నన్ని పాదములం దిట్టి చమత్కృతి యుండును.

గీ. నలినలీలనంచు నలినలిగావించు, నించుమించులాడు నించుమించు
లేమనగవుజూపు లేమననగుబాపు, జగ మెఱుంగుదాని జగ మెఱుంగు. 1-101.

గీ. హిమరసైకసైకతమునందు విహరించు, కైరవేషువేషు ఘననిభాంగు
నెనరుఁదవుల దవులనే చూచి క్రీడిగా, నెఱిగి యార! యారగేందువదన.
ముదితచేతులఁ దలబ్రాలము త్తియముల ముదితచేతులగుచు 2-24.
(ముదిత చేతస్కులగుచు అని యుండదగును.)

ఈ క్రిందియుదాహరణ సాంతపదములు మనశ్శబ్దమును నిర్ధారణచేయును.

మనసుభద్ర సుకృతమహిమమనసుభద్రమయ్యె. 3-87.
మంగళసూత్రంబు! చతురిమంగళసీమన్. 2-14.

ఒక్కొకచో రేఫ, శకటరేఫముల సాంకర్య మీప్రవాహమున గొట్టుకొనిపోవుచుండును. అయిన నివి రసోత్పాదకములే.

కురుపీరవసింపఁగ నీకురు (కుఱు) పీర 1-145. వేమఱుఁ జురుఁ మరుప్ప్రద్గాంక 3-42.

వశ్యవాక్కగు చేమకూర వేంకటకవికిగాక యితరుల కింతటిసామర్థ్యము కలుగుట యరిది. ఇంక నెన్నెన్నో పద్యము లుదాహృతములుగా చూపవచ్చును. 1-150, 1-195,196 ను ప్రాసములు.

4. శ్లేషలు - యమకానుప్రాసములు మొదలగు శబ్దాలంకారములేగాక శ్లేష మొదలగు అర్థాలంకారములయందు నీకవి యందెవేసినచేయి.

గీ. పోఁకమ్రాఁకులమహిమ కప్పురపు టనఁటి, యాకుఁదోఁటలసౌభాగ్యమందె గలదు
ప్రబలుమౌక్తికసౌధసంపదలమహిమ, వీటిరహి మెచ్చవలయుఁజో వేయునోళ్ల. 1-32

ఇందు పోఁక - కప్పురము - ఆకు - మౌక్తికము - వీటిరహి అనుచో, శబ్దశ్లేషలవలన కర్పూరసహితమైన వీడియము (తాంబూలము) వ్యక్తమగుచున్నది.

ఉ. ఊదుకపోవుశంఖము నవాంగళరేఖశరాసనంబులన్
వాదుకుబట్టుకన్బొమలవైఖరి వంకలుతీరుచుఁ, కటా
క్షోదయలీలసాయకసమూహములన్ విషమాస్త్రు గెల్చుబో
యేదొరసాటి యానరున కెన్నఁగ వీరవిలాససంపదన్. 1-34.

ఈపద్యమున ఊదుకపోవుట - వాదుకుబట్టుట - వంకలుతీర్చుట మొదలగు తిరస్కార పదములకు నాయా యుపమానవాచకముల స్వభావమునకు చక్కని యర్థభావసమన్వయము శ్లేషమూలమున సమకూడినది.

5. జాతీయధ్వనులు: ఊత - (Accent) మనోభావవ్యక్తీకరణమునకు

క. మీరింద్రప్రస్థముగ, న్నారా? పాండవులఁ జూచినారా? సఖులై
వారందఱు నొకచో నున్నారా! వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా!

తెనుగున ఊత (Accent) యున్న దని చెప్పుటకు నీగ్రంథమున చక్కనియుదాహరణములు గలవు. ఒక్కటి—

క. అరచందమామ నేలిన, దొరగా [1]నెన్నుదురు, నెన్ను[2]దురు బిత్తరికిం
బరువుపంపు మల్లెమొగ్గల, దొరగా [1]బల్కుదురు, బల్కు[2]దురు జవ్వనికిన్. 2-78.

పై పద్యమున 1 యని సూచించినచోట నూఁదిపలికిన ఒకయర్థమును 2 సూచించినచో నూదిపల్కిన మఱియొకయర్థమును తెలుపును - ఒకటి నెన్నుదురు, = గణింతురు; రెండవది నెఱ+నుదురు - నెన్నుదురు. రెండవదానిలో నొకటి పల్కుదురు = చెప్పుదురు, రెండవది పల్ + కుదురు = పంటియొక్క కుదురు, చాలు అనగా దంతపంక్తి.

ఇట్టి మనోహరకావ్యమున పాతాళలోకమునగల నాయిక యులూచిని, మర్త్యలోకమున గల నాయిక చిత్రాంగదను, స్వర్గలోకనాయిక సుభద్ర (సుభద్ర శ్రీకృష్ణుని చెల్లెలు). చిత్రించి చేమకూర వేంకటకవి సిద్ధహస్తుఁడై నాఁడు. విజయవిలాసము దక్షిణదేశీయాంధ్రకవికా విజయవిలాసము.

## సారంగధరచరిత్ర

చేమకూర వేంకటకవి ద్వితీయకృతి సారంగధరచరిత్ర. ఇదియును మూడాశ్వాసముల పద్యకృతి. కథ ప్రసిద్ధమైన సారంగధరునివృత్తము. దీనియం దనవారికి లేకపోయినను నాశ్వాసాద్యంతపద్యములు రఘునాథరాయునికే కృతిగా నున్నవి. దీనికి మూలము గౌరన నవనాథచరిత్రమున గలదు. కథ మాళవదేశమందు జరిగినను నాంధ్రదేశమున మిక్కిలి వ్యాప్తినందినది. ఈగ్రంథమున నవనాథచరిత్ర ద్విపద కృతినుండి పద్యానువాదములు గలవు.

సారంగధరచరిత్ర తొలుత ప్రత్యేకప్రబంధముగా వ్రాసినకవి చేమకూర వేంకట కవియే. జాతివార్తాచమత్కారములకు, శబ్దశ్లేషలకు తెనుగుకవితా కమనీయతకు నాదర్శ ప్రాయమగు వేంకటకవి కవితాలతకువిజయవిలాసమును సారంగధరయును నిత్యసౌరభమును వెదజల్లుపుష్పములు. ఈసారంగధరకథను ద్విపద యక్షగానగేయరూపమున కవులు వెలయించినను, "క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ" యనునట్లు వేంకటకవిరచనను నెవ్వరును మించిపోలేదు. లోకోక్తులు శ్లేషార్థములుగల జాతీయోక్తులు అపూర్వదేశిపదములు నిండారుచు, తెనుగుతీయదనమును చవిచూపుచుండు నీగ్రంథము. "విజయవిలాసముకంటె, కవితాఘటికయందు, *రచనాసౌష్ఠవమునందును కొంచెము వెనుకబడినను శిల్పనైపుణిలో దానిని మించినది." ఇది ముద్రితమై వ్యాప్తిలో నున్నది.

## కృష్ణాధ్వరి †

ఈతడు నైషధపారిజాతీయ మను శ్లేషప్రబంధమును, రచియించి రఘునాథునకుం గృతిగా నొసంగినాడు. ఇది యైదాశ్వాసముల కావ్యము. రఘునాథనాయకుం డీకృతికిన్ ముందు, పెక్కుకృతు లందినట్లు కృష్ణాధ్వరి యిట్లు తెలుపుచున్నాడు.

సీ. నవరస శ్రీరఘునాథభూపాలీయ నామభామాభీష్టనాయకుండు
పారిజాతకథావతారికాహృదయ కావ్యస్వయంవరవరవల్లభుండు
కల్యాణకౌముదీకందర్పనాటక కన్యోద్వహానబద్ధకంకణుండు
యమరుకాహంకార! హారిభంగిక శృంగారసంజీవినీకాముకుండు

---

* ఈగ్రంథమును కూలంకషముగ బరిశోధించి, జితకాశివ్యాఖ్యానముతో గూడ విద్వత్కవులు, విమర్శకాగ్రేసరులును నగు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ప్రకటించిరి. ఈగ్రంథము పై సంపూర్ణవిమర్శనమందు గలదు.

తంజాపురాంధ్రనాయక రాజచరిత్రమున పుట 237 లో కృష్ణయజ్వకూడా తెనుగున శృంగార నైషధపారిజాత మనుద్వ్యర్థికావ్యము రచియించెను అని వ్రాయబడియున్నది. గ్రంథ నామమునం దెక్కడను ముందు శృంగారపదము గనపట్టుటలేదు. ఇది శ్లేషకావ్యము, ద్వ్యర్థికావ్యముగాదు-దానిగద్య యిది-"ఇది శ్రీమద్రఘునాథపాలనానుభవనిష్ణాత కృష్ణాధ్వరివిరచితంబైన నైషధపారిజాతీయం బనుపుణ్యశ్లేషప్రబంధము నందు...ఆశ్వాసము"

తాళచింతామణిపద్యాతత్పరుండు, మంచి జామాతరఘునాథమనుజనేత
తెలియ నైషధపారిజాతీయకృతిచయం, బేవు రక్కల చెప్పెదైరె హెచ్చు ననుచు.

ఈకవి వర్ణనలకును మృదుపదరచనానైపుణ్యమునకును సులభగ్రాహ్యశ్లేషకు నీ క్రిందిపద్యముల నుదాహరణములుగా గ్రహింపనగును. ఉభయకథాపక్షములను జంద్రోదయవర్ణనము.

"సీ. అంధకారముగొందులందుదూకిననేమి వెన్నెలకుబ్బు గావింపలేదె
అంభోరుహశ్రీలనపహరించిననేమి కైరవంబులసెల్లఁ గావలేదె
కోకంబులకు మేలు గూర్పకుండిన నేమి సెరిఁజకోరముల మన్నింపలేదె
విరహిదంపతులకు వేడి చూపిననేమి సుఖితులకును జల్వచూపలేదె
గీ. మేలుదలఁచినవారికి మేలుఁ జేయుఁ, గీడుదలఁచినవారికిఁ గీడు చేయుం
నేఁడు జాబిల్లి సెత్తిదీవించ నేల, ధర్మమిది రాజమాత్రసాధారణంబు."

పురవర్ణనము, స్త్రీవర్ణనము

సీ. రంగారుకడవన్నెబంగారుకుండల నొరయుచు నుండుపయోధరములు
కటికిదూరమతానాశావకాశంబు నధరీకరించుమధ్యమునుకీని
మాలిన్యమెఱుఁగనిమణిదర్పణంబులఁ గడకొత్తుముఖ చంద్రకాంతకాంతి
మించురత్నాకరమేఖలకును భూష ణంబైనచారునితంబభార
తే. మారవర్ణింపఁ బ్రద్యుమ్నహర్మ్యమిట్టిదింతియేయనిమరినిశ్చయింపరాని
యేపొసఁగెచెరా ... ... నృపతి పుత్రికలను జూచిహృదయ మలర."
నొరయుచునుండు (పు) [1] రాచుకొనుచుండు (స్త్రీ) పోటిచేయుచుండు
పయోధరములు (పు) మేఘములు (స్త్రీ) స్తనములు
రత్నాకరమేఖల (పు) సముద్రమువడ్డాణముగాఁగలభూమి (స్త్రీ) రత్నముల కాకరమగు వడ్డాణము.

వ. సత్యాయత్తచిత్తానుపర్వకార్యనిర్వహణంబునకై వచ్చితి నంటివి తత్సాక్షికంబుగా నిన్ను వరించెద మదిత స్వయంవరోత్సవంబున ననుచు రాజకన్యలక్షణంబున విన్నవింప ననుకంప మానుండై విని రేపుసోమశ్రవణంబు శోభనకృత్యంబులకనిశ్చితంబు బ్రవేశించి హర్షోత్కర్షంబున సమస్త రాజలోక సాధారణ నాగరిక సౌవస్తిక సంభావణంబుల విదర్భభూపతి పూజ్యమానుండై సముద్య దద్యశ్వీన వివాహశోభనలుండు నగరిశృంగారంబు గావింపగా మించుచుండునప్పుడు.

సత్యాయత్తచిత్తా
- (నై)[2] సత్యమునకధీనమైన చిత్తముకలవాఁడా
- (పా) సత్యభామకధీనమైన చిత్తముకలవాఁడా

తత్సాక్షికంబుగా
- (నై) సుపర్వులు సాక్షులైయుండఁగా
- (పా) సత్యభామ సాక్షియైయుండఁగా

1. పు=పురవర్ణన. స్త్రీ=స్త్రీవర్ణన.
2. పా=పారిజాతాపహరణకథ. నై=నైషధకథ.

రాజకన్యలు+అక్షణంబున (పా) రాజకన్య+లక్షణంబున (సై)
విదర్భభూపతి+పూజ్యమానుఁడై (పా)
విదర్భభూపతి (చేతఁ) బూజ్యమానుఁడై (సై)
వివాహశోభ (చేత) నలుండు (సై)
వివాహశోభనలు+ఉండు (పా)

క. భృతిచే విదర్భభూపతి, సుతనుసమాజంబునెల్లసాక్షిం జేసి శుభ
స్థితిఁ బెండ్లియాడె నధిగత, రతిభావనలుండు సానురాగశ్రీలన్.
విదర్భభూపతిసుతను=విదర్భరాజుకూఁతురగుదమయంతిని (సై)
సమాజంబునెల్లన్=సదస్యులనందఱను (సై)
విదర్భభూపతి=రుక్మిణీపతియగుకృష్ణుఁడు
సుతనుసమాజంబున్=రాజకన్యాసమూహమును

సూరనాదులుపయోగించిన యాంధ్రభాషా సంస్కృతాభిభాషా శ్లేషాదులగు నన్ని శ్లేషలను గ్రహించినట్లు పైయుదాహరణముల వలననే స్పష్టముగాఁ దెలియుచున్నది. (నైషధపారిజాతీయముసంఖ్య. 172)

ఇట్టి యుత్తమకావ్య మింతవఱకును ముద్రితము కాకుండుట యాంధ్రుల దురదృష్టము. దీనినిగూర్చి మద్రాసువిశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన శాఖాపత్రికలో శ్రీచల్లా సత్యనారాయణగారి వ్యాసము చూడఁదగినది.

## క్షేత్రయ

ఆంధ్రసంగీతప్రపంచమున మూర్తిత్రయ మని చెప్పఁదగినవారు అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య. వీరిలో కడపటివారిరువురు తంజాపురాస్థానికి సంబంధించినవారే. క్షేత్రయ సంగీతవిద్యాచక్రవర్తియగు రఘునాథునిదర్శించినట్లు ఎవరుండ్ర నరసింహకవి రచించిన 'ఆంధ్రకౌముది' యనుగ్రంథమున నిట్లు గలదు.

మువ్వగోపాలభక్తేన క్షేత్రజ్ఞకవినాకృతత్వాచ్చ.

క. తమదామె పట్టు దర్థుల, క్రను మెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి, భ్రమరంబులు యచ్యుతేంద్ర రఘునాథనృపా!

కాని యీతనిపై క్షేత్రయ చెప్పినపదములు కానరావు.

## కవిచౌడప్ప

ఆంధ్రవాఙ్మయమున హాస్యరసమును వెల్వరించిన కవిచౌడప్ప రఘునాథనాయకుని సెలవిఁగినట్లుగా నీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. నేరుతు నని మాటాడగ, వారిజభవునంతవానివశమా! తంజా
పూరిరఘునాథరాయని, గారెఱుఁగఁగ కుందవరపు కవిచౌడప్పా.

# *అరవదేశమందలి ఆంధ్ర వాఙ్మయము

విద్యాశేఖర
శ్రీ అక్కిరాజు ఉమాకాన్తమ్

తంజావూరు సరస్వతీమహాలున అరవదేశనివాసులు రచించిన ఆంధ్రగ్రంథములనేకము లున్నవి. వీనినిఁ బరిషత్పుస్తకాలయమున కొసఁగిన వారిలోఁ దెలుఁగు వ్రాయుటకుఁ గాని చదువుటకుఁ గాని సమర్థులు కానివారు పెక్కురు గలరు. తెలుఁగా దేశమున రాజాదరముకల భాషగానుండిన దినములలో గ్రంథకర్తలు బయలుదేఱి గ్రంథముల రచింపుచియుండిరి. వా రాంధ్రదేశమునుండి పోయి యచ్చట స్థిరపడినవారుగాఁ గాని వారిసంతతివారుగాఁ గాని యుండవలయును. కేవల మరవవారు వ్రాసిన గ్రంథములుగూడఁ గొన్ని యీసూచ యమునం దున్నవి. దక్షిణదేశమునందుఁ దెలుఁగునకుఁ బ్రభుపోషణమున్న సమయమున నాంధ్రు లనేకు లాప్రాంతములకుఁ బోయిరనుట వాస్తవము. ఇప్పటికిని వారిసంతతి వా రచ్చట నున్నారు. పరిషత్తు సంపాదించిన దక్షిణదేశగ్రంథసూచయమునందుఁ గొన్ని

సంస్కృతగ్రంథములు

కూడ నున్నవి. కాని తెలుఁగు పుస్తకములసంఖ్యకంటె వీనిసంఖ్య మిక్కిలి తక్కువ. ఈసంస్కృతగ్రంథములలోఁ గొన్ని యరుదైనవి యున్నవి; కొన్ని యాధునికదాక్షిణాత్య పండితవిరచితము లున్నవి. మంకిభట్టకృతమైన ప్రాతిశాఖ్యభాష్యమును (భరద్వాజశిక్ష,) కేశవమిశ్రుని తర్కభాషయుఁ గాంచీనాథుని రతిరహస్యదీపికయు, శంకరుని శారీర మీమాంసాభాష్యమును, దిరుమలదేవరాయల గీతగోవిందవ్యాఖ్యానమును వీనిలో ముఖ్యములైనవిగా నున్నవి. తర్కగ్రంథమగు గదాధరవిరచితసామాన్యనిరుక్తి సునుపైన మొద్దుకాగితములపై వ్రాయఁబడి యున్నది. పాలకాప్యమునికృత వనానుచరితాఖ్యాయ

---

* ఈవ్యాసము 1912 సం॥ న విద్యాశేఖర శ్రీ అక్కిరాజు ఉమాకాన్తమ్‌గారుచేసిన తంజావూరి సరస్వతీమహాలునందలి గ్రంథపరిశోధనలకు ఫలితముగ వ్రాయఁబడినది. దక్షిణదేశమందలి తెలుఁగు వాఙ్మయ పరిశోధకులలో వీరే మొదటివారు. "త్రిలిఙ్గ" మాసపత్రికకు సంపాదకులుగను, అమీఁద ఆంధ్రసాహిత్య పరిషత్తుమేనేజరుగను ఉండిరి. కొంతకాలము ప్రెసిడెన్సీకాలేజీ ప్రధానాంధ్రోపాధ్యాయులుగ నుండిరి. పల్నాటివీరచరిత్రను అనేకములయిన వ్రాఁతప్రతులతో సంప్రతించి చక్కఁగ పరిష్కరించి ప్రకటించిరి. షేక్స్పియర్ నాటకకథలు - టిప్పుసుల్తాన్ నవల - పాణినీయము మున్నగు గ్రంథము లనేకములు రచించిరి. వీరిస్వస్థలము గుంటూరుజిల్లా నరసారావుపేట సమీపమందలి పిడుగురాల (గుత్తికొండపోస్టు.) సుప్రసిద్ధ పండితులగు శ్రీ బెల్లంకొండ రామారావుపంతులువారివద్దను కలకత్తా విశ్వవిద్యాలయ సంస్కృతకళాశాలలోను వ్యాకరణసాహిత్యవిద్యలగడించిరి. వీరిభాషాభిమానమును సత్ప్రవర్తనయుం జిరస్మరణీయములు. వీరి "నేటికాలపు కవిత్వం" అను గ్రంథము నవ్యసాహిత్యవిమర్శనమునకు పునాదివంటిది. పక్షవాతముచే 1938-వ సం॥ న అకాలమరణముచెందిరి.

మని యొకశాస్త్రమున్నది. దానిలో గజరోగచికిత్సావృత్తాంతము మునిచక్కఁగ వివరించి నాఁడు. మఱికొన్ని వైద్యసంగీతశ్రౌతగ్రంథములుకూడ నున్నవి. ఇవియన్ని తెలుఁగులిపి యందే యున్నవి.

భరతముని విరచితమైన యభినయదర్పణమును, శార్ఙ్గసూరి ప్రణీతంబైన సంగీత రత్నాకరమును గలవు. తక్కినవి

## తెలుఁగు గ్రంథములు

నన్నయ మొదలు పెద్దనాదులవఱకునుగల కవులగ్రంథములలో మిక్కిలి ప్రఖ్యాతి చెందినవే యిందున్నవి. అనఁగా భారతము, రామాయణము, భాగవతము, మనుచరిత్ర, వసుచరిత్ర, రాఘవపాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, నరసభూపాలీయము మొదలగునవి యున్నవి కాని హెచ్చుకీర్తి గడింపని ప్రబంధములు పూర్వకాలపువి యంతగాలేవు. మధ్యకవుల కావ్యములు నాధునికులకావ్యములును సంచయమునందు హెచ్చుగానున్నవి. ఆప్రాంతమంతయు నాంధ్రభాష కర్ణాటరాజులరాజ్యకాలమున వ్యాపించి నది. కావున నంతకుఁ బూర్వపు వాఙ్మయముకంటెఁ దరువాతి వాఙ్మయమే యచ్చట నధిక ముగా నున్నది. మఱియు విజయనగరరాజులనాఁటి వాఙ్మయమే దక్షిణదేశమున 18 వ శతాబ్దియందు బయలుదేఱిన వాఙ్మయమునకు మాతృకగా నున్నది. సంచయమునందలి యీతెలుఁగు గ్రంథములను, పురాణములు, నిఘంటువులు, వ్యాకరణము, ఛందస్సు, అలంకారశాస్త్రము, కళలు, పద్యకావ్యములు, శతకములు, దండకములు, యక్షగాన ములు, ద్విపదకావ్యములు, వచనకావ్యములు నని విభజించి యొక్కొకశీర్షిక క్రింద వాని వానిని గుఱించి క్లుప్తముగఁ జెప్పెదను.

## పురాణములు

నన్నయభట్టపోతనభాస్కరవిరచిత భారత, భాగవత, రామాయణములును గ్రొత్తవి కొన్నియు నీసంచయమున నున్నవి. రామాయణము సంస్కృతమున మహాకావ్యముగాఁ బరిగణింపఁబడుచున్నను సౌలభ్యముకొఱకుఁ బురాణములక్రిందఁ జేర్చితిని. విష్ణుపురాణా దులు, వచనకావ్యములు,కొన్నియున్నవిగాని వానినిగూర్చి ప్రబంధములక్రిందఁ జెప్పెదను. పోతనరచించినదిగాక, హరికభట్టారక కృతంబైన భాగవత మొండున్నది. ఇది పద్య కావ్యము. ఏకాదశ ద్వాదశస్కంధములు మాత్ర మున్నవి. హరికభట్టారకుఁడు హనుమ ద్భక్తుఁడు. గ్రంథమును హనుమంతునికే యంకితము చేసెను. ఈతఁడు సహజపారస్వత చంద్రనామాంకుఁడు. గ్రంథాదియందలి

శా. బంధూకప్రసవారక్తవదనుఁ బ్రఖ్యాతునిం రామహృ
ద్బంధుం వాయుతనూభవుం దలఁచి విద్వత్కోటి, మద్వాగ్విభూ
తిం ధాత్రి న్వినుతింప భాగవతమం దేకాదశ ద్వాదశ
స్కంధంబుల్ దెనిఁగింతుఁ బూర్వకథితస్కంధానుపూర్వంబుగన్

అనుపద్యమువలన నీతఁడు భాగవతమును బూర్తిగఁ దెలిఁగించెనేమో యనుసందియము కలుగుచున్నదిగాని గ్రంథమును జదువ నాసందియము తొలఁగుటకుఁ గారణములు కాన్పించుచున్నవి. వెలిగందలనారయ పూరించిన యేకాదశద్వాదశస్కంధములలోని పద్యములవంటిపద్యము లిందుఁ గన్పట్టుచున్నవి. మూదిరి కొక్కటి చూపెదను.

గీ. భక్తులగు యాదవేంద్రుల: బరఁగఁ జూచి, యన్య పరిభవ మెఱుఁగ రీయదువు లనుచు
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వేఱొకండు, దైవ మిఁకలేదు త్రిభువనాంతరము లందు.

(వెలిగందల నారయ్య.)

గీ. మత్సమర్పితభక్తిచే మలయుఁ గాన, నన్యపరిభవ మెఱుఁగ దీయదుబలంబు
వీరిఁ బరిమార్ప నేఁదక్క వేఱెమఱొక, దైవ మోపునె త్రిభువనాంతరము లందు. (హరికభట్టారకుఁడు.)

హరికభట్టారకునిఁజూచి వెలిగందల నారయ్యయో నారయ్యను జూచి భట్టారకుఁడో లేక వీరిద్దఱును మఱియొకదానినిఁ జూచియో వ్రాసియుండవలెను. మఱియు హరిక భట్టారకుని

"క. మారుతసుతుండు కృతపతి, పారీణత భాగవతము పలికెడి దఁట యీ
సారస్య మిచటఁ గలుగఁగ, వేఱొకమార్గ మునఁ బోవు వెఱ్ఱి నుఁ గలఁడే."

అను పద్యము

"క. పలికెడిది భాగవతమఁట, పలికించెడు వాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁట, పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా ?"

అను పోతనపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. ఇంతియకాక హరికభట్టారకుని

"క. తిట్టుదురు దొంగదొంగని, కొట్టుదు రావిప్రవరునిఁ గొమ్మనిచేకం
బెట్టుదురు భిక్ష మనుచును, బట్టెడు గోమయము తెచ్చి పకపక నగుచున్."

మొదలగు పద్యములవలనను నితనిశైలి భాగవతశైలి కనుకరణమని గ్రహింపవచ్చును. వీని నన్నిటినిఁబట్టిచూడ నితఁడు వెలిగందలనారయ గ్రంథమునుఁ జూచి వ్రాసెననియే చెప్పఁదగును. ఇతని యాశ్వాసాంత గద్యము.

"ఇది శ్రీహనుమల్లబ్ధవరప్రసాద సకల విద్యానవద్య సహజసారస్వత చంద్రనామాంక రామవిద్వన్మణి కుమార హరిభట్టారక ప్రణీతంబైన భాగవతమహాపురాణంబునందు...పరిపూర్ణంబైన యేకాదశస్కంధము"...

అనియున్నది. ఇతఁడు పోతనకుఁ బిమ్మటివాఁడనుట స్పష్టమేగాని యితనికాలమిది యని నిశ్చయించుట కాధారము లిందు లేవు.

యథావాల్మీకంబను రామాయణ మీసంచయములో నున్నది. ఇది సమగ్రముగా లేదు. దీనిని ఘనగిరి రామకవి రచించెను. సంస్కృతమున నున్నప్రకారము సర్గసర్గములుగ నితఁడు తెనిఁగించినాఁడు. ఈతఁడు దీనికి యథావాల్మీకం బని పేరిడినందున నిదివఱ కొక యయథావాల్మీక ముండియుండవలెనని తోఁచెడిని. రంగనాథ భాస్కర రామాయణములే ఘనగిరి రామకవియొక్క యయథావాల్మీకములై యుండును. కావున నీ రామకవి భాస్క

రునికిఁ బిమ్మటివాఁడే యని తలఁచుచున్నాను. సంపుటములోని పత్రములు చాలమట్టునకుఁ జెడిగియుండుటఁజేతను, గ్రంథాదిపత్రములు పోయినవి కావునను నితని కాలము సరిగాఁ గనుఁగొనుటకు వీలుకలుగకయున్నది.

మఱియు ప్రాఁకకోట పుల్లయ్య కృతమైన బ్రహ్మోత్తరఖండమును, రేపూరి యనంత యజ్వరచితములైన శ్రీముష్ణమాహాత్మ్య శివరహస్యఖండములును, సుదురుపాటి వేంకనార్యుఁడు విరచించిన మల్లపురాణము నున్నవి. ఈకవులు మువ్వురును దాక్షిణాత్యులు; ఆధునికులును. వీరిలోని సుదురుపాటి వెంకనార్యుఁడే యాంధ్రభాషార్ణవము రచించెను. ఇతఁడు 1767 మొదలు 1789 వ సంవత్సరము వఱకును రాజ్యముచేసిన రాయరఘునాథ తొండమాన్ మహీపాలుని యాస్థానకవి. తొండమానుని కాలమున రచింపఁబడిన గ్రంథము లీసంచయమునఁ జాలఁగలవు.

నిఘంటువులు

దేసితెనుఁగు మఱుఁగులు, నానార్థసారము, రేఫ ఱకార నిర్ణయము, ఆంధ్రనిఘంటువు, అకారాదియగు దేసితెలుఁగుల నిఘంటువు ననునిఘంటువు లిందున్నవి. వీనిలో నాంధ్రనిఘంటువు (వేంకటేశాంధ్రము) గణపవరపు వేంకటకవిరచితము. దేసితెలుఁగు నిఘంటువు సర్వలక్షణ శిరోమణిలోఁ జేరియున్నది. సర్వలక్షణ శిరోమణియు వేంకటపతి విరచితమే. ఆంధ్రనామసంగ్రహ సాంబనిఘంటువులుకూడ నున్నవి, నంజుండ నిఘంటు వనియొక సంస్కృతనిఘంటువు గలదు. దీనిని రచించిన యతఁ డాధునికుఁడు.

వ్యాకరణము

కేతనకవి యాంధ్రభాషాభూషణము, లక్ష్మీనృసింహకవి యాంధ్రకౌముది, గణపవరపు వేంకటకవిసర్వలక్షణ శిరోమణియు నిందుఁ గలవు. లక్ష్మీనృసింహకవియొక్క యాంధ్రకౌముదిలోని సూత్రములకు నన్నయభట్టీయములోని సూత్రములకును భేదము హెచ్చుగా లేదు. ఆంధ్రశబ్దచింతామణిని దీనిని బోల్చి చూడఁగా సూత్రములకుఁ బ్రతిసూత్రములు కల్పింపఁబడినట్లు తోఁచుచున్నది.

1. నామ్నః ప్రాతిపదికం. 2. ప్రత్యయోవర్ణకః. 3 ధాతుః క్రియా. 4. ద్రుతాఖ్యోనః.

అను సూత్రములు కొంచెము హెచ్చుతక్కువగా రెండిటికి సమము. ఇట్టి వనేకములు కలవు.

1. నిత్యముతో ఒచి. 2. వా ఒతః. 3. అసాదిషు విభక్త్యుతః. సంధి. ఆంధ్ర కౌముది. 1. సంధిర్నాచో చ్యుతః. 2. వా ఒతః. 3. అసాదిషు విభక్తిషూతో ఒవా. సంధి. ఆంధ్ర. చింతామణి.

ఈ త్రిసూత్రీద్వయమునుబట్టియే రెండుగ్రంథములకును గల సంబంధము తెలిసికొనవచ్చును. ఆయనగ్రంథము నీయనయో యీయనగ్రంథము నాయనయో లేక యిద్దఱును మఱియొకగ్రంథమునో చూచి యుండవలయు ననుట నిర్వివాదమైన యంశము. లక్ష్మీనృసింహకవి,

శ్లో॥ ఆథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిశన్, కౌముదీమాంధ్రశబ్దానాం సూత్రాణి చకరోత్యయం.

అని గ్రంథాదియందుఁ జెప్పియున్నాఁడు. కనుక నీతఁ డథర్వణాచార్యులకుఁ దరువాతివాఁడనుట స్పష్టము. ఇతఁడు నన్నయభట్టునుగాని నన్నయభట్టీయమునుగాని దడవియుండలేదు. ద్వితీయాచార్యుఁడైన యథర్వణుని నుదాహరించినప్పుడు ప్రథమాచార్యుఁడైన నన్నయ నేల మానును? కనుక లక్ష్మీనృసింహాకవి కాలమునాఁటి కాంధ్రశబ్దచింతామణి పుట్టలేదేమో. ఆంధ్రకౌముదినిఁ జూచి యెవ్వరో చింతామణి వ్రాసి నన్నయపేరిడియుందురు. నన్నయభట్టీయమును జూచియే నృసింహ మాంధ్రకౌముదిని రచించి దొంగతనము బయల్పడకుండఁ జింతామణినిఁ గప్పిపెట్టె నని యేల చెప్పరాదు? అని కొందఱు శంకింపవచ్చును. లక్ష్మీనృసింహాకవి గప్పిపెట్టినచో నథర్వణుఁడైన నేల నన్నయను బేర్కొనియుండఁడు? ముందువా రుదాహరింపకుండుటయే వెనుకటివారు లేరనుటను దెలుపుననుతర్కమున్నచో టులవర్తింపదుగాని సందర్భములనుబట్టి చూడ నియ్యెడ వర్తించునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. సంచయములోని పుస్తకములనుబట్టిచూడ ఆంధ్రశబ్దచింతామణికిఁ దెలుఁగైన యప్పకవీయముగాని, వ్యాఖ్యానమైన యహోబలపండితీయముగాని యచ్చట వాడుకలో నుండినట్లు కాన్పింపదు. ఆంధ్రశబ్దచింతామణి దక్షిణదేశ మందుఁ బ్రచారములో లేకపోవుటయే యచ్చటఁ దెలుఁగు వర్ధమానదశయం దుండినకాలమునఁ జింతామణి పుట్టియుండలేదనుటకు నిదర్శనముగాఁ జెప్పవచ్చు ననితలఁచెదను. దక్షిణదేశమునందలి తెలుఁగు గ్రంథములన్ని సంపూర్ణముగ సంపాదింపఁబడినప్పుడీ విషయమును గూర్చి యెక్కువ దృఢముగా సిద్ధాంతము చేయవచ్చును.

ఆంధ్రకౌముదీ కర్తయగు లక్ష్మీనృసింహాము కాలమునాఁటికిఁ గణ్వరచితమును, బృహస్పతిరచితమునైన తెలుఁగువ్యాకరణము లుండెనఁట. వీనిపేరులే యిప్పుడరుదుగ వినుచున్నాము. ఈవ్యాకరణములు దొరకినచో భాషాతత్వపరిశోధకుల కమూల్యసాధనములుగానుండును. లక్ష్మీనృసింహాకవి మండ్రువంశజుఁడు; వరదసోమయాజికిని నాంచారమాంబకును దనయుఁడు. అష్టభాషాపండితుఁడు. సర్వలక్షణశిరోమణి సాధునికుఁడైన గణపవరపు వేంకటకవి రచించెను. దీనియందుఁ బెక్కంశములు కలవు. "పలనాటిగొల్లలపాటజాతి" యని పాడిన వేంకటకవియే యితఁడు. "కర్ణాటకవులలో మేటి" యని యితఁడు తననుగూర్చి లక్షణశిరోమణిలోఁ జెప్పికొనెను.

## ఛందస్సు

కవిజనాశ్రయముయొక్క 7 ప్రతులీ సంచయమునఁగలవు. కవిజనాశ్రయమునకే భీమచ్ఛందస్సని నామాంతరముకలదు. భీమకవి విరచిత జ్యోతిషపద్యములు 237 గల చిన్నపుస్తకమొకటియున్నది. వేములవాడ భీమకవి జ్యోతిషపటలములు వ్రాసెననియు నవి యిప్పుడు కానవచ్చుచుండలేదనియు, వాడుకగలదు. భీమకవి జోస్యముని యొక గ్రంథ మచ్చుపడియున్నదఁట. దాని ప్రతులిప్పుడు కన్పట్టవు. ఆ భీమకవియే యీభీమకవియై

యాపద్యములే యీపద్యములై యుండినసుండవచ్చును. గ్రహములీ యీ స్థానములం దుండినచో మనుజుఁడిట్టివాఁడగునని యీపద్యములలోనున్నది. భీమకవిరచిత జ్యోతిష పద్యములనుండి నొకపద్యము నుదాహరించెదను.

క. చదువులయందును జాణయుఁ, బదలక లేఖలను వ్రాయవలసిన వాఁడౌ
నదితీరవాసకరుఁడగు, సుదతులకును శిక్షచేయు సుజ్ఞానియునౌ.

మఱియు

క. నృపులకుఁ బ్రియుఁడై యుండును

అనిప్రారంభించి

శివవిష్ణులయందు భక్తిచేసెడివాఁడౌ

అని పవలకుఁ బ్రాసమైత్రి కల్పించినాఁడు. పూర్వలాక్షణికుల మతంబున "ప, వ" లకును "ప,బ" లకును బ్రాసమైత్రి యున్నట్లే యనుమానింపఁదగును. లక్ష్యములు కానవచ్చుచున్నవి. వెల్లంకి తాతంభట్టు,

క. పబయోరభేదమనియెడు, నెపమున పఫ బభలు వాకునేర్పున వడిగా
నుపమింపవచ్చుఁ గృతులం, దుపనిషదుచితార్థ సూక్తులాలసిరచోటన్."

అనుపద్యమున "ప,బ"లకుఁ బ్రాసమైత్రి చూపినాఁడు. నాల్గుపాదములలో నొకపాదమున మాత్రమిట్లు రావచ్చునని కొందఱు తలంతురు. ఈప్రాంతముల నిప్పుడు సులక్షణసారముం బోలె దక్షిణదేశమునం దాకాలమునఁ గవిజనాశ్రయ ముపయోగపడినట్లు తోఁచుచున్నది. వీరనఛందస్సని యొక్క గ్రంథమున్నది. ఈవీరన్న భీమన్నను దడవినాఁడు గనుక భీమన్నకుఁ దరువాతివాఁడని నిశ్చయింపవలసి యున్నది. ఆనందరంగరాట్ఛందపుఁ బ్రతులు 4,6 కలవు. దీనిని రచించిన కస్తూరిరంగకవి యాధునికుఁడు. అనంతుని ఛందస్సుకూడ నున్నది. తాతంభట్టుకవిలోకచింతామణి కలదు. దానిలో వర్ణనీయ వళిప్రాసదోషాధికారంబులున్నవి; గ్రంథముపూర్తిగ లేదు. తాతంభట్టు కవిలోక చింతామణికిఁ గావ్యానుశాసనంబని పేరు పెట్టియున్నాఁడు. ఇప్పు డచ్చుపడియున్న సులక్షణసారముయొక్క యట్టపైఁ దద్గ్రంథకర్త తాతంభట్టని ముద్రించి యున్నారు.* ఈ యచ్చుపడ్డ సులక్షణసారమునకుఁ దాతంభట్టు కర్తకాఁడు. కవిలోక చింతామణియే యీసులక్షణసారంబని భావించుట తప్పు. దీనికంటెఁ జింతామణి విలక్షణమైనది. లింగముగుంటతిమ్మయ సులక్షణసారమునకు దీనికిని భేదములు కాన్పించుచున్నవి.

## అలంకార గ్రంథములు.

అజ్ఞాతకర్తృకంబగు సాహిత్యలక్షణంబును, నారాయణయ్యంగారు తెలిఁగించిన యాంధ్రరసమంజరియుఁ దప్ప నలంకారగ్రంథములలో నూతనము లీసంచయమున లేవు.

* ఇది శ్రీవావిళ్లవారు ముద్రించిన సులక్షణసారమునఁ జక్క చేయఁబడినది.

## కళలు

ధనుర్విద్యావిలాసము, *ఖడ్గలక్షణము నని రెండు గ్రంథము లీశీర్షిక క్రింద రాఁదగినవి యున్నవి. ధనుర్విద్యావిలాసమును గొండవీటి రాజగు కృష్ణాని తిరుపతిరాయనింగారి ప్రోత్సాహంబున రచించి గ్రంథకర్తయగు కృష్ణమాచార్యుఁడు కోదండరామస్వామి కంకితంబుచేసెను. తిరుపతిరాయలు వెలమ; కుతుబశాహీవలనఁ గొండవీటి రాజ్యమును బొందిన కృష్ణానిమాణిక్యరావు వంశస్థుడు. తిరుపతిరాజుతండ్రి యోరంగజేబు కాలములోనివాఁడని గ్రంథమువలనఁ దెలియుచున్నది కావున నిది 17 వ శతాబ్ద్యంతమున నో 18 వ శతాబ్ద్యాదినో పుట్టి యుండును. ధనుర్విద్యావిలాసములో గ్రంథకర్త కొండవీటి నిట్లు వర్ణించి యున్నాఁడు:—

సీ. పసమించు భీష్మకప్రముఖావనీపాలకులకు వజ్రపుజోడు కొండవీడు
శత్రురాజాధిరాజవిరాజదైశ్వర్యకలశంబు ముకుఁద్రాఁడు కొండవీడు
అఖిలయాచకరాజహంసయూథములకుఁ గ్రొందామరలనాడు కొండవీడు
దేవతాయతనమై దీపించుకల్యాణకుధరంబు సైదోఁడు కొండవీడు
తే. హరిహరవిరించిముఖదేవతావతంస, సంసదభిరామహేమవిశాలసాల
జాగ్రదగ్రమహార్హహర్మ్యచ్ఛటులకటక, ఘుమఘుమధ్వానములకూడు కొండవీడు.

ఈగ్రంథ మమూల్యమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఇది సంస్కృతమున కాంధ్రీకరణము కాదు. తిరుపతిరాజు తా నభ్యసించిన విధంబుల నుపన్యసింపఁగా గ్రంథకర్త విని యాప్రకారము పద్యములలో వ్రాసెను. అట్లయ్యు గ్రంథమంత ద్రోణుఁ డర్జునునకుఁ జెప్పినట్లు సూతుఁడు శౌనకాది మహర్షులకుఁ జెప్పిన విధమున వైశంపాయనుఁడు జనమేజయునితోఁ జెప్పె నని కృష్ణమాచార్యుఁడు కోదండరామస్వామిని సంబోధించి వచించినభంగి నున్నది. ఇట్లు చెప్పుట మనవారి కాచారము. ఈయాచారము ననుసరించియే కాఁబోలును మొన్నమొన్న జరిగిన బొబ్బిలియుద్ధ వృత్తాంతముకూడ నారదుఁ డింద్రునకుఁ జెప్పవలసివచ్చినది కాని దిట్టకవినారాయణ చెప్పుచుండఁగా మనము విననోఁచినవారము కాకపోయితిమి. చారిత్రక విషయములను నిటీవలి రాజులకాలములోఁ గట్టఁబడిన దేవాలయంబులంగూర్చిన యంశంబులను సూతునివక్త్రబిలంబే వినిపించినది; శౌనకాది మహర్షుల శ్రవణకుహరంబులే యాలించినవి; నైమిశారణ్యక్షోణీరుహంబుల ముదిగొమ్మలే తలలూఁచినవి. సూతుని కింకనైన విశ్రాంతి యీయనివారు కృతఘ్నులు గదా!

ధనుర్విద్యావిలాసమంతయు స్వానుభవముచేఁ దిరుపతిరాజు వివరించినది గనుక మిక్కిలి విలువగల గ్రంథముగా మన మెన్నఁదగి యున్నది. దీనిలో విషయంబులను గ్లుప్తముగాఁ గృష్ణమాచార్యుఁడే యిట్లు చెప్పినాఁడు.

---

* దీనిని రచించినకవి నవనప్ప.

# షష్టిపూర్తి సంపుటము

"ఈ ధనుశ్శాస్త్రంబునం గురుసంకీర్తనంబును, శిష్యాచరణంబును, విద్యాప్రభావసూచనంబును, సఖండాఖండకోదండద్వయసామాన్యోద్దేశంబును, ధనుర్నిర్మాణప్రమాణప్రముఖవిశేషవిభాగంబును, మార్గణపరిగణనాప్రీణనంబును, దద్విధానమానప్రశంసనంబును, పుంఖోపసంఖ్యానంబును, పక్షపరిమాణప్రశంసయుం, విషంగరచనాప్రవచనంబును, మౌర్వీవిధానకథనంబును, నంగుళిత్రాణప్రకీర్తనంబును, జ్యారోపణప్రకరణంబును, ధనురూర్ధ్వాధరభాగవిభాగంబును, ముష్టిప్రకరణంబును, స్థానోపసంఖ్యానంబును. శరగ్రహణహస్తప్రతిపాదనంబును, సంధానక్రమ వివరణంబును, ఆకర్షణహస్తప్రస్తావంబును, బాణహస్తక్షేత్రనిరూపణంబును, దృష్టిలక్షణాన్వీక్షణంబును, ధనురాకర్షణకౌశలోపన్యాసంబును, శరవ్యాపారయోగ్యతిథివారతారకాకరణ విస్తరప్రస్తావంబును, ఖురళికారంగప్రసంగంబును, రంగప్రవేశలక్షణనిర్దేశంబును, ధనుశ్శరపూజాయోజనంబును, గురుప్రణామస్థేమంబును, శరశరాసనగ్రహణపౌర్వాపర్యపర్యాలోచనసూచనంబును, లక్ష్యశుద్ధిలాభంబును, లక్ష్యవేదికారచనావివేచనంబును, నారాచమోచనప్రకారసూచనంబును, చిత్రలక్ష్యభేదనోపాయప్రతిపాదనంబును, శాబ్దలక్ష్యశరాభ్యాసవిలాసంబును, దూరనికటస్థలలక్షితలక్ష్యభేదన దృష్టి ముష్ట్యంగుళనియమనలక్షణాన్వీక్షణంబును, రథారోహణ శరాభ్యాస విశేషభాషణంబును, గజారోహణశరప్రయోగ విధానంబును, హయారోహణ శరమోక్షణ వివరణంబును, దూరాపాతిశరాభ్యాస విస్తరప్రకీర్తనంబును, శరప్రయోగసమయోపాయనిరూపణంబును, శరగమనగుణదోషవిభాగంబును, దివ్యాస్త్రమంత్రతంత్రప్రయోగ విస్తరప్రస్తావంబును లోనుగాఁ బంచచత్వారింశల్లక్షణంబులు ఘటితంబులై యుండు."

గ్రంథమునందు మొదట వెలమవారి చరిత్ర మించుక గలదు. ఇట్లు వ్రాయఁబడిన గ్రంథములు తెలుఁగు బాసలో మిక్కిలి యరుదు. ఈ గ్రంథము గణింపఁదగిన దని నాయభిప్రాయము.[1]

ఖడ్గలక్షణమను రెండవ గ్రంథము[2] నెవ్వరు రచించిరో తెలియదు. దీనిలో నాలుగు పత్రములుమాత్రమే యున్నవి. కత్తులపేరులు, వాని పొడవు వెడల్పులు నీ గ్రంథములోఁ జెప్పఁబడినవి.

## పద్యప్రబంధములు

సంచయమునందలి పద్యకావ్యముల కర్తలగు 47 గురు కవులలో 27 గు రరవదేశపువారుగా నున్నారు. వీరు 18 వ శతాబ్దియందుండినవారు. అచ్చటచ్చటఁ జ్యుతసంస్కారంబును శృంగారాతిరేకంబును వీరి పద్యప్రబంధముల విశేషలక్షణములుగాఁ గన్పట్టుచున్నవి. పచ్చిశృంగారమును వర్ణించు తారాశశాంక విజయకర్తయగు శేషము వేంకటపతియు, రాధికాసాంత్వన కర్త్రియగు ముద్దుపళనియు నరవదేశపువారే. కొంచెము తక్కువగ నీ తరగతిలోఁ జేరిన చేమకూర వేంకటకవియు నరవదేశస్థుఁడే. ఈ తరగతిలోని వాఁడే యగు సాంబశివకవి యను నతఁడు బిల్హణీయముకూడఁ దెనుఁగున రచించి దక్షిణదేశపు శృంగారమునకుఁ గొఅంతవాపెను. బిల్హణీయమునకు బిల్హణీయములు, తారాశ

1. ఈ గ్రంథము నేఁడు ప్రభుత్వమువారిచే ప్రకటితమైనది.

2 ఇదియును ప్రభుత్వమువారిచే ప్రకటితమైనది.

శాంక విజయమునకుఁ దారాశశాంకవిజయములు, రాధికా సాంత్వనమునకు రాధికాసాంత్వనములు రచించిన యీదాక్షిణాత్యాంధ్రకవుల శృంగారాభిరతి యేమని వర్ణింతుము? సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడొక రాధికాసాంత్వనము నేకాశ్వాసముగ రచించెను. విజయరంగ చొక్కభూపాలునిచే సువర్ణదండాదులుగొన్న బద్దెవ్రాడి యెఱ్ఱభూపాలుఁడు తారాశశాంకకథ రచించి యువజన హృదయానందమని పేరిడెను. మఱియిద్దఱరవవారు తారాశశాంక కీర్తనలు, తారాశశాంక నాటకము (యక్షగానము) వ్రాసిరి. ఇవిగాక యరవలు రచించినవి మదనానందము, మీనకేతనాభ్యుదయము, శృంగార రసమంజరి యను పేరులు గల గ్రంథములుకూడ సంచయమున నున్నవి. వీని నన్నిటినిఁ జదివినచో నీతిపథ దూరుండైన భ్రష్టుండుంబోలె మద్యపానవ్యభిచారాదిదుష్కర్మదూషితంబులగు సందుగొందులయందుఁ గవిత పతిత కావలసివచ్చెఁగదాయని పరితాపము కలుగక మానదు. అనంగరంగమను రతిశాస్త్రము సంస్కృతమునఁ గల్యాణమల్లవిరచిత మొక్కటి యున్నదిగాని పూర్తిగ లేదు. అతిశృంగారమును వర్ణించిన దాక్షిణాత్యాంధ్ర గ్రంథములే వ్యాకరణోల్లంఘనమును బ్రారంభించినవి. ఒక దేశభాష యన్యదేశమునందును నన్యదేశ ప్రాంతములందును వికృతమగుచుండును. ఈయవస్థ మన తెలుఁగున కింతకుఁ బూర్వముపట్టినది. ఇప్పుడు పట్టుచున్నది. స్వచ్ఛమైనభాష కేనాఁటికిని హాని వాటిల్లదు. కొందఱు హాని కలిగింపవలెననియత్నించినను గలుగనేరదు.

దాక్షిణాత్యాంధ్ర గ్రంథకర్తలలో "అళఘురి, పెరియన్న" యని యిద్దఱు గేవల మరవపేరులు గలవారే యున్నారు. సముఖము వేంకటకృష్ణప్పనాయక విరచితమైన యహల్యాసంక్రందన ప్రతియొక్కటి యున్నది; కాని సంపూర్ణము గాలేదు.

## శతకములు

ఇదివఱకెచ్చటఁ బ్రచారములో నున్న దాశరథ్యాది శతకము లీసంచయమునఁ గలవు. అరవదేశస్థులు రచించిన శతకములుకూడ నున్నవి.

"గీ॥ తాళనిచ్చునె ప్రేమ కాంతాలలామ" యనియంత్యపాదము గల కాంతాలలామ శతకము పచ్చి శృంగారముతో నిండియున్నది. ఇదియు నరవదేశనివాసి రచించినదియే. శృంగారపద్యములని మఱియొక శతకమున్నది. రామశతకము, ముక్తికాంత పద్యములు, సుబ్బరాయ శతకము, ప్రసన్నజనచింతామణి, సుబ్రహ్మణ్య శతకము, సిద్ధరామ శతకము, కాళహస్తి శృంగశతకము, మీనాక్షీశతకము ననునవియు నున్నవి.

## దండకములు, చూర్ణికలు

సంచయమునందలి దండకములలో భోగినీదండకము తప్పఁ దక్కినవన్ని దక్షిణదేశమునందు జనించినవే యైయున్నవి. ఈ దండకములందును శృంగారము పొంగి పొరలుచున్నది: చంద్రాననా దండకము, లీలావతీదండకము, నామగిరి లక్ష్మీదండకము, కామాక్షీ దండకము, [సూర్యదండకము], భోగినీదండకము, [శక్తిగణపతి దండకము], సుబ్రహ్మణ్య దండకము, వినాయక దండకము, ముద్దళగిరి దండకము ననునవి ముఖ్యములైనవి. రాజ

లుంచుకొన్న భోగముహారినిఁ గూర్చిన దండకములు వీనిలో నున్నవి; భోగపుఁబడంతుల వాదములును నిందుఁ గలవు. భద్రాచలముహారి చూర్ణిక, గోపికాగీత చూర్ణిక, పాంచాలి రంగయ్యంగారి చూర్ణిక, రామస్వామిచూర్ణిక, యనునవి సంచయమునందున్న చూర్ణికలు.

## యక్షగానములు

సంచయమునందలి యక్షగానములలో నొకటి రెండు తప్పఁ దక్కిన వన్నియు దక్షిణదేశమునం దుద్భవిల్లినవే యైయున్నవి. వీనిలోను శృంగారము మిక్కిలి యెక్కువగా నున్నది. గోపాలవిలాసము, రంగపురిపారిజాత నాటకము, తారాశశాంక నాటకము, నను పేరులను బట్టియే చదువరులు వానిలోని శృంగార రసమును గ్రహింపఁగలరు. దక్షిణదేశంబున నుద్భవిల్లిన యతిశృంగారరస ప్రవాహంబు నాలుగు పాయలై పద్యప్రబంధశతక దండక యక్షగానములయందుఁ బాఱినదని చెప్పవచ్చును. సీతాకల్యాణము, ఎఱుకల కొఱవంజి నాటకము, పార్వతీకల్యాణము, (కవహోద్దండవేంకన), సుందరకాండ నాటకము సుగ్రీవవిజయము నను యక్షగానములు కూడ సంచయమునం దున్నవి.

## ద్విపదప్రబంధములు

నలచరిత్రము (రాఘవకవి), సారంగధరచరిత్ర (బాణాలశంభుదాసుఁడు), ధర్మాంగద చరిత్ర (బొమ్మకంటి నృసింహకవి), రామాయణము (రంగనాథుఁడు), మైరావణచరిత్రము, భారతోద్యోగపర్వము (తిమ్మయ), గీతరఘునందనము (తిరుమలకవి), అనునవి సంచయము నందలి ముఖ్యద్విపదకావ్యములు. ఇవియన్ని దక్షిణదేశములోఁ బుట్టినవని చదువరులు భ్రమింపకుందురుగాక! బొమ్మకంటి నృసింహకవి యెవ్వరో కాని ద్విపదకావ్యములు విరివిగా వ్రాసియున్నాఁడు. ఈతఁడు రచించిన నలచరిత్రముయొక్క ముద్రితప్రతి నాయొద్దనున్నది. తిమ్మయ యుద్యోగపర్వమును జదువ నితఁడు భారతమంతయు ద్విపదకావ్యముగా రచించి నట్లు కన్పట్టుచున్నది. గీతరఘునందనము గొప్పగ్రంథము. రంగనాథుని తరువాతనే ద్విపద కావ్యరచన ప్రబలినట్లు చెప్పుటకనేకాధారములు గలవు. మనలో ననేకులిప్పుడు ద్విపద కావ్యములన్నఁ జుల్కనగాఁ జూచుచున్నారు. ద్విపదకావ్యముల రచించుట సులభమనియు నందువలన నవి పండితజనాదరణీయములు కావనియు వారి యభిప్రాయము. కవితకుఁ గష్ట మేమి సుఖమేమి? ఎముకలు విఱుచుకొని చెప్పిన పద్దెములలో నెక్కువరసముండునని కాఁబోలు వీరియభిప్రాయము. సాధారణ పద్యకావ్యములు రచించుటకంటె గణపవరపు వేంకటకవివలె బంధకవిత్వము చెప్పుట కష్టతరముగదా! అందువలనఁ బద్యకావ్యములకంటె బంధమయ కావ్యము లెక్కువగా నాదరింపఁదగినవని చెప్పవచ్చునా? గ్రంథము రచించుటకుఁ గవి యెంతకష్టపడినాఁడని పరికించుట విమర్శకులపనిగాదు. "గ్రంథమున రసమెట్లు పోషించినాఁడు? ఎట్టిభావములున్నవి? భావానుకూలముగ శైలియున్నదా? భావముల నెట్లు వ్యక్తీకరించెను?" అని విచారింపవలసి యుండును. ఈచర్చ కిది స్థలముకాదు కావున నింతటితోఁ జాలింతును.

## వచన ప్రబంధములు

సంచయమునందలి వచనకావ్యములు దాదాపుగ నన్ని దక్షిణదేశమునందే యుద్భవిల్లినవి.

1. పంచతంత్రము. 2. భగవద్గీత. 3. మహావాక్యము. 4. గురుశిష్యసంవాదము. 5. ఆత్మైకబోధ. 6. భాగవతము. 7. విక్రమార్కచరిత్రము. 8. శ్రీరంగమాహాత్మ్యము (పాండ్యమండలాధీశ్వరుండైన విజయరంగ చొక్కనాథుఁడు.) 9. పాండవుల యశ్వమేధ వృత్తాంతము. 10. సాలభంజికల కథలు. 11. శ్రీరంగ మాహాత్మ్యము 12. జైమినిభారతము (సముఖ వేంకటప్ప నాయకుఁడు.) 13 ద్వాత్రింశత్సాలభంజికల కథలు. 14. రాయ వాచకము (విశ్వనాథరాయనిస్థానాపతి.) 15 రామాయణము (తుపాకుల అనంత భూపాలుఁడు.) 16. రామాయణము (శ్యామరాయకవి) 17. గజారణ్యమాహాత్మ్యము. 18. రామాయణము. 19. రామాయణసంగ్రహము. 20. భేతాళపంచవింశతి. 21. వచననైషధము. 22. పంచదశమహావాక్యము. 23. వాసుదేవమననము. 24. మాఘమాహాత్మ్యము (విజయరంగ చొక్కనాథుఁడు.) 25. వైశాఖమాహాత్మ్యము.

ఈగ్రంథములలోఁ దుపాకుల యనంతభూపాల విరచితమైన విష్ణుపురాణము మాత్రము ముద్రితమైయున్నది. ఆంధ్రభాషాజ్ఞానము లేని యప్రౌఢులు గ్రామ్యభూయిష్ఠముగా వ్రాసినగ్రంథములు కొన్ని వీనిలోనున్నవి. పైగ్రంథములన్నిటియందును దఱుచుగా వాక్యమధ్యవిసంధి కానవచ్చుచునేయున్నది. తుపాకులయనంతభూపాలుని రచన మనోహరముగను విన సొంపుగను నున్నది. కొలఁది వ్యాకరణ దోషముల కేమిగాని తక్కినగ్రంథములలోని వచనముగూడ మిక్కిలి చక్కఁగనున్నది. వీనియందలి వాక్యముల శయ్యయుఁ బదసంబంధమును నాంధ్రభాషాతత్త్వము ననుసరించి యున్నవి. ఇంగ్లీషుభాషాసంపర్కము లేని యాకాలమున నుదయించిన వచనకావ్యములు వాఙ్మయజిజ్ఞాసువుల కమూల్యములు గదా! చిన్నయసూరికిఁ బూర్వము వచనవాఙ్మయము విరివిగా లేదనియే యనేకులు భ్రమపడియుండిరి. గ్రంథములు దొరకనియప్పుడు భ్రమపడక యేమిచేయుదురు? ఇట్టిగ్రంథములను సంపాదించి వాఙ్మయవిమర్శకులకు వెలుంగునొసంగిన సాహిత్యపరిషత్తు ముందుముందీదృశోపకారములు భావకులకు సల్పవలయునని యాంధ్రులాసపడుట యుచితంబయగును. పూర్వోదాహృత గ్రంథపట్టికలోని [1]రాయవాచకమును విశ్వనాథరాయలవారి "స్థానాపతి" రచించెను. ఈస్థానాపతి కృష్ణదేవరాయల సమీపమునుండి యాయనవృత్తాంతమును జూచినది చూచినట్లు వ్రాసెను. ఈగ్రంథము చరిత్రగా మిక్కిలి యుపకరించును. ఇట్లు వ్రాయఁబడిన చరిత్రములు తెలుఁగునఁ బెక్కులులేవు. ప్రత్యక్షముగాఁ జూచి వ్రాసిన చరిత్రాంశములయొక్క ప్రామాణ్యమునుగూర్చి నేను జెప్పవలసినపని లేదు. దీనిలో శూద్రగ్రామ్యము తఱుచుగాఁ బొడకట్టుచుండుటచే నీ "స్థానాపతి" శూద్రుఁడని తోఁచుచున్నది. ఆకాలపు వచనశైలి తెలియుటకై సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని [2]జైమినిభారతమునుండి కొన్ని పఙ్క్తులుదాహరించుచున్నాను:—

---

1, 2 ఇవి ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ముద్రింపఁబడినవి.

"అచ్చట మత్పుత్త్రియైన మదనుని విషంబు పెట్టించి చంపించెదనని యూహించి తన తనయుని పేర స్వహస్తలిఖితంబుగా నొక్క పత్త్రిక వ్రాసి ముద్రవైచి చంద్రహాసుని చేతికిచ్చి వినయంబున నెనరుదోంచ నట్టుగా చేరంబిలిచి యీపత్త్రికం గొని నీవాకండ్లును కుంతలపురంబునకుం జని నాపుత్త్రునికి కమ్ము యిమ్ము యచ్చట నీకు సకలశోభనంబులు గలుగునని చంద్రహాసుండు పోయి ఆకమ్మ గైకొని మనోమారుతవేగంబైన తురంగంబునెక్కి నిమిషమాత్త్రంబున కుంతలపురంబునకుం జని తత్పురప్రాంతంబునందు చంచచ్చంచరీక ఝుంకారసంకులంబైన యొక్కయుద్యానవన మధ్యంబున హృద్యంబైన పద్మాకరంబు పొడగని రాయంచ జక్కవ పెంట్లుకుల గరుల గరువలిచే నెగయు పుష్పాదుల నప్పలించిన విప్పగుకల్లకలువలు నుల్లసిల్లు తేనెసోనల నానిన చలిగాలిముంమొగ్గలకలవలనం శ్రమంబుదీర తురంగంబు సాబానివశంబుచేసి పల్లవ పుష్పఫలభరితంబైన సహకారవృక్షంబునీడ బడలికదీర పవ్వళించి నిదురింపుచుండ ఆకుంతల మహీకాంతుని కూతురు చంపకమాలిని దుష్టబుద్ధితనయ విషయయు మన్మథు నారాధింపం గోరి సఖీజనులతోడం గూడ నవ్వనంబునకు వచ్చి పల్లవితంబులును సుమితంబులు ఫలితంబులు నగు పొన్నలు పొగడలు గోరంట్లు శామంతులు చూతంబులు పారిజాతంబులు జాజులు విరిజాజులు మల్లెలు మొల్లలు పోకమానులు మొదలగు తరులతానికరంబుల కుసుమంబులు గోయుచు విరిగుత్తుల నొండొరుల వ్రేయుచు నొయ్యారంపు నడలచే వనమయూరంబుల గర్వంబులు డింపుచు పూలరెమ్మలు గూడిపంపుచు పువ్వులకై మదిదింపుచు సఖుల చేరంబిలుచుచు సరసంపు టెలుంగులచే మత్తకోకిలంబుల మదంబులడంపుచు పుష్పవీథికలు వంపుచు మేనిమెఱుంగుల వనంబెల్ల నింపుచు నిటలంబుల నటించు కుటిలాలకంబులచే తుమ్మెదలం గ్రమ్ముచు పల్లవంబులం చిదుముచు కోసిన విరులు పైయొదవోనం దురుముచు తళుకువాలారు జూపుతూపులు బాలకురంగ హృదయాంగంబులు నాడుచు లేనిచువాకలం దాటుచు తమ సౌరభంబులచే కుసుమసౌరభంబులు మాటుచు రాజనందనయగు చంపకమాలియు మంత్రితనయయగు విషయయు పువ్వులుగోసి యలసి కమలాకరంబుడాసి వేడుకమీర జలక్రీడలాడి విగళితహారమణి గణంబులచే కమలాకరంబు రత్నాకరంబు సేయుచు తత్తటంబున దుప్పటంబులు గట్టి సొమ్ములు బెట్టి కుంకుమకస్తూరి కలలంది యవ్వెలందులు మన్మథపూజ సేయుచుండ నయ్యవసరంబున నమ్మంత్రికొమారికె యొక్కెలని గట్టున తీయమామిడిచెట్టు నీడలో నిదురింపుచున్న చంద్రహాసునిం గాంచి అందియలు మొలనూలు మువ్వలు రవల మెట్టెలు మ్రోయకుండ మెల్లమెల్లనం జని యక్కుమారవరుని రూపరేఖాసౌందర్యకళావిలాసంబునకుం జొక్కి చక్కెరవిలుకుని బారికిం జిక్కి చేరంజని అడపసంచి తాటకట్టియున్న కమ్ము విడిచి చూచి చెయివ్రాలు దెలిసి యవ్వాక్కులాద్యంతమును చదువుకొని నిజజనకుని విషబుద్ధికి పరితాపంబు నొందుచు రూపరేఖావిజిత రమాకుమారుండైన యీరాచకుమారునకు విషమొసంగుమని వ్రాసిన యింతనిర్దయుండు జగంబునం గలండే యనివగచి విష మొసంగుమని వ్రాసిన యక్షరంబుల నడుమ యకారంబు వ్రాసి తామసింపక నావచ్చునంతలో విషయ యొసంగుమని వ్రాసి యప్పటి ముద్రవైచి అడపసంచి తాటం గట్టి పెన్నిధిం జూచి విడువంజాలని పేదవడువున నవలనడుగిడంజాలక కొంతదడవు చూచుచుండి పరాధీనగావున దీనమానసయై యెఱుంగనియట్లు రాజపుత్త్రి కడకుం జని తదనుమతిబడసి నిజగృహంబునకుం జనియె. అంత చంద్రహాసుండు నిదుర మేల్కొని సరసీజలంబుల ప్రక్షాళితపాణిపాదవదనుండై లేచి నె...... నప్పురంబునకుం వచ్చి యడనెడ శుభశకునంబులం పొడగనుచు ప్రధానివాకిటికిం జని ఫణివారిచే తనరాక మంత్రికుమారున (కెఱింగించుటయు నతండు పుళిందకుని సుతుండు వచ్చినాండనివిని సంభ్రమంబుగా నెదుర్కొని గాఢాలింగనంబు గావించి సంతసంబున యేకాంతప్రదే

శంబ్బరకుంజరి పుళిందుని సేమంబ్బడుగుచు తండ్రిముద్రవైచిన పత్రికనొసంగిన కేలంగైకొని శ్రీమతుసకలగుణ సమృద్ధుండైన దుష్టబుద్ధియగు కుమారుండగు మదనుని దీవించ్చి పుత్తెంచిన శుభప్రయోజనంబ్బు. పుళిందుని ముద్దుపట్టి కులస...నపొషంబ్బుగల మేటి. యెల్లప్పుడు మదను మహోహితుండు. వీరిం గనుగ్గొనిన యాత్మజాంబ్బర సందేహంబ్బుమాని విషయ నొసగ్గి, కావచ్చునంతలో యల్లకార్యంబ్బులు చక్కబెట్టునది యను వక్కణ చదువుకొని సంతసించ్చి నాసహోదరికి తగినవరుండు దొరికె మేలు మేలనుచు ము(మౌ)హూర్తిక(కు)లు(ల)రావించ్చి యారాత్రి శుభలగ్నంబ్బు, గలుగుటవలన వివాహంబ్బుగావించి మహేంద్రవైభవంబ్బున సముచితవిధానంబ్బు లాచరింప్పచుచుండె.”

దక్షిణదేశ గ్రంథములయం దర్ధానుస్వార ముండవలసినచోట శ్రద్ధతో నుంపఁబడి యున్నది. ఆకారమున మాత్ర మీయరసున్న పూర్ణానుస్వారమును బోలియున్నది. అంతటఁ బూర్ణానుస్వారమే పూర్వ ముపయోగించిరి కాని యర్ధానుస్వారము లేదనుకొందమా పద్యపాదములందు గణభంగము సంభవించును. మనదేశపుఁ దాళపత్ర గ్రంథములలో నర్ధానుస్వారము కానరాదు. మనవారికంటె దాక్షిణాత్యు లర్ధానుస్వారమును మిక్కిలి జాగరూకతతోఁ బాటించిరి. ద్రుతమున కాదేశముగా వచ్చిన యరసున్నను వీరంత పాటించినవారు కారు. సిద్ధానుస్వారములను (పదమధ్యమందలివి—అతఁడు, అరఁటి, నెలఁత, చెలఁగు) విడిచిపెట్టక యుంచిరి. దీనికిఁ గారణ మారయఁగా దక్షిణదేశస్థులు “వాఁడు” మొదలైన యరసున్నగల పదముల నుచ్చరించునప్పుడు సానునాసికోచ్చారణము చేయుదురని తెలియవచ్చుచున్నది. దక్షిణ మండలములందున్న తెలుఁగువా రిప్పటికి వచ్చినాండు, పోయినాండు, వేండ (వేఁడ) చీంపురుకట్ట యని యనుస్వారము నాత్యస్ఫుటముగ వినఁబడునట్లు మాటలాడుచుందురఁట. ఇందువలననే దాక్షిణాత్య గ్రంథములం దీయనుస్వార మెక్కువగాఁ బాటింపఁబడి యుండును. అరవకన్నడ మళయాళ భాషలందు ముక్కు సహాయముతోఁ బలుకవలసిన పదములు పెక్కులుకలవు. మనదేశమునందుఁగూడ నీ యనుస్వార ముచ్చారణములో నుండి కాలక్రమమున జాఱిపోయియుండును. నే నుదాహరించిన జైమినీభారత పఙ్త్కులలోఁ జదువరులు కొన్ని విశేషములం గనిపెట్టవచ్చును. అనుస్వారము తరువాత వచ్చిన యక్షరము ద్విత్వముం బొంది యున్నది. ఐకారము పరమైనప్పుడు ద్విత్వము కానరాదు. కొన్నిచోట్ల ద్రుతమునకు బదులుగా వచ్చిన యనుస్వారమునకుఁబరముగానున్న యక్షరము ద్విత్వముం బొరసియుండలేదు; కొన్ని స్థలంబులం బొంసియున్నది. గట్టు, బడలిక వీనిలోని “అ” కారము “ఎ” కార మైనది. యడనెడ, యల్ల, యెల్ల అను చోటుల యకారముమీఁది “అ, ఎ” అను నచ్చులొకటికొకటి మాఱినవి. “గుత్తి” “గొత్తి” గా మాఱినది. సముచ్చయమైన “ను” “న్ను” అని యొకచోనున్నది. ఇంకఁ గొన్ని మార్పులును గలవు. అనుస్వారము, అచ్చుల మార్పులు, ద్విత్వము, మొదలగునవి స్వరశాస్త్ర (Phonetics) నియములు గమనింపవలసిన విషయంబులు కదా!

# మాఅన్నగారు శ్రీటంగుటూరి ప్రకాశము రచించిన "నా జీవితయాత్ర" విమర్శలో "శ్రీవీరేశలింగము పంతులుగారి కేసు."

శ్రీటంగుటూరి శ్రీరాములుగారు, ప్లీడరు, రాజమండ్రి.

శ్రీ వీరేశలింగముగారు పబ్లికు లైఫ్‌నుండి రిటైరు కావలెనని "కార్లిలియను" చేసిన తీవ్రమైన ఆందోళనమున దేశములోని దైనికపత్రికలేవియు పాల్గొనలేదు. మద్రాసున ఇతరపత్రికలేవియు ఈవిషయమున జోక్యము కలుగజేసుకొనలేదు. నేను శ్రీ వీ॥ గారి మీద తెచ్చినకేసులోని నావాఙ్మూలమును సదరు కేసులోని శ్రీ వీ॥ గారి (ముద్దాయి) స్టేటుమెంటును పూర్తిగ The Hindu "A Sensational case of Defamation" అను మకుటముక్రింద ప్రచురము చేసినది. సదరు కేసున తీర్పును పూర్తిగగాని అసంపూర్తిగగాని ప్రచురము జేయకుండ పర్యవసానమును అతి క్లుప్తముగ ప్రచురముచేసినది. శ్రీ వీ॥ గారు తమ ముద్దాయి స్టేటుమెంటున నీతిశాస్త్రము ప్రకారము లాప్రకారము ఆయన అవినీతిని రుజువుచేసే ముఖ్యమైన సంగతులను ఒప్పుకొని వాటికి సమాధానములను చెప్పిరి. నా వాఙ్మూలమున నే నేఆధారములమీద ఆయన పతితుడని నమ్మితినో అవి అన్నియు పూర్తిగ పూసగ్రుచ్చినట్లు చెప్పితిని. తరువాత నామీద తెచ్చిన మొకటికేసున తీర్పును పూర్తిగ ప్రచురము చేయకుండ దాని పర్యవసానమును మాత్రము The Hindu పత్రిక వెల్లడి చేసినది. లేటు శ్రీగంటి లక్ష్మన్నగారు అప్పుడు రాజమహేంద్రవరము "హిందూ" గౌరవ నీయ కరెస్పాండెంటు ఈవిషయమున "సైడ్సు" తీసుకొనుటకు తనకేమి ఇష్టము లేదనియు అందుచేత సదరు కేసులలోని తీర్పులను పూర్తిగ ప్రచురము జేయ లేదనియు, అప్పటి హిందూ ఎడిటరుగారైన శ్రీ కస్తూరి రంగఅయ్యంగారు తనకు వ్రాసినారని శ్రీలక్ష్మన్నగారు నాతో చెప్పిరి.

నామీద శ్రీ వీ॥ గారు తెచ్చిన రెండవ కేసున వారి వాఙ్మూలము ముఖ్యాంశములను The Indian Patriot పత్రిక "A sensational case of Defamation" అను శీర్షిక క్రింద ప్రచురముచేసినది. అది చదివినతరువాత లేటు శ్రీదివాన్ హనుమంతరావుగారు మాఅన్నగారితో ఇట్లు అన్నారని మాఅన్నగారు నాతో చెప్పిరి:—

"శ్రీ వీ॥ గారి వాఙ్మూలమును చదువలేకుండ ఉన్నాము. ఏలాగైనా కేసును రాజీ చేయించండి."

The Indian Patriot పత్రిక శ్రీ పీ॥ గారి వాఙ్మూలములయొక్క తక్కినభాగమును ప్రచురము చేయుటకు నిరాకరించినదని సదరుపత్రిక కరస్పాండెంటు అగు శ్రీబోడపాటి రామలింగముగారు నాతో చెప్పిరి. నేను శ్రీ పీ॥ గారిమీాద తెచ్చిన కేసున full proceedings నామీాద శ్రీ పీ॥ గారు తెచ్చిన రెండవ కేసులలోని full proceedings "కార్లిలియను"లో ప్రచురము చేసి సదరు పత్రికలను ఆసేతుహిమాచల పర్యంతమున ప్రచురమగుచున్న అన్ని ఇంగ్లీషుపత్రికలకును తెనుగు పత్రికలకున్ను పంపితిని. క్రిందటివ్యాసమున ఉదహరించిన The Social Reform Advocate, Madras అను వారపత్రికయును The Indian Social Reformer of Bombay అనువారపత్రికయును తప్ప మరే ఇతర ఇంగ్లీషుపత్రికలు ఈవిషయమున జోక్యము కలుగచేసుకోలేదు. ఒక తెలుగుపత్రిక తప్ప తక్కిన తెలుగు పత్రికలన్నియు తలలు వంచుకొని మౌనము ధరించినవి. శ్రీపీ॥ గారికిని నాకును రాజీచేయవలెనని ఓం ప్రథమమున నేను ఆయనమీాద తెచ్చిన కేసు విచారణ ఆరంభము కాకముందే లేటు శ్రీబారు శ్రీరామనరసింహారావు గారును శ్రీఅడవికొలను వేంకటగోపాలరావు గారును బ్రహ్మప్రయత్నములుచేసిరి. శ్రీపీ॥ గారికిని నాకును ఏవిధమైన అవకాశములేదనియు వారికి నచ్చచెప్పి ఆయనతో రాజీపడుటకు నిరాకరించినాను. నామీాద తెచ్చిన మొదటి కేసున హైకోర్టులో తూ॥ గో॥ జిల్లా మే॥ గారి పునర్విచారణ ఉత్తరవుమీాది రివిజను పిటిషను అడ్మిషను నిమిత్తము వచ్చినప్పుడు జస్టిసు శ్రీసదాశివ అయ్యరుగారు మాఅన్నగారితో నాకును శ్రీపీ॥ గారికిని రాజీచేయించమని సలహాను సూచించినారని ఆక్రిందటి వ్యాసమున తెలియచేసియున్నాను. సదరు అయ్యరుగారి సలహాను ఖండించుచు శ్రీపీ॥ గారితో నేను రాజీపడుటకు ఏవిధమైన అవకాశము లేకపోవుటకు కారణములను అతివిపులముగ తెలియజేయుచు 1915-వ సం॥ ఏప్రిలు ఒకటి రెండు వారములకు కలిపి ప్రచురముచేసిన "కార్లిలియను" లో "The Hon'ble Mr. Justice Sadasiva Iyer and Ourselves" అను శీర్షిక క్రింద ఈపెద్ద సంపాదకీయమును ప్రచురము చేసితిని:—

"Many of our readers remember, we suppose, that the Revision Petition we filed against the order of further inquiry passed by Mr. Elwin in the first case of Defamation disposed of in our favour, in the High Court of Madras, came for admission before the Hon'ble Mr. Justice Sadasiva Iyer in February, 1914. When His Lordship, after dealing with the previous cases in the usual course of things, came to our Petition, His Lordship, it seems, sat silent. Then our Counsel argued the preliminary point that the order of Mr. Stewart was in effect an order of acquittal and that Mr. Elwin had no jurisdiction to deal with it. His Lordship thereon admitted our petition and posted it before a Divisional Bench. After admitting our petition, His Lordship said to our Counsel, Mr. T. Prakasam, to the following effect:

"The Editor of *The Carlylean* is, I think, a relation of yours. Is he not your brother? Is there no chance of these two gentlemen (Mr. Viresalingam and ourselves- *Ed. C.*) becoming friends again? Both are working for the public good." We suppose that His Lordship read both Mr. Stewart's Order and Mr. Elwin's Order, and knew the nature of Mr. Viresalingam's case as well as the nature of our defence. Mr. Viresalingam's case was that we libelled his private moral character out of spite with a view to enthrone ourselves in his place. We pleaded justification for the public good and non-applicability of the piece alleged to have been aimed at him. Both of us could not be in the right. If Mr. Viresalingam's case is true, ours becomes false. If our case is true, his becomes false. Odgers in his Libel and Slander observes: "When an action is brought and justification pleaded, no honourable compromise can be effected: the matter must be fought out to the bitter end." Odgers did not figure himself either as a plaintiff or as a defendant in any Defamation case, civil or criminal. He only viewed the question from an ethical standpoint, and made the above observation in regard to compromises in defamation cases. In a defamation case in which justification is set up as a defence, both the parties cannot be in the right or in the wrong. One must be in the right, and the other must be in the wrong. As a self-respecting man the party who is in the right, cannot enter into any compromise with the party who is in the wrong. One or the other must go to the wall. If the Court holds our case false and Mr. Viresalingam's case true, we become a kind of villain, say like Shakespeare's Iago in his *Othello*. If the Court holds our case true and Mr. Viresalingam's case false, he becomes a kind of impostor. Mr. Stewart held that "his immoral living was proved for the purpose of the Evidence Act" and that "the only evidence more conclusive one could ask for was that of the girl herself, but she was not likely to admit immorality." Mr. Elwin ordered further inquiry on the sole ground that Mr. Viresalingam's conduct, though inexcusable and immoral from English stand point, must be seen if it was so from Hindu stand point. As a Hindu, His Lordship knows what the Hindu stand-point in regard to the matters in dispute is. Under such circumstances of the case, was it proper on the part of His Lordship to throw a hint to our Counsel who is our brother (elder), to the effect that he should see his way to bring about a compromise between ourselves and Mr. Viresalingam? We are very sorry to say that His Lordship, in so doing, went out of His Lordship's way as a Judge. In any case, and especially in a case of this kind which relates to the cause of moral, social, and religious reform, a judge's business is not to suggest desirable or

undesirable compromises. His data consists in sitting up straight, stern and serene, and dealing justice without minding who the parties are, of course tempering justice with mercy. His Lordship's remarks to our Counsel to bring about a compromise between ourselves and Mr. Viresalingam, show what we observed recently in regard to Mr. Justice Sadasiva Iyer's putting a premium upon falsehood, hypocrisy and selfishness, out of false pity, sometimes unconsciously. They also show that His Lordship has got queer ideas of public men as well as of the integrity of moral, social and religious movements. A social and religious reformer, who abuses his trust, misbehaves with a young woman, puts on the mask of a virtuous man, performs her second marriage under the auspices of a Public (Registered) Association, gives a social reform (cosmopolitan) dinner to which advocates of reform are invited and which they attend, and sets the criminal law in motion against those who criticise and expose his conduct with a view to redeem him and the movements he professes to lead,—What kind of a man is he? Is he not a corruptor of public life and public movements and enemy to progress? Does he deserve any pity at the hands of those who love progress? We say that it was more out of false pity towards Mr. Viresalingam that His Lordship suggested the compromise to our Counsel who, His Lordship thought, could influence us into a compromise, as he is our elder and superior in position and influence. Of course, our Counsel himself was moved not a little by false pity and magnanimity towards the all-round transcendent impostor of Rajahmundry. We may state here that our Counsel did his best to bring about a compromise between ourselves and Mr. Viresalingam, in accordance with His Lordship's suggestion as well as in accordance with the wishes of a host of others who were likewise moved by false pity towards him. What perhaps saved us from a conflict with our Counsel and elder brother who has done us yeoman's service, was more the refusal of Mr. Viresalingam and his influential supporters to accept any terms short of apology from us. With a view to show Mr. Prakasam's considerate and magnanimous attitude towards Mr. Viresalingam which stands out in marked contrast to the attitude of Mr. Viresalingam's vakils to us. It may not be out of place to give out the terms of compromise which our Counsel in his own diplomatic and statesmanlike way proposed first to Mr. Viresalingam through a *chela* of his and then to us. They are to this effect:—"Our Counsel in the High Court should submit to their Lordships that the matter is adjusted out of Court, that the petitioner would withdraw his petition, and that the complainant

would withdraw his two defamation cases against us and others." For our part we thanked God for Mr. Viresalingam's refusal to accept the terms our Counsel proposed in due or undue obedience to His Lordship Justice Mr. Sadasiva Iyer's and many others' false pity-prompted above said suggestion.

And then see the effect of His Lordship's remarks to our Counsel. Some of Mr. Viresalingam's supporters at once spread a rumour to the effect that our Petition was admitted with great difficulty and that it would have been thrown out but for the question of jurisdiction raised in it. While our petition was pending in the High Court, the Anniversary of the Ahdhra Jatheeya Kalasala of Masulipatam was celebarated last year with Mr. Justice Sadasiva Iyer in the Chair. Mr. Viresalingam attended the same, occupied the platform beside or behind Mr. Justice Iyer along with Mrs. Annie Besant, and was garlanded along with them,—all evidently to show not only the "Arava" Judge but other judges that the Andhra Patriotic World did not see anything wrong in the various startling facts that were made known about Mr. Viresalingam's private character. Oh! What a wonderful progress has the Andhra Patriotic World made in the fine art of hypocrisy! It seems that the Andhra Patriots are bent upon promoting the moral progress of the Andhra Desa. How? By whitewashing the daring and hideous day-light immorality and imposture of its heaven-sent prophet.

మనదేశమున "లైఫ్" యొక్క అన్ని "డిపార్టుమెంట్లు"లో అవినీతి ఎక్కువ అగుట చేత క్రమముగనో అక్రమముగనో కొద్దిగనో గొప్పగనో పేరు ప్రతిష్టలు సంపాదించుకొని ముందుకువచ్చి నాయకులమని విఱ్ఱవీగువారి లోటుపాట్లను చాటున మాటున వారు చేయు ఘోరనీచకృత్యములను ఏకరుబెట్టుటను మనము సహించలేము. శ్రీవీ॥ గారు రిటైరు కాక పోవడము, నీతిమతసంఘ సంస్కరణోద్యమములకు చాలా హానికరమనే నమ్మకముతో నేను వ్రాయుచున్న వ్రాతలు చాలమందికి అయిష్టమును కలుగజేయడమే గాకుండ నేను కసితీర్చుకొనవలెననే దురుద్దేశముతో వ్రాయుచున్నానని చెప్పనారంభించిరి. అప్పుడు ఇంగ్లాండులో 1889- 1890-వ సంవత్సరమున ఐరిషుహోంరూలు మూవ్‌మెంటుకు నాయకుడైన పార్నెల్ నాయకత్వమును గురించి జరిగిన గొప్ప ఆందోళనమును ఉదహరించి 1915-వ సం॥ ఆగస్టు మొదటివారమున ప్రచురము చేసిన "కార్లిలియన్" లో ఇట్లు వ్రాసితిని:—

"We publish elsewhere some extracts under the heading of "Parnell's Strained Leadership" from *Morley's Life of Gladstone*. Lord Morley deals with it in Ch. V, Vol. III, under the heading of *"Breach with Mr. Parnell."* Extracts quoted deal with the attitude of the British Liberal party and

the Irish Nationalist party. Our readers can easily understand why we have quoted them now. It is to explain our attitude towards the continuance of the leadership of Mr. Viresalingam in the field of moral, social and religious reform. Mr. Parnell's case differs from Mr. Viresalingam's case entirely. Mr. Parnell was not a religious and social reformer like Mr. Viresalingam. The former's offence pales before the latter's. In the Divorce Court, Mr. Parnell did not set up any defence. He did not go into the witness-box and speak lies. Soon after the decree was pronounced, he married Mrs. Captain O' She. Of whatever hypocrisy and immorality Parnell was guilty of, before they became public, he did not try to justify himself in a court of Justice. And then he made ample expiation by marrying Mrs. Captain O' She, after divorce was granted. In spite of so many redeeming features in Mr. Parnell's his fall in leadership, although it was a political one was discountenanced as a stained one by the British. Although it was upheld by the Nationalist Party, yet it was dis-countenanced by the religious Ireland. "Cardinal Manning had more than once written most urgently to the Irish Prelates the moment the decree was known, that Parnell could not be upheld in London and that no political expediency could outweigh the moral sense. He knew well enough that the bishops in Ireland were in a difficult straits, but insisted that plain and prompt speech was safest. It was now a case, he said to Mr. Gladstone, *res ad triavios*, and it was time for the Irish clergy to speak out from the house-tops. ......... 'We have been slow to act,' telegraphed to one of the Irish members (November, 30), 'trusting that the Party will act manfully. Our considerate silence and reserve are being dishonestly misinterpreted.' 'All sorry for Parnell', telegraphed Dr. Grokethe Arch-Bishop of Cashell—a manly and patriotic Irish man if ever one was—'but still, in God's name let him retire quietly and with good grace from the leadership. We quote the following defence of the attitude of the Liberal Party by Lord Morley, and commend the same to all who want us to forget and forgive the past:—

'A man might estimate as he pleased either the nonconformist conscience in England or the Catholic conscience in Ireland. But the most cynical of more calculators—I should be slow to say that this was Mr. Parnell - could not fall a prey to such a hallucination as to suppose that a scandal so frightfully public so impossible for even the most mild-eyed charity to pretend not to see...........' would instantly drop out of the mind of two of the most religious Communities in the world; or that either of

these communities could tolerate without effective protest so imperitent an affront as the unruffled continuity of his stained leadership. ........The liberal leaders had a right to assume that the case must be as obvious to Mr. Parnell as it was to everybody else; and unless loyalty and good faith have no place in political alliances, they had a right to look for his spontaneous action. Was unlimited consideration due from them to him and none from him to them? Would we be wrong, if we say, 'Was unlimited consideration due from us to Mr. Viresalingam and his supporters and none from them to us, especially when the interests of reform are seriously at stake." To justify the strong language we now and then have been using in connection with this matter, we may quote the following words of Lord Morley on Parnell's affair:— "All depends upon the point of view. Men on a raft in a boiling sea have something to think of besides department and the graces of serenity........It was not until a protracted game had gone beyond limits of reason and patience that words sometimes flamed high. Experience of national assemblies gives no reason to suppose that a body of French, German, Spanish, Italian, or even of English, Scotch, Welsh, or American politicians placed in circumstances of equal excitement arising from an incident in itself so squalid and so provocative would have borne the strain with any more self-control." Lord Morley observes in the concluding portion of the chapter on this subject on the public opinion in America thus;—'In America almost every name of consideration was hostile."

ఈసంపాదకీయము వగైరాలు చదువుకొన్న తరువాత నామీద దురభిప్రాయమును మార్చుకొనిరి. 1915-వ సం॥ము మార్చినెల ఆఖరునుండి ఆగస్టునెల మొదటి వారము ఆఖరువరకు "కార్లీలియన్" చేసిన తీవ్రమైన ఆందోళన ఆంధ్రదేశమును ఉద్ధరించుటకు కంకణము కట్టుకొన్న ఆంధ్రబ్రహ్మమతస్థులలో కొంతమందికి అంతరాత్మ కొంచెము బాధించినది. సదరు బాధకు తాళజాలక బ్రహ్మమతవ్యాప్తి కొరకు స్థాపింపబడిన "ధర్మసాధని" అను తెలుగు పక్షపత్రిక కొంచెము ధైర్యముతో శ్రీవీ॥ గారిని పబ్లికు లైఫ్‌లోనుంచి రిటైరు కమ్మని ప్రార్థించినది. సదరు "ధర్మసాధని" సాధన చేసి చేసి వ్రాసిన తెనుగు వ్యాసమును ఇంగ్లీషున తర్జుమా చేసి "Somehow or other better late than never" అను శీర్షిక క్రింద వ్యాఖ్యతో సెప్టెంబరునెల మొదటివారము "కార్లీలియను" ప్రచురము చేసినది. "ధర్మసాధని" చేసిన ప్రయత్నము, పాపము! సఫలము కాలేదు. ధర్మము ఏమిటి! అధర్మం ఏమిటి! న్యాయము ఏమిటి! అన్యాయము ఏమిటి! క్రమము ఏమిటి! అక్రమము ఏమిటి! అధికసంఖ్య కందిని నందిని, నందిని పందిని చెయ్యగలదు! అధిక సంఖ్య మహాత్మ్యము ఏమని చెప్పగలము. ముందు వ్యాసమున "ధర్మసాధని" వ్రాసిన వ్యాసము వగైరాలను ఉదహ

[illegible]

రించి ఆంధ్రదేశమున నీతిమతసంఘరాజ్యాంగసంస్కర్తల నీతినియమములు వగైరాలను గురించి వ్రాసెదను.

శ్రీ వీరేశలింగముగారు నామీద తెచ్చిన కేసులు జరుగుచుండగా మంగమ్మ చని పోయినది. మంగమ్మయును ఆమెను పెండ్లిచేసుకొన్న శ్రీ పోతరాజు ప్రకాశరావుగారును బ్రాహ్మణులు. శ్రీ వీ॥ గారి కోరికమీదనో పట్టుదలమీదనో శ్రీ ప్రకాశరావుగారు తమ జంధ్యమును తీసివేసి బ్రహ్మమతపద్ధతుల ప్రకారము మంగమ్మను వివాహమాడిరి. మంగమ్మ పోయిన తరువాత ఆయన తిరిగి యజ్ఞోపవీతమును ధరించిరి. హిందూశాస్త్ర పద్ధతుల ప్రకారము శ్రీ వీ॥ గారి హిందూ వితంతు శరణాలయములోని (బ్రహ్మమత మవలంబింప నొల్లని) ఒక బ్రాహ్మణ వితంతువును, శ్రీ వీ॥ గారి పరిపూర్ణకటాక్షవీక్షణములతో 1915-వ సం॥ జులై నెలలోనో ఆగస్టులోనో చేపట్టిరి. శ్రీ వీ॥ గారి ఈ వివాహామోదన క్రిందటివ్యాసమున నేను తెలియజేసిన కాకినాడలో బ్రహ్మమతస్థులచేత ప్రచురింపబడుచుండిన "ధర్మసాధని"కి ఎంతమాత్రమును నచ్చలేదు. అయితే ఆయన ఆంధ్రబ్రహ్మ మతస్థులకు ఒక పెద్దదేవుడు. ఆపెద్ద దేవుడు చేసిన పనిని ఖండించుట అంత సులభమైన కార్యమా? అందుచేత "ధర్మసాధని" చిట్టచివరకు ధైర్యము తెచ్చుకొని చిత్రవిచిత్రముగా ఆయన చేసిన పనిని ఖండించుచు, నామీద ఆయన తెచ్చిన డిఫమేషను కేసులమూలముగ ప్రజలలో ఎక్కువమందికి ఆయనమీద గౌరవము పోయినందున ఆయన పబ్లికు లైఫ్‌లోనుంచి రిటైరుకావడము మంచిది అని. 1915-వ సం॥ ఆగస్టు 16-వ తేదిన వ్రాసినది. "ధర్మసాధని" వ్రాసినదానిని ఇంగ్లీషులోకి ప్రతిపదార్థముగ తర్జుమాచేసి 1915 సం॥ సెప్టెంబరు మొదటి వారమున ప్రకటించిన "కార్లీలియన్"న ఇట్లు ప్రచురింప జేసితిని.

"Great good has been done to the country through Mr. Viresalingam Pantulu. Therefore, we rever him. Our reverence towards him will always last. But when we review his actions, we cannot but express our opinion of them, though adverse or unpleasant. Although he could not discover if Mr. Prakasa Rao knew English or not, yet he found out merely that he became a Brahmo and got his first marriage performed according to the rites of the Brahmo Samaj. It seems that he has now re-donned his sacred thread. Therefore it seems that Mr. Pantulu believes that he had become again a Hindu; so it seems that he allowed his second marriage to be performed according to Hindu rites under his auspices. Oh! What a scorn of religion is this! It cannot but strike those who have the least thinking faculty that Mr. Prakasa Rao is changing his religion for the sake of marriage. There is nothing strange in Messrs. Chilakamarthi Lakshminarasimham's and Kunduri Venkataratnam's thinking that Mr. Prakasa Rao is a fickle-minded person and it is not good that Mr. Pantulu should lend

countenance to his conduct. Both of them went away by way of discountenancing the marriage, without changing their opinions even after hearing the explanation given by Mr. Pantulu. Marriages like this spell infinite harm or ruin to the country; they are root-eating worms of Dharma (Righteousness or morality). So, it is very regrettable that Mr. Pantulu should countenance and help them. It is our opinion that Mr. Pantulu is doing great harm both to the Brahmo Samaj and the Hindu Society, by his encouraging them. We have one thing to tell Mr. Pantulu. As those friends who co operate with him, are losing faith in him on account of such strange actions of his ; as the opinion or feeling of the majority of people is against him as the result of the recent defamation cases; as he has grown old; he will do well to understand that is not meet for him still to have any more connection with public movements; and so we request him to sever his connection with the same and to take rest and spend his old age in peace.''

శ్రీవీరేశలింగముగారి నిరంకుశత్వమును అవకతవక పనులును అందరికిని తెలుసును. అయితే నేమి! ఆయన ఒక పెద్దదేవుడు. పెద్ద దేవుళ్లు చేసే అవకతవక పనులు అవకతవక పనులు గావు; పెద్దదేవుళ్ల నిరంకుశత్వము నిరంకుశత్వము కాదు. శ్రీ ప్రకాశరావుగారి సదరు రెండవవివాహమునకు శ్రీవీ॥ గారు ఇచ్చిన సమాధానమును విశ్వసింపక, వివాహమును ఆమోదింపకుండ, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు శ్రీకుందూరి వేంకటరత్నము గారు వెళ్లడము, "ధర్మసాధని" పైనచెప్పిన విధముగ ధర్మాన్ని సాధించడము, అప్పటప్పటికి మిక్కిలి గొప్ప సంగతులే? తమ అద్వితీయమైన స్వీయచరిత్రలో శ్రీవీ॥ గారి రజోతమో గుణము లన్నిటిని బహు బాగుగ కప్పిపెట్టి ఆయన సత్వగుణప్రధానుడే గాకుండా ఆ పాదమస్తకమంతా సత్వమే యని వర్ణించిన, కళాప్రపూర్ణ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఏమరుపాటున గాబోలు! ఆయన నిరంకుశ స్వభావమును గురించి 242, 243 పుటలలో ఇట్లు వ్రాసిరి:—

"శ్రీ కందుకూరి వీరేశలింగముగారికి శ్రీకనుపర్తి యోగానందముగారను ఒక మిత్రు డుండెడివారు. ఆయన కుమార్తె శ్రీసుందరమ్మగారు బాల్యమున వితంతువయ్యెను. ఆమె వివాహము నిమిత్తమూ విద్యనిమిత్తం శ్రీవీరేశలింగముగారి వితంతు శరణాలయములో చేరెను. సుందరమ్మగారు శ్రీవీరేశలింగముగారికి మిత్రుని పుత్రికఅగుటయేగాక సుగుణ సంపదలచేతగూడ శ్రీవీరేశలింగముగారికి రాజ్యలక్ష్మమ్మగారికి మిక్కిలి ప్రియపుత్రిక వలె నుండెను. ఆమెను శ్రీకామరాజు హనుమంతరావుగారికిచ్చి వివాహము చేయవలెనని ఆదంపతుల సంకల్పము. శ్రీహనుమంతరావు శ్రీదేశిరాజు పెదబాపయ్యగారి సవతి తల్లికి సోదరుడు.........చిన్నతనమునందే బంధుమిత్రులను వదలుకొని శ్రీ బాపయ్యగారివలెనే అనుష్ఠానిక బ్రహ్మమతస్థుడైన కార్యశూరుడు.........వారికిద్దరికి బ్రహ్మమత ప్రకారము

వివాహముచేయవలెనని శ్రీవీరేశలింగముగారి ఆశయము........కాని ఒక అంతరాయము వచ్చెను. శ్రీహనుమంతరావుగారు బోధనాభ్యసనకళాశాలలో జేరి ఆవిద్య పూర్తి కాకుండగనే జాతీయోద్రేకమువల్ల చదువుమాని కళాశాలవదలిపెట్టిరి. శ్రీవీరేశలింగముగారి కాపని ఇష్టపడలేదు. శ్రీవిపినచంద్రపాలుగారి ఉపన్యాసములు శ్రీవీరేశలింగముగారి కనలేసరిపడలేదు. ఆయన పూర్వకాలపు వాడగుటచే నాంగ్లేయ ప్రభుత్వమునకు విరుద్ధమైన మాటలుగాని చర్యలుగాని వారి కిష్టములేదు. శ్రీహనుమంతరావుగారు ప్రిన్సిపాలుగారి ఆజ్ఞను తిరస్కరించినందున శ్రీవీరేశలింగముగారి కాయనమీద అయిష్టము గలిగెను. కాబట్టి శ్రీవీరేశలింగముగారు శ్రీహనుమంతరావుగారి వివాహమునకు కొన్నిషరతులేర్పరచిరి. శ్రీహనుమంతరావుగారు శ్రీసుందరమ్మగారి యిష్టములేకుండ తనయింటికి ఏఅతిథినితీసుకొని రాకూడదు. వందేమాతరము గొడవలలో జోక్యము కలుగచేసికొనకూడదు. ధనవ్యయము మామెయిష్టప్రకారము జరుగవలెను. ఇవిగాక మరి కొన్ని షరతులుండె నని నాకు జ్ఞాపకము. ఒకనాడు శ్రీహనుమంతరావుగారు మాయింటికి వచ్చినప్పుడు వివాహమాయెనా యని అడిగితిని. శ్రీవీరేశలింగముగారు తన వివాహవిషయమై కొన్ని షరతులు పెట్టిరని పై షరతుల జెప్పిరి. అప్పుడు నే నిట్లంటిని. "ఇదివరకు శ్రీ వీరేశలింగము గారెన్నడు షరతులమీద వివాహములుచేయలేదు. షరతులతో జరగిన వివాహమువలన సంసారముపొత్తుపడదు. కాపురము సరిగా పొసగదు. అట్టివివాహము చేసుకొనుటకంటె మానుకొనుటమేలు." ఈపలుకులు శ్రీవీరేశలింగముగారికి తెలిసెను. ఆయనకు నామీద కోపమువచ్చెను. పూర్వము మాయింటికి దరుచుగ వచ్చెడివారప్పటినుండి తరుచుగ వచ్చుట మానిరి. కాని వారికి నామీద విశ్వాసము వదలలేదు... షరతులవివాహవిషయమై శ్రీవీరేశలింగముగారికిని శ్రీహనుమంతరావుగారికిని అభిప్రాయభేదము గలుగుటచే శ్రీహనుమంతరావుగారి వివాహమప్పటికి నిలుపుచేయబడి పిమ్మట కొంతకాలమునకయ్యెను. నామూలమున పరస్పరానురాగముగల యాదంపతుల వివాహము నిలుపుచేయబడిన దని వివాహమగువరకు నేను విచారించితిని. పిమ్మట నా మనసు శాంతించెను."

ఈసుప్రసిద్ధ శతాధిక గ్రంథకర్తగారి అంతరాత్మ చిట్టచివరకు ఈవిషయమున "దాపుడు ధనంబు స్వామికి దార్చినట్టు" ఎంతో నిర్మలమై పోయినది. ఇదంతా 1907-వ సం॥న జరగినది. ఈగొప్పఆంధ్రగ్రంథకర్తగారి మనస్సాక్షి అప్పుడప్పుడు చాల తమాషాగ మారుచుండేది; 1912-వ సం॥ మున శ్రీవీ॥గారి మహాపతనము వీరికి వినికిడి మూలమున తెలిసినప్పుడు దానిని ఏకరువుబెట్టుమని వీరిని ప్రోత్సాహము చేసినది; శ్రీవీ॥ గారి సమాధానములను వినడముతోడనే తృప్తిచెంది హాయిగ నిద్రపోయినది. 1915-వ సం॥మున పైన ఉదహరించిన శ్రీపా॥ ప్రకాశరావు బ్రహ్మమతమునువిసర్జించి బ్రాహ్మణమతమును తిరిగి అవలం

బించి జంధ్యమును వేసుకొని హిందూమతపద్ధతుల ప్రకారము బ్రాహ్మణ వితంతువును వివాహమాడుటను శ్రీ వీ॥ గారు అంగీకరించుట శ్రీ చి॥ ల॥ గారి మనస్సాక్షిని గాఢ నిద్రలోనుండి లేపుటచే శ్రీ వీ॥ గారి సమాధానమును అంగీకరింపకుండ సదరు వివాహమును కడు ధైర్యముతో "బాయికాట్" చేసిరి. "ధర్మసాధని" లోని పైనజెప్పిన సంపాదకీయమును చదువుకొన్న తరువాత ఆయనయును తదితర సంస్కరణప్రియులును ఏమి చేసిరో నాకు తెలియదు. శ్రీ పా॥ ప్రకాశరావుగారి ద్వితీయవివాహమును గురించి తమ స్వీయచరిత్రలో శ్రీ చి॥ ల॥ గారు ఒకమాటనైనను వ్రాయలేదు. అది వ్రాస్తే శ్రీ వీ॥ గారి కీర్తికి కళంకము కలుగ చేసిన పాపాన పోవుదురుకదా! శ్రీ వీ॥ గారు ముక్కోపి అని శ్రీ ల॥ న॥ గారికి బాగా తెలియును. కోపమున ఆయనచేసిన యకార్యము లనేకములు. అందులో శ్రీ కామరాజు హనుమంతరావు గారి వివాహవిషయమును మాత్రము పొరపాటున ఉదహరించి అంతకన్న దారుణమైన వాటిని గురించి తమ స్వీయచరిత్రలో ఏమిలేదు. "ధర్మసాధని" వ్రాసినదానిమీద ఈ వ్యాఖ్యను వ్రాసితిని:—

"We are glad to see that at last our Cocanada Brahmo contemporary has, somehow or other, picked up courage and arrived at the end. Our contemporary's method of requesting Mr. Viresalingam to retire from public life reminds us of a Telugu proverb which runs as follows:— "It is like pointing out one's nose by passing one's hand from behind ones' head instead of pointing it out straightly and atonce." But better late than never. We expected our Cocanada contemporary to express its own honest opinion upon Mr. Viresalingam's behaviour which has been contended "to be harmless and innocent according to Hindu manners and customs, however inexcusable it may be according to the English stand-point," in the interest of Brahmoism itself which it has been championing. Even now it does not straightly express its own opinion upon it; but it wants him to retire, as the opinion of the majority is against him in regard to the same. We must say that this course of action is not Dharma Sadhanam, practising Righteousness or doing Justice. And then why should Mr. Prakasa Rao be found fault with for changing his religion for the sake of marriage more than Mr. Viresalingam? Mr. Prakasa Rao and his late spouse, Mangamma, changed their Hinduism, if they had really changed it, at the instance and for the sake of Mr. Viresalingam. In conclusion, we must say that there is no use swallowing camels and straining at gnats. If a man like Mr. Prakasa Rao changes his religion for the sake of marriage, it does not matter much. But if journalists who advocate reform, connive at the

misbehaviour of leading reformers like Mr. Viresalingam, even when it is proved in a Court of Justice, they become great enemies of good morals, reform and progress."

శ్రీవీ॥ గారు అతీతులైనందున నీతిమతసంఘసంస్కరణోద్యమములతో సంబంధమును వదలుకొని రిటైరు కావలసిన దని "కార్లిలియన్" వ్రాసిన "ఆర్టికల్సు"స ఇది ఆఖరుది. 1915-వ సం॥ ఆగస్టు నెలలో శ్రీవీ॥ గారి వగైరాలమీద రాజమండ్రి మునిసిఫ్ కోర్టున నామీద వారుతెచ్చిన మొదటికేసును గురించి రూ. 1500 లు డామేజెస్‌కు దావా దాఖలుచేసిరి. శ్రీవీ॥ గారు పబ్లికులైఫులోనుంచి రిటైరు కావలసినదని "కార్లిలియన్" చేసిన రాద్ధాంతము సిద్ధాంతము అంతయు మాఅన్నగారికి బాగుగ తెలుసును. అయితే అసలు మొదటి కేసులోని రెండవ సీనును మూడవ సీనును, రెండవ కేసును గురించి మా అన్నగారు తమ స్వీయచరిత్రలో నేమియు ఎత్తుకొనప్పుడు శ్రీవీ॥ గారు రిటైరు కావలెనని "కార్లిలియన్" 1915-వ సం॥న జేసిన అతి తీవ్రమైన ఆందోళనమును గురించి ఏలాగు ఎత్తుకొంటారు?

శ్రీపురము,
రాయపేట

* టంగుటూరు శ్రీరాములు.

---

* తమవ్యాసమును షష్టిపూర్తి సంపుటములో ప్రచురింపవలసినదిగా కోరియుండిరి. ఇది ముద్రణభాగ్యమందులోపలనే వారు కాలధర్మమొందిన కెంతయు చింతిలుచున్నాము.

# ఆంధ్రకవితాస్రవంతి

శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు, నెల్లూరు.

భారతవర్షమున గీర్వాణి పెక్కురఁ గూతుండ్రఁ గన్నది. వారలలోఁ దత్సమ పెద్ద యామె. ఈడు వచ్చినంత వారివారికి నచ్చిన నాడులందుఁ బ్రజల మనస్సుల నెలకొని తక్కిన తోఁబుట్టువులు భావతరంగముల నోలలాడుచు వాఙ్మయ మను సుద్యానవనముల విహరింపఁ జొచ్చిరి. ఎల్లరకు లేని యజంతత్వ మను శ్రవణ సుభగాలంకృతిం దాల్చి క్రొత్త సోయగమున విఱ్ఱవీగున దయ్యె మన తెనుఁగుపాప.

పల్లెలను, పట్టణములను, పాటకజనముల యాటపాటలకు నీడుజోడై, పామరజనముల సంసారముల రసముచిప్పిలు స్వభావ మధురములగు, నమాయికపు మాటలకుఁ బూటకాపై పాలబుగ్గల బాలబాలికల ముద్దుంబల్కులకుఁ దరితీపై చిన్నెల వన్నెలఁ జిందులు ద్రొక్కుచుండిన దానాడు మన తెనుఁగుబాల.

మన వైదికులాబిడ్డ నెత్తి ముద్దులాడు నోము నోచరై రేమో. శ్రుతిసూక్తులఁ జెవులు సెవుడుపడ్డ వారికి మనపాప పలుకులముద్దుకు, జన్నంపుఁబొగను కనులు కాటుకపడ్డ వారికి మనపట్టి తెలిగన్నుగవయు, కెమ్మోవిపై లేనగవును వినఁ గనఁ దీటిక లాకపోయెనో. రాచవారి యుడుకుతేజస్సు మొత్తమో యనఁ బుట్టిన మన విష్ణువర్ధనుఁడు తనచిన్ననాటఁ బల్లెటూళులఁ బెరిగినాఁడు, తెలుగుబాలను పాంసుక్రీడ చెలి సేసి కొన్నాఁడు, దినదినమున కట్టి తోఁబుట్టుతో నాట్లాడినాఁడు, పెద్దపెరిగి వీరుఁడై నాఁడు, రాజరాజై నాఁడు, తనచెల్లెలికి వయసువచ్చినది, చెక్కుచెదరని సిరి, సంపద, పాడి, పంట గన్న పంచమవేదము గన్నాఁడు విన్నాఁడు. తనతెనుంగుసోదరి నాయిరవు మంచి దని యటనిల్ప నెంచినాఁడు. ఆంధ్రధర్మరాజు వరుఁడు; మనయాంధ్రవాణి వధువు. వధూవరులకు నన్నయ, మత్యబురాధిపాచార్యుఁడు లాఁగా సుముహూర్తమునఁ బెండ్లి గావించినాఁడు. హంసయానమున నడవ సాగినది మన తెనుఁగుజవరాలు.

మహామంత్రులగు భాస్కరాదులు మన తెలుంగు నాడుపడుచునకు సీతమ్మనేస్తమునఁ దెనుంగుఁ గమ్మఁదనము సరసుల నోరూరఁ జవులు పుట్టించినారు. అమ్మ గీర్వాణి అక్కతత్సమ తోడుపడ రాజహంసుల మానసముల కవిహంసుల కైవారములఁ గ్రీడించిన దీ మన తెనుంగుప్రౌఢ.

కవి బ్రహ్మగనో, బ్రహ్మ కవిగనో పుట్టెనా అన్నట్టు కవిబ్రహ్మయై తిక్కకంటి వాఁడా యన్నట్టు తిక్కన్నయై అష్టమూర్తుల యాజియై గీర్వాణికి మాఱట యగు తత్సమము తెలుంగుసరస్వతికిఁ గూర్మితమ్ముఁడై మనుమసిద్ధి మనుగడ మిన్నంద జన్మించి యుత్తరరాము నుత్తముంజేసి సోమరసముం ద్రావి భారతసంహితను హరిహరుల మ్రోల సోమసూర్యుల

సాహిత్యమున అధ్యయనముఁ జేయసాగినాఁడు మన విక్రమసింహపురి కవి వీరసింహుఁడు. వలపల దాపలల తెలుంగు వేల్పుల వాణీసోదరులు ముందంజ వేయసాగిరి. చనవుంబట్టి ఆంధ్ర వాణి "అన్నా మీధర్మని కింత కట్నమిచ్చి నన్నుద్ధరింపవా? మాయమ్మకు అక్కఁడు దావులు పెక్కులు, ఎల్లరు వారిం గైసేయు వారల కదా. నాకు నీయిక్కయొకదా? తిక్కనా అన్న, అమ్మాయీ, సోదరీ నేనుండఁగ నీ కేలనమ్మ యుత్తలపాటు? అన్నలుండ ఆడుపడుచులు బంగరుటుయ్యేలలనూగరా. ఇదే నీకై దీక్షవూని రచనగరు కట్టెదను. ఆంధ్రధర్ముఁడు పాడి తప్పక నిన్నేలుగాక" అని భారతసౌధ మనుత్తనుము నన్నయ మూడంతస్తులపై పదునేనంతస్తులఁ గట్టినాఁడు, హరిహరుల నిరువంకలఁ బ్రతిష్ఠించినాఁడు, ఆంధ్రవాఙ్మయ భద్రపీఠిపై ఆంధ్రవాణిని సర్వాంగసుందరిని, సర్వాలంకారశోభితను ఆంధ్రావళి మోదమునం బొరయ శ్రీగౌరులు చెల్మి నావహింప నాంధ్రధర్మతో నిల్పి పట్టాభిషిక్తఁ గావించినాఁడు. శంభుదాసుఁడో "హరేరామ హరేరామ" యని రామకృష్ణుల స్మరించుచు నాంధ్రవాణికిఁ బూజ సల్పినాఁడు.

ఓరుంగల్లున గణపతి రాజనీతిసదస్సున కవిరాజులతో నాంధ్రవాణికి గీర్వాణి సాహమున విందు గావించినాఁడు..

కవికోకిలములు, కవిహంసములు, కవిపుంగవులు, పండిత కుంజరులు, శ్రోత్రియ వ్యాఘ్రములు, దార్శనిక సింహములు వాఙ్మయోద్యానములను, భాషారణ్యములను మొత్తములై పరస్పర జిగీషకై కూతలిడి బొబ్బలిడి గర్జిల్లిరి వారి వారి దారి మిన్న యని.

తెనుఁగు సరస్వతినే విందులకుఁ బిల్త మనువారు; గీర్వాణితో నని పెక్కురు; కలదు గీర్వాణికే మృష్టాన్నము, బిచ్చ మావికృతికని తక్కినవారు ఇరువుర నటునిటుఁ గదల్పక కట్టుబాటుల నుండఁ జన నిత్తు మను వారనేకులునై డీకొనిరి; కొందఱు గీర్వాణికే యని తెలుఁగువాణి వెలివేసి మడి గట్టుకొని యామెకు నేకాంతమున బువ్వపెట్టిరి. ఆయమ కసిగాటులుగ భుజించెను గాని ఆంధ్రిని వీడి యుండలేక పోయెను.

తిక్కన భావనా ప్రపంచమున హరిహరులు ప్రత్యక్షహరిహరులై బుక్కరాయలతోఁ జూపట్టిరి. మాధవుఁడు విద్యారణ్యుఁడయ్యె. భారతసౌధము విద్యానగరమయ్యె. సోముఁ డాంధ్రిమహిమ వక్కాణించె. అగ్రహార మండితుఁడయ్యె. ఆంధ్రవాణి విద్యారణ్యుల నావేశించి శ్రుతి విశ్రుతి గావింప బుద్ధి పుట్టించె. బుక్క హరిహరా మోక్షకాంత యదే చేఁజాచెదు. శ్రుతి వక్కాణింతు ననె. పరిశ్నుత శ్రౌత విద్యాపారగులు విరూపాక్షునాలయమున సిద్ధాంతములఁ జెప్ప శుద్ధాంతఃకరణమున నాయతి యాయతి శుభంబునకై శ్రుతిసీమంతిని భాష్య సామ్రాజ్ఞిగ దిగ్విజయము గావించె. దేవజగమునుండి వచ్చిన శ్రుతికి భూజగమున నాంధ్రవాణి గావించిన యీభాష్య సత్కారమున విమల యశోముక్తాఫల హార ధారణమున నాయమ యిచ్చో జేగీయమానశాఁ బొచ్చె.

ఆ శ్రుతి విందునం జేసి మనయాంధ్ర జగమునఁ బండితులు, కవులు, గాయకులు, వందలకుఁ బుట్టిరి. సహజ పాండిత్యుఁడు ఆంధ్ర కృష్ణునిఁ బ్రతిష్ఠించి కైసేసె. కవి సార్వ

భౌముఁడు ఆంధ్రవాణికి ఈతిబాధలఁ దొలంగించి జయభేరి మ్రోగించె. వాణి సారాణి (సాయేలిక రాణి) యన్న పిల్లలమఱ్ఱి వీరుఁడై కవిత్రయము మార్కొని జైమినితో నశ్వమేధముం జేసె. అంత నాంధ్రకృష్ణుఁడు సాక్షాత్కరించె. పితామహుఁడు చిగురుం గొమ్మకుఁ జేవ నెక్కించి శాంతిశృంగారములఁ గలనికిం బురికొల్పి సాగించి శాంతించి విష్ణుం గొలిచె. రాయఁడు చూడికుడుత్త దేవిపాదముల కెఱఁగి లోకోత్తర చతురుఁడయ్యె. శ్రీబట్రాజు జడములకుఁ జైతన్యముం గల్పించి యాకల్ప మాకల్పముగఁ జేసె, కర్ణాటలక్ష్మి మన యాంధ్రవాణిని తన యుపాస్యదేవిగ నిట్టు సేసి ధన్యయయ్యె.

ఇంతలో ద్రావిడలక్ష్మి మనయాంధ్రవాణిని తంజావూరు రాజుల మూలమునఁ బిల్పించికొనినది. మన తెనుంగుఁదల్లి తనతల్లి ప్రేమవీడక గీర్వాణితోఁ జనియె. ఇరువురకు దినదినము విందులయ్యె. చేమకూర పాకంపు రుచులతో రాధిక సాంత్వనములతో నవి వికాసమందె. గీర్వాణవాణి తోడ్పాటున గోవిందకృష్ణుల కీర్తించిన శుక దేవశార్దూలకుం గన్నులు మూతపడ సెవులు పండువులమునుంగ తెనుంగువాణి సాయమున త్యాగరాజు, క్షేత్రయ, అన్నమార్యాదులు తెనుంగు మెఱుంగుల మనోంబరంబుల మెఱయించి యమృతధారల, సర్వదేవతామయుని విష్ణు నభిషేకించిరి. ప్రజ లానంద పరవశులైరి.

ఇట్టి యుపకృతిం జేసిన ఓ తెనుంగుసరస్వతీ! నీకిదే జోహారులమ్మా! నీవంటి నెమ్మది నడకగల భాషామాత ఎవరమ్మా? గీర్వాణి ముద్దుల బిడ్డవమ్మా! ద్రావిడ కర్ణాట భాషా దేవుల సత్కారమందితి గదమ్మా! ఆంధ్రసరస్వతీ! మా ఆంధ్రదేశమును ఆంధ్రభాషను, చిరస్థాయులుగ నిల్పగదవమ్మా! అమ్మా తెనుంగుతల్లీ మా ఆంధ్రకవులకు సరసకవిత, పండితులకు లెస్స వైదుష్యము, విమర్శకులకు లోకజ్ఞత, వ్యాఖ్యాతలకు భాషాభావ పరిజ్ఞానము, కర్మఠులకు అదాంభికత్వము, వేదాంతులకు (జ్ఞానులకు) నిష్కాలుష్యము నాయకులకు స్వార్థత్యాగము ప్రజల కైకమత్యము సర్వమత సామరస్యము, ఎల్లర కసూయా రాహిత్యము దయసేయుతల్లీ, ఆంధ్రభాషాదేవీ! నీ కిదే జోహారు, తెనుంగువాణీ నీ కిదే నమస్కారము, ఆంధ్రసరస్వతీ! నీ కిదే సాష్టాంగ దండప్రణామము. ఆంధ్రదేశమునకు, జయము, ఆంధ్రభాషకు జయము, ఆంధ్రులకు జయము, ఆంధ్రకవితకు జయము. ఓమ్ శాంతిః శాంతిః శాంతిః. ఆంధ్రరాష్ట్రము ప్రతిష్ఠ నెగడుగాక.

# ఆముక్తమాల్యద

రాజచరిత విశారద
రావుసాహెబ్ శ్రీ సి. హయవదనరావు,
బి. ఏ., బి. యల్., యం. యల్. సి., బెంగళూరు.

ఆముక్తమాల్యద అను ఉత్తమప్రబంధము స్మరణకు రాఁగానే శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు అనుసంస్థయు దాని కిప్పుడధిపతియైన భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారును తప్పక స్మరణకు వచ్చితీరుదురు. శ్రీ రామస్వామిపండితులపుత్రరత్నమే శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు. శ్రీ రామస్వామిశాస్త్రులవారిదివసములో వ్రాఁతప్రతులరూపముననే లభ్యమగుచుండెడి ఈయుత్తమప్రబంధముచు పరిష్కరించి వ్యాఖ్యానముతో ముద్రింప సమకట్టిరి. మహోత్తమస్థితిలో విజయనగరసామ్రాజ్య మున్నదినములలో నిది రచింపఁబడుటచే దానిచరిత్ర కిది యెంతయుపకరించునో వేఱుగఁ జెప్పనక్కఱలేదు. శ్రీ రామస్వామి శాస్త్రులుగారు విశాలము స్వతంత్రమునగు దృక్పథముగలవారు. ఆయన పండితమాత్రులే కాదు. పదిరూకలు సంపాదింతమన్న సామాన్యపుటూహలతోఁగాక ఆంధ్రప్రజానీకమున కుత్తమగ్రంథముల నచ్చొత్తించి యిత్తమనుపవిత్రసంకల్పముతో నొకముద్రాశాలను క్రీ. శ॥ ౧౮౫౪ సంవత్సరమున నెంబరు 323 తిరువత్తియూరుహైరోడ్డు తండియార్పేట లోని గృహమున ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల యనుపేర స్థాపించిరి. అదియే నేఁటి వావిళ్లముద్రాక్షరశాల. చెన్నపురిలో ముద్రణవ్యాపారముగనే కాక పరిశ్రమగఁ బెంపొంది తీవ్రమగుపోటీ నెదుర్కొనవలసినదినములలో నింతచక్కఁగ నింత సంతృప్తికరముగా నాధునికపద్ధతులపై ముద్రాయంత్రమును స్థాపించి సర్వతోముఖవృద్ధిని జూడఁ గన్న యాతండ్రిపుత్త్రులగొప్పదనమున కిది యొకమచ్చుతునక. ఈముద్రాశాల త్వరలోనే శతవార్షికోత్సవమును జరపికొని యింతోధికముగా భాషాసేవ ప్రజాసేవ చేయఁగలుగుఁ గాక! అత్యాధునికపద్ధతులపై నపూర్వముద్రణమున నాటితేటి యిన్నాళ్లనుండి ఆంధ్ర సారస్వతవికాసమునకుఁ దోడ్పడిన ఈముద్రాశాల శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారి ఆధ్వర్యమున నింకను జేగీయమాన మగుఁగాక!

తెనుఁగుగ్రంథములను వ్యాప్తిచేసి తెలుఁగుభాషను వృద్ధిపఱచుటకే శ్రీ రామస్వామి శాస్త్రులుగా రీముద్రాశాలను స్థాపించినది. చెన్నపురి ఆంధ్రులకు అరవలకు నావాసస్థానమైనది. కాని, పదునాలుగవశతాబ్దమునుండి విజయనగరరాజులయున్నతితో చెన్నపురి లక్ష్మి ఆంధ్రులరూపరేఖావిలాసములనే యెక్కువ చూఱఁగొన్నది. ఈనగరవాసులలో నెక్కువమంది ఆంధ్రులకు అరవభాషపైని, అట్లే యెక్కువమంది యరవవారికి ఆంధ్ర భాషపైని, గౌరవప్రతిపత్తులు గలవు. ఆకారణమున ఈముద్రాశాల చెన్నపురిలో స్థాపితమగుట అచటివా రెల్లరికిని వరప్రసాదమే యైనది. దీనివలన శ్రీ రామస్వామిశాస్త్రులవారి

స్వతంత్రత, నిపుణత, కార్యదీక్ష తెలియఁగలవు. ఈయుత్కృష్టకార్యమును మఱింత విజయవంతముగఁ గొనసాగించి తండ్రి వేసినపునాదిపై నుత్తమసౌధమును నిర్మించి విజ్ఞాని గనే కాక విజయవంతుఁడగు వ్యాపారస్థుఁ డన్నకీర్తియు గడించియున్న శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారి ప్రజ్ఞాపాటవము మఱింత స్తుతింపఁదగినది.

పండిత శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు ముద్రించి ప్రకటించిన యుత్తమగ్రంథ ములలో ఆముక్తమాల్యద యొకటి. ఇది 1869, 1884, 1909, 1914, 1930. సంవత్సర ములలో నైదుముద్రణములంది నిపుడాఱవముద్రణ మందనున్నది. కాని, క్రీ. శ. ౧౮౬౯ లోనే యెంతో కాలము యెంతో శ్రమ యెంతో ధనము వ్యయించి ఈయుత్తమ గ్రంథమును ముద్రింపఁ దలఁపూని విజయముగన్న శ్రీ రామస్వామిశాస్త్రులవారిదీక్ష వారి స్వతంత్రపుటూహ చాల ప్రశంసనీయములు. వారిద్వితీయముద్రణ ప్రతి పీఠికలో తప్పులు కుప్పలుగా నున్న వ్రాఁతప్రతులను సరిచూచి చక్కని ప్రతిని దయారుచేసి ముద్రించుటయే తమకోరిక యని శ్రీ రామస్వామిశాస్త్రిగారు పేర్కొనిరి. "మూలమును లేఖకప్రమా దాదులచేత నానావిధపాఠములుగ నుండెను. ఈ హేతువుచేతనే దీని నిదివఱ కెవ్వరును ముద్రింపఁబూనరైరి" అని వారు వ్రాసిరి. వారు దేశము నలుమూలలనుండి యెన్నియో ప్రతులు తెప్పించి సరిచూచి సర్వజనాదరణీయములగు పాఠములనే యేర్చికూర్చి తమప్రతిని ప్రకటించిరి. ఇంతేకాక దానికిఁ దాము వ్రాసిన "రుచి" యను వ్యాఖ్యానమును జేర్చి ముద్రించిరి. ఎందఱో మహాపండితు లంతకుఁ బూర్వమే దీనికి వ్యాఖ్యానములు వ్రాసియున్నను నొక్కపుస్తకముకూడ పూర్తిగ వారికి లభ్యము కాలేదు. వీరిప్రథమముద్రణపుప్రతులు శీఘ్రముగాఁ జెల్లిపోవుటచే మఱికొన్ని వ్రాఁత ప్రతులను బరిశోధించి క్రీ. శ॥ ౧౮౮౪ లో దీనిని బునర్ముద్రించి తమపాండితీవైభవమును వారు చూపుటే కాక తన కీకార్యమున సాయపడిన మహాపండితులు దొరతనమువారినార్మల్ స్కూలులో నుపాధ్యాయులు నైన శ్రీ చదలువాడ సీతారామశాస్త్రిగారిని లోకమున కెఱుకపఱచి వారు తమకుఁ జేసినసాయమునకుఁ గృతజ్ఞతాపూర్వకముగ వారిపేరుకూడ ముఖపత్రముపై ముద్రించుట శ్రీ రామస్వామిశాస్త్రులయౌదార్యమునకుఁ దారకాణ. శ్రీ సీతారామశాస్త్రిగారు శ్రమయని వెనుదీయక భాషాశక్తి విజ్ఞానశక్తి కారణములుగా శ్రీ రామస్వామిశాస్త్రులుగారికి సాయపడుటయుఁ బ్రశంసనీయముగువిషయమే. దీనితోఁ గీర్తిగని రాజధానికళాశాలలోఁ జేరిన శ్రీ సీతారామశాస్త్రిగారే సహృదయులై శ్రీ శాస్త్రులు గారికి సాయపడుట నిక్కువమే కాని వారిసాయము శ్రీ రామస్వామిశాస్త్రులుగారికృషికిఁ బైఁబడిన దని కొందఱనుకొనుట సాహసము, అన్యాయమును,

నెల్లూరు నవాబుపేట వాస్తవ్యులగు శ్రీమాన్ వింజమూరి నరసింహాచార్యులుగారు ఆముక్తమాల్యద వ్రాఁతప్రతులను గొన్నిటిని దాము సంపాదించినసంగతి నెల్లూరుపండిత గోష్ఠిలో నొకమాఱు చెప్పఁగా విని శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు వీని సంపాదించి

శ్రీచదలువాడ సీతారామశాస్త్రిపండితులసాయమునఁ బ్రకటించిరని శ్రీవేదము వేంకటరాయ శాస్త్రిగారు ౧౯౨౭ వ సం॥ లోఁ దాము ప్రకటించినఆముక్తమాల్యదపీఠికలోఁ బేర్కొని యున్నారు. శ్రీసీతారామశాస్త్రులుగారు తమకు సహాయపడిరని వారికిఁ గృతజ్ఞత తమ గ్రంథముఖముననే శ్రీరామస్వామిశాస్త్రులుగారు చెప్పుకొనియున్నారు. కాన పరిశుద్ధ మగు ఆముక్తమాల్యదాప్రతి వెలువడుటకు శ్రీనరసింహాచార్యులు, శ్రీసీతారామశాస్త్రిగారలకుఁ గొంతగౌరవభాగ మున్నమాట యథార్థమేకాని యింతశ్రమపడి తమకున్న దంతయు దానిపై వినియోగించి పరిష్కరించి టీకవ్రాసి ప్రకటించిన శ్రీరామస్వామిశాస్త్రులవారికే చెందినగౌరవ మత్యంత మనుట నిస్సంశయము. శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారే యీవిషయమును "ఆముక్తమాల్యదను రుచివ్యాఖ్యానముతో శ్రీవావిళ్లవారు ప్రకటించి నప్పటినుండి యది కాంచినఖ్యాతి నిరుపమానము. విద్యార్థిప్రపంచమున కది కామధేనువుగా విరాజిలుచున్నది. అంతే కాదు. ఇది యానాఁడు ప్రకటింపఁబడకయే యున్న యేనాఁడో ఆముక్తమాల్యద రూపరేఖలేక నశించియుండెడి దనుటలో నాశ్చర్యము లేదు." అని వ్రాసియుండిరి. కాని, యీరుచివ్యాఖ్య శ్రీరామస్వామిశాస్త్రులుగారిది కాక యితరుల దనుకొనుట మాత్రము తుంతవ్యము కాదు. అసూయాపరు లేకాలముననైన నుండుటయు వారు వట్టి అభూతకల్పనములను జేయుటయు నెప్పుడును గలదు. కావున, శ్రీరామస్వామిశాస్త్రులుగారు ఆముక్తమాల్యదాసంపాదన పరిశోధనవ్యాఖ్యావిరచనావిషయములలో ననంత శ్రమతో శాశ్వత మగుగ్రంథము నాంధ్రసారస్వతప్రపంచమునకే కాక భారతసాహిత్య రంగముననే నిలిపిన కీర్తిశాలు రన్నది నిస్సంశయవార్త సంతతస్తుతిపాత్రము.

శ్రీనరసింహాచార్యులవారికడ గలప్రతులే కాక యితరములగు ప్రతుల నెన్నిటినో శ్రీశాస్త్రులవారు సంప్రతించియుండి రని వారే పీఠికలోఁ దెల్పుటచేతనే కాక మూలపరిష్కృతగ్రంథములఁబట్టియే మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇందు శ్రీశాస్త్రులవారు గైకొన్న యుచితతరపాఠములు పాఠాంతరములు, శ్రీశాస్త్రులవారు నిర్మించిన యాశ్వాససంఖ్యాదికము గమనార్హములు. ప్రాచీనులు తలఁచినట్లు ఈగ్రంథమున ఆఱాశ్వాసములే కలవని వారు నిర్ణయించి గ్రంథాంతమున, "కొన్ని ప్రతులలో ఆఱవ ఆశ్వాసము మాలదాసరి బ్రహ్మరక్షస్సుపూర్వచరిత్రము నడుగుటతో సమాప్తమయి బ్రహ్మరాక్షసుఁడు తనచరిత్రమును బ్రారంభించుటతో నేడవయాశ్వాస మారంభమయి తుదిపద్యములతో నంతమయినది. కాని, ప్రాచీనవ్యాఖ్యాత లెవ్వరును సప్తమాశ్వాసాంతపద్యములకు టీక వ్రాసియుండనికారణమున నిది యాఱాశ్వాసములగ్రంథమే యని స్పష్టము, అందుచే నిది యాఱాశ్వాసములగ్రంథముగనే నేను ముద్రించితిని అని వ్రాసియున్నారు. దీని తరువాతి ముద్రణములలోను 1930-వ సంవత్సరములలో వెలువడిన ఐదవముద్రణములోను టీక లేకయే ఆఱవయాశ్వాసాంతమున నీయధికపద్యములు ప్రక్షిప్తములుగ చూపఁబడినవి.

అందుచే నాఁటికి తెలుఁగుసారస్వత ప్రపంచమునకుఁ దెలియవచ్చిన ప్రతుల నన్నిటిని శ్రీ రామస్వామిశాస్త్రులుగారు పరిశోధించి రనుట విస్పష్టము. లేనిచోఁ బై వాక్యములు వా రెట్లు వ్రాసియుండఁగలరు ? అదికాక నాఁటికే చెన్నపురిలోనున్న ప్రభుత్వమువారి ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సులైబ్రరీలో నున్న ప్రతులను సైతము శ్రీ శాస్త్రులవారి యంతటి దీక్షాశాలి చూచియుండ రనుట సత్యము కానేరదు. ప్రయాణసౌకర్యములు లేనియాదినములలో నెల్లూరు నవాబుపేట వెళ్లి వ్రాఁతప్రతులను శోధించిన శ్రీ శాస్త్రులుగారు ఊరిలోనున్న ఓరియంటల్ లైబ్రరీలోని ప్రతులు చూడకుందురా? అందు నప్పటికి సి. పి. బ్రౌనుదొరయంతటి శ్రద్ధాళువు పండితుఁడు జాగ్రత్తపఱచియుంచిన వ్రాఁతప్రతులను వీరు చూచియేయుందురు. బ్రౌనుదొరకుఁ గల ఆంధ్రభాషాభిమానము ఆముక్తమాల్యదపైఁ గల ప్రత్యేకాభిమానము ఓరియంటల్ లైబ్రరీలోని 392 నెంబరుగల ఆముక్తమాల్యదప్రతిలో గోదాదేవి చరిత్ర మాయన వ్రాసియుంచుటయు, అదే గ్రంథము మఱియొకప్రతిలో (నెం 405 రు) నది జూలూరి అప్పయ్య పండితశేఖరునిచే 1834 లో పరిష్కరింపఁబడిన దని వ్రాసియుంచుటయు, అంతేకాక "ఆముక్తమాల్యదాశబ్దసూచి" యనుపేర (నెం 423 రు గల గ్రంథము) ఆముక్తమాల్యదలోనిశబ్దముల నేరి 1849 లో బ్రౌనుదొర ప్రభుత్వభాషాంతరీకరణకర్తగా నున్నపుడే పూర్తిచేయించియుంచుటయు, ఆపదములకు ఆశ్వాససంఖ్యయు పద్యసంఖ్యయు నొసంగుటయు మున్నగువిషయములు సాక్షీభూతములు.

అందుచే శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారి రుచివ్యాఖ్యకుఁ బూర్వము ఆముక్తమాల్యదపై నెన్నియో సమగ్రములు కొన్ని యసమగ్రములు కొన్ని వ్యాఖ్యానములు కలవు. అందు గుడిపాటి వెంకటకవీంద్రుఁడు వ్రాసిన "తాత్పర్యబోధిని" యొకటి. ఇది క్రీ. శ॥ 1848 కిఁ బూర్వమే విరచింపఁబడిన ట్లొకప్రతివలనఁ దెలియుచున్నది. ఇదికాక "బుధమనస్తోషిణి" యనుపేర మఱియొక్క రెవ్వరో క్రీ. శ॥ 1813 ప్రాంతమున రచించి నట్లు తోఁచున దింకొకటి మూఁడవది. గట్టుపల్లి శ్రీనివాసకవి వ్రాసిన "మహాటీక" యింకొకటి. ఇదియు సుమారు క్రీ. శ॥ 1800 వ సం. ప్రాంతమున రచింపఁబడినదే. శ్రీ వావిళ్ల వారి "రుచి" వ్యాఖ్యానము, ఇవికాక యసమగ్రములు ముప్పదియొక్కటి వఱకుఁ గలవు. ఇం దాయా వ్యాఖ్యాతలపేళ్లు సైత మెన్నింటిలోనో లేనే లేవు.

ఇన్నిప్రతులుగల మఱియొకగ్రంథము (ఇతిహాసపురాణాదులు తక్క) ఆ లైబ్రరిలో లేనే లేదు. దీనినిబట్టి క్రీ. శ॥ 19 వ శతాబ్దారంభమునుండి యీగ్రంథమునకు సారస్వతదృష్టిని మతదృష్టిని మిక్కిలి పే రుండె నని స్పష్టము. ఆకాలముననే తాటియాకులపుస్తకములనుండి తెల్లకాగితములపుస్తకములలో గ్రంథములు వ్రాసియుంచు టారంభము. నెం. 392 రు గల గ్రంథము ననుసరించి (1) కృష్ణదేవరాయలే యీగ్రంథకర్త యనియు (2) ఆఱాశ్వాసములే యిందుఁ గలవనియు (3) మొదటి యైదాశ్వాసముల చివర గ్రంథకర్త ఆశ్వాసాంతపద్యములు వ్రాసినాఁ డనియు, ఆఱవయాశ్వాసాంతమునఁగల పద్య

భాగము నాలవయాశ్వాసాంతపద్యభాగమే మరల లిఖింపఁబడిన దనియు మనకు స్పష్టముగాఁ దెలియును. ఈపై విషయములలో నభిప్రాయభేదములు కలవా రెందఱో యున్నారు. ఈ నెం. 392 రు గల ప్రతి 1847-1850 నాఁటిదని మనము తెలిసికొనవచ్చును. నెం. 393 రు గల ప్రతికూడ ఆకాలమునకుఁ జెందినదే యైయుండవలయును. నెం 394 రు గల ప్రతిలో ఆశ్వాసాంతపద్యములు సరిగా వ్రాయఁబడలేదు. అంతేకాక మనుచరిత్రలోనిపద్యము లాముక్తమాల్యద ఉపోద్ఘాతములో నున్నవానికి దేనికిని టీక లేదు. నెం. 396 రు గల ప్రతి రెంటాల దాసన్న వ్రాసినట్లు ఆంగీరసాధి కాషాఢశుద్ధ చతుర్దశినాఁడు పూర్తిచేసినట్లు కలదు. అనఁగా క్రీ. శ॥ 1812 జూలై నెల నెం. 397 రు గల ప్రతి సమగ్రమైనది. కాని, యిందు మొదటి నాలుగుపుటలలోఁ గొన్నికఠినపదములు వానికర్థములు వివరణములు కలవు. నెం. 398 రు గల ప్రతిలో మొదటి రెండాశ్వాసములే కలవు. ఇది సంతెనాడ వీరరాఘవులు (వికృతి. మాఘ. బ. 10 క్రీ. శ॥ 1831 ఫిబ్రవరిలో) వ్రాసినది. నెం. 399 రు గల ప్రతిలో తుదినాలుగుపద్యములుమాత్రము లేవు. నెం. 400 రు గల ప్రతిలో మొదటియాశ్వాస మొక్కటి కలదు. నెం. 401 రు గల ప్రతిలో ఆఱవయాశ్వాసములోని కొంతభాగము కలదు. ఇందలివిశేషము కఠినపదముల కెక్కడికక్కడ అధస్సూచికలో నర్థము లిచ్చుట. ఇది క్రీ.శ॥ 1834 లో వ్రాసినట్లు కలదు. వీనినన్నిటినిబట్టిచూడ ఆముక్తమాల్యదకుఁ గలవిఖ్యాతి విస్పష్టము. నెం. 395 రు గల ప్రతి సమగ్రమే కాని నడుమనడుమ నెన్నియోపుటలు లేవు. కొన్ని పుటలు తెల్లకాకితములుగనే విడువఁబడియున్నవి. ఆఱవయాశ్వాసములోను దుదియాశ్వాసములోను చివరిమూఁడుపద్యములు ఆశ్వాసాంతములు లేవు. తుదియాశ్వాసము ఏడవ యాశ్వాస మని యున్నను ఆఱవయాశ్వాసాంతపద్యములు కానరావు. నెం. 402, 403, 404 రు "తాత్పర్యబోధిని" యనువ్యాఖ్య గలవి. నెం. 402 రు ప్రతిలో మొదటియాశ్వాసము రెండవయాశ్వాసములో 27 పద్యములు గలవు. మూలము వ్యాఖ్య యింతవఱకే యిందుఁగలదు. నెం. 403 రు లో 1 మొదలు 6 వఱకు మొదటియాశ్వాసపద్యములు, మూఁడవయాశ్వాసము పూర్తిగను, 1 మొదలు 105 వఱకు నాలవయాశ్వాసము, ఐదవ యాశ్వాసము పూర్తిగను ఆఱవయాశ్వాసములో 1 మొదలు 19 వఱకుఁ గలపద్యములు వ్యాఖ్యానముతో సైత మిందుఁ గలవు. నెం 404 రు గల ప్రతిలో మూలము లేదు. మూఁడవయాశ్వాసవ్యాఖ్యయే కలదు. తరువాత ఈ ప్రతి పరిశోధితమై తే 2-2-1848 దీని పూర్తిచేయఁబడినది. ఈ వ్యాఖ్యానకర్తపేరు ఆపస్తంబసూత్రుఁడు, హరితగోత్రుఁడు నగు కిచ్చనామాత్యపుత్త్ర గుడిపాటి వెంకటకవీంద్రుఁ డని గలదు. ఈతఁడు సంస్కృతాంధ్ర గ్రంథము లెన్నియో వ్రాసినట్లు చెన్నపుప్రధానిశ మారుఁ డగు సిర్నంక వేంకటప్రధాని యాశ్రితుఁడ ననియు ఆత్రేయగోత్రుఁడు నందవరీకబ్రాహ్మణుఁడు నగు కృష్ణపతి ఛాయాపతి సోదరుఁడ ననియు నీవ్యాఖ్యాత యిందుఁ దెలుపుకొనియున్నాఁడు. ఈవ్యాఖ్య విపులము సమగ్రమేకాని యిందు వాడినభాష వ్యావహారికము.

నెం. 405 రు మొదలు 411 వఱకుఁ గల ప్రతులు "బుధమనస్తోషిణి" యను వ్యాఖ్యతో నసముగ్రములగు భాగములు కలవి. ఇందులో నెం. 4।5 రు గల ప్రతిలో ఒక్క మూఁడవయాశ్వాసముతక్క మిగిలిన గ్రంథమంతయు వ్యాఖ్యతోఁ గలదు. నెం. 406 రు ప్రతిలో ఆఱవయాశ్వాసములోని కొంతభాగము వ్యాఖ్యానము కలవు. నెం. 4।7 రు గల ప్రతిలో ప్రథమాశ్వాసమంతయు వ్యాఖ్యతోఁ గలదు. నెం. 408 రు గల ప్రతిలో నాలవ యాశ్వాసములోఁ గొంతభాగము వ్యాఖ్య గలవు నెం. 409 రు ప్రతిలో పీఠిక తొలుతటి కొన్ని పద్యములు గలవు. నెం. 410 రు ప్రతిలో మూలము లేదు. మూఁడవయాశ్వాసము నకుఁ దక్క అంతటికి వ్యాఖ్య గలదు. నెం. 411 రు గల ప్రతి పై ప్రతివంటిదే. ఈబుధమన స్తోషిణీవ్యాఖ్య వెంకటపతిరాజు రాజమాంబలకొడు కగు ఉప్పలపాటి జోగిజగన్నాథ రాజు వ్రాసినది. ఆతఁడు సూర్యవంశక్షత్రియుఁడ ననియు కందాళకృష్ణమాచార్యశిష్యుఁడ ననియుఁ జెప్పుకొనెను. ఈవ్యాఖ్య యాతఁడు శ్రీముఖ మాఘ శు ౨ నాఁడు (ఫిబ్రవరి 1813) పూర్తిచేసినట్లు గలదు. దీనికి నకలు ప్రతిమాత్రము 1822వ సం. మేనెలలో వ్రాసినట్లు గలదు. ఈరాజు గురుప్రేరణచే ఈవ్యాఖ్య వ్రాసినట్లును, తనగురువు మహామేధావి యనియు నూతనకావ్యము వ్రాయుటకంటె ఇట్టి యుత్తమకావ్యమునకు వ్యాఖ్య వ్రాయుటే మేలని యాతఁడాదేశించె ననియు చెప్పుకొనెను. ఈతఁడు తనవంశమును జెప్పుకొనుచు తనపూర్వుఁడగు అప్పలరాజును పేర్కొనెను. ఆతనికొడుకు వేంకటరామరాజు; అతని కొడుకు వెంకటాధిపుఁడు, అతనికి రాజమ్మవలనఁ గలిగినకొడుకే యీవ్యాఖ్యాత. నెం. 405 రు గల ప్రతిపై బ్రౌనుదొర కాకిత మొకటి యంటించి "ఇది విద్వచ్ఛిరోమణి జూలూరి అప్పయ్య 1834 లో పూర్తిగఁ బరిష్కరించిన" దని వ్రాసియుంచెను. ఇందు ఆఱాశ్వాసములే కలవు కాని, ఆఱవయాశ్వాసాంతమున "ఇది నీలాచల..." అనుపద్యము క్రొత్తగాఁ జేర్పఁబడినది. దీనినే వేదము వేంకటరాయశాస్త్రిగారు తమప్రతిలో "షష్ఠమం" అనుచోట "సప్తమం" అని దిద్ది ఏడవ ఆశ్వాసాంతపద్యముగాఁ జేర్చి ఆఱవయాశ్వాసాంత పద్యముగా గట్టుపల్లి శ్రీనివాసకవి ప్రతిలోఁగల "ఇది నైరామన..." అనుపద్యమును జేర్చిరి. ఈపద్యము నాలవయాశ్వాసాంతమునవే శ్రీనివాసకవి పేర్కొనెను. దానినట్లు వేదమువారు మార్చిరి. "ఇది నీలాచల..." అనుపద్యము క్రీ. శ॥ 1813-వ సంవత్సరమునకుఁ జెందిన జగన్నాథరాజు ప్రతిలోనిది. దీనికిఁ బూర్వప్రతులలో నాలవయాశ్వాసాంత పద్యము ఆఱవయాశ్వాసాంతపద్యముగాఁ గలదు. ఈసంప్రదాయము ననుసరించియే వావిళ్ల వారు తండ్రికొడుకు లిరువురు తమయాముక్తమాల్యద ముద్రణప్రతులలో "ఇది సింహా చల..." అనుపద్యమునే యుంచి ముద్రించుచున్నారు.

నెం. 412 మొదలు 417 రు వఱకుఁ గల ప్రతులు గట్టుపల్లి శ్రీనివాసకవి రచించిన వ్యాఖ్యానము గలవి. ఈ శ్రీనివాసకవి ఆముక్తమాల్యద పెద్దనార్యకృత మనియు ఇం

దేడాశ్వాసములు కలవనియుఁ దెలిపెను. "ఇది నైరామన..." అనుపద్య మీతని ప్రతిలోనే ఆఱవయాశ్వాసాంతపద్యముగాఁ గలదు. దీనినే వేదముబాడు గైకొనిరి. శ్రీనివాసకవి సప్తాశ్వాసము లాముక్తమాల్యదలోఁ గలవని తానే యూహించి సృష్టించెనో లేక యాధారము లేమైనఁ గలవో తెలియదు కాని, అన్నియాశ్వాసాంతపద్యములకు టీక వ్రాసిన యీకవి ఆఱవయాశ్వాసాంతపద్యములకుమాత్రము వ్రాయకుండుట గమనార్హము. దీనినిబట్టి గట్టుపల్లి శ్రీనివాసకవియే యీపద్యమును సృష్టించియుండవచ్చు ననియు నందుచేతనే దాని కాతఁడు టీక వ్రాయలే దనియు ననుకొనుటలో దోషము లేదు. శ్రీనివాసకవి తిరుపతి వేంకటాచలపతిభక్తుఁడ నని చెప్పుకొని తనటీకకు తొలుతనే వేంకటేశ స్తోత్రము చేసెను. ప్రసిద్ధిగన్న గట్టుపల్లివంశజుఁడ ననియు గురూపదిష్టమగు శాస్త్రజ్ఞానము కలవాఁడ ననియు లోకసంగ్రహార్థమే ఆముక్తమాల్యదకు మహాటీక వ్రాయుచున్నా ననియు నీతఁడు చెప్పుకొనెను. పైఁజెప్పఁబడిన యాఱుప్రతులలోను నెం. 412 రు గల ప్రతియే మూలవ్యాఖ్యాసమగ్రము; మిగిలిన వసమగ్రములు. 413 లో మొదటిమూఁడాశ్వాసములు, 414 లో వ్యాఖ్యాతపీఠిక గాని, మొదటియాశ్వాసములోని 2-6 పద్యముల వ్యాఖ్యగాని లేవు. ఈప్రతిని క్రీ.శ॥ 1809 సం.లో నకలు వ్రాయఁబడినదని కలదు. నెం. 415 రు ప్రతిలో మొదటిరెండాశ్వాసములకు మూఁడవయాశ్వాసములోఁ గొంతభాగమునకు వ్యాఖ్య గలదు. మిగిలినభాగమునకు మూలముమాత్రము గలదు. 416 లో మూఁడవ యాశ్వాసము మధ్య నాగిపోయి పంచమాశ్వాసాంతముఁ బ్రారంభమయి షష్ఠాశ్వాస మధ్యమున నాగిపోయినది. నెం. 417 రు గలప్రతిమాత్రము సమగ్రము 418, 419 లు నసమగ్రము. 420 లో పీఠిక, ఆశ్వాసాంతపద్యములు లేవు కాని మిగిలినభాగమంతయుఁ గలదు. ఇందులోని విశేష మేమనఁగా వ్యాఖ్యానము శ్రీనివాసకవిదే కాని, ప్రతిపుట పైని "రామేశ్వరీయ" మనుపేరు గలదు. శ్రీనివాసకవి టీక కది వేఱొకనామమో యేమో తెలియదు. నెం. 421 రు గలప్రతిలో నైదాఱాశ్వాసములకు టీక గలదు.

గట్టుపల్లి శ్రీనివాసకవిప్రతి ననుసరించి యీగ్రంథ మెన్ని యాశ్వాసములది యన్న ప్రశ్న బయలుదేఱినది. ఆఱవయాశ్వాసమునే రెండాశ్వాసములుగా విభజించిన దీతఁ డా యనుసంశయము కలుగుచున్నది. "ఇది నైరామన..." అన్నపద్య మెవరిది? అది ప్రాచీన మైనచో ఇతఁడు దాని కేల టీక వ్రాయలేదు? ఇది ప్రాచీనము కాదనియు గ్రంథమున నాఱాశ్వాసములే కలవనియు వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు విశ్వసించిరి. వ్యాఖ్యాతలు చాలమంది ఏడవయాశ్వాసాంతపద్యములకు టీకయే వ్రాయలేదు. 1930 వ సంవత్సరమున వావిళ్లవారు ప్రకటించినప్రతికి పీఠిక వ్రాయుచు మేడేపల్లి వేంకటరమణాచార్యులు ఈగ్రంథ మాఱాశ్వాసములదే యనియు నేడాశ్వాసముల దని నమ్మకుండుటకుఁ గారణము ఈతుదిపద్యములలోఁ బదదోషములు ఛందోదోషములు నుండుట యనివ్రాసిరి.

పూర్వలిఖితములగు వ్రాతప్రతులలో నిట్టిదోషము లెన్నియో యున్న వనుకొన్నను, పెక్కురవ్యాఖ్యాన్యానములనుబట్టి యాఱాశ్వాసము లే యున్న వని యెన్నవచ్చును.

ఏడాశ్వాసము లున్నవనుకొన్న పక్షమున ఈయాశ్వాసాంతపద్యము లెట్లు నిర్ణయింప వలె నన్నది గడ్డు సమస్య. ఉన్నయాశ్వాసాంతపద్యము లిట్లున్నవి.

| ఆశ్వాస సంఖ్య | తుది పద్యము | వ్రాత ప్రతులు | ముద్రిత ప్రతులు 1. వావిళ్ల వారిది. 2. వేదంవారిది. |
|---|---|---|---|
| 1. | "ఇది కర్ణాట ధరాధృతి..." | అన్నిట సమానము | సమానము. |
| 2. | "ఇది భూమండన ... ... ..." | ,, | ,, |
| 3. | "ఇది పాత్ర ప్రహారేశ్వ..." | ,, | ,, |
| 4. | "ఇది సింహాచల దంభకేసరి..." | ,, | ,, |
| 5. | "ఇది యంధ్రోక్తి యథార్థనామ..." | ,, | ,, |
| 6. | ... | అన్నిట భేదము గలదు | రెండిట భేదము గలదు |
| 7. | ... | ,, | ,, |

వావిళ్లవారి ప్రతిలో ఆఱవయాశ్వాసాంతపద్యము "ఇది సింహాచలదంభకేసరి..." వేదము వారిదానిలో "ఇది నైరామన..." అనియు. ఏడవయాశ్వాసాంతపద్యముగా "ఇది నీలాచల నీలచేలక..." అనియుఁ గలదు. "ఇది నీలాచల..." అన్నపద్యమే క్రీ. శ. 1813సం.లో ఉప్పలపాటి జగన్నాథరాజు వ్రాసినదియు 1834 లో జూలూరి అప్పయ్య పరిష్కరించినదియు నగు మాతృకలోనిది, ఇందలి "షష్ఠమం" అనుమాటను "సప్తమం" అని మార్చి వేదమువారు ఏడవయాశ్వాసాంతపద్యముగాఁ జేర్చిరి. ఈపద్యమే క్రీ. శ. 1809 సం. ప్రాంతమువాఁడైన గట్టుపల్లి శ్రీనివాసకవిప్రతిలో ఆఱవయాశ్వాసాంతపద్యముగా నున్నది.

| ప్రాతప్రతి నెంబరు | ప్రాతప్రతి యెవరిది? | కాలము | నకలు వ్రాత కాలము |
|---|---|---|---|
| 414 | గట్టుపల్లి శ్రీనివాసకవి వ్యాఖ్యానముగల ప్రతి | సరిగా తెలియదు కాని క్రీ. శ. 809 కి పూర్వము | 1809 |
| 396 | ఆముక్తమాల్యద మూలపు ప్రతినకలు | సరిగా తెలియదు కాని క్రీ. శ. 1812 పూర్వము | 1812 |

"నైరామన" అన్నపదము జగన్నాథరాజు ప్రతినిబట్టి వేదమువారు తీసికొని యుందురుగదా! కాని! "నైరామన" అన్ననగరము కాని, రాజుపేరుకాని ఉన్నట్లాధారము కానరాదు. అది యొక తురుష్కప్రభువురాజధాని యని వేదమువా రన్నారు కాని దాని కాధారము చూపరైరి, అది వారియూహకానోపు. లేదా న్యూనిజుపేర్కొనిన "మేదర్ మెలగో"(Mader Melugo) అనుతురుష్కసేనాని—1520 లో సాళువతిమ్మనిచే నోటువడ్డ యతఁడు—ఇతఁడా? లేదా బీజపురవాసి తురుష్కసేనాని కొండపల్లికడ నోడినవాఁడు నగు "మల్లుక ఉద్దండఖానా?" లేక కొండపల్లికడఁ బట్టువడ్డ గోల్కొండనవాబు బిజ్జిఖానా? ఏమైనను కృష్ణరాయ లాముక్తలో తనవిజయములను రెండుపర్యాయములు పేర్కొన్న స్థలములు గలవేమో చూతము. మొదటి యైదాశ్వాసముల యంత్యపద్యములలోను ఏ ప్రాతప్రతులకు ముద్రితప్రతులకు అభిప్రాయభేదము లేదు.

1. "ఇది కర్ణాట ధరాధృతి..." — i. ఉదయగిరి విజయమును పేర్కొన్నది.
2. "ఇది భూమండన కొండవీడు..." — ii. కొండవీటి విజయమును ,,
3. "ఇది పాత్రప్రహారేశ్వర..." — iii. కొండపల్లి విజయమును ,,
4. "ఇది సింహాచలదంభకేసరి..." — vi. సింహాచలముకడ పొట్నూరున విజయస్తంభము నాటుటను ,,
5. "ఇది యాంధ్రోక్తియథార్థనామ..." — v. కేంబని? కోట విజయమును ,,

దీనినిబట్టి యొక్కొక్కయాశ్వాసాంతపద్యములో కవి వేఱువేఱు దిగ్జయమే పేర్కొనెను కాని యొకపరిఁ బేర్కొన్నది మరలఁ బేర్కొనలేదు. అందుచే ఆఱు ఏడు ఆశ్వాసములు కలవనుకొన్నప్పుడు రెండిట మొదటియైదాశ్వాసములలోను పేర్కొనని క్రొత్తవిజయములను పేర్కొనవలయునుగదా! మఱియుఁ బూర్వపద్యములన్నిటిలో కృష్ణరాయలచే నోడిపోయినరాజులపేళ్లు గలవు. అట్లె ఆఱవయాశ్వాసాంతమున బీజపురసేనాని ఇస్మాయిల్ అదిల్‌షాయు, ఏడవయాశ్వాసాంతమున నీలాచలాధిపుఁడగు గజపతియుఁ బేర్కొనఁబడియుండవచ్చును. ఈవిధముగా నింకను పరిశోధించుటకు సమస్యలెన్నో యీగ్రంథమునఁ గలవు. ఉత్తమపాఠములు, ఆశ్వాససంఖ్యానిర్ణయము, వ్యాఖ్యానములు,

వ్యాఖ్యాతల నామములు, కాలము మున్నగునవన్నియు జాగ్రత్తగా పరిశీలింపవలయును. లభ్యములైన వ్యాఖ్యలన్నియు 18, 19 శతాబ్దముల మధ్యనని మాత్రము నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. కృష్ణదేవరాయల కాలమును గూర్చిన చరిత్రను సమగ్రముగ సేకరించుటకు ఈ గ్రంథ మత్యంతోపయోగకారి యనుట సత్యము.

క్రీ. శ. 1869 సం. లో వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారీ గ్రంథపరిష్కరణమునకుఁ బూనుకొన్నప్పుడు వివిధములగు ప్రతులను దిలకించుటలో సక్రమపాఠముల నేరుకొనుటలో పడ్డశ్రమ యనంత మనుటయు సత్యము. వారికి లభించిన ప్రతులు తప్పులకుప్పలు. 1874 న ప్రకటించిన ప్రతి పీఠికలో వారిట్లు పలికిరి. "దీనికి పూర్వపండితులు రచించిన టీకలు పెక్కులుండిన నొకటియైనను మొదటనుండి కడవఱకు నేకరూపముగా నుండునది కాదు. అవియును లభించుట యరుదు. మూలమును లేఖకప్రమాదాదులచేత నానావిధపాఠములుగా నుండెను. ఈ హేతువుచేతనే దీని నిదివఱ కెవ్వరును ముద్రింపఁ బూనరైరి. ఇట్టి యీ గ్రంథమును జాలినంత ప్రయాసపడి భిన్నదేశపుస్తకములను దెప్పించి శక్యమైనంతవఱకు శోధించి యెల్లవారికి నిందులోని విషయము సుగమమగునట్లు రుచి యను నొకటీక వ్రాసి దానితోడ ముద్రించినాఁడను."

ఇంత శ్రమించి యీయుత్కృష్టగ్రంథము నందించిన శ్రీ రామస్వామిశాస్త్రులుగా రెంత స్తుతిపాత్రులో వారియుత్సాహము, దీక్ష, శక్తి పుణికిపుచ్చుకొని తండ్రి నిమించిన తనయుఁ డనిపించుకొనుచు తెలుఁగు తెలిసినవారెల్లరిచే దేశము నలుగడలనుండి విస్తారమగు కీర్తిని సంపాదించుకొనుచున్న శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవా రెంత స్తుతిపాత్రులో చెప్ప నలవికాదు. ఆంధ్రభారతి నారాధించువారు అనశ్వరమగు నాంధ్రభారతి నత్యంతము గౌరవించువారు అందఱును శ్రీ శాస్త్రులుగారు చిరంజీవులై యితోధికసేవ చేయుచుందురు గాక యని సర్వశక్తివంతుఁ డగు పరమేశ్వరుని కోరి ప్రార్థింతురు గాక !

[ఇది త్రిలింగరజతోత్సవ ఆంగ్లసంపుటిలో 89-103 పుటలలో రాజచరితవిశారద రావుసాహేబ్ శ్రీ పి. హయవదనరావు, బి. ఏ., బి. యల్., యం. యల్. సి., యం. ఆర్. ఏ యస్., గారు వ్రాసిన ఆంగ్ల వ్యాసమునకు శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, బి, ఏ, గారి అనువాదము.]